# సాధనరహస్యము

తెలుగులో 10ముద్రణములు పొంది, వేలాది ప్రతులు అమ్మకమై, ఆధ్యాత్మిక గ్రంథ ప్రచురణములలో అపూర్వ సంచలనము కలిగించి, అనేకమంది సాధకులకు ఆధ్యాత్మిక జ్యోతియై కాంతి కిరణముల ప్రసరింపజేయుచున్న ఈ గ్రంథము సాధకలోకానికి శ్రీ అనుభవానంద స్వాములవారి అపూర్వ కానుక!

ఇంతవరకు ఈ గ్రంథము తెలుగు, తమిళము, మరియు కన్నడభాషలలో ప్రచురింపబడినది.

రచయిత

శ్రీ అనుభవానందస్వామి

# సాధనరహస్యము

(భగవత్ సాక్షాత్కార మార్గాన్ని తెలియజేసే అనుభవైకవేద్య గ్రంథము)




సర్వ సిద్ధాంత సౌరభాది బహు గ్రంథకర్తలు

(బాపట్ల & భీమునిపట్నం)

శ్రీ రామకృష్ణాశ్రమముల సంస్థాపకులు

పరమహంస పరివ్రాజకాచార్య

శ్రీ శ్రీ శ్రీ

అనుభవానంద స్వాములవారు

Publication No. 6



10వ ముద్రణము : 1998

మూల్యము : రూ. 80.00

ప్రతులకు :

1. శ్రీ రామకృష్ణ భక్త సమాజము
   శ్రీ అనుభవానంద గ్రంథమాల
   11.1.13 ఎం.జి.రోడ్
   **బాపట్ల - 522 101**
   గుంటూరు జిల్లా.

2. శ్రీ శారదా రామకృష్ణ సంఘము
   స్వామి అనుభవానంద యోగకేంద్ర
   శివాలయం వీధి
   **భీమునిపట్నము - 531 163**
   విశాఖపట్నం జిల్లా.

# సాధనరహస్యము




## పత్రికల

* * *

## ప్రముఖుల అభిప్రాయములు

* * *

ఎన్నిమారులు చదివినను ఇంకను మరి మరీ చదువవలయుననియే కోరిక ఉండును. ఈ గ్రంథమును చదివి ఆచరణములోనికి తెచ్చుకొని అనుభవానందాన్ని పొందినవారు ధ్యనాతిధన్యులు.

1\. . . . ఈ ఉద్గ్రంథం గతంలో అనేక పత్రికల ప్రముఖుల మెప్పు పొందింది. ఇందు యోగం, తత్వచింతన, రాజయోగం, భక్తియోగం మొదలైన విషయాలెన్నో చర్చించారు. ఇవి కేవలం ఆముష్మికచింతనామనస్కులకేగాక సామాన్యులకుకూడా బోధపడేశైలిలో ఉన్నాయి. చదివి దాచుకోదగ్గ విలువైన ఈ పుస్తకానికి ముఖచిత్రాలంకరణ మరింత వన్నె తెచ్చింది.

---ఈనాడు.

2\. అష్టాంగ యోగము . . . సాధన చతుష్టయ రహస్యాలు, ఈ గ్రంథములో సర్వులకు బోధపడే రీతిని వివరింపబడినవి. . . . సంతతాభ్యాసంద్వారా ఏకాగ్రత, వైరాగ్యాలను అలవరచుకొని ఆత్మ తత్వానుభూతిని పొందటానికి భారత ఋషులు ప్రతిపాదించిన సూత్రాలను అవగాహన చేసుకోవటానికి ఈ గ్రంథం సహాయంచేస్తుంది.

--- ఆంధ్రప్రభ

3\. . . . 'సాధనరహస్యం' సాధక కల్పతరువు . . . యోగులకు విరాగులకు కూడా పఠనీయము అనడానికి ఇంకొకరు, 'సర్టిఫికెటు', ఈయనక్కరలేదు. . . . ఈ గ్రంథములోని ప్రత్యక్షరంలోను శ్రీమదనుభవానందులు అనుభవా నందులుగా ప్రత్యక్షమౌతూ, . . . ఉపనిషణ్ణులైన పాఠకులకు సాధనరహస్యాన్ని బోధిస్తున్నట్లు గుర్తించి అనుభవానందం పొందవచ్చు.

--- ఆంధ్రపత్రిక

4\. . . . ఈ గ్రంథము ఇప్పుడే . . . మళ్ళీ మళ్ళీ అచ్చువేయవలసిన అవసరం కలిగింది అంటే స్వాములవారు చేసిన సూచనలు ఎన్నివేలమంది సాధకులకు ఉపకరిస్తున్నవో మనము ఊహించుకోవచ్చు.

--- ఆంధ్రజ్యోతి

5\. . . . విషయాలను వీరు విప్పి చెప్పిన ధోరణి చూస్తే ముచ్చట వేస్తుంది. పెద్దలమనుకునేవారుకూడా పిన్నలై కూర్చుండి వినవచ్చు. ప్రతివారు చదువుకోవలసిన గ్రంథం. . . . ఆధ్యాత్మిక సాధన రహస్యములను వీరిందులో వెన్నముద్దలు, గుజ్జనగూళ్ళు చేసి తినిపిస్తున్నారు.

---కృష్ణాపత్రిక

6\. . . . సాధకునికి అవసరమైన సర్వ విషయాలు పండొలిచి చేతిలో పెట్టినట్లు స్వాములవారు మనకిచ్చియున్నారీ గ్రంథములో.

---ఆరాధన

7\. . . . ఆధ్యాత్మిక జిజ్ఞాసాపరులకు . . . చాలా సులభశైలిలో వివరించబడటంవలన, ఈ గ్రంథవిషయాలను, ఈ విషయంలో ఏమాత్రం ప్రవేశం లేనివారుకూడా అర్థం చేసుకోగలరు.

---గోల్కొండ పత్రిక

8\. . . . ఈ గ్రంథము 'వాఙ్మయ గురువు' అనవచ్చు. అనేక ఉత్తమ గ్రంథాల ప్రయోజనము ఈ ఒక్కదానిచే సిద్ధింపచేసుకొనవచ్చును.

---శ్రీ శుద్ధచైతన్య స్వాములవారు

9\. . . . 'సాధనరహస్యము' కంటె ఆత్మసాక్షాత్కార మార్గమును స్పష్టముగా వివరముగా తెలుపు గ్రంథము దుర్లభము.

---శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

10\. . . . 'సాధనరహస్యము' చదువ మొదలిడుటయే నా వంతు, చివరంటా తీసికొనిపోవుట దానివంతు. తాము భిక్షువులు. తమ 'సాధనరహస్యము' చదివినవారు తమ విజ్ఞానమునకు, అనుభవమునకు భిక్షువులు.

--- శతావధాని శ్రీ వేలూరి శివరామశాస్త్రి.

* ఇంకను అనేక అభిప్రాయములు కలవు *

# విషయసూచిక



# అంకితం

ఓ

సాధకా!

సాధనచేత

సాధ్యపడజాలని

దెద్దియులేదు. అందుకే

ప్రేమతో యీ గ్రంథాన్ని

యిస్తున్నాను తీవ్ర ముముక్షుత్వంతో

తంటాలు పడుతూ ఉండే

**సర్వ సాధక లోకానికంతా**

## * పరిచయము *

నేటి ప్రపంచపరిస్థితిని మనస్సులో తీవ్రంగా ఆలోచిస్తే మనం ఏస్థితిలో ఉన్నామో వ్యక్తంఅవుతుంది. భౌతికవిజ్ఞానం బాగా అభివృద్ధి చెంది మానవులకు క్షణికసుఖాలను అందిస్తున్నది. తెలివితేటలు చాలా ఎక్కువగా ఉన్నవని చెప్పుకొంటున్నారు. కాని భక్తిజ్ఞానములు, మన సంస్కృతీ సంప్రదాయములు రోజురోజుకూ దూరం అవుతున్నవి. ధనార్జనకున్న ప్రాముఖ్యత ఆధ్యాత్మికవిజ్ఞాన సముపార్జనకు లేదు. ఇది ముఖ్యమను భావన ప్రజల మనస్సునుండి వైదొలగింది. ధర్మార్థకామమోక్షములలో ధర్మ మోక్షములు దూరమగుచున్నవి. ఇక మిగిలిన అర్థకామములు ఏకమై, మానవత్వమును నాశనముచేసి, స్వార్థమును పెంచి, ప్రేమానురాగముల త్రుంచి, మమతానురాగముల దూరము చేయుచున్నవికదా! ఈ విషయములందరికీ తెలిసినను 'మనకెందుకు', అని ఎవరికివారే భావిస్తూ అశాంతియుత జీవితమును గడుపుచూ, వృద్ధాప్యమున ననేక బాధల నొందు చున్నారు. ఇది అవివేకముగదా!

పర్వతమువలె సాధనలో నిశ్చలత్వాన్ని పొంది, వృక్షమువలె సాధనలో ఔన్నత్యాన్ని ఆర్జించి నదీజలమువలె సాధనలో నిర్మలత్వాన్ని గడించి, ఆకాశమువలె సాధనలో విశాలత్వాన్ని పొందటానికి మానవుడు ఏమి చేయాలి? సంకుచిత స్వార్థభావముల నేవిధంగా దూరం చేయాలి? నిత్యజీవితంలో ప్రశాంతిని ఏవిధంగా సాధించాలి? ఎట్టి సాధన చేయాలి? భగవదనుభూతిని ఎట్లా పొందాలి? అనే ప్రశ్నలకు సమాధానాలు ఎక్కడున్నవి? శ్రీ అనుభవానందస్వామి విరచితమైన ఈ 'సాధనరహస్యం'లో ఉన్నవి.

దేశ దేశాలలో పర్యటించి, ఎందరికో ఆశ్చర్యానందాలను కలిగిసూ యింకా కొందరిని తన నిజస్థానానికి రప్పించుకుంటున్నది ఈ సాధన రహస్యము. 'దృఢమైన పునాదిపై నిర్మితమైన భవనం చెక్కుచెదరనట్లుగా యమనియమాదులను పునాదిగా గల పారమార్థికానుభవంకూడా నిశ్చలమై, స్వార్థదూరమై, సంతతానంద విభూషితమై, సాధకులకు జన్మరాహిత్యమును కలిగించును' అని ఈ సాధనరహస్యం ప్రబోధిస్తున్నది. ఇది ఒక అపూర్వ, అపురూప గ్రంథరాజమనుటలో అతిశయోక్తిలేదు. లేఖలరూపంలో శ్రీ అనుభవానందస్వాములవారిచేత వ్రాయబడిన ఈ గ్రంథం అనేకులకు సాధన రహస్యాలను చక్కగా వివరించి, నాటికి, నేటికి ముముక్షువులను సాధనోన్ముఖులను చేయుచున్నదనుట నిస్సంశయము.

శ్రీ అనుభవానంద స్వాములవారిచే 1936లో ఆశ్రమ ద్వయం స్థాపింపబడినది. ఆంధ్రదేశంలో ప్రథమంగా శ్రీ రామకృష్ణ సంప్రదాయ ఆశ్రమం.విశాఖపట్నంజిల్లా, భీమునిపట్నంలో శ్రీ శారదా రామకృష్ణ సంఘము ప్రారంభమైనది. దీనికి అనుబంధంగా శ్రీ అనుభవానంద యోగకేంద్రము ఉన్నది. గుంటూరుజిల్లా, బాపట్లలో శ్రీరామకృష్ణ భక్త సమాజము స్థాపింప బడినది. దీనికి అనుబంధంగా శ్రీ అనుభవానంద గ్రంథమాల కలదు. ఈ గ్రంథమాల, యోగకేంద్రములు రెండునూ శ్రీస్వాములవారిచే రచితములైన అనేక పద్య, గద్య, కీర్తన, వేదాంత గ్రంథములను, శ్రీ శారదా రామకృష్ణ వివేకానందాది మహనీయుల జీవితాదర్శములు మొదలైన అనేక పుస్తకములను అనేక భాషలలో ప్రచురించుచున్నవి. మరియు భక్తి ప్రబోధాత్మకమగు క్యాసెట్లను కూడా తయారు ఒనర్చుచున్నవి. శ్రీస్వాములవారి సమాధి మందిరంకూడా శ్రీ అనుభవానంద యోగోద్యాన్ అను పేరుతో బాపట్లలోనే ఉన్నది.

రెండుఆశ్రమాలలో శ్రీ స్వాములవారిచే స్వయంగా తయారు చేయబడిన శ్రీ శారదా రామకృష్ణమూర్తులు ప్రతిష్ఠింపబడి ఆరాధింప బడుచున్నారు. సాధారణంగా ఆశ్రమాభివృద్ధికాక, ఆశ్రమవాసులైన బ్రహ్మచారులు అభివృద్ధి చెందవలయునని శ్రీస్వాములవారి ఆకాంక్ష. నేడు ఆశ్రమ నిర్మాణం సులభమేకాని అందలి వ్యక్తులను సరిదిద్దటం చాలా కష్టం. నిత్య పారాయణ, ఆసనాదిక, జప, తప, వేదాంత ప్రవచనములు ఆశ్రమాభివృద్ధికి తోడ్పడుతాయి. చక్కని శీలసంపద, సత్ప్రవర్తనలచే బ్రహ్మచారిసాధకులు ఆశ్రమాలకు శోభను కలిగించాలి. సంఘాభివృద్ధి అవసర మైనంతవరకు మాత్రమే ఉండాలి. వ్యక్తులు సాధకులై సక్రమంగా అభివృద్ధిచెందాలి. అప్పుడు సాధకులు వివేకవైరాగ్యసంపన్నులై, కామకాంచ నాసక్తిరహితులై, ప్రాపంచి కులతో అనవసర సంబంధముల విడనాడి, ఆశ్రమ నిర్మాతకు, ఆశ్రమాలకు, తమ జీవితాలకు, పరమానందాన్ని చేకూర్చగలరు.

నియమనిష్ఠాగరిష్ఠులగు శ్రీ అనుభవానంద స్వామివారిచే స్థాపించ బడిన ఆశ్రమములకుకూడా వారు చక్కని నియమావళిని ఏర్పాటు చేసియున్నారు. ఈ నాటికి భీమునిపట్నం ఆశ్రమములో మార్గశిర బహుళ సప్తమినుండి 5 దినములు శ్రీ శారదాజయంత్యుత్సవములు, బాపట్ల ఆశ్రమములో ఫాల్గుణ శుద్ధ విదియనుండి శ్రీరామకృష్ణ జయంత్యుత్సవములు, సంకీర్తన, ఉపన్యాస, పాట కచ్చేరి, హరికథలతో ఎటువంటి ఆడంబరములు లేకుండా జరుగుచున్నవని తెలియజేయుటకు ఆనందించుచున్నాను. మైకు

లేకుండా జరిగే కార్యక్రమాలు యిక్కడే. అందుచేతనే ఆశ్రమాలు ప్రశాంతంగా నిత్యపారాయణ, వేదాంత ప్రవచనములతో నలరారుచున్నవి. శ్రీ స్వాముల వారికి, శిల్ప, చిత్రలేఖన, సంగీత, సాహిత్య, కవిత్వ, రచన, ఉపన్యాసాదిక అనేక కళలయందు అద్భుతమైన ప్రవేశమున్నది. అందుచేతనే యీ కళలన్నీ ఆశ్రమాలలో వ్యక్తమవుతూ, ఆనందాన్ని కలిగిస్తూఉంటాయి.

సాధన వ్యక్తిగతం. అందుచేతనే సాధనలు అనేకం అయ్యాయి. కాని గమ్యంమాత్రం ఒక్కటే అనే రహస్యాన్ని విస్మరించరాదు. దీన్ని గ్రహించలేక సాధనలు చేస్తున్నామని తృప్తి పొందుతూ, అభివృద్ధి లేక, అన్ని అనుభవాలు కలిగినట్లు భ్రాంతిని పొందుతున్నారు నేడు. చిత్తవృత్తుల నిరోధించని యోగమేది? యోగం లేనిదే శాంతి ఏది? శాంతిలేని జీవితం ఎందుకు? శ్రీ రామకృష్ణదేవుని సర్వదేవ, సర్వమత సమన్వయ సాధనమార్గములో, శ్రీ స్వాములవారి సాధన పద్ధతిలో ప్రశాంతిని సాధించటానికి నేటి ప్రాపంచిక పరిస్థితులనుండి బయటపడిన సాధకులకు యోగ్యులైనవారికి ఒక విశిష్టమైన అనుష్ఠాన సాధనావిధానం మా ఆశ్రమవాసులైన బ్రహ్మచారులకుమాత్రమే పరిమితమైయున్నది. కాని ఇక అర్హులైన సాధకులకుకూడా ఆయవకాశమును మా ఆశ్రమములయందు సాధనా సమావేశములద్వారా కల్పించటానికి ప్రయత్నం చేయాలని సంకల్పం.

సర్వ సాధనోపయుక్తమైన ఈ సాధనరహస్యం గ్రంథ నేడు మరల పదవ ముద్రణకు రావటం ఎంతో ఆనందదాయకం. సాధకులజేరి, సాధనా విధానముల తెలియజేసి, సాధనానుభవముల వ్యక్తపరచి, సర్వమానవాళికి శాంత్యానందముల చేకూర్చుటకు సాధనరహస్యం బయలుదేరుచున్నది. ఆహ్వానించండి! చదవండి! చదివించండి! ఆనందించండి! మన ప్రాచీన భారతీయ విశిష్టతకు నమస్కరించండి!

మాతాజీ త్యాగీశానంద పురి
5.7.98



1. శ్రీ రామకృష్ణ భక్త సమాజము,
శ్రీ అనుభవానంద గ్రంథమాల - బాపట్ల, గుంటూరు జిల్లా.



2. ఆశ్రమమున శ్రీ స్వాములవారు స్వయముగా చేసి, ప్రతిష్ఠించిన



3. శ్రీ అనుభవానంద యోగాశ్రమ్ - శ్రీ స్వామివారి సమాధి మందిరము. బాపట్ల.



4. శ్రీ అనుభవానంద స్వామివారి సమాధి,



5. శ్రీ బ్రహ్మానందసరస్వతీ స్వామివారి సమాధి,

# వివరములు

1. 'శ్రీ రామకృష్ణ భక్త సమాజము' అను సంస్థను శ్రీ అనుభవానంద స్వాములవారు, బాపట్లలో 1938వ సంవత్సరములో స్థాపించిరి.

2. 1949వ సంవత్సరమున శ్రీ రామకృష్ణ పరమహంస దేవుని, 1954 సంవత్సరమున శ్రీ శారదాదేవిని శ్రీ స్వాములవారు ప్రతిష్ఠించిరి.

3. 'శ్రీ అనుభవానంద యోగోద్యాన్' శ్రీ అనుభవానంద స్వాములవారి సమాధులున్నవి. సమాధిమందిర నిర్మాణం 1996.

4. 1973 ప్రమాదీచ నామ సంవత్సర వైశాఖ పౌర్ణమి శ్రీ అనుభవానంద స్వాములవారి మహాసమాధి.

5. 1916 నల నామ సంవత్సర జ్యేష్ఠ శుద్ధ పంచమి శ్రీ బ్రహ్మానంద స్వాములవారి మహాసమాధి.

6. 'శ్రీ శారదారామకృష్ణ సంఘము' అను సంస్థను శ్రీ అనుభవానంద స్వాములవారు, భీమునిపట్నంలో 1937వ సంవత్సరమున స్థాపించిరి.

7. 1945వ సంవత్సరమున శ్రీ రామకృష్ణదేవుని, శ్రీ శారదాదేవిని శ్రీ స్వాములవారు ప్రతిష్ఠించిరి.

శ్రీ వివేకానంద స్వామి జయంతి

శ్రీ మాతాజీ జన్మదినోత్సవ సందర్భంగా

శ్రీశ్రీశ్రీ అనుభవానంద స్వాములవారు వ్రాసిన ఉత్తరము

బాపట్ల - 21.1.60

## నా మాతాజీ పుట్టినదినం

పుట్టుక ఎవరో! ఎక్కడనుండియో! ఎట్లో! ఎందుకో! అంతా అగోచరం! అయోమయం! పుట్టినవ్యక్తి సర్వసంబారాలతో, అవసర ఉపకరణాలతో యీలోకంలోకి వచ్చి, వచ్చినపని చేసుకొనిపోక, దారి తొలగటం ఎందుకు? సుఖాలను దుఃఖాలను కౌగిలించటం దేనికి? ఏడ్వటం దేనికి? ఏడుస్తున్నానని, అంతా ఏడుపేలని చెప్పుకుని తనతెలివితక్కువతనం ప్రకటించుకోవటం ఎందుకు? ఆదుఃఖం తనతెలివితక్కువలో వుందిగాని ప్రపంచములో వుందా? ప్రపంచం దుఃఖస్వరూపమా? తాను ప్రపంచంతో తెలివిమాలిన సంబంధం పెట్టుకోటంచేత, తాకోరినది దానివల్ల కలుగకపోవటం చేత ఆశాభంగంకలిగి, అసంతృప్తిచెంది ఏడుస్తున్నాడే జీవుడు! వీడు ఆ ప్రపంచాన్ని దుఃఖమయంఅని అంటానికి అధికారం ఏది?

ప్రపంచం దుఃఖరూపంకాకపోతే వాడే దుఃఖస్వరూపుడా? అయితే, ప్రపంచంతో సంబంధంలేనివేళల హాయిగావుంటాడు. తన జీవితంలో సగభాగం అలాగే గడుపుతుంటాడు! మిగతా సగంలోకూడా అధికభాగం ఆ హాయి కాకపోయినా మరొకవిధమైన హాయిని అనుభవిస్తూ పొంగిపోతూ వుంటాడు. ఇలా లెక్కవేసిచూస్తే ఏస్వల్పకాలమో 'దుఃఖమో' అని **ఏడుస్తూ**

న్నాడు. అంతా ఆశ్చర్యం! మరలా అయోమయం! స్వాభావికంగా వాడిలో యీ దుఃఖంలేదని తోస్తుంది. 'దుఃఖం దుఃఖం' అన్నవాడు నిద్రలో ఏడ్వ దేమి! Sleeping dose యిచ్చినపుడో? Hypnotise చేసినవాడికో? అంటే వాడు తన సహజస్థితిలో తనకు తానుగా వున్నప్పుడు అంటే ప్రపంచంతో సంబంధం పెట్టుకోకుండా వున్నప్పుడు, యీదుఃఖంఅనే దెయ్యం వాడిని ఆవరించదు. అలాగే ఔషధాలవల్లగాని, మంత్రాలవల్లగాని, మనోబలంచేగాని, వాడిని ప్రపంచానికి దూరంగా వుంచితే, మరలా తనసహజస్థితిలోకి వెళ్ళి, దుఃఖపిశాచానికి దూరంగా వుండగలుగుతున్నాడని తెలుతుంది.

కాబట్టి, యీదుఃఖం ప్రపంచంలోలేదు, వాడిలో లేదు అని తేలింది. మరి ఎక్కడనుండి వచ్చింది? వాడికి ప్రపంచానికి గల సంబంధంలోనుంచి పుట్టింది యీపిశాచం. అది కొంచెంఅలంకారాలు చేసుకొని అందంగావుంటే దానికే సుఖంఅని అంటారు లౌకికులు. మరి తక్కువ దుఃఖమేగా సుఖం అంటే! ఎంతదుఃఖం అనుకుంటే అంతదుఃఖం దాంట్లోనే లేదా మరి యీ లోకంలో! కాబట్టి లోకుల సుఖదుఃఖాలురెండూ ఆ పైశాచిక స్వరూపాలే! సుందరంగా వుంటేనే సుఖం! వికారంగావుంటే దుఃఖం! విచిత్రంగానే వుంది. ఒకేతత్త్వం ఒకవేళ సుఖంగా, మరొకవేళ దుఃఖంగా ఉండుట అద్భుతమే! కాని యిది సామాన్యానుభవమే! అందరికి తెలిసిందే! స్థూలంగావున్న వస్తువులే ఒక్కొక్కప్పుడు సుఖాన్నియిస్తాయి, మరొకకాలంలో దుఃఖాన్ని యిస్తూ వుంటే, అగోచరమైన యీ దుఃఖభూతం అలా ఎందుకు కాకూడదూ!

కాబట్టి సుఖదుఃఖస్వరూపంఅయిన దీన్ని కేవలం దుఃఖస్వరూపంఅని కొట్టివేయటం అన్యాయం. దీని యథార్థస్వరూపం ఏమిటి అనిఆలోచిస్తే ప్రపంచసంబంధం అదిఅని ప్రస్ఫుటం. ఈసంబంధాన్ని ఎంత జాగ్రత్తగా వుంచుకున్నా, దానిప్రభావం ఏకొంచమైన చూపకమానదు. ఈ సంబంధం యొక్క హెచ్చుతగ్గులనుబట్టి, దీనిస్వరూపమును అనుసరించి, అదే సుఖం గానో దుఃఖంగానో పరిణమించి బాధిస్తూవుంటుంది.

అలాగఅని సంబంధంలేకుండా పుట్టినవాడెట్లా వుంటాడు? సంబంధంవలననే జన్మ. దానివలననే పెరగటం. అలాగే దానివలననే మరణంకూడా పొందుతున్నాడు. పుట్టినా, శరీరసంబంధంలేదనే దుఃఖమేగదా మరణం? అందుచేత ఎలాగ జీవించడం? మరలా జీవిచడం అంటేనే సంబంధం. అయితే ఆత్మహత్యయే శరణ్యమా అంటే, అదికూడా సంబంధమే. అంటే సంబంధం బాధాకరంఅనిభావించి, దాన్ని ఆత్మహత్యద్వారా త్రుంచివేయుటం మరిఅదేగదా! మరోగత్యంతరంఎలాగ? మరలా అగోచరం! అయోమయం!

అందుచేత మరోవిధానండండాలి. పుట్టుక మనకుతెలియనట్లే మనకు అర్థం కాకుండానే, మన కర్తృత్వంలేనట్లే జరిగింది. ఎలాగో, ఎందుకో, అగోచరం! పుట్టనివానిసంగతి మనకు అక్కరలేదు. ఎలాగో వాడివిషయం అగోచరమే. పుట్టినవాడు ఎలా యీసంబంధ పాశాలనుండి తప్పించుకొని, దుఃఖావేశాన్ని పొందకుండా ఉండాలి? అదే సమస్య. పుట్టుకతో, యీ ప్రపంచంతో సంబంధం ఏర్పడ్డది. ఆసంబంధం ఏదోవిధంగా వచ్చినా పోవటంలేదు. కాబట్టే ఆసంబంధం బాధాకరంకాకుండా ఉండే విధానమే గత్యంతరం. దాన్ని ఉండి, లేనిదాన్నిగా మార్చాలి. అంటే మన సంబంధాలు ప్రపంచంద్వారా సంప్రాప్తించినా దానిని లేకుండా చేయటంకాక లేనట్లుగా చేయాలి. ఎలాగ?

కొంచెం ఆలోచిస్తే యీ సంబంధాలన్నీ శరీరంద్వారానే ఏర్పడ్డవి. ఆ శరీరంద్వారా మనస్సు అనుభవిస్తున్నది మంచిచెడ్డలను. ఆ సంబంధాలను శారీరకంగానే అంటే స్థూలంగానేఉంచి, మానసికంగా అవి పనిచేయకుండ చేసుకుంటే మనం కడతేరినట్లే. శరీరం, మనస్సును రెండింటిని వేరువేయాలి. శారీరకసంబంధాలు స్థూలంగా ఉండినా, మనస్సులో లేకపోతే బాధ ఏది? అయితే మనస్సులోలేనిది శారీరకంగా ఎలా!

సంబంధాలు శారీరకం, మానసికం అని రెండు విధానాలు. మొదట జన్మతో శారీరకసంబంధాలు ఏర్పడ్డవి. తల్లిదండ్రులు, అన్నదమ్ములు మొదలైన సంబంధాలు. రెండవది మానసికం. భార్య, మిత్రులు, శత్రువులు వగైరా.

పరలా సంతానంశారీరకం. అందుచే శారీరకాలను అలాగేఉంచి, మానసికా లను మొదట్లోనే లేకుండా చేసుకుంటే ఎంతో తేలిక అయిపోతుంది. ప్రథమ శారీరక సంబంధాలను మనస్సులోనికి చొరకుండా స్థూలంగాఉంచితే, అవి బాధాకరం కానేకావు.

ఈరెండు సంబంధాలు చాలా బాధాకరంగా ప్రపంచంలో అందరికి రూపొందుతూఉంటాయి. ఆసంబంధాలు లేనివాడుధన్యుడు. ఇంకా యింత బలీయంకానివి యితర ప్రపంచసంబంధాలు. మొదటే వాటిని జయించిన వాడికి యథార్థంగా యివి కష్టంకాదు. అవి సాధారణంగా పేరుప్రతిష్ఠలు, ధన ధాన్యాలు మొదలైనవిగా ఉంటాయి. వాటిని జయించటం సులభం. ఒకరు పొగుడుతుంటే మరొకరు నిందిస్తుంటారని, అది లోకంతీరు అని **గుర్తిస్తే** లోకేషణ నశిస్తుంది. అలాగే ధనధాన్యాదికం మొదలైనవి స్వార్థంతో కూడిన వని, ఆ స్వార్థంతోనే బాధఉన్నది అనిగ్రహిస్తే 'యిది కావాలి అది కావాలి' అనే ప్రవృత్తి నశిస్తుంది. ఒకవేళ సంపదవచ్చినా, ఉన్నా, కేవలం తన స్వార్థంకోసం గాక పరార్థంగా సద్వినియోగం చేస్తాడు. అప్పుడు బాధ ఉండదు. అందుచేత యీలోకంలోపుట్టి సాధించేవి ఐహిక సంపదలుకాక, ఉండిలేనట్టి జీవితవిధానమే. అదియే 'అస్పర్శ యోగం' అని సూత్రం. అదే 'అనుభవస్వరూపం' అని మూలరహస్యం.

దాన్ని పుట్టినావని భావించే నీవు త్వరలో సాధించి, దాని మాధుర్యాన్ని ఆస్వాదించి, ఆనందించి, అనేకులకు మార్గదర్శివి కాగలవని ఆశించి, ఆశీర్వ దిస్తున్నాను. అట్టి స్థితి నీకు శ్రీశారదారామకృష్ణులు అనుగ్రహిస్తారని గాఢ విశ్వాసం.

1. శ్రీలున్ జ్ఞానవిరాగసంపదలచే జెల్వొందువంశాన నీ
వీరీతిన్ జనియించి శారదదయాదృష్టిప్రభావంబుచే
వైరాగ్యంబుదయింప యోగినివియై వేదాంతశాస్త్రార్థముల్
నీలో జేర్చుచు సన్న్యసించితవురా! నీభాగ్యమెల్లెన్నుటో!

2. చిన్నతనాన శారదను జేరి సరస్వతి నాబడు కీర్తి సం
పన్నత దేశమెల్లెడల ప్రాభవమొప్ప ప్రసంగధాటిచే
మిన్నగమించి సర్వులకు మిక్కిలి శ్రేష్ఠపు మార్గదర్శివై
యున్న మహాత్మురాలవు మహోన్నతధర్మపరాయణాత్మవున్

3. మాతాజీ! గురు రామకృష్ణుడతులమ్మౌ జ్ఞానవైరాగ్యముల్
ప్రీతిన్ నీకు నొసంగుగాత! జననీ శ్రీ శారదామాయి లో
కాతీతప్రతిభావిభూతి నిడగన్! ఆయుష్యమారోగ్య సత్
ఖ్యాతిన్ నీకిడుగాత దేవతలు! నీకాశీస్సులేనిచ్చెదన్

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం.

# అనుభవసందేశము

అనేక ముద్రణలపొంది, తెలుగులున్న దేశదేశాలతిరిగి, 'సాధకుల కల్ప తరువు' అని, 'సాధక వాఙ్మయగురువు' అని, అసంఖ్యాకంగా సంస్తుతుల్ని సంపాదించిన మన 'సాధనరహస్యం', ఆధ్యాత్మికజిజ్ఞాసగల చిన్న అమ్మాయికి వ్రాయబడినా, పెద్దలకుకూడా అదియే 'ఉపయోగకరంగా' వెలుగొందటం, 'పండితులకేకాకుండా పామరులకుకూడా ఆధ్యాత్మిక విషయపరిజ్ఞానం అందుబాటులో ఉండాలనే లక్ష్యం' సిద్ధింపచేసుకోటం 'వ్యావహారికం అనర్గళప్రవాహంలాగా సాగిపోతూ పాఠకులలో బాగా అభిరుచిని' కలిగించడం, 'ముచ్చటైన వ్యావహారికభాషతో ఎంతోసరళత్వం సాధించి కృతకృత్యురా'లవటం, 'పఠనానంతరం ఏవేదాంత గ్రంథములైనను పఠించి అర్థం చేసుకొనుట సులభసాధ్యము కాగల'టుల చేయడం, 'ఆధ్యాత్మిక విజ్ఞానం ప్రచారం చేస్తున్నవారుగాని, యితరులుగాని యిలాంటి గ్రంథాలను ప్రచురించి యుండలే'దనియు, 'సాధకునకవసరమై సర్వవిషయాలు, పండొలిచి

చేతిలోపెట్టినట్లు' యిచ్చినదనియు కీర్తినార్జింపటం చాలా ముదావహం. అందుచేత 'ముఖ్యముగా అమూల్యం. ఎన్నిమారులు చదివినను యింకను మరిమరి చదువవలయుననియే కోరికయుండును' అనబడు మన 'సాధన రహస్యం' మరల ముద్రింపబడటం గర్వకారణం కాదూమరి!

అయితే 'తార్కికయుగం' అనబడే యీ భౌతికవిజ్ఞానయుగంలో ఆటం, హైడ్రోజన్ బాంబులయుగంలో యిలాంటి గ్రంథానికి స్థానముందా అనేసందేహం కొందరికి కలుగుతుంది. ఈగ్రంథస్థ పరిజ్ఞానంవల్ల ఆధునిక లోకాన్నిబాధిస్తున్న ఆర్థికాది సమస్యలు, యుద్ధాది మానవకృత సంక్షోభాలు తీరుతవా అనేప్రశ్న తొంగిచూస్తుంది. కానికొంచెము విమర్శనాదృష్టిలో గ్రంథ విషయాన్ని పరిశీలిస్తే, ప్రస్తుతకాల సమస్యలన్నింటికి యీగ్రంథమే సమాధానమేమోఅని, అదే శరణ్యమేమోఅని యథార్థ సంశయమావిష్కృతము కాక మానదు. 'సాధనరహస్యం' అవసరమైన తత్త్వచింతనలో ప్రారంభమైనా, నాలుగునుండి పదిహేడో ఉత్తరంవరకు, ఇరవైఎనిమిదినుండి ముప్పైఆరు వరకు అసలు ఆధ్యాత్మికజీవితానికి పునాదిఅయిన యమనియమాదులు, సాధనచతుష్టయాన్ని వివరించి, సాధకునికి బాహ్యలోకానికి అంటే అందులో ఉండే వ్యక్తులతోకలిగే సర్వసంబంధబాంధవ్యాలను ఎత్తిచూపి, ఆ సంబంధాలవిధానాలను విశదీకరించి, వాటిని పవిత్రంగా ఉంచుకోవాలని స్పష్టపరచింది. పరులకు ఎట్టిబాధా కలుగకుండా ప్రవర్తించటమే పవిత్రతఅని కట్టెదుటపెట్టింది. 'పాపాయపరపీడనం' అనివ్యక్తపరచింది. ఆధ్యాత్మికానుభవాలను పొందాలనేవాడేగాక, ప్రపంచజీవితం సాఫీగా సాగిపోవాలనేవాడైనా ఆ సూత్రాలను ఆచరణలో పెట్టుకోటం అత్యవసరం. అలాగే అందరూ ఆచరిస్తే యిక ప్రపంచంలో మైత్రీ కరుణ ముదితా ప్రేమతత్త్వాలే ఆనందనృత్యాలు చేస్తుంటాయి అనకతప్పదు. అప్పుడు సంఘానికి బాధాకరమైనకల్పిత తర, తమ భావాలు సడలిపోతయి. స్వార్థమేకాకుండా పరార్థంకూడా ముందుకు వస్తుంది. అంతటితో ఆధునికవాతావరణంలోఉన్న సర్వసమస్యలు, సంక్షోభాలు, భయాలు అదృశ్యం అవుతయి.

అయితే యీ గ్రంథ విషయాలు అందరికి అనుభవంలోకి వస్తాయా? అందరికి సౌఖ్యాన్ని చేకూర్చేవిధంగా ప్రపంచం 'బంగారుభూమి' అయి ఆనందసీమ అవుతుందా? కాని ప్రపంచంలో నూటికి తొంబది తొమ్మిదిమంది, సంఘ, దేశనాయకులనబడే ఒకరిద్దరిచేతుల్లో **కీలుబొమ్మలై** సుఖదుఃఖాల్ని అనుభవిస్తూఉంటారు. అంటే ఆయా నాయకుల చిత్తసంస్కారాలనుబట్టే ప్రవర్తిస్తూ, దానికితగిన అనుభవాన్ని చవిచూస్తూ ఉంటారు. సామాన్యమానవులు సాధారణంగా అనుభవించే సుఖదుఃఖాలు వారి ప్రారబ్ధం అనేకంటే నాయకుల ధీకుశలత, ప్రజానీకంపై ఆనాయకుల ప్రేమాదరాలు, ఒక్కమాటలో నాయకుల చిత్తపరిపాకంమీద ఆధారపడిఉంటాయి అంటే ప్రస్తుతానికి బాగుంటుంది. కాబట్టి, కోట్లాదిగానున్న ప్రజానీకాన్ని యీ విధంగా నాయకులలోకిదించాం. ఈనాయకులు తమచిత్తాల్ని శుద్ధి చేసుకుంటే ప్రజానీకంకూడా వెంటనే బాగుపడి ఆనందిస్తుంది. 'యథా రాజా తథా ప్రజా' అన్నారుగదా పెద్దలు!

కాబట్టి 'సాధనరహస్యం' అట్టి సంఘనాయకుల చిత్తాలను సంస్కరింప యత్నిస్తుంది. నాయకుడు సంఘంలోనుండే వస్తున్నాడు. **కాబట్టి** సామాన్యప్రజానీకంలో చిత్తవికాసాన్ని కలుగజేయటానికి తోడ్పడుతుంది. రాబోయే నాయకులకుకూడా మార్గదర్శకం అవుతుంది. ఈ విధంగా మన 'సాధనరహస్యం' సంఘంలో ఉత్తమసంస్కారాల్ని పెంపొందింపజేసి, ఆధ్యాత్మికంగా వ్యక్తిలో గలుగజేసే అసామాన్య ఆధ్యాత్మికపరిణామాన్నిమించిన తేజాన్ని సాంఘికజీవితంలో కలుగజేస్తుంది. ఇది 'సాధనరహస్యం' యొక్క గాఢవిశ్వాసం. అట్టి పరమాశయంతోనే ప్రపంచంలోకి వచ్చింది. కొంతవరకు తన లక్ష్యాన్ని సాధించింది. అధికోత్సాహంతో మరల నూత్నవికాసంతో వెలువడుతున్నది. అది సంకల్పించి, గమ్యంగా ఉంచిన ఆధ్యాత్మికపరిణామాన్నే ముఖ్యంగా తీసుకుంటే, సాంఘికజీవితం ధార్మికజీవితంపైన, అది ఆధ్యాత్మికజీవితంపైన, మరల అది భగవద్భక్త్యాదులపైన ఆధారపడి ఉంటుంది. **కాబట్టి** సాధకుడు లక్ష్యంలో ఉంచుకోకపోయినా, పరిసరాలు పవిత్రంఅయి, సంఘం

విశాల పరార్థదృష్టిలో వ్యవహరించి అనుకోని సత్ఫలితాలు కలుగుతాయి. కాని, లౌకికపారమార్థికాలు విభిన్నంకాకుండా, పరస్పరాపేక్షితాలై, వ్యక్తిసౌఖ్యానికి, ప్రపంచశాంతికి కారణం అవుతాయని 'సాధనరహస్యం' యొక్క నమ్మకం

అట్టి నమ్మకంతోనే ఉత్తరాల రూపంలో యీ గ్రంథాన్ని మొదట స్వీకరించి, పఠించి, అనుష్ఠించి, 'ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ' అన్న ఆర్యోక్తిని గమ్యంగా ఉంచుకొనిన మనమాతాజీ శ్రీశారదాశతవార్షికోత్సవ సందర్భంలో, శ్రీశారదాకృపావిశేషంచేత విరజాదిహోమాదులచేసి, సన్న్యసించి, శ్రీమాతాజీత్యాగీశానందపురీ అను యోగపట్టానుపొంది, తన లక్ష్యంలో భాగమైన సంఘక్షేమంకొరకు అవిరళంగా ఉపన్యాసాలు, గ్రంథాల మూలంగా కూడా కృషిచేస్తున్నందుకు ఎల్లరు ఆనందిస్తున్నారు గర్విస్తున్నారు. అదే విధంగా తననుచదివి, నిస్స్వార్థంగా సంఘసేవ చేయటానికి అనేకులు ముందుకువస్తారుగాక అని ఆశిస్తున్నది 'సాధనరహస్యం'. అలా నిశ్శ్రేయస మార్గానికి నిశ్శ్రేణిని నిలుపుతారుగాక అని 'సాధనరహస్యం' యొక్క ప్రగాఢ ఆకాంక్ష. ఆమెకోర్కెను పరమేశ్వరుడాలకించి సిద్ధింపజేస్తాడుగాక!

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం.

(signature) బాపట్ల

# పరిచయము

శ్లో. అపారప్రాచ్యపాశ్చాత్యవిద్యావైదుష్యమూర్తయే
నమోస్త్వనుభవానందస్వామినే సిద్ధమూర్తయే

శ్రీ అనుభవానంద స్వాములవారిచే వ్రాయబడిన యీ 'సాధన రహస్యం' అచ్చుటచ్చుట పర్యటనచేయుచు, సామాన్యమానవులకు సాధారణ జీవితవిధానాలను, సాధకులకు సాధనామార్గాలను, గురువులకు గురువర్యుల గుణగణాలను, శిష్యులకు యథార్థశిష్యలక్షణాలను, విరాగులకు వైరాగ్య విషయాలను, సమాధిస్థితులకు సమాధిరహస్యములను, సిద్ధులకు సిద్ధుల లక్షణాలను తెలియజేస్తూ, పొరపాటుపడినవారిని హెచ్చరిక చేస్తున్నది. అందరికి తెలియజేయుటఅనే తన బాధ్యతను తాను నిర్వహిస్తూనే ఉన్నది యీ 'సాధనరహస్యం'.

నేటి పరిస్థితులలో తన వ్యక్తిత్వాన్ని కోల్పోకుండ యథార్థ విషయాన్ని ప్రబోధించటం అత్యవసరం. వ్యక్తికి వ్యక్తిత్వంఅనేది చాలముఖ్యం. అది లేకున్న వ్యక్తిక్రిందకు దిగజారుతుంటాడు. ఆ వ్యక్తిత్వమేఉంటే దేశంలో అల కల్లోలాలు సమసిపోతాయి. అప్పుడు రామరాజ్యంఅయి ప్రశాంతవాతావరణం ఏర్పడుతుంది. అట్టిరాజ్యసంస్థాపకులు హరిశ్చంద్రుడు, శ్రీరామచంద్రుడు అశోకునివలె త్యాగమూర్తులుకావాలి. అంతేకాక అట్టి రాజ్యనిర్మాతలను ధర్మ మూర్తులుగా, ఆదర్శప్రభువులుగా తీర్చిదిద్దిన నిష్కామకర్మానుష్ఠానతత్పరు లైన వశిష్ఠ, విశ్వామిత్రాది మహర్షివర్యులుకావాలి. ఎవరికి ఎట్టివిద్య అవ సరమో దానిని ప్రబోధించి, ఆచరింపజేయగల సర్వసమదర్శులును, సర్వ సమర్థులును, ఆధ్యాత్మికజ్ఞాననిష్ణాతులునుఅయిన శ్రీవివేకానంద, శ్రీరామ తీర్థ, శ్రీఅనుభవానందాది యతిసార్వభౌములు కావాలి. ఈ సర్వసమైక్యత ప్రపంచంలో ప్రవేశిస్తేచాలు మనుష్యులలో, దేశంలో అశాంతి పటాపంచలవు తుంది. స్వార్థం, ధనదాహం, పైశాచికప్రవృత్తులు నశిస్తాయి. క్రమశిక్షణా రాహిత్యంవలననే చిన్ననుండి పెద్దలవరకు యీ అర్థంలేని స్వతంత్రత.

పై విధంగా సర్వాదర్శాలను సర్వులకు అందించేదే యీ 'సాధన రహస్యం'., వారివారి వ్యక్తిత్వాన్ని, వారివారి స్థానాలను వారికి తెలియజేసేదే యీ 'సాధనరహస్యం'. ప్రథమంగా వ్యక్తి ఒకక్రమపద్ధతిలో తనకుతానుప యోగపడి, తర్వాత ఆవ్యక్తియే సంఘమునకు ఎట్లు ఉపయోగమగునో తెలుపునదీ 'సాధనరహస్యం'. వ్యక్తి, సంఘములు **పరస్పరాపేక్షకములై** యుండునను విషయముల ప్రబోధించునదీ మన 'సాధనరహస్యం'.

ఈ ప్రచురణమున శ్రీస్వాములవారు, నా జన్మదినసందర్భమున, నేను భీమునిపట్టణంలో ఉండగా నాకు ఆశీస్సులతో, **దివ్యసందేశాన్నిస్తూ** వ్రాసిన ఒక ఉత్తరాన్నికూడా ప్రకటిస్తున్నాం. అంతేకాక **1960**లో నేను శ్రీ స్వామిజీ సన్నిధానంలోనేఉన్నాను. **21.1.1960** నా జన్మదినకానుకగా మూడుపద్యాలను ఆశీర్వదిస్తూ వ్రాశారు. కాని వాటిని నేను చూడలేదు **1981** వరకు. అదే వారు నాకు ప్రేమతోయిచ్చిన అమూల్య సందేశం! దివ్యా దేశం! ప్రేమాశీర్వాదం! ఆ పద్యత్రయంకూడా యిందులోఉన్నది. శ్రీ

స్వామీజీ దివ్యాశీర్వాదమే నాకు సదారక్షయై, అండదండయై నాజీవితాన్ని నిశ్చలంగా, నిర్మలంగా, ప్రశాంతంగా నడుపుతున్నది. అదే వారు నాకుపెట్టిన భిక్ష! వారు చెప్పినట్లు నడుచుకుంటున్న నాకు వారులేనిలోటు ఎల్లప్పుడూ గోచరిస్తూ బాధిస్తూనేఉంటుంది. వారికి సాశ్రుపూరితనై నమస్కరిస్తున్నాను.

శ్రీస్వాములవారు దివ్యానుభవపూరితంగా రచించిన యీ 'సాధన రహస్యము'ను పఠించినవారు, శాంత్యానందముల పొందుటయేగాక, సంఘం కూడా ప్రశాంతిపొందాలని భావించి, ఆ సంఘ, లోకశాంతులకు సహకారు లౌతారని భావిస్తున్నాను.

మరియు యీ 'సాధనరహస్య' గ్రంథ ఆధారంగా 'దివ్యయోగ సాధన రహస్యము' అనేపేరుతో మరోగ్రంథము వెలువడి సాధకులకు దివ్యానందాన్ని కల్గిస్తున్నదని తెలియజేయుటకు ఆనందిస్తున్నాను.

మరల మన 'సాధనరహస్యం' దేశపర్యటనకు బయలుదేరుతున్నది. ఆహ్వానించండి! పఠించండి! గ్రహించండి! ఆత్మానుభూతిని పొందండి! ఆనందించండి! తరించండి!

బాపట్ల,
**14.1.91.**

మాతాజీ త్యాగీశానంద పురి

## అనుభవానందుల అనుభవరహస్యము

నేను సన్న్యాసిని. 'అనుభవానంద స్వామి' అంటారు. సత్యాన్వేషణకు జీవితమంతా దీక్ష పూనాను ... మాటలకంటె వ్రాతలు, అనుభవం గొప్పది. వాటిద్వారా మనం యితర్లతో ప్రసంగించాలి ... ఆర్తి, తీవ్రతవేదనలు కావాలి. నా చిన్నతనంలో రాత్రులు నిద్రపోయేవాడినికాను. బోర్లాపడుకొని దిండులో తలదూర్చి రాత్రంతా భగవంతునికొరకు విలపించేవాడిని. నా కన్నీటిలో ఆ దిండు తడిసిపోయేది ...

శ్రీరామకృష్ణ, వివేకానందుల జీవితాలు చదివి చాలా కాలమైంది. అంటే 9 లేక 10 సంవత్సరాలు అయింది. ఇంకా చదువుతూ ఎంతకాలం జీవితం గడిపేది? సంవత్సరాలు దొర్లిపోతున్నాయి. ఎప్పుడు చదువుదామని పుస్తకం తెరిచినా నా హృదయంలో ఒక మంట బయలుదేరుతుంది. అశాంతి ఎక్కువ అవుతుంది. ఎందుచేతనంటే అట్టి స్థితులనుగూర్చి విని ఆనందించటం యింకా ఎన్నినాళ్ళు? అనే ప్రశ్న నన్ను బాధిస్తుంది. అనుభవం పొందాలి. వాళ్ళంతటివాడిని కావాలి. అదే నా లక్ష్యం.

... కేవలం సన్న్యాసం ఎందుకు? సాధనానుభవాలు పొందని సన్న్యాసం అనవసరం నాదృష్టిలో ... నేను ట్రెయినింగు (Training) అవుతున్నాను. అందుచేత నేనుకూడా ట్రెయినింగుస్టూడెంటునే. ఆ ట్రెయినింగు పాసు కావటం చాలకష్టం. దీనికి పుస్తకాలు ఉపయోగించవు. తెలివితేటలు పనికి రావు. దేహపుష్టి నిష్ప్రయోజనం. ఉపాధ్యాయులు లేరు. పరీక్షలు అసలు

లేవు. కాని రిజల్ట్సు (Results) మాత్రం ఉన్నవి. ఈ ట్రెయినింగుకోర్సు ఒకటి, రెండు సంవత్సరాలలో ముగియదు. వ్యక్తి బలాబలాలనుబట్టి కాల పరిమితి ఉంటుంది ...

'దీక్షలు' అని చెప్పవచ్చుకాని సాగించటం చాల కష్టం. పట్టుదల కావాలి. ఎన్ని ఆటంకాలువచ్చినా వెరవకుండా నా కోటిజపదీక్షలను సాగించాను. రోజుకు 20 గంటలు జపదీక్షలో కాలం గడిపాను.

... కాలినడకన దేశంఅంతా చాలాసార్లు తిరిగాను. అశాంతి ఎక్కువ అయిందేకాని ప్రశాంతి లభించలేదు. శాంతి, ఆనందం, తిరగటంలో, చదవటంలోకాక సాధనచేసి, అనుభవం పొందటంలోఉందని గ్రహించాను.

... అనుభవం + ఆనందం = అర్ధనారీశ్వరతత్త్వం. అనుభవంలేనిదే ఆనందం కలుగదు. ఆ అనుభవం అలౌకికం. అనుభవం హృదయానిది. ఆ అలౌకిక అనుభవంవలనమాత్రమే ఆనందం కలుగుతుంది. ఈ రెండు ఒక్కచోటనే ఉంటాయి.

... ఆధ్యాత్మికంగా అభివృద్ధిపొందేకొద్దీ హృదయం విశాలం కావాలి. ఈ ప్రపంచంఅంతా అందులో యిమిడిపోవాలి. ఆ ఆధ్యాత్మికానుభవంలో సర్వభేదాలు సమసిపోతాయి. అంతా ఒక్కటిగా అవుతుంది. అదే అనుభవం, ఆనందం ...

... నేను చెప్పేది శ్రీ రామకృష్ణవివేకానందులగురించి. నేను ప్రేమించేది శారదను. గడ్డాలపెంచి పూర్వఋషులను అనుసరిస్తాను. మాట్లాడుతూ పాశ్చాత్యుల ఇంగ్లీషును ఉపయోగిస్తాను. భావాలు సంస్కృతం. కవిత్వం తెలుగు. మనసులో అద్వైతం. వాక్కు శాక్తేయం. ఆచరణలో విశిష్టాద్వైతం. పాటించేది ద్వైతం. తిరిగేది అన్నిదేశాలు. స్నేహితులు అందరు. చుట్టూ ఉండేది బాలబాలికలు. ప్రసంగించేది పెద్దలతో. చనువుగా దగ్గరకు చేరేది స్త్రీలు. ఇలా అన్నిద్వంద్వాలసమ్మేళనం 'అనుభవానందం'.

శ్రీ అనుభవానందస్వామువారి "డైరీల" నుండి

ఓం శ్రీశారదారామకృష్ణాభ్యాం నమః

# ప్రారంభము

ప్రియమైన పాఠకులారా!

నాకు బాల్యంనుండి 'వివాహం' అనేమాటవింటే అసహ్యం కలిగేది ఎందుచేతనో! 'దేవుడు' అంటే నా దృష్టిలో వివాహంకానివాడు. అందుచేతనే రాముడు, కృష్ణుడు, శివుడు మొదలైనవారు దేవతలు ఎట్లా అవులారని నా సందేహం. కాని నా సందేహాలను నివారణ చేయగలవారేరి? అటువంటి సమయంలో, **1944** డిశంబరులో, భీమునిపట్నం ఆశ్రమంలో, శ్రీ శ్రీ శ్రీ అనుభవానందస్వాములవారి పరిచయం కలిగింది. అది భగవదనుగ్రహం. నా యీ ఆధ్యాత్మికజీవితానికి అది తొలిమలుపు.

శ్రీ స్వామిజీ, పిల్లల్ని బాగా చేరదీయటం, వారిచే కోలాటం వేయించటం, పాటలు నేర్పటం, బీచిలో ఆడించటం చేసేవారు. ఆ విధంగా శ్రీ స్వామీజీతో సన్నిహితత్వం ఏర్పడింది నాకు. శ్రీస్వామీజీ ఎంతచక్కగా ఆడు

కోగలరో భాష్యాదిగ్రంథాల్ని అంతచక్కగా బోధించగలరు. అదే వారి ప్రత్యేకత. ఎప్పుడూ సంతోషంగా ఉండటమేకాని ముడుచుకునిఉండటం వారికి చేతకాదేమో! శ్రీస్వామిజీచెప్పే పాఠాల్ని శ్రద్ధగా వినేదాన్ని. శ్రీశారదా, రామకృష్ణ, వివేకానంద మూర్తిత్రయాన్నిగూర్చి శ్రీస్వామీజీద్వారా విన్నాను, చదివాను. ఆ మూర్తిత్రయం నా హృదయంలో నిలిచిపోయారు. **శ్రీరామకృష్ణ** దేవుని సాధన, సర్వసమన్వయం, శ్రీశారదాదేవి త్యాగప్రేమలు, శ్రీవివేకానందుని గంభీరత్వం నాలో ఏదోసంచలనం కలిగించాయి. అంతేకాక ప్రత్యక్షంగా నాకు కనిపిస్తున్న శ్రీస్వామిజీ తపోసంపన్నులు, ప్రేమమూర్తులు, సర్వకళాకోవిదులు, సర్వవిద్యావిభూషితులు. బ్రహ్మచర్యంనుండి సన్న్యసించినవారు. అదే నాకు పరమానందాన్ని కలిగించింది.

శ్రీస్వామిజీసాంగత్యంలో నాకు యింకా సందేహాలు ఎక్కువ అయ్యాయి. అనేకమంది భజనలుచేస్తూ భక్తులమని, వేదాంతప్రబోధాలు చేస్తూ జ్ఞానులమని చెప్పుకునేవారిని చూచాను. 'భక్తులు, జ్ఞానులు సంతోషంగా ఉంటారుకదా! వీరిలో ఆనందంకనిపించదే! బగవద్దర్శనంపొందామంటారుకాని లౌకికవ్యవహారాలు తాపత్రయాలు తగ్గవేమి? సమాధుల్లో మునిగిపోతున్నామంటారుకాని అహంకారమమకారాలు, ఈర్ష్యాసూయలు, కోపతాపాలు నశించవేమి? మరల పెళ్ళి, పిల్లలు, యివన్నీ సాగుతూనే ఉంటాయే! శాంతిగా కనిపించరేమి?' ఇట్లాటి సందేహాలు కలిగేవినాకు. శ్రీ **రామకృష్ణ** పరమహంసజీవితం చదివినతరువాత యిట్టిభావాలు కలిగేవి. 'శ్రీ శారదా, రామకృష్ణ, వివేకానందుల్ని ఆదర్శంగా ఉంచుకోవాలి. మంచి సన్న్యాసిగా జీవించాలి. శ్రీ స్వామిజీలాగ ఉండా' లని భావించేదాన్ని.

శ్రీస్వామిజీ, కొంతకాలం భీమునిపట్నంలో, కొంతకాలం బాపట్లలో, కొంతకాలం యితరచోట్ల ఉండేవారు. **1945** నుండి శ్రీ స్వామిజీకి ఉత్తరాలలో నా సందేహాల్ని తెలియజేస్తూ, వ్రాస్తూ ఉండేదాన్ని. ఏదో ఆవేదనతో వ్రాసేదాన్ని. 'ఈ ప్రపంచంలో చావుపుట్టుకలు తప్పించుకోటానికి ఏ సాధనలు ఎట్లా చేయాలి? మహాత్ముల్ని ఎట్లా అనుసరించాలి? ఏ **సాధనచేస్తే** నిశ్చలత్వం, ప్రశాంతత కలుగుతాయి? ఈ పూజలు, భజనలు చేస్తూ లౌకిక వ్యవహారాలలో మునిగిఉంటారేమి? అసలు భక్తిఅంటేఏమిటి? జ్ఞానంఅంటే ఏమిటి? సన్న్యాసి కావాలంటే ఏ లక్షణాలుండాలి?' అని శ్రీ స్వామిజీకి

వ్రాస్తూ ఉండేదాన్ని. శ్రీ స్వామిజీ నా ఉత్తరాల్ని చూచి ఏమాలోచించారో! నాలో వారికి ఏశక్తి కనిపించిందో! నాభావిజీవితం వారి మనోనేత్రానికి గోచరించిందేమో! ప్రేమవాత్సల్యాలను రంగరించి నా ప్రశ్నలన్నింటికి సమాధానాలు ఉత్తరాలుగా వ్రాశారు.

ఆఉత్తరాలు వ్రాయటంలోనే శ్రీస్వామిజీకి సాధనలోగల పరిపూర్ణత్వం తెలుస్తున్నది. ఆయన సాక్షాత్ అనుభవస్వరూపులే! ఆవిధంగా వ్రాసిన ఉత్తరాలు మార్పుచేయకుండా ఉన్నదున్నట్లుగానే 'సాధనరహస్యం' అనే పేరుతో అచ్చుఅయినది. ఆ జవాబులు **1946**లో జరిగాయి. నాటికే 'మాతాజీ' అనే పేరుపెట్టారు నాకు. ఆ పేరుతోనే ఉత్తరాలు వ్రాశారు. తర్వాత **1947** ఆగస్టులో శ్రీస్వామిజీ సన్నిధికి చేరుకున్నాను, వారి ఆశీర్వాదబలంతో, భగవదనుగ్రహంతో.

'ఎంతమంది నాకు ఉత్తరాలు వ్రాసేవారు! కాని నీ యీ ఉత్తరాల జవాబులు ప్రత్యేకం. తర్వాత నీవు నావద్దకు రావటం, ఆ ఉత్తరాలు పుస్తకంగా తయారుకావటం, అది 'సాధనరహస్యం'గా అచ్చు కావటం యిదంతా శ్రీ రామకృష్ణదేవుని సంకల్పం. శ్రీరామకృష్ణుడు సాధనావతారంకాబట్టే 'సాధన రహస్యం', ఆయన సర్వానుభవమూర్తికాన ఆ అనుభవాలను వెదజల్లడానికి 'శ్రీఅనుభవానంద గ్రంథమాల' జన్మించింది. ఆయన పేరుతో ఏదిపెట్టినా విజయమే సిద్ధిస్తుంది. శ్రీగురుదేవుని ఆశీర్వాదప్రభావంఅమ్మా!' అను శ్రీ స్వామిజీమాటలు యథార్థములు. 'సర్వం శ్రీరామకృష్ణార్పణమస్తు' అనేదే వారిభావన. కర్తృత్వరహితస్థితి వారిది. అదే సాధకులకు ఆదర్శం. నాయీ జీవితాన్ని తీర్చిదిద్ది, నాకు జ్ఞానాన్నిప్రసాదించిన ప్రేమమూర్తులైన శ్రీస్వామిజీకి యివే నాసహస్రప్రణామములు. శ్రీస్వామిజీ అనుభవానందులు. వారు పొందినది అనుభవానందము. ప్రసాదించినదికూడా అనుభవసందేశమే!

శ్రీ అనుభవానందస్వామి జయంతి, మాతాజీ త్యాగీశానంద
భీమునిపట్నం. **26.10.83**

# 1
# యోగార్థము

అమ్మాయీ మాతాజీ!

సాధనవిషయం తెలుసుకోవాలని నీ కాంక్షను వెలిబుచ్చావు. చాలా సంతోషం. అసలు ఆముక్తిపదాన్ని పొందటానికి శాస్త్రాలు జ్ఞాన, భక్తి, యోగ, కర్మలుఅనే నాలుగు మార్గాలను సూచించాయి. ప్రపంచంలో ఏ మతమైనా, ఏ మార్గాన్ని అనుసరిస్తున్నా, కొంచెం విమర్శచేసి చూచామంటే అది మన శాస్త్రాలుచెప్పే యీనాల్గుమార్గాలలో చేరాలి. ఈమార్గాలనే 'యోగా' లంటారు. శాస్త్రంప్రకారం 'యోగం' అంటే 'కలయిక' అని అర్థం, లేక కూడిక అనవచ్చు. అనగా యీమార్గాలు చివరకు ఒక 'కూడికను' కలుగ జేస్తాయి అన్నమాట. వేటిని కలుపుతాయి? అది తెలుసుకుందాం.

మనం తెల్లవారిలేచిందిమొదలుకొని మన ఇంద్రియాలద్వారా లోకాన్ని చూస్తున్నాం అంటే మనఇంద్రియాలద్వారా అనుభవిస్తున్నామన్నమాట.

శాస్త్రంప్రకారం మనయింద్రియాలు పదకొండు. అందులో అయిదు కర్మేంద్రియాలు, అయిదు జ్ఞానేంద్రియాలు, ఒక్క మనస్సు. కర్మేంద్రియాలంటే 1. వాక్కు (నోరు) 2. పాణి (చేయి) 3. పాద (కాళ్ళు) 4. పాయు (మల విసర్జనఅంగం) 5. ఉపస్థ (మూత్రవిసర్జనఅంగం, ఇదే విషయాలతంత్రం). ఈ కర్మేంద్రియాలకు ప్రత్యేక విధులున్నాయి. వాటివాటిని అవి చేస్తూ ఉంటాయి. వీటికిని బాహ్యప్రపంచానికిన్ని చాలా సన్నిహితసంబంధం ఉంది. ఇలాగే పంచజ్ఞానేంద్రియాలు. అవి, 1. శ్రోత్ర (చెవులు) 2. త్వక్ (చర్మం) 3. చక్షు (కళ్ళు) 4. జిహ్వ (నాలుక) 5. ఘ్రాణ (ముక్కు) అని అంటారు. ఈఅయిదింటికి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనే లక్షణా లున్నాయి. చెవిచేత శబ్దాన్నివింటాం. చర్మంచేత స్పర్శజ్ఞానం కలుగుతుంది. కన్నుచేత రూపంతెలుస్తుంది. నాలుకచేత రసం అంటే రుచిని కనుక్కుంటాం. ముక్కుచేత వాసన తెలుసుకుంటాం. అంటే యీఅయిదు జ్ఞానేంద్రియముల ద్వారాగూడా లోకాన్ని అనుభవిస్తున్నాం అన్నమాట. ఇక పదకొండో ఇంద్రియం మనస్సు. పై పది ఇంద్రియాలకు ఆధారం మనస్సు. అది లేకపోతే యీ యింద్రియములు ఏమీ ఉపయోగించవు. అందుచేత యీ మనస్సు పై దశేంద్రియాలకు జీవగర్రలాంటిది. అలా అయ్యుండికూడా దీనికి ప్రత్యేకత ఉంది. కేవలం ఊహచేతనే అంటే పై చెప్పబడ్డ దశేంద్రియాలతో సంబంధమే లేకుండా, మనస్సునే ఉపయోగించి మనం కొన్ని విషయాలను కనుక్కుంటున్నాం. దాన్నే శాస్త్రంలో 'అనుమానప్రమాణం' అంటారు. అది చాల వరకు మనస్సుమీదనే ఆధారపడిఉంటుంది. అందుచేత యీ మనస్సును గూడా ఒకయింద్రియంగా లెక్కకట్టారు పెద్దలు. అప్పటికి మొత్తానికి ఏకా దశేంద్రియాలు లెక్కకు తేలాయి.

పై వాక్యంలో 'అనుమానప్రమాణం' అనేమాట వచ్చింది కాబట్టి 'ప్రమాణం' అంటేఏమిటో క్లుప్తంగా చెప్పి మన విషయానికి వస్తాను. మనకు కలిగే జ్ఞానాన్ని విభజన చేసి, పెద్దలు యీ వేరువేరుమార్గాల జ్ఞానం కలుగుతుందని తీర్మానించారు. పై చెప్పబడిన దశేంద్రియాలద్వారా మనకు కలిగే జ్ఞానాన్ని 'ప్రత్యక్షప్రమాణం' అంటారు. దీనిలో మనం గ్రహించే వస్తువులు,

మనకంటే బాహ్యంగా అంటే బయటగా ఉంటాయి. ఉదాహరణకు చూచుకో. మనం దేన్నైనా చూడాలంటే మనకంటికి బయటగా ఉన్నదాన్నే చూస్తాముగాని కంటిలోనిదాన్నిగాని, కంటికి వెనకాలనో, లోపలనో ఉన్న దాన్నిగాని మనకంటితో చూడగలమా? అలాగ, పైనచెప్పబడిన పది ఇంద్రియాలు, తమకంటే బయటవస్తువులనే గ్రహింపగలిగి ఉంటాయి. అందుచేత ప్రత్యక్షజ్ఞానంఅంటే బాహ్యవస్తుజ్ఞానంఅన్నా పరవాలేదు. ఈవిధంగా ప్రత్యక్ష జ్ఞానానికి రెండురకాల నిర్వచనంచెప్పవచ్చు. 1. ఇంద్రియజన్యజ్ఞానం - ఇంద్రియాలవల్ల కలిగినజ్ఞానం అన్నమాట. 2. బాహ్యవస్తుజ్ఞానం - బయటనున్న వస్తువులగూర్చిన జ్ఞానం. ఈ నిర్వచనాలభాష వేరైనా భావంమాత్రం ఒక్కటే అవుతుంది.

ఇక యీ ప్రత్యక్షజ్ఞానంఅన్నామే యిది రెండువిధాలుగా ఉంది. 1. ప్రమాజ్ఞానం 2. భ్రమాజ్ఞానంఅని. ఎన్నిసార్లు చూచినా, ఎందరుచూచినా, మార్పుచెందనిజ్ఞానం ప్రమాజ్ఞానం అంటారు. అంటే ఉదాహరణకు చెప్పుతాను విను. సముద్రాన్ని చూచావు. ఎన్నిసార్లుచూచినా అదే సముద్రం. ఎవరు చూచినా అదే సముద్రం. చూడగానే అందరూ ఎప్పుడూ సముద్రమనే అంటారు. అందుకని ఆ సముద్రాన్నిగూర్చి మనకు కలిగినజ్ఞానం ప్రమాజ్ఞానం అంటారు. ఇలాగ యీ మాదిరి నిశ్చయమైనజ్ఞానాన్ని ప్రమాజ్ఞానం అంటారు. అలాకాక మార్పుచెందేది భ్రమాజ్ఞానం. అది ఎలాగంటావా? విను. నీవూ, లక్ష్మి భీమునిపట్నంలో బీచికి వెళ్ళారు. ఆడుకుంటున్నారు. ఇంతలో, మన లైటుహౌసుదగ్గర ఒక గడ్డంసాధు ఎవరో కనబడ్డారు. ఇద్దరు, ఒక్కగంతు వేశారు. 'అరుగో స్వామిజీ వచ్చారు' అని అరిచారు. పరుగెత్తుక వెళ్ళారు. చూచారు. 'అయ్యో! కాదే! ఎవరో సాధు!' అని ఆశాభంగంతో ఒక చిరునవ్వు నవ్వుకున్నారు. వచ్చేశారు. మొదట స్వామిజీ అనుకున్నారే, ఆ జ్ఞానం తర్వాతపోయింది. ఇలాగ పరీక్షవల్ల తర్వాతపోయే జ్ఞానం భ్రమాజ్ఞానం అంటారు. అంతేగాక మీకిద్దరికే 'స్వామిజీ' కాని యితరులకెవరికైనా ఆ సాధు 'స్వామిజీ'గా కనిపించాడా? లేదు. అందరికి కాదన్నమాట. అంటే యీ భ్రమ అందరికి కలుగదు. కొందరికే కలుగుతుంది. ఈ విషయాన్ని వివరించ

టానికే గ్రంథాల్లో అనేక ఉదాహరణలు చెప్పుకుంటూ వచ్చారు. అందులో ముఖ్యమైనది 'రజ్జుసర్పభ్రాంతి'అంటారు. ఈవిషయం 'విచారసాగరం' అనే గ్రంథంలో, బొమ్మలతోగూడ వేసి వివరించారు. చూడు.

చీకటిపడ్డతర్వాత, ఒక ఆడమనిషి నూతికి నీళ్ళకువెళ్ళింది. ఆ బావి దగ్గర చుట్టుకొనిఉన్న సర్పాన్ని చూచింది. కెవ్వున కేకేసింది. 'పాము! పాము!' అని అరిచింది. పారిపోయింది. ఊళ్ళో పెద్దలంతా చేరారు. దూరాన్నించి చూశారు. ఆపాము కదలకుండా చుట్టగా పడుకొని ఉంది. చాలా పెద్దదికూడా. దగ్గరకు పోవడానికి భయం. దాన్ని చంపటానికై ఉపాయాలకు సభలు జరుగుతున్నాయి. 'తుపాకి తెచ్చి, దెబ్బతప్పితే అది పైనపడకుండా ఉండటానికి చెట్టెక్కి కాలిస్తే బాగుంటుం'దన్నాడు ఒకడు. 'కాదు. బాణాలతో కొడదా' మన్నాడు యింకొకడు. 'ఇంతెందుకు? రోకళ్ళు తీసుకుని అందరమూ దానిపైకి ఉరికి కొట్టేద్దా' మన్నాడు మరొకడు. కాని ధైర్యం ఎవరికి చాలలేదు. 'మంచినీళ్ళబావిదగ్గర పాముటమ్మా!' అని ప్రక్కింటి అవ్వతో ఎవరో అన్నారు. 'అదేమి పామో' చూట్టానికనివచ్చింది అవ్వ. 'చీకట్లో పామునెల్లా కొడతారు' అంటూ ఒక చిన్న బుడ్డిదీపాన్ని తెచ్చింది. చూచింది. పెద్ద నవ్వునవ్వింది. 'ఓరి వెర్రివెంకన్నల్లారా! అది చేంతాడురా! కోడలు పెట్టిందిలావుంది!' అని అరిచింది నవ్వుతూ అవ్వ. అందరు పరుగెత్తుకవచ్చి చూచారు. తుపాకితో చెట్టెక్కినవాడు పైకొమ్మమీదినుంచి ఒక్క దూకు దూకాడు. పాపం కాలుకు కొంచెందెబ్బకూడా తగిలింది. వాడి పేరు వెర్రి వెంగళయ్య. ఇలా అందరూ చూచారు. నవ్వారు. పాముమీదకోపం, చేంతాడు మరిచిపోయిన అవ్వకోడలిమీద చూపుతూ ఎవరింటికి వారు వెళ్ళారు. చూచావా? మొదట్లో, చీకట్లో పాముగా కన్పించింది, వెలుతురులో త్రాడైపోయింది. అంటేచీకట్లో పాముగాఉందా? లేదు. అది ఎప్పుడూ త్రాడే. అంటే రజ్జువే. కాని చీకట్లో వీరివీరి భ్రాంతిచేత పాములాగ చూచారు. రాద్ధాంతం చేశారు. తర్వాత తెలివివచ్చాక త్రాడేఅని యథార్థజ్ఞానం పొందారు.

ఇలాంటివే 1. మరుమరీచిభ్రాంతి–ఎండమావును నీళ్ళనుకోటం. 2.

శుక్తిరజతభ్రాంతి-ముత్యపుచిప్పను వెండి అనుకోటం. 3. స్థాణుపురుష భ్రాంతి-మొద్దును చూచి మనిషి అనుకోటం మొదలైనవి. ఇంకా ఎన్నో ఉన్నాయి. ఇప్పుడు భ్రాంతిజ్ఞానంలోఉన్న రహస్యం గ్రహించి ఉంటావు అనే ధైర్యం, నమ్మకంతో, యిక దాని వివరణ మానేస్తున్నాను.

అంటే యీ ప్రత్యక్షజ్ఞానంఅనేది రెండు రకాలు. 1. ప్రమాజ్ఞానమని, 2. భ్రమాజ్ఞానమని. వానిఅన్వయం ఎలాగో గ్రహించావన్నమాట. ఇదే ప్రత్యక్షప్రమాణం.

ఇక 'అనుమానప్రమాణం' అనే రెండో ప్రమాణాన్నిగూర్చి చెప్పుతాను. దీంట్లో ప్రత్యక్షజ్ఞానం కొంచెం మొదట్లోఉపయోగపడుతుంది. కాని తర్వాత మనస్సే ఊహిస్తుంది. దూరాన్నుంచి కొండమీద పొగను చూచావనుకో. వెంటనే ఏమంటావు? అచ్చట అగ్నిచేత ఏవో తగలబడుతున్నయి అంటావు. అంటే పొగఉన్నదికాబట్టి దానిదగ్గర నిప్పుఉన్నదని, ఆ అగ్నిని నీవు ప్రత్యక్షంగా, పైననిర్వచించిన ప్రత్యక్షప్రమాణంప్రకారం చూడకపోయినా, అక్కడ అగ్నిఉందని నీవు తీర్మానం చేస్తావు. అలా ప్రత్యక్షంగా తెలుసుకోటానికి వీలులేకపోయినా, కొన్నియితరమైన, దానికి సహజమైన లక్షణాలవల్ల ఒకనిర్ణయం చేశామంటే దాన్ని అనుమానప్రమాణం అంటారు. మనం ఏతీర్మానం చేస్తామో అది సత్యమైనప్పుడే దాన్ని అనుమానప్రమాణం అంటాం. లేకపోతే భ్రాంతి అంటాము. అంటే మంచునుచూచి పొగ అనుకొన్నామనుకో, అప్పుడు అగ్ని ఆ మంచుఉన్నచోట ఉంటుందా? అయినా మంచునుచూచి అగ్ని ఉందనుకొని, తర్వాత తనపొరపాటును గ్రహిస్తే అది భ్రాంతిజ్ఞానం, భ్రమాజ్ఞానంక్రింద లెక్క. ఈ అనుమానప్రమాణానికి, పొగ అగ్ని ఉదాహరణే, శాస్త్రంలో ఎక్కువగా చెప్పబడుతుంది. దాన్నే 'పర్వతో వహ్నిమాన్'- పర్వతం అగ్నితోఉంది. 'ధూమాత్' పొగ ఉండటంచేత. 'యత్ర యత్ర ధూమవాన్ తత్ర తత్ర వహ్నిమాన్' ఎచ్చటెచ్చట పొగ ఉంటుందో అచ్చటచ్చట అగ్నిఉంటుంది అని శాస్త్రం.

ఇక మూడోప్రమాణం 'శబ్దప్రమాణం'. 'శబ్దం' అంటే యిప్పుడు 'వేదం' అన్నమాట. ఇది చాలా గట్టిది. ఇప్పుడు ప్రత్యక్షప్రమాణం ఒకవేళ భ్రమఅయినా కావచ్చు. అలాగే అనుమానప్రమాణంకూడా భ్రమ కావచ్చు. ఎందుచేతనంటే యీ రెండున్నూ, మన శక్తిసామర్థ్యాలమీద ఆధారపడి ఉంటాయి. మన శక్తిసామర్థ్యాలంటే అంతశక్తిమంతం కావుగా! పొరపాటు పడవచ్చు. అందుచే పెద్దలు 'మన పూర్వపు పెద్దలయిన ఋషులు అనేకులు సాధించి తీర్మానించి, మనపై అపారప్రేమచే వ్రాసియుంచిన జ్ఞాననిధి వేదాన్ని చదవండి. ఆ వేదాన్నే నమ్మండి. అవి అనేకయుగాలనుండీ, సిద్ధప్రజ్ఞులైన మహాఋషులచేతనే ఉచ్చరింపబడిన అనుభవరాశి కాబట్టి వాటినే నమ్మండి. మీమీ చిన్న అనుభవాల్నినమ్మి చెడిపోకండి' అన్నారు. అందుకనే ఈ శబ్దప్రమాణం అంటే వేదం అన్నాం.

చాలవరకు, అంతప్రమాణమే 'ఆప్తవాక్యం' కూడా. ఆప్తవాక్యం అంటే మన మేలుకోరిచెప్పేవారి వాక్యాలన్నమాట. అందరు మనమేలుకోరినట్లే మాట్లాడుతారు. కాని ప్రాపంచికవిషయాలలోగాక ఆధ్యాత్మికవిషయాలలో ఆరితేరి, అనగా యీ గ్రంథంలో చెప్పబడబోయే సాధనసంపత్తిని సంపూర్తిగా పొంది, వేదార్థాన్ని గ్రహించి, సాధనాదుల్లో మునిగి, ఆధ్యాత్మికమార్గాన అనుభవానందాల పొందియుండి, మనమీద అనుగ్రహించేత, మన శ్రేయస్సుకై పలుకబడినవారి వచనాలే ఆప్తవాక్యాలు. ఇవి కూడా వేదవాక్యాలన్నమాటే. అయితే అలాటివారు మనకు లభించటం చాలకష్టం. మన అదృష్టం బాగాఉంటేనేగాని వారిదర్శనం మనకు కలుగదు. అలాంటివారు లభించినా, వారిఅనుగ్రహం సంపాదించటం యింకాకష్టం. అట్టి అనుగ్రహరూపవాక్యాలే ఆప్తవాక్యాలు. ఈకాలంలో యివి మరీకష్టం. నా బుద్ధికిమాత్రం వేదవాక్యాలకన్నా యిట్టివారి ఆప్తవాక్యాలే శ్రేష్ఠం అంటాను. వేదాలు చెప్పిఊరుకుంటాయి. కాని ఆప్తుడు చెప్తుతాడు, చేయిస్తాడు, సవరిస్తాడు, ఆపత్కాలంలో రక్షిస్తాడు, అన్నివిధాల తోడ్పడి అభివృద్ధికి తెస్తాడు. ఆప్తుడు తోడునీడ అన్నమాట. అయినా శాస్త్రం త్వరగా లభ్యపడుతుంది. కాని ఆప్తుడుమాత్రం లభ్యంకావటం పూర్వజన్మకర్మపరిపాకం. అది సామాన్యంకాదు. అంటే అనేక జన్మలుగా,

మనం గుడ్డెద్దుచేలోబడ్డట్లు తంటాలు పడుతూఉంటే చూచి, కనికరించి, మనమీద జాలిపడివస్తాడు ఆప్తుడు.

ఇలాగ ప్రత్యక్షం, అనుమానం, శబ్దం, ప్రమాణాలు మూడు. వీటిని సరిగ్గా గ్రహించుకోవాలి నీవు. ఈ ప్రత్యక్షానుమానశబ్దప్రమాణాల మూలంగా, వాక్పాణిపాదపాయూపస్థలనబడు కర్మేంద్రియపంచకం, శ్రోత్ర త్వక్చక్షుజిహ్వాఘ్రాణాలను జ్ఞానేంద్రియపంచకం, మనస్సు అను ఏకాదశేంద్రి యాలద్వారా యీ లోకాన్ని, మనం అనుభవిస్తున్నామని పై గ్రంథపాఠం యొక్క సారాంశం.

ఇక, యీ ప్రపంచాన్నిగురించి ఆలోచిద్దాం కొంచెం. ఈ ప్రపంచం చరాచరాత్మకం. చరములంటే కదిలేవి. అచరములంటే కదలనివి. కదిలేవి ఏవంటే, ఈదేవి, ఎగిరేవి, తిరిగేవి అన్నమాట. ఈదేవి నీళ్ళలోఉండే చేపలు మొదలైనవని అర్థం. ఎగిరేవి గాలిలోఉండే పక్షులు, ఈగలు మొదలైన రెక్కలు గల జీవులకన్వయం. తిరిగేవి భూమిమీదఉండే మనుష్యులు, పశువులు యితర జంతువులున్నూ. ఇక కదలనివి చెట్లు, కొండలు మొదలైనవి. వీటిని గూడా శాస్త్రజ్ఞులు నాలుగువిధాలుగా విభజించారు. 1. ఉద్భిజ్జములు 2. అండజములు 3. స్వేదజములు 4. జరాయుజములు. ఉద్భిజ్జములంటే భూమిని చీల్చుకుని పుట్టేవి, అంటే వృక్షాలు, కొండలు. అండజములంటే గ్రుడ్లులోనుండి పుట్టేవి, పక్షులు, కీటకాలు బల్లులు మొదలైనవి. స్వేదజము లంటే చమటవల్లపుట్టే నల్లులు, పేలు. ఇక జరాయుజములంటే మావిలో నుండి పుట్టేవి. మావిఅంటే పుట్టుచున్న శిశువునకు చుట్టూవుండే తోలు సంచి. ఈమావినుంచిపుట్టే మనుష్యులు, పశువులు, మృగాలు యీ తర గతివారవుతారు. వీటినన్నింటినికలిపి చతుర్విధ జీవరాసులు అంటారు. ప్రపంచంలోగల అన్నిజీవులు యీ నాలుగువిధాలలో ఏదో ఒకవిధంలో చేరి ఉండక తప్పదు. మరొకవిధానం లేదు.

వీటినన్నింటిని జీవరాసులంటాం. ఈ జీవపదాన్ని చెప్పడానికే యింత

గ్రంథం నడవాల్సివచ్చింది. పై చెప్పినవిధాన, ప్రపంచంలో ఏ మూలచూసినా జీవకోటి లేకుండాలేదు. మట్టిలోకూడా ప్రాణం ఉంది అని మన పెద్దల భావం. అయితే దానికి ప్రాణం ఎలా ఉంది? మనకు తెలియకపోయినంత మాత్రాన లేదనకూడదు. మనం 'అది మట్టి, నిర్జీవం' అంటున్నాం. కాని దాంట్లోగూడా ప్రాణందంది. ఇంతెందుకు, ఒకమనిషి చనిపోగానే ఆ దేహాన్ని చూచి నిర్జీవమంటాం. శవమంటాం. యథార్థంగా అలా అనటానికి వీలేలేదు. ఒక్కరోజు అలాగే ఉంచితే, ఆ ఒక్క జీవిలోనుంచే యెన్నెన్నో కన పడకుండా, అతిసూక్ష్మంగాఉన్న ఎన్నో జీవరాసులు బయలుదేరుతాయి. వాటినే పురుగులంటాం. అలాగ మనంతెలుసుకున్న యీ ప్రాణాలేకాకుండా అనేకప్రాణాలు యిందులో యిమిడియేఉన్నాయి. ఆవిధంగా మనం దృష్టితో చూస్తే లోకమంతా జీవమయం, లేక ఒక్కమాటలో లోకము జీవ రూపంఅన్నా అనవచ్చు.

సరే, యింతవరకూ లోకం జీవస్వరూపమంటున్నాం. బాగానేవుంది. లోకంలో ఏ వస్తువైనా పుట్టటం చూస్తున్నాం. విత్తనములోనుంచి మొక్కలుగా అన్నీ మరొకదానిద్వారా పుట్టుతున్నాయికదా! ఈప్రపంచం ఎలా పుట్టింది? ఈప్రశ్న చాలా కఠినమైన ప్రశ్న. దీన్ని తీర్మానించటానికే పెద్దలంతా తంటాలుపడి తలక్రిందులైనారు. అయినామనం దీన్నిగురించి కొంచెం ఆలో చించకపోతే ఎలాగ? కాబట్టి పుట్టుటఏమిటో, దీనికి కారణాలేమిటో, పుట్టుట ఎవరివల్లనో, ఏపదార్థంచేత యీపుట్టుక ఏర్పడిందో, మొదలైన విష యాలు యిక ఆలోచిద్దాం. అంటే సృష్టి రంగంలోకి దిగుదాం. సరేనా!

ఆతడే మన దిక్కు.

ఆతడే మన గమ్యం.

2-1-46.

# 2
# తత్త్వచింతనము

ప్రియమైన మాతాజీ!

చిన్నదానివైనా యిలాంటి ఆధ్యాత్మికవిషయాలలో నీకు జిజ్ఞాస కలిగినందులకు నేను చాల సంతోషిస్తున్నాను. అమ్మాయీ! నిజం చెప్తుతాను విను. ప్రపంచంలో నీయీడు చిన్నపిల్లలు ఎందరులేరు! వారందరికి యీ బుద్ధి ఏల పుట్టలేదు! పోనీ, అందరికి కాకపోయినా కొందరికైనా కలుగరాదా! అదీలేదే! ఇలాగ, చిన్నతనంలోనే యిట్టి భక్తిశ్రద్ధలు కుదరటం చాలా అరుదు. ఇంతెందుకు మనం గ్రంథాలలో వెతికిచూచినా, పేరుపొందిన జ్ఞానులు ఆడవాళ్ళలో ఎందరున్నారు? బృహదారణ్యకోపనిషత్తులో మైత్రేయివిషయం వింటున్నాం. ఆమె యాజ్ఞవల్క్యమహర్షికి భార్య అంటారు. ఆమె గొప్పదనం ఏమిటంటే విను. ఆ యాజ్ఞవల్క్యుడు చాలకాలం ప్రపంచాన్ని అనుభవించిన మహాపండితుడు. అనుభవంలేని పాండిత్యంలో చాలకాలం మునిగిఉండి, తర్వాత కళ్ళు తెరిచాడు. ఈ సంసారం నిస్సారం అనే శాస్త్రవాక్యాలు ఈతని

హృదయానికి తట్టాయి. 'ఛీ ఈ సంసారంవ'ద్దని తీర్మానం చేసుకున్నాడు. కాని యితనికి యిద్దరు భార్యలున్నారు. వారిలో కాత్యాయని పెద్దది, మైత్రేయి చిన్నది. ఈ స్త్రీలుగూడ వాలపండితులు. చిన్నతనములోనే వీళ్ళు గొప్ప విద్యానిధులై తమ్ముజయించినవారినే పెండ్లాడుతామని నిశ్చయించుకున్నారు. తమ విద్యకుమించిన విద్యావంతునికొరకు వెతకటం ప్రారంభించారు. ఈ యాజ్ఞవల్క్యుని ప్రఖ్యాతి విన్నారు. ఆయన మీదికి ఉరికారు ప్రశ్నాపరంపర లతో. కాని ఆ కాలంలో ఆయనకు ఎదురుపడే పండితుడే లేడన్నమాట. అలాంటిదిట్టకు ఈ ప్రశ్నలొక లెక్కా! ఊదేశాడు. అందుచేత ఆయన్ని వీరి ద్దరూ పెండ్లాడారు. ఇద్దరూ ఒకసారికాదనుకో. మొదట కాత్యాయని ఆయన్ని ఎదుర్కొని, ఓడి వివాహం చేసుకుంది. తర్వాత అలాగే మైత్రేయి. దీంట్లో దోషం చూచావా? అంత చదువుకొని, యీ స్త్రీలు, ఆ చదువుకు తగినభర్తకై వెతికారుకాని, ఆ చదువులోవున్న అనుభవానికి యత్నించలేక పోయారు. అలాగే యీ యాజ్ఞవల్క్యుడుకూడా. ఆ వనితలను గెల్చినా, వారి లౌకికభావాలకు లొంగి, వాళ్ళను పరిణయమాడాడు. ఇది, వీరి ముగ్గురిలో గల లోపంఅని నా భావం.

కాని కొన్నాళ్ళకు, ముందు చెప్పినట్లు తనతప్పును గ్రహించాడు యాజ్ఞవల్క్యుడు. సన్న్యాసంతప్ప వేరే గత్యంతరంలేదని తీర్మానం చేసు కున్నాడు. సన్న్యాసం తీసుకోవాలంటే భార్య, తల్లి అనుజ్ఞ కావాలని శాస్త్రం కాబట్టి చిన్నభార్యను ముందు పిలిచాడు యాజ్ఞవల్క్యుడు. 'నేను సన్న్యాసం పుచ్చుకుంటాను. ఉన్నఆస్తినంతా మీ యిద్దరికి పంచేస్తాను పుచ్చుకోండి' అన్నాడు. ఆ మాటలకు మైత్రేయి నిర్విణ్ణురాలైంది. ఎందుకు? 'తనకు సన్న్యాసం ఎంత అవసరమో నాకుకూడా అంతఅవసరమే. అలాంటప్పుడు ఆస్తిని మాకు యిస్తారట! తాము సన్న్యసిస్తారట! ఏమి యీ చిత్రం' అని భావించింది మైత్రేయి. అందుకని యాజ్ఞవల్క్యుని నిరుత్తరుడిగా చేయ టానికి, వీలయితే ఆయనతోపాటు తానుగూడ సన్న్యాసిని కావటనికి, ఒక చిన్న ప్రశ్నవేసింది మైత్రేయి. 'నాథా! మీరన్నమాట చాల సబబుగానేవుంది. కాని, యీలోకంలోవున్న ఆస్తినంతా నాకుమీరిచ్చినా, ఆయాస్తివల్ల నాకేమైనా

మోక్షం కలుగుతుందా?' అని అన్నది. ఆ మాట వినేటప్పటికి అమ్మాయీ! యాజ్ఞవల్క్యునికి కళ్ళు తిరిగాయిఅంటే నమ్ము. అతని సంతోషం ఆకాశాన్ని అంటింది. 'మైత్రేయీ! నీ సౌందర్యానికి, నీ పాండిత్యానికే, నేను యిదివరకు నిన్ను చాలాప్రేమించేవాడిని. ఇప్పుడిలాంటి అనుభవరూపమైన ప్రశ్నను వేసి నందుకు నిన్నెంతగా ప్రేమించాలో తెలియటంలేదు. ఇక, దానికిఫలితంగా నాలోవున్న ఆధ్యాత్మికవిద్యనంతా నీకు చెప్పేస్తాను. కూర్చో' అని సగౌర వంగా కూర్చుండజేసి, అతిశ్రద్ధతో ఆమెకు ఆత్మతత్త్వాన్ని బోధించేశాడు. ఆ బోధయే వేదాలలో ఉపనిషత్తుగా మారి 'బృహదారణ్యకోపనిషత్త'ని చాల పేరుగాంచింది. ఇదంతా ఎందుకు చెప్పుకొచ్చానంటే, ఆడవాళ్ళల్లో చాల తక్కువ అనుభవశాలురుంటారని నీకు బోధచేయటానికే.

ఇలాగ, మైత్రేయివిన్న ఉపనిషత్తులో మరొక విదుషీమణి ఉంది. ఆమె యీకాత్యాయనీమైత్రేయీల తలల్లోనుండి దూరిపోయింది. చాలఅసమాన. ఆమెయొక్క ప్రశ్నలకు తట్టుకోలేకపోయాడు యాజ్ఞవల్క్యుడు. అయితే, మగదబాయింపు చేత ఆమెనుకూడ నోరు మూయించాడు ఘటికుడైన యాజ్ఞవల్క్యుడు. ఈ అసమానప్రతిభాస్వరూపిణి ఎవరనుకుంటున్నావు? ఆమెయే గార్గి. ఆమె పేరు విననివారుండరు. ఆమెగూడ యాజ్ఞవల్క్యునే వివాహమాడిందంటారు కాని ప్రమాణాలుతక్కువ. ఇక ప్రస్తుతకాలంలోనా? లేకేమి? మీరా, సక్కు, శారదామాయి, మొదలైనవారున్నారుకాని చాల కొద్ది మందిఅని నా అభిప్రాయం.

దీనయుందంతటిపర్యవసానం ఏమిటంటే అలాటివారికికూడా లేని బుద్ధి, నీకు యీ చిన్నతనంలో కలగటం గర్వించవలసినవిషయం. అలాంట ప్పుడు, నీ స్థితినిగూర్చి నేను ఎంత ఆనందించాలో తెలియటంలేదు. చూడు, సంసారిగావున్న మైత్రేయి ప్రశ్నకే యాజ్ఞవల్క్యుడు అంతపొంగిపోతే, యిక ప్రపంచంఏమిటో తెలియని, నీ కల్మషంలేని ఆర్తికి నేను ఎంతసంతోషిం చాలో! ఆఆనందాన్నిపట్టలేక యీ 'సాధనరహస్యం' అనుదాన్ని నీకు సుల భంగా అర్థంఅయ్యేటట్లు, వివరంగాఉండేలాగ, అవసర విషయాలనన్నింటిని

చేర్చి, ఒకవేళ పెద్దదయినా ఫరవాలేదని వ్రాసేస్తున్నాను. నీవు 'పెద్దదే' అని భయపడక శాంతంగా, శ్రద్ధతో అర్థంచేసుకో. అర్థం చేసుకున్నదాన్ని ఆచరణలోపెట్టి సాధించు. అప్పుడు నా యీవ్రాత సఫలం అయిందని ఆనందిస్తాను. తెలిసిందా?

ఇక మన ప్రస్తుతవిషయానికి వద్దామా! పూర్వం ఏ విషయాలు చెప్పుతున్నానో జ్ఞాపకముందా? ఈ కనపడే ప్రపంచమే జీవస్వరూపం అన్నాను. ఈ ప్రపంచం ఎలా పుట్టిందో విచారించటానికి పూనుకున్నాం. సృష్టివిషయం గ్రహించటం చాలకష్టం అన్నాను. కాబట్టి శ్రద్ధగా విను.

ఏదైనా పుట్టిందంటే దానికి కొన్నికారణాలుండాలి. ఉదాహరణకు చూచుకో. ఒక కూజాను కొన్నావు. అది ఎలా పుట్టిందో విచారించు. ఆ కూజా 'దేనిలోనుండి పుట్టింది? ఎవరివల్ల పుట్టింది? దేనిసహాయంవల్ల పుట్టింది?' అనే మూడు ప్రశ్నలు మనకు కలుగుతాయి. మొదటి ప్రశ్నకు సమాధానం ఏమిటి? మట్టిలోంచి పుట్టిందంటాం. ఎవరివల్ల పుట్టింది? అంటే కుమ్మరివానివల్ల పుట్టిందంటాం. దేనిచేత పుట్టిందంటే ఆ కుమ్మరి ఉపయోగించిన చక్రము, కఱ్ఱలంటే దండముల ఉపయోగం, లేక సహాయం చేత పుట్టిందిఅంటాం. ఆకూజాకు ఆమట్టి 'ఉపాదానకారణం' అవుతుంది. కుమ్మరివాడు 'నిమిత్తకారణం' అవుతాడు. చక్రదండాదులు 'సహకారి కారణం' అవుతాయి. ఈ మాటలు, విషయాలు, చాలముఖ్యం కాబట్టి బాగా అర్థంచేసుకుని జ్ఞాపకం ఉంచుకో. మట్టివల్ల కుండ ఏర్పడిందికావున దాన్ని ఉపాదానకారణం అన్నాం. కుమ్మరి చేశాడుకాబట్టి అతన్ని నిమిత్త కారణం అన్నాం. చక్రదండాదులు సహాయం చేశాయికాబట్టి అవి సహకారి కారణం అయినాయి. ఈ కారణాలవల్లఏర్పడ్డ యీ కూజాను 'కార్యం' అంటారు. మట్టి, కూజాను తయారుచేసి, కూజాను వదలకుండా, కూజాలోనే యిమిడిపోయింది. అంటే కార్యంలో ఏ 'కారణం' యిమిడివుంటుందో దాన్ని ఉపాదానకారణం అని నిర్వచించవచ్చును. కూజానుచేసిన కుమ్మరి, కూజా తయారు అయినతర్వాత దానిలో యిమిడివున్నాడా?

లేదు. వాడు చేయకపోతే అసలు కూజా కానేకాదు. వీడిని నిమిత్తకారణం అన్నారు. ఇక చక్రదండాదులున్నాయే, వీటిని సహకారికారణం అన్నాం కదూ! ఇవి లేకపోయినా చేతులతోనైనా కుమ్మరి ఆ కూజాను చేయవచ్చు. అంటే సహకారికారణం అంతముఖ్యం కాదన్నమాట. కాని ఒక కార్యానికి నిమిత్త, ఉపాదానకారణాలు చాల ముఖ్యం. అర్థం అయిందా? కాకపోతే మరల చదువు. అర్థం అయితేనేగాని ముందుకు పోవద్దు. మరల చెప్తుంటాను విను. ఏకారణమైతే కార్యంలో యిమిడిఉంటుందో దాన్ని ఉపాదానకారణం అంటారు. ఏకారణం లేకపోతే కార్యమేకాదో, ఏది కార్యంలో ఉండదో దాన్ని నిమిత్తకారణం అంటారు. ఈకార్యకారణమీమాంస చాలగొప్పది. దీనిమీదనే ఆధారపడివుంది వేదాంతమంతా. మొదట్లో చాలగొడవగా ఉంటుంది. కాని తర్వాత చాలసులభమై, తర్వాతి విషయాలను అర్థంచేసుకోవటానికి అవకాశం యిస్తుంది. కాని ప్రస్తుతానికి యింతవరకు నీకు చాలు. అవసరాన్నిబట్టి, యిక ముందు యీ విషయం తెలుసుకుంటావు.

అలాగే ప్రస్తుతవిషయంలో యీప్రపంచం పుట్టిందంటారే దీనికి ఉపాదానకారణం ఏది? నిమిత్తకారణం ఏది? అనే ప్రశ్నకు సమాధానం రావాలి.

దానికి కొందరుమతస్థులు అన్నారుకదా, 'ప్రధానంఅనే మట్టిలాంటి వస్తువొకటుంది. ఈశ్వరుడొకడున్నాడు. కుమ్మరి మట్టితో కుండలు ఎలా చేస్తాడో, అలాగే ఈశ్వరుడు యీప్రధానంతో యీప్రపంచాన్ని, జీవుల్ని, చేశాడయ్యా' అని. వీరినే సాంఖ్యులనిఅంటారు. కాని యీ సాంఖ్యవాదాన్ని వేదాలు ఒప్పుకోవు. వేదాల్లో ముఖ్యభాగాలుఅన్నవి ఉపనిషత్తులు. వీటినే 'వేదాంతం' అనికూడా అంటారు. ఈ ఉపనిషత్తులు ఏమంటున్నాయి? 'ఆ భగవంతుడు, లేక బ్రహ్మం పరిపూర్ణమైంది. అంటే సర్వవ్యాప్తంగా అంతటా నిండివుంది' అనిఅన్నాయి. 'అలా సర్వవ్యాప్తంగాఉన్న బ్రహ్మంలో, ప్రధానం ఎలా ఉందయ్యా?' అంటాం. 'ఎందుకుండగూడదు? ఇప్పుడు గాలిలో మనంఅందరం ఉండలేదా? నీళ్ళల్లో చేపలుంటంలేదా?' అని అంటావా? కాని కొంచెం ఆలోచించుకో! మనంఉన్నచోట, అంటే మనం ఎంతస్థలాన్ని

ఆక్రమించామో, ఆకాశంలో, ఆస్థలంలో గాలిలేదన్నమాటే. 'మనలో గాలి లేదా?' అంటావేమో! రాయిఅనుకో. దాంట్లో గాలిలేదుగా! అలాగే చేప ఉన్నస్థలంలో నీళ్ళులేవుగా! అలాంటప్పుడు ఒకచోట గాలిఉండి మరొక చోట లేదనాలి. అలాగే బ్రహ్మం, ప్రధానం ఉన్నచోటలేకుండా, యితరత్రా అంతటాఉందంటే ఆబ్రహ్మం సర్వవ్యాప్తంకాదనే తేలుతుంది. ఇంకా ఉపనిషత్తులంటాయిగదా ఆ బ్రహ్మం 'అనంతం అఖండం' అని. ఆ బ్రహ్మం అనంతం అయితే, అంటే అంతంలేకుండాఉంటే, యీ ప్రధానం ఉన్నచోట అంతం కలిగిఉన్నట్లేగా? నీళ్ళు అంతటాఉండి, చేపవరకుఉండి, చేపవర్కం దగ్గరకు వచ్చేటప్పటికి అంతంకావటంలేదూ? అలాగే ప్రధానందగ్గరకు వచ్చేటప్పటికి ఆ బ్రహ్మం పూర్తిఅయి, చేపనుదాటగానే మరల నీళ్ళు ప్రారంభం అవుతాయిఅన్నట్లు, ఆబ్రహ్మం ప్రధానంతర్వాత మరల ప్రారంభం అవుతుందన్నమాట అంటే, యీ బ్రహ్మం యీ ప్రధానంచేత ఖండింపబడినది అనేగా! భూమిలో ఒక గోడను కట్టాలనుకో. దానికై పునాది వేయాలి. ఆ పునాది ఎంతఉండాలో, అంత గుంటతీసి పునాది కట్టుతాం. అంటే ఆ పునాది, ఆభూభాగాన్ని ఖండించి, ఆభాగంలో తాను ఆక్రమించిందిఅని అర్థమేగా! అలాగే యీప్రధానం, ఆబ్రహ్మాన్ని ఖండించి, ఆభాగంలో తాను ఉందని అర్థంవస్తుంది. అలాగా అనటానికి వీలులేదంటాయి ఉపనిషత్తులు.

అంతేకాదు. ఈ ఉపనిషత్తులు అంతటితో ఊరుకోలేదు. ఆ బ్రహ్మం, 'సజాతీయవిజాతీయస్వగతభేదరహితం' అని చెప్పాయి. ఇది యింకా చాల కష్టం. 'సజాతీయం' అంటే ఏమిటి? 'విజాతీయం' అంటే ఏమిటి? 'స్వగతం' అంటే ఏమిటి? చెప్పుతాను విను. ప్రపంచంలో 'భేదం' అంటే యీమూడురకాలుంటుంది. సజాతీయంఅంటే ఒక్కజాతిలోనేఉండే భేదాలు. ఎలాగంటే రెండు అరటిచెట్లున్నాయి. రెండూ ఒకేజాతికి చెందినవన్నమాట. కాని ఒకటిపెద్దది, మరొకటిచిన్నది. అలాగే యిద్దరు మనుష్యులున్నారనుకో. ఒకరు నల్లగాను, మరొకరు ఎర్రగాను ఉంటారు. ఒకే జాతికి చెందినా, వీరిలో తారతమ్యాలున్నాయిగదూ! ఈ భేదాన్ని సజాతీయభేదం అంటారు. రెండోది విజాతీయభేదం. అరటిచెట్టు, మన భీమిలి నరసింహ

స్వామికొండ. రెండూ ఒకేజాతికి చెందినవికావు. ఇది వృక్షజాతిది. అది రాయిజాతిది. ఈ రెండింటికి యింకా భేదాలు ఎక్కువగా ఉంటాయి. ఈ రెండును భిన్నజాతికిచెంది, భేదాలు గల్గిఉంటాయి. ఇక మూడోది స్వగతభేదం. చెట్టుంది. దానికి పండ్లు, ఆకులు, పూలు, కొమ్మలు, వేళ్ళు, యిలాగ అనేకవిధాల భాగాలున్నాయి. అన్నీ ఆ చెట్టుకు చెందినవేకాని ఒక దాంతో మరొకదానికి చాల విభేదాలున్నాయి. మన దేహంలో చూడు. కాలు వేరు, చేయివేరు, కన్నువేరు, ముక్కువేరు. పర్యవసానంగా స్వగతభేదంఅంటే ఒక వస్తువు, తనలోగల అంతర్భాగాలలో భేదం కలిగిఉంటంఅని అర్థం. ఇపుడు యీ త్రివిధభేదాల అన్వయం అర్థమయిందా? ఇక విను. ఈలాంటి మూడుభేదాలు బ్రహ్మంలోలేవని ఉపనిషత్తులవాదం. ఆ భావాలు బ్రహ్మవిషయంలో అన్వయంచేద్దాం. బ్రహ్మంలో సజాతీయభేదంలేదంటే మరొక బ్రహ్మం యింతకంటే పెద్దదికాని, చిన్నదికాని, పుల్లదికాని, తియ్యదికాని, ఎర్రదికాని, పచ్చదికానిలేదన్నమాట. ఇక విజాతీయభేదంకూడా బ్రహ్మంలో లేదు. బ్రహ్మంకానిపదార్థం, సాంఖ్యులుచెప్పు ప్రధానంలాంటిదైనా లేదని అర్థం. ఆ బ్రహ్మంలో కన్ను, ముక్కు, చేయి, కాలు, లేక వేళ్ళు, ఆకులు, పండ్లు, పువ్వులాంటి అంతర్భాగాలుకూడా లేవు. కాబట్టి స్వగతభేదం సంగతి కూడా లేనేలేదుఅని ఉపనిషత్తుల తీర్మానం. 'ఏమి ఆ ఉపనిషత్తులు చెప్పిందంతా మనం సమ్మతించాలా?' అంటావా! ఈ విషయం శబ్దప్రమాణంలో కొంచెంగా చర్చించాను. ఉపనిషత్తులు యుక్తి, అనుభవానికి అనుకూలంగా చెప్పుతాయి. కాబట్టి అవి, అందరికి ప్రమాణంకావాలి. అందుచేతనే వాటిని 'అపౌరుషేయం' అంటారు. అవి మానవమాత్రునిచేత వ్రాయబడ్డవి కావు. అవి సృష్టికిముందే ఉన్నాయట! అందుకనే, వాటిల్లో చెప్పబడ్డవిషయాలను నిర్వివాదంగా ఒప్పుకొనితీరాలి.

ఇలాగ, ఉపనిషత్తులు గట్టిగా చెప్పుతూవుంటే యిక యీ సాంఖ్యులు చెప్పే ప్రధానవాదం, అంటే ప్రధానాన్నిగూర్చి చెప్పేవాదం ఎలా నెగ్గుతుంది? ఆ బ్రహ్మనికి అన్యంగా ఏపదార్థం ఉండటానికి వీలులేకపోతే, యీ ప్రధానానికి స్థానం ఎలావస్తుంది? కాబట్టి యీ ప్రధానమూ లేదు, దీన్ని లోకంలాగా, లేక

జీవులులాగ సృజించే ఈశ్వరుడూ లేడు.

అయితే, యిక యీ సృష్టిని వివరించేగతి ఎలాగా? మరల పెద్దలు ఆలోచించారు. 'కాదుకాదు. ప్రధానంలేనిమాట నిజమేకాని ఆబ్రహ్మం తనం తటతానే యీరూపంగా మారాడు. అంటే లోకంగాను, యీలోకంలోని జీవులుగాను అతడే మారాడు' అన్నారు కొందరు. ఈవిపరీతం ఎక్కడైనా ఉందా? అన్యవస్తువును అపేక్షించకుండా, అంటే యితరవస్తువు సహాయం లేకుండా ఒకవస్తువు, మరొకవస్తువుగా మారుతుందా? పాలు పెరుగు కావాలంటే మజ్జిగఉండాలిగా? మట్టి, కుండకావాలంటే కుమ్మరి ఉండాలిగా? బండి నడుస్తున్నప్పటికీ లాగేవి, తోలేవాడు ఉండాలిగా? అనేదే ప్రశ్న. అలా తొందరపడవద్దు. సాలెపురుగుంది. అది తనలోనుంచే దారాన్ని తీస్తుంది. గూడు కట్టుతుంది. ఆ దారాన్ని తయారుచేయడానికి పత్తినిగాని, సిల్కునుగాని, అది ఎక్కడైనా తెచ్చిందా? తనలోనుండే ఆ దారం తీసింది. అంటే యితరవస్తువుపైన ఆధారపడక, తనమీదనే ఆధారపడి ఆ దారాన్ని తీసింది. దానికే 'స్వాపేక్షికం'గా తయారుచేసిందని అంటారు. స్వ + అపేక్ష, అంటే తనపైన ఆధారపడటం. ఇతరంపై ఆధారపడితే 'పరాపేక్షికం' అంటారు. పర + అపేక్ష, అంటే యితరుల సహాయంవల్లఅని అర్థం. అంటే, యీసాలెపురుగు స్వాపేక్షికంగానే ఆదారాన్ని తీస్తుంది. అలాగే ఆబ్రహ్మం కూడా స్వాపేక్షికంగానే యీలోకాన్ని సృజిస్తున్నాడు. ఇతనికి పరాపేక్షతో అవసరంలేదు అంటారు కొందరు. వీరినే పరిణామవాదులు అనిఅంటారు. దీనినే సిద్ధాంతం చేయడానికిఅంటే స్థాపించటానికి, కొన్ని ఉపనిషత్తుల వాక్యాలు కూడా చూపిస్తారు వీరు. ఈ వాదం, మొదటి సాంఖ్యవాదంకంటే బాగుంది. కాని యిదీ చాలాదోషాలతో కూడివుంది.

'ఈబ్రహ్మం దీన్ని ఎందుకు సృజించాడయ్యా' అనేసందేహం కలుగుతుంది. ఈ ప్రశ్నకు సరియైన ప్రత్యుత్తరంలేదు. ఈ ప్రశ్నకు యే యే సిద్ధాంతులు యే యే సమాధానాలు చెప్పారో, వాటివాటికి తిరుగు సమాధానాలు ఏమిటో విచారించటం మొదలుపెట్టితే, అసలు మనకు కావలసిన 'సాధన

రహస్యం' విషయం అంతర్ధానమై, ప్రస్తుతం నీకు అర్థంకాని శాస్త్రచర్చ వచ్చే స్తుంది. అందుకని ఆ చర్చ ప్రస్తుతం మానేస్తున్నాను.

పోనీ, ఎలాగోఅలాగ సృజించాడయ్యాఅని అందామంటే మరొక చిక్కువస్తుంది. 'అసృజింపబడ్డ ప్రపంచం, సాలెపురుగుకు సాలెగూడు వెలుప లగాఉన్నట్లు, బ్రహ్మానికి అన్యంగాఉన్న' దందామాఅంటే ఆ బ్రహ్మంయొక్క సర్వవ్యాపకత్వానికి భంగం వచ్చేస్తుంది. 'కాదు ఆ బ్రహ్మానికి లోపలనేఉందని చెప్పుదామా' అంటే ఆ బ్రహ్మంయొక్క అనంతత్వానికి, అఖండత్వానికి ముప్పు వస్తుంది. అంటే, బ్రహ్మంలో స్వగతభేదం ఏర్పడుతుంది. ఆ ప్రపంచం బ్రహ్మానికి అన్యంగాఉంటానికి అసలే వీలులేదు. అన్యంగావుంటే విజాతీయభేదం రాదూమరి! ఇట్టి భేదాలుగాని, మార్పులుగాని, కలగటానికి వీలులేదు. కాబట్టి యిలా యోచిస్తే, యీ సృష్టి ఆ బ్రహ్మంనుండి ఎలా జరి గిందో చెప్పటానికి, యీసంకుచితమైన మానవమనస్సుకు సాధ్యంకావటం లేదు. 'అసలు సృష్టి జరగలేదందామా?' అంటే పెద్ద ఎనుబోతులాగ ముందు కన్పిస్తుంటే లేదని ఎలాగంటాం? మనకు తెలియనివిధంగా జరిగిందని చెప్పి తీరాలి.

దీన్నంతా ఆలోచించి శ్రీ శంకరాచార్యులవారు 'వివర్తవాదం' అని, సృష్టికి ఒకసమాధానం చెప్పారు. ఎలాగంటే రజ్జుసర్పభ్రాంతిఅని నీకు పూర్వం చెప్పాను. అంటే ఒకత్రాడును చీకట్లోచూచి, పాముఅని భ్రమ పడటం అన్నమాట. మనం ఆ పామునుచూచి అరిచామే, అప్పుడున్న పాము ఎలా పుట్టింది? అనేదేప్రశ్న. దీనికి తల్లి ఎవరు? తండ్రి ఎవరు? చెప్పగలవా? నీవే కాదు పెద్దపండితులైనా, ఆ శంకరాచార్యులుకూడా చెప్పలేకపోయారు. ఆపాము నిజంగాపుట్టిఉంటే దీపంరాగానే పారిపోతున్నట్లుకనపడాలి. దాన్ని రోకళ్ళతో చావమోది ఉండాలి. అలాకాకుండా ఏమైంది అది మరి? త్రాడులో దూరిందా? లేదు. మనం దీపంతో చూడకముందు ఆ త్రాడులోఉందా? అప్పుడూ లేదు. దీపంతో చూచినతర్వాతఉందా? అప్పుడు అసలేలేదు. ఇక ముందూలేక, వెనుకాలేక, మధ్యలో దానికి తల్లి,

తండ్రిలేక ఎలావచ్చిం దంటావు? పోనీ మధ్యలోఅయినా అందరికి ఉందా? ఆ భ్రాంతిలో ఉన్నవారికే ఉందికాని అందరికీ లేదు. ఎలా వచ్చిందో, ఎలా పోయిందో తెలుసుకోటానికి సాధ్యంకాకుండా ఆ సర్పం, ఆ త్రాడుమీద భాసించింది అనిఅంటారు శాస్త్రజ్ఞులు. ఇలా ఏతీర్మానం చేయటానికి వీలు కాలేదుకాబట్టి దీనికి 'అనిర్వచనీయఖ్యాతి' అనిపేరుపెట్టారు శ్రీశంకరులు. అలాగే శ్రీ శంకరులవారి అద్వైతవాదప్రకారం, యీ ప్రపంచం 'ఇలాగ' అని, మనం నిర్ధారణ చేయటానికి వీలులేనివిధంగా, అంటే అనిర్వచనీయంగా సృజింపబడ్డది ఆబ్రహ్మంవల్ల. కాబట్టియీవివర్తవాదాన్ని అనుసరించిచూస్తే, సర్పానికిత్రాడే సర్వకారణం అయినట్లు, యీసృష్టికంతా బ్రహ్మమే నిమిత్తోపాదానకారణాలు. రెండునుఅయినాడుఅని తీర్మానం చేశారు.

ఇప్పటికి పైనజరిగిన గ్రంథంవల్ల ఏమితేలింది? రః జీవరూపంగాఉన్న యీ లోకంఅంతా, ఆ బ్రహ్మంవల్ల అనిర్వచనీయంగా సృజింపబడ్డది. సృజింపబడ్డదని అన్నారుకాని అసలు ఏమనాలంటే, సృజింపబడ్డట్లుగా కనబడుతున్నది అనాలి. ఎందుకంటే ఆ పాము, ఆ త్రాడువల్ల సృజింపబడ్డదా? లేదుగా! సృజింపబడ్డమాదిరిగా కనిపిస్తుంది. అలాగే యీ ప్రపంచంకూడా ఆ సజాతీయవిజాతీయస్వగతభేదరహితుడును, అనంతుడును, అఖండుడును, నిర్వికారుడునుఅయిన ఆ బ్రహ్మంచేత సృజింపబడినట్లు కనిపిస్తున్నదని పర్యవసానం.

ఇలా సృజింపబడ్డది అనబడే సృష్టికిని, లేక జీవునికిని, సృజించినది అనబడే బ్రహ్మనికిని కూడికయే 'యోగము' అనే పదంయొక్క అర్థం. రః పొడుగైన ఉత్తరాన్ని చదివి అలసిఉంటావు. చాలకఠినమైన విషయాలనుకూడ విన్నావు. కాబట్టి యీయోగం ఏమిటో, ఎన్నివిధాలో, మొదలైన విషయాలు, రేపు ఉత్తరంలో చూద్దాం.

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం.

(signature)

3-1-46

# 3
# స్త్రీఅర్హత

నా మాతాజీ!

నీకు మరల ఉత్తరం వ్రాయటానికి ఆలస్యం అయినందుకు చింతిస్తున్నాను. కారణంఏమిటో తెలుసా? ఒంగోలునుండి వ్రాసినతర్వాత బ్రాహ్మణ నిడమానూరు వెళ్ళాను. అక్కడ ఆ ఊరివాళ్ళ భక్తిఉత్సాహాలు నీకుతెలుసుగా! నాకు వ్రాయడానికి అవకాశం లేకపోయింది. ఎప్పుడూ చుట్టూజనం, ఎక్కువగా సంకీర్తన. కాబట్టి ఎలా వ్రాసేది? సాధ్యమైనంతవరకు, త్వరలో నీ ఉత్తరాలవిషయాన్ని పూర్తిచేయాలనే ఉద్దేశ్యముతో, నాకెక్కువ విశేషాలు ఉండని కర్లపాలెం వచ్చాను. ఇక వెంటవెంటనే వ్రాయటానికి యత్నిస్తాను.

మొన్నటిఉత్తరంలో, మొదటిభాగంలో, జ్ఞానులనేవారః స్త్రీలోకంలో పూర్వంగాని యిప్పుడుగాని చెప్పుకోదగినంత ఎక్కువగా లేరన్నాను. ఆ

మాటమీద నీకు అధైర్యం కలిగిందా? అలాంటి భయం అవసరమే లేదు. నేను చాలవరకు స్త్రీజనపక్షపాతినిసుమా! మొదటినుంచి స్త్రీలకొక అప చారం జరిగింది. అది వేదకాలంలోకాక, తర్వాత పురాణయుగంలో[6] జరిగి ఉండవచ్చు. శారీరకంగా స్త్రీలంటే అబలలు. ఆమాటనిజమే. మానసికంగా మాత్రంకాదని పూర్వం మనం చర్చించిన గార్గి, మైత్రేయి, మొదలైన స్త్రీరత్నాలచరిత్రలే సాక్ష్యం. స్త్రీలు కండబలం లేనివాళ్ళుకాబట్టి, పురాణ కాలంలో పూర్వము కట్టుబాట్లతోపాటు, ఆధ్యాత్మిక కట్టుబాట్లుకూడా స్త్రీలపై పెట్టారు కొందరుపెద్దలు. ఆపెద్దల అభిప్రాయాలు మంచివే అయి ఉండవచ్చు. కాని కాలక్రమేణ స్త్రీలకు, చాలఅపచారం వాటివల్ల జరిగింది. దానికి ఎదుర్కొనలేక ఆడవాళ్ళు లొంగిపోయారు. అందుచేత వేదాలలో కొన్ని మంత్రాలకే కర్తృత్వంగొన్న స్త్రీలు, యిదివరలో చెప్పినట్లు ఉపనిషత్తు లకే ఆధారమైన స్త్రీలు, 'వేదాలను స్త్రీలు చదవరాదు:' అనేశాసనానికి లొంగి పోయి, ఆధ్యాత్మికవిద్యకే దూరమయి, సర్వం మరచిపోయారు స్త్రీలు. రానురాను శారీరకంగానేకాకుండా, మానసికంగాకూడా 'అబలలం' అనే భావం వాళ్ళలోఏర్పడి నాటుకుపోయింది. ఆకారణాన అన్నివిధాల క్రుంగి పోయారు మనఆడవాళ్ళు. కాని, వెంటనే తంత్రశాస్త్రం వాళ్ళకు అండగా నిలిచింది. 'స్త్రీకే మోక్షార్హతగాని పురుషునికికాదు' అని ప్రచండ ప్రచారం సాగించాయి తంత్రశాస్త్రాలు. 'ఈ ప్రపంచాన్నంతా సృజించి, పెంచి, లయంప జేసేది ఆదిశక్తిసుమా!' అన్నాయి తంత్రాలు. 'బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు యీ పరాశక్తి చేతుల్లో కీలుబొమ్మ' లన్నాయి తంత్రాలు. 'ప్రపంచం అంతా నిజంగా విచారిస్తే స్త్రీత్వమే' అన్నాయితంత్రాలు. 'ప్రపంచంలో ఏ గొప్ప దనంఉన్నా ఆదిశక్తిస్వరూపమేకాబట్టి స్త్రీత్వమే' అన్నాయితంత్రాలు. 'నోరు కదిలిస్తే శబ్దం. ఆ శబ్దం శక్తిస్వరూపంకాబట్టి స్త్రీత్వం' అన్నాయి తంత్రాలు. 'ఇంతెందుకు జీవత్వమే స్త్రీత్వం' అన్నాయితంత్రాలు. ఇదంతా నిజం అన్నాడు శ్రీకృష్ణుడు. అదే నేనన్నాడు గీతలో. ఎల్లప్పుడూ ఆడవాళ్ళతోనే ఉండేవాడు. స్త్రీవలె సున్నితంగా ఉండేవాడు. అంతేకాదు **నిజమాలోచిస్తే** కృష్ణుడంటే ఎవరనుకున్నావు? అష్టప్రకృతుల భార్యలుగా గలిగి, పదారువేల

కళల చెలికత్తెలుగా గలిగి, దగ్గరున్నట్లుగాఉన్నా, అతిదూరంగా ఉన్నానని చెప్పుకోడానికోఅన్నట్లు నీలవర్ణంగలిగి, మాయకులొంగక మాయాతీతు డనుటకు నిత్యబాలకుడైఉన్న యీ కృష్ణుడెవరనుకొన్నావు? 'కృష్ణ' అంటే నలుపు. 'కాళి' అంటేకూడా నలుపు. అందుచేత కృష్ణుడంటే సర్వమాయా స్వరూపిణి, జగన్మాత కాళికాదేవియే. సందేహంలేదు. గీతా విశ్వరూపఘట్టం అంతా శ్రీకృష్ణుని ఆదిశక్తిస్వరూపాన్నే తెలుపుతుంది. అందుచేత భాగవత గ్రంథంలంతా స్త్రీలకొరకే, వారి ఆధ్యాత్మికాభివృద్ధికే పోరాడుతుందన్న మాట. స్త్రీలకే ప్లీడరులాగా వాదించి వాదించి, బోధించి, శాస్త్రాలనుచెప్పి, చివరికి తంత్రశాస్త్ర ప్రబోధకుడైన పరమశివుడు, చూచావా! సగం స్త్రీఅయి కూర్చున్నాడు. ఇక మనరామకృష్ణునివిషయం నీకు తెలిసిందే. ఆయనకూడా పురుషులకెంత ప్రాధాన్యంయిచ్చాడో స్త్రీలకుకూడా అంతప్రాధాన్యం యిచ్చా డేమో అనిపిస్తుంది నాకు. ఎలా అంటావా? స్త్రీయైన కాళికాదేవియే ఆయ నకు ఇష్టదైవం. తండ్రికంటేతల్లినే ఎక్కువగా ప్రేమించాడు. స్త్రీ సన్న్యాసిని యైన భైరవినే గురువుగా స్వీకరించాడు. మన శారదాదేవిని భార్యగాచూడక, తన ఇష్టదైవంగా పూజించాడు. ఇట్టి పూజనీయదృష్టిలో, ఆయన పురుషు లను చూడలేదని గట్టిగా చెప్పవచ్చును.

దీనియంతటి సారాంశమేమిటంటావా? స్త్రీలు సహజంగాచూస్తే, మానసికంగా, ఆధ్యాత్మికంగాకాని దుర్బలులుకారు. చాలకాలంనుంచివచ్చిన అభ్యాసంవల్ల పురుషులు అలాభావించడమేకాక స్త్రీలుగూడా అలాఅను కుంటూ అనదలైపోయారంటున్నాను. అర్థంఅయిందా? కాని స్త్రీలు మరల పూర్వపుటౌన్నత్యాన్ని ఎలాపొందాలంటావా? విను చెప్పుతాను. వేదాల్లోనైనా, స్త్రీపురుషరూపమైన యీలింగభేదాన్ని ఎత్తకుండానే అన్నారుగదా, 'నాయ మాత్మా బలహీనేన లభ్యః' అంటే ఆయాత్మ బలహీనునిచేత పొందబడేది కాదుఅని. బలహీనత్వం, అనగా కాయికంఅంటే శారీరకం కానేకాదు. అలా గైతే అన్నివంకర్లుగల అష్టావక్రమహర్షి ఎలా సిద్ధత్వం పొందాడుఅంటాం. కాబట్టి ఆ వాక్యానికి అర్థం ఏమనాలి? అంటే మానసికంగా బలహీనులు, అంటే అర్థజ్ఞానశూన్యులకు ఆత్మసాధ్యంకాదని అర్థం. ఆధ్యాత్మికబలహీను

లంటే పూర్వసంస్కారం లేనివాళ్ళకు సాధ్యంకాదన్నమాట. విద్యాబుద్ధులున్న వాళ్ళకే మంచి సంస్కారాలు ఏర్పడుతాయి. మరి, ఆత్మ ఎలా లభ్యంఅవుతుం దంటే, ఆ ఉపనిషత్తులు ఏమంటున్నాయి? 'త్యాగేనైకే' అనిఅన్నాయి. అంటే యోగసూత్రాల్లో, శ్రీపతంజలిమహర్షికూడా చెప్పినట్లు 'అభ్యాసవైరా గ్యాభ్యాం' అంటే అభ్యాసంచేత, వైరాగ్యంచేత ఆఆత్మను పొందగలుగు తారు. ఎవరు? దీనిలో ఆడ, మగ, విచక్షణ ఎక్కడైనాఉందా? దివిటీలు పెట్టి వెతికినాలేదు. కాబట్టి యీఅభ్యాసవైరాగ్యాలు క్షుణ్ణంగా ఎవరు పొందు తారో, వాళ్ళు స్త్రీలైనాసరే, పురుషులైనాసరే ఆ ఆత్మను పొందితీరాలి. ఈ వైరాగ్యం ఎలా పొందాలి అంటావా? అభ్యాసంచేత, సత్సాంగత్యంచేత. ఈ అభ్యాసవైరాగ్యాలవిషయం అవకాశాన్నిబట్టి మరొకపర్యాయం చెప్తుతాను. అందుకని నా ఉద్దేశ్యంప్రకారం ఎవరైనాసరే, స్త్రీ అయినంతమాత్రాన ఆత్మ లాభం దొరకదని అధైర్యం పొందరాదు. ఆత్మానుభూతికి గ్రంథాల్లో చెప్పబడ్డ సర్వలక్షణాల్ని పొందడానికై, తగినఆర్తితో యత్నిస్తే, తప్పక పురుషులవలె స్త్రీలుగూడా పొందుతారని నానమ్మకం. అలాగే నీవుసైతం యీ దృష్టితోనే, యీ దైవమార్గాన్ని నిర్భయంగా నడవవలసిందని నా హృదయపూర్వకమైన సలహా. అంతేకాదు. నీవు చిన్నదానివికాబట్టి యిది నేను నీకిచ్చే ఉపదేశంఅని కూడా చెప్తుతాను.

ఇక మరల మనగ్రంథవిషయానికి వద్దామా! మొదట్లో, ముక్తిని పొంద టానికి నాల్గుమార్గాలు పెద్దలు చెప్తుకొచ్చారని చెప్పాను. ఈ నాల్గుమార్గాలు అనేటప్పటికి ఒకసందేహం కలుగుతుంది. అది ఏదంటే, యీ చెప్పబడ్డ నాలుగుమార్గాలు వేరువేరుగా ముక్తిని కలుగజేస్తాయా? ఒకటైనతర్వాత ఒక టిగావచ్చి ముక్తికి దారి తీస్తయ్యా? లేక అన్నింటిని ఒకేసారిగా ప్రారంభించి ఆచరించాలా? ఈవిషయం చాలాముఖ్యం. అంతేకాదు కఠినం. అందుచేతనే పూర్వకాలంలో యీవిషయాన్ని చాల చర్చించారు పెద్దలు. ఒక్కొక్కరు ఒక్కొక్కదానికి ప్రాధాన్యం యిచ్చారు. అందుచేత లోకంలో యిన్నిమార్గాలు, అంటే యిన్నిమతాలు ఏర్పడ్డయి. కాని కొంచెం సూక్ష్మంగామాత్రంచూస్తే, నిష్పక్షపాతంగాచూస్తే మనకేవిశదం అవుతుంది. అంతేకాదు. ఈ భేదాలు,

పోట్లాటలు, సాధనచేయకుండా కబుర్లు చెప్పేవాళ్ళకేకాని సాధకులకు ఉంటా నికే వీలులేదు. ఎందుకంటావా, సాధన చేసేవాడికి మార్గం ఏదిముందు, ఏది వెనుక అనే రహస్యం బాగా తెలుస్తుంది. కాబట్టి వాడు యీ వ్యర్థతర్కాలలోకి దిగనేదిగడు. ఈ రహస్యం తెలుసుకోవాలని తనను ఆశ్రయించినవాళ్ళకు చెప్పేస్తాడు. ఆ రహస్యం యిది.

మొదట కర్మయోగం, తర్వాత రాజయోగం, తర్వాత భక్తియోగం, చివరికి జ్ఞానయోగం వచ్చేస్తుంది. మొదట్లో, యీ ప్రపంచంలోఉన్న కష్ట సుఖాలను చూచి, అవి క్షణికం అనేరహస్యాన్ని గ్రహించి, 'ఎలాగ ఎప్పుడూ సుఖంపొందే మార్గం' అని ఆలోచిస్తుండే మానవునికి, వేదాలు కర్మకాండను బోధించాయి. ఈ కర్మకాండలోఉన్న రహస్యంఅంతా పరలోకంలో సుఖాల కొరకు తంటాలుపడటం. ఈ కర్మకాండను అనుసరించాలంటే దేహం ఆరో గ్యంగాఉండాలి. అందుకనే అష్టాంగమార్గంగాఉండే యోగమార్గం అవసరం అవుతుంది. అంటే కర్మమార్గంలోకి దిగేటప్పటికి, దేహపటుత్వంకోసం ఆసనాలు, నాడీపటుత్వంకోసం ప్రాణాయామాలు, బుద్ధినిలకడకోసం ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులు మొదలైనవి కావాల్సివస్తయి. ఈ విష యాలు వివరించివ్రాస్తాను తర్వాత. ధ్యానంఅంటే ఏమిటో అనేటప్పటికి, ఆ యోగసూత్రాల్లోనే 'ఈశ్వరప్రణిధానాత్'అని ఈశ్వరుడు చెప్పబడతాడు. ఆ ఈశ్వరుడు సర్వవ్యాపకుడని, అతన్ని ధ్యానించాలని, అతన్నే ప్రణవం అనాలని మొదలైన విషయాలు అక్కడ చెప్పారు. అంటే, స్వర్గభోగాలపైఉండే బుద్ధి భగవంతునిపైకి మరలుతుంది. భక్తియోగంలో భగవంతుడొకడు కలడని, అతడు సృష్టిస్థితిలయకర్తఅని, అతన్ని పొందాలని మొదలైన విషయాలమీదికి బుద్ధి ప్రసరించేటప్పటికి, 'భగవంతుడు ఆకారం కలవాడా? నిరాకారుడా? గుణాలున్నాయా? లేవా? సృష్టి ఎలాచేస్తాడు? ఎందుకు చేస్తాడు?' అనే కోటానుకోట్ల సందేహాలు బుద్ధిసూక్ష్మతగల ప్రతివ్యక్తికి కలుగుతాయి. ఆ సందేహాలు కలగటంతోనే జ్ఞానమార్గంలోకిదిగినట్లే. ఈ సంకుచితమైన రూపంతో, గుణాలతోఉండే భగవంతునిపై భక్తిఅడుగంటి, వీటికన్నిటికి అతీతమైన ఆత్మమీదికి బుద్ధి తిరుగుతుంది. ఈ బుద్ధి పరిపక్వం అయ్యేటప్ప

టికి 'ఆ ఆత్మ నేనే' అనే స్థితివచ్చి, ఆ అద్వితీయమైన ఆనందంలో మునిగిపో యేటప్పటికి, జ్ఞానమార్గం సిద్ధించిందన్నమాట. ఇది యీ మార్గాల్లోఉన్న రహస్యం. అలాగే సాధనమీదనే ఆధారపడి, ఆ ఆత్మస్థితిని తెలుసుకోవాలని పూనుకున్నవాళ్ళంతా, యీమార్గాన్నే అనుసరించితీరాలి. లేకపోతే, ఎన్ని జన్మలకైనా వాళ్ళు యీ ఆత్మానందాన్ని పొందనేలేరు.

ఇక ఆ మార్గాలు, అంటే యోగాలు ఏమిటో చూద్దామంటావేమో! ఆ విషయం తర్వాత చెప్తుతాను. లేకపోతే కష్టం. ఎందుకంటే, యీ మార్గాల్లో ప్రవేశించాలంటేనే నీవడిగే సాధనరహస్యాన్ని పొందిఉండాలి. ఆ సాధనసంపద పొందకముందే యీ మార్గాలు ఎలాఅర్థం అవుతాయి? కాబట్టి ముందు మనప్రశ్నను తీర్మానంచేసి, తర్వాత అవసరాన్నిబట్టి యీ నాల్గు యోగాల్ని వేరువేరుగా వివరంగా నీకు చెప్పేస్తాను. కాబట్టి దీన్నిముందు అర్థం చేసుకో.

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం.

8 – 1 – 46

# 4
# కర్మయోగము

*సోదరీ మాతాజీ!*

క్రిందటి ఉత్తరాన్ని, బాగా అవగాహనం చేసుకొని ఉంటావు. కాని, యోగాలవిషయం నేను చివరవ్రాసిన మాటలకు నీకు చింత కలిగిందనుకుంటాను. 'పోనీ క్లుప్తంగానైనా తెలుసుకోకపోతే, ఆ విషయాన్ని గ్రహించాలనే కాంక్ష మనసులో ఉండిపోతుంది. ఆకారణంచేత యీప్రస్తుతాంశాలనే గ్రహించలేకపోతానేమో! అందుచేత కొంచెంగానైనా చెప్పండి' అంటున్నావా? అదీ నిజమే. నీ ఆర్తికి చాలా సంతోషం. అయితే చెప్పుతాను శ్రద్ధగావిను.

యోగాల్లో కర్మమార్గం మొదటిదన్నానుకదూ! అసలు పరిణామచక్ర ప్రకారం అజ్ఞానిగాఉండే మానవుడు, యీ ప్రపంచవిషయాల్ని **అనుభవిస్తూ** ఉంటాడు. 'పరిణామచక్రం' అంటేఏమిటో తెలిసిందా? నీవు పుట్టినపుడు ఎంతపిల్లవో తెలుసునా? జానాబెత్తె పిల్లవు. క్రమక్రమంగా నీ దేహం, పాలు,

అన్నం మొదలైన ఆహారపదార్థములచేత పోషించబడి పెద్దదయింది. ఇప్పుడు పొడుగయ్యావు. అలాగే యింకా నీ దేహంలో, కాలంజరిగినకొద్దీ అనేకరకాల అభివృద్ధి కలుగుతూ వస్తుంది. దీన్ని 'శారీరకపరిణామం' అంటాం. అలాగే చదువులోకూడా. మొదట్లో 'ఓనమాలు' దిద్దుతూ, తర్వాత మాటలు, ఆట చిన్నకథలు, పాటలు, పిమ్మట పెద్దపుస్తకాలకు వచ్చావు. అలాగే యింకా చదివి, అనేకగ్రంథాల్లో పాండిత్యం, అనేక భాషల్లో ప్రావీణ్యం పొందుతావు. ఇలా విద్యాభివృద్ధిని 'విద్యాపరిణామం' అంటాం. విద్యాపరిణామంలో **బుద్ధి** వికాసం పొందుతూఉంటుంది కాబట్టి దాన్ని 'మానసికపరిణామం' అని కూడా అంటాం. ఈ రీతిగానే వుంటుంది 'ఆధ్యాత్మికపరిణామం'. బుద్ధి, లౌకికవిషయాల్లోకాక దైవికవిషయాల్లో అభివృద్ధి చెందుతూఉంటే దీన్ని ఆధ్యాత్మికపరిణామం అంటాం. ఇది చాలాసూక్ష్మంగా జరుగుతుంది. అందుకని గ్రహించటంకష్టం. అయినా ముఖ్యంగా గ్రహించిఉండాలి. ఈ ఆధ్యాత్మికపరిణామం, పైచెప్పిన యోగాలరూపంగా ఉంటుంది. ఈ పరిణామంలో కర్మమార్గం మొదటిమెట్టుఅందాం.

ఈ మొదటిమెట్టుకు పూర్వం, మానవుడు కేవలం పశుప్రాయుడు. వీడికి తన శారీరకసౌఖ్యాలు, తనస్వార్థం, తనఆయుష్యం, తనఆరోగ్యం అన్నట్లుగా ఉంటాయి. అప్పుడు వీడొక అడివిమనిషి అనుకో. వాడిలో ప్రధాన గుణం తమస్సు. ఈ గుణాలు మూడున్నాయి. అందులో తమస్సుకు మత్తు, నిద్ర, ఆలస్యం, అలసట, మూర్ఖత్వం మొదలైన సర్వారిష్టగుణములు ఉంటాయి. రెండోగుణం రజస్సు. దీంట్లో అహంకారం, అహంభావం, క్రూరత్వం, తొందరపాటు, దర్పం, చురుకుదనం మొదలైనవేగాక, తెలివి, కార్యశూరత్వం, పౌరుషం మొదలైన మంచిలక్షణాలుకూడా ఉంటాయి. ఇక మూడోగుణమైన సత్వంలో అన్నీ మంచిలక్షణాలే! సత్యసంధత, అహింస, సంతోషం, బుద్ధికుశలత, ప్రేమ, దయ, యిలాంటి చెప్పటానికి వీలులేనన్ని మంచిలక్షణాలు ఎన్నోఉంటాయి. ఈ చివరలక్షణంతోనేఉంది ఆధ్యాత్మిక పరిణామంఅంతా. ఎంతసత్వగుణం ఎక్కువ అవుతుంటే అంతఆధ్యాత్మికాభివృద్ధి అన్నమాట. మానవుడుఅంటే యీ మూడుగుణాల కలయిక. ఒక్క

గుణంమాత్రమే ఎవరికిఉండదు. 'అంటే కేవలం సిద్ధులకుగూడ, జ్ఞానులకు గూడ ఒక సత్వగుణమేకాకుండా తమస్సుకూడా ఉంటుందా' అంటావేమో! అట్టివారికికూడా యీమూడుగుణాలూ ఉంటాయి. కాని సత్వగుణం చాల ఎక్కువగా ఉండటంచేత రజస్తమోగుణాలు అప్రధానమై, చెప్పుక్రింద తేళ్ళ లాగ లేనట్టేఉంటాయి. అలాగే అజ్ఞానియై తమోగుణంతోనిండిన యీ అడవిమనిషిలోగూడ సత్వరజోగుణాలున్నప్పటికి, ముఖ్యంగా సత్వగుణం లేనట్లేఉండి, తమోగుణమే తాండవిస్తూఉంటుంది. అందుకనే వాడికి యితర ప్రాణంతీయటంఅంటే చాలసులభం. వెనుకాడడు. వాడిలో మంచి అనేదే లేదా అనిపిస్తుంది. అలాంటివాడు కొంతకాలం యీలోకంలో, యీ భార్యా బిడ్డలతో కష్టసుఖాలు అనుభవించినతర్వాత, వాడికి 'యీ సుఖాలు ఎప్పటికీ ఉండవే' అనేజ్ఞానం కలుగుతుంది. అప్పుడేమిచేస్తాడు? ఈ సుఖాలన్నీ శాశ్వ తంగాఉండే ఉపాయానికి తంటాలు పడుతూఉంటాడు. 'నీకు పిల్లలు కావా లంటే దశరథుడిలాగా 'పుత్రకామేష్టి' అనేయజ్ఞం చేయరా' అనే శాస్త్రవాక్యం వింటాడు. బలేబాగుందంటాడు, చేస్తాడు. ఇలాగే, వేదాల్లో పిల్లలకొరకే కాకుండా, ధనంకావాలంటే, భార్యకావాలంటే, భర్తకావాలంటే, పశువులు కావాలంటే, ఒకటేంటి మనకేదికావాలన్నా వాటిని పొందటానికి, వాటివాటికి తగిన యజ్ఞాలు, యాగాలు, వ్రతాలు, యిలా ఎన్నింటినో చెప్పేశారు పెద్దలు. వాటిలోకి దిగుతాడు మనఅజ్ఞాని. ఇహంఅంటే యీలోకానికి సంబంధించిన సుఖాలకై యీకర్మకాండలో ప్రవేశిస్తాడు. కాని యింకాకొంచెం బుద్ధి వికాసం పొందేటప్పటికి, 'యీలోకసుఖాలు శాశ్వతంగాఉండే దిక్కుందా' అని ఆలోచిస్తాడు. అప్పుడు వీడికి శాస్త్రం ఏమంటుందంటే 'ఒరే! మరికొన్ని యజ్ఞాలు చెప్పుతాను. వాటిని చేశావంటే ఆ సౌఖ్యాలు శాశ్వ తంగాఉండే ఉపాయం చెప్పుతాను' అంటుంది. 'అయితే యీ సుఖాలు యీ లోకంలోమాత్రంకాదురా అబ్బాయీ! మరొకలోకంలో' అంటుంది. 'అయ్యయ్యో! ఈ భార్యాసుఖాన్ని ఎలావదిలేది? ఈ మేడను ఎలావదిలేది? మొన్ననే కొన్నానే, ఆ పెట్రొమాక్సులైటుసంగతి ఎలాగ?' అంటాడు వాడు. 'ఒరే వెర్రివాడా! ఈ నీ భార్యకంటే చక్కనైనరంభను నీకే యిస్తాను. అక్కడ

బంగారుమేడలో నిన్ను ఉంచుతాను. వెధపలైటుకోసం ఎందుకేడుస్తావు? ఆ బంగారుమేడలో రత్నాలే, వజ్రాలే దీపాలురా! ఇంతెందుకు? ఇప్పుడు యీ లోకంలో నీవు కలనైనా కని, విని, ఎరుగని సుఖాలలో నిన్ను వుంచేస్తాను. కాబట్టి యీ యజ్ఞాన్నిచెయ్యి' అంటాయి శాస్త్రాలు. అంటే యీ యిహ సౌఖ్యాలమీదనుండి వీడిబుద్ధి తీసి పరసౌఖ్యాలమీద యీశాస్త్రాలు పెట్టేటట్లయి అన్నమాట. అందుకు వాడేమంటాడు? 'ఎస్, ఆల్ రైట్' అంటాడు. ఇది కర్మయోగంలోవుండే రహస్యం. అంటే కర్మయోగంవల్ల ప్రపంచవిషయాల మీదఉండే బుద్ధి పరవిషయాలమీదికి పోతుందనిఅర్థం. అందుచేత మూడు యోగాలలో అవసరమయ్యే వైరాగ్యం, యీ కర్మయోగంలో అంకురిస్తుంది. కేవలం తమస్సులోనుంచి బుద్ధి రజస్సులోకిదిగి, ప్రవృత్తి చురుకుదనానికి దారి చూపుతుంది.

కాని యీ కాలంవారు, కర్మయోగానికి మరొకఅర్థం తీశారు. ఈ అర్థం భగవద్గీతకాలంనుండి వచ్చింది. 'ఇన్ని కాలాలున్నాయా?' అంటా వేమో! మనకుతెలియని, అంటే ఎవరు చెప్పలేనికాలంలో పుట్టాయి వేదాలు. అందుకే అవి అనాదులు. అంటే ఆది, లేక పుట్టుక లేనివి అని అర్థం. తర్వాత వచ్చాయి యీ పురాణాలు. పురాణాలలోనిది మహాభారతం. ఆ మహాభార తంలోభాగం భగవద్గీత. అందుచేత భగవద్గీత వేదాలతర్వాత విషయంఅని తీర్మానం. భగవద్గీతకుపూర్వం గ్రంథాలనుచూస్తే యీ క్రొత్తనిర్వచనం కర్మ యోగానికి లేనేలేదు. ఆ గ్రంథాలలో ప్రవృత్తి, నివృత్తి, అనేకాని కర్మను సూచించే పదాలేలేవు. ప్రవృత్తిఅంటే ప్రపంచసంబంధం కలిగిఉంటం. నివృత్తి అంటే సంబంధంలేకుంటం. ప్రవృత్తిక్రింద వస్తాయి బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం అనే మూడు ఆశ్రమాలు. ఇక నాల్గవఆశ్రమమైన సన్న్యాసం, **నివృత్తి** క్రింద వస్తుంది. ఈ ఆశ్రమాలు పూర్వపద్ధతిలో ప్రస్తుతం లేకపోయినా వాటినిగూర్చి కొంచెం తెలుసుకోవాలి.

వివాహం కాకముందు, ఎనిమిదోఏట ఉపనయనం కాగానే, అరణ్యా లలో, మునిపల్లెలలోఉండే గురువులదగ్గరకు వెళ్ళి, ప్రపంచసంబంధం అసలే

లేకుండా వేదాన్నిచదువుకోవాలి. ఆ కాలాన్ని 'బ్రహ్మచర్యాశ్రమం' అంటారు. అప్పుడు యీ బ్రహ్మచర్యానికి చాల నియమాలుంటాయి. అప్పుడే అతనికి, ఆధ్యాత్మికవిద్యలో ప్రవేశం. తర్వాత, తానుగడించిన యీ విద్యను పొందటానికి, వలసిన గుణాలు సంపాదించటానికి అవకాశంయిచ్చే 'గృహస్థాశ్రమం' లో దిగుతాడు. అంటే వాడిబుద్ధి, అప్పుడైనా భార్యాబిడ్డలు, ధనధాన్యాదుల మీదనేఉండక, తాను పొందవలసిన ఆధ్యాత్మికఅనుభవాలు, వాటికనుగుణమైన గుణాలమీదనే ఉండాలి. ఇలా కొంత కాలంఉండి, తర్వాత బిడ్డలకు సర్వంయిచ్చేసి, తాను, తనకు అత్యవసరపరిచర్యలు చేయటానికి తన భార్యతోగూడ అరణ్యంలోకి వెళ్ళి, తపస్సుకు యత్నించటం 'వానప్రస్థం'. తర్వాత, ఏవిధమైన ప్రపంచసాయమూకోరక అతీతంగాఉండటం 'సన్న్యాసం'. ఇవి నాలుగు ఆశ్రమాలు. ఇవి, యీ రూపంగా కాకపోయినా మరొకవిధంగా మనమనస్సు గట్టిపడి ఆధ్యాత్మికానుభవానందాల పొందే యోగ్యత కల్గేవరకు, ఆయోగ్యత కలగటానికి, యీయాశ్రమక్రమం తప్పకవస్తూనే ఉంటుంది. ఇప్పుడు యీకడపటి సన్న్యాసం తప్ప యితరమైన మూడుఆశ్రమాలు ప్రవృత్తిమార్గం అనవచ్చు. నాల్గవది నివృత్తి అవుతుంది. పై విభజనలో వానప్రస్థాన్ని ప్రవృత్తిలోవేశాం. కాని నిజానికిఅది ప్రవృత్తికాదు, నివృత్తికాదు. మరేమంటే రెంటియొక్క సంక్రమణం, అంటే కలయిక. ఆ స్థితిలో కర్మ చేస్తాడు కాని తనకొరకుకాదు, లోకంకొరకు. అంటే తానుచేసే నిత్య, నైమిత్తికకర్మల ఫలితం తానుకోరడు. ఇతురలకొరకై చేస్తాడని చెప్పవచ్చు. నిత్యకర్మఅంటే స్నానసంధ్యావందనాదులని అర్థం. నైమిత్తిక కర్మంటే అప్పుడప్పుడుజేసే వ్రతాలు, యాగాలు మొదలైనవి అన్నమాట. వీటినన్నింటిని ఆ వానప్రస్థుడు, వాటిఫలితాలను తనకొరకై కోరకుండా చేస్తాడు కాబట్టి 'నిష్కామంగా' చేస్తాడు అనవచ్చు. అంటే ఫలాపేక్షలేకుండా అనిఅర్థం. ఈ స్థితి ప్రవృత్తికి, నివృత్తికి మధ్యలోఉండే వంతెనలాంటిదన్నమాట. ఈ స్థితినిగూర్చి, ఆ నిష్కామకర్మ విధానాన్నిగురించి వివరించ వలసివచ్చింది గీతలో.

ఈ అర్థాన్ని పట్టుకున్నారమ్మా మనపెద్దవాళ్ళు కొందరు. ముఖ్యంగా,

యీనూత్నభావాన్ని బయటికి లాగినవారందరికి నాయకుడు శ్రీ బాలగంగాధర తిలక్. ఈయన అసమానమైన పండితుడు. అందుచేత, చాల సమర్థతతో 'గీతారహస్యం' అనే పెద్దగ్రంథాన్ని వ్రాసి, నిష్కామకర్మను ముందుకు తెచ్చాడు. దీన్నే గాంధీమహాత్ముడు, యింకాఅనేకులు యిప్పుడు **అనుసరిస్తూ** ప్రచారం సాగిస్తున్నారు.

ఈ భావంవారుఅనేది ఏమిటంటే 'కర్మ' అనగా వేదాలలోచెప్పే యజ్ఞయాగాదులేకాదు, లేక మీ నిత్య, నైమిత్తికకర్మలూ కాదు. అసలు కర్మ అంటే ఏమిచేసినా కర్మే. చివరికి నిద్రపోతున్నా, గాలి పీలుస్తున్నా కర్మే. అందుకని కర్మచేయకుండా, ఏ జ్ఞానికూడా ఉండడు, ఉండలేడు. కాబట్టి మనం చేసే కర్మయొక్కఫలితంమీద ఆసక్తిలేకుండా చేయాలి. అదే నిష్కామకర్మ. దాన్నే మనం 'అనాసక్తియోగం' అనవచ్చు. దీన్నిగూర్చి శ్రీకృష్ణభగవానుడుకూడా అన్నియోగాలకంటె ఉత్తమయోగంయిదే అన్నాడు. ఆకారణంవల్ల 'యితర యోగాల ప్రసక్తిలేకుండానే యీనిష్కామకర్మయోగం చేస్తే మోక్షం సిద్ధిస్తుంది' అనిఅంటారు యీ ప్రముఖులంతా. యజ్ఞయాగాదులరహస్యం మర్చిపోయి, ఉపనిషత్తులభావం తెలియని మనకందరికి నిజమే అనిపిస్తుంది. కాని అసలు నాలుగు యోగాలలోఉన్న కర్మయోగం యిదికాదు. అయినా యీ కొత్తనిర్వచనంలోగూడ గొప్పదనం ఉంటంచేత, మనందీన్ని అయిదో యోగంక్రింద తీసుకోవచ్చును. అయితే దీన్ని కర్మ, యోగ, భక్తిమార్గాల అన్నింటిలో అంతర్గతంగానో, లేక కర్మయోగానికి, యోగమార్గానికి మధ్యనో ఉంచవచ్చు. దీన్ని సక్రమంగా అనుసరించామంటే, ఆ శాస్త్రంచెప్పే కర్మయోగంకంటే, యీ నూతనకర్మయోగం వైరాగ్యాన్ని పెంపొందింప చేస్తుంది. అయితే 'దాన్ని తొలగించి దీన్ని పెట్టరాదుటయ్యా' అంటే అది కూడదు. వేదంలో మూడు భాగాలుంటాయి. మొదటిది 'కర్మకాండ' అంటారు. దానిలో యజ్ఞయాగాదిరూపమైన కర్మయోగాన్నే చెప్పారుకాని యీ కొత్తకర్మయోగాన్ని బోధించలేదు. తర్వాత 'బ్రాహ్మణము'లనేవి రెండోభాగం. వీటిల్లో ఎక్కువగా ఉపాసనలుంటాయి. ఇదంతా చాలవరకు భక్తియోగానికిసంబంధం. ఇక మూడోభాగం 'ఆరణ్యకా'లంటారు. ఇవే ఉప

నిషత్తులభాగం. దీన్నే జ్ఞానమార్గంఅంటారు. అందుచేత, వేదం మూడు మార్గాలు ప్రత్యేకప్రత్యేకంగా చెప్పేఉంది. ఈ కర్మయోగం తీర్మానం చేయ బడేఉంది కాబట్టి, దాన్ని మార్చటానికి వీలులేదు. కాని యిప్పుడు రాజ యోగాన్ని చేర్చినట్లు, యీ నిష్కామకర్మయోగాన్నికూడా అయిదోదాన్నిగా చేర్చుకుంటే తప్పులేదు.

ఇలాగ పర్యవసానానికి మనకు తేలేదేమిటంటే, మొత్తానికి కర్మయోగం వల్ల చిత్తశుద్ధికలిగి, బుద్ధి ప్రపంచవిషయాలలో మునిగిపోకుండా, యీ సంకుచిత విషయదృష్టినుండి బయల్పడి, నిష్కల్మషమైన భక్తిలోకి పోతుంది. ప్రస్తుతం ఆచరణలోలేని, శాస్త్రాలు చెప్పే కర్మయోగంకంటే, అందరికి ఆచరణయోగ్యంగాఉండే యీ నిష్కామకర్మయోగం, ప్రస్తుతకాలానికి చాలా మంచిది. ఇట్టి అనుష్ఠానంవల్ల ఆధ్యాత్మికపరిణామంలో, యికముందు అవ సరం అయ్యే సత్వగుణం చాల అభివృద్ధిఅయి, యిక రాబోయే ఆధ్యాత్మిక మార్గాన్ని సున్నితంచేస్తుంది. ఇది కర్మయోగం. అంటే, అమ్మాయీ! కర్మ యోగంలోనీకు చాలఉపయోగపడేది ఏమిటనుకున్నావు? మొదటినిర్వచనం అంటే వేదకర్మవిషయం నీకు అవసరంలేదు. తిలక్, గాంధీమహాత్ములు చెప్పే భావం చాల ముఖ్యం. దీన్నే నీవు బాగా అర్థంచేసుకొని, ఏ పని చేసినా, ఆ పని వల్ల కలుగబోయే ఫలితంమీద కాంక్షనువదలి ఆ పనిని చెయ్యాలన్నమాట. ఈ విషయాన్ని గ్రహించి, ఆచరించి, తర్వాతయోగాలకు నీ బుద్ధిని తయా రుచేసి సిద్ధంగాఉండు.

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం.

8-1-46.

# 5

# రాజయోగము - యమము - అహింస

ప్రియమైన సోదరీ మాతాజీ!

నిన్నటిదినం కొంతవరకు కర్మయోగంఅంటే ఏమిటో విన్నావు. ప్రస్తుతం అంతవరకుచాలు. అసలు యీ కర్మయోగాన్ని అభ్యసిస్తేనేగాని మన చిత్తం నిర్మలంకాదు. ఆ చిత్తనిర్మలత్వం కలిగితేగాని, ఆధ్యాత్మికమార్గంలో ముందడుగు వేయటానికి వీలులేదు. పైకెన్నివేషాలు వేసినా, 'చిత్తశుద్ధిలేని శివ పూజలేలయా' అని వేమన్నఅన్నట్లు ప్రయోజనం ఏమాత్రంలేదని నమ్ము. అంటే యీ కర్మయోగం, యికముందు కట్టబడబోయే ఆధ్యాత్మికసౌధాని కంతటికి పునాదిఅనుకో. పైకి ఎన్ని తళుకులు రంగులువేసినా, పునాది గట్టిలేక పోతే ఆ సౌధం ఎంతకాలం ఉంటుంది? అందుకని ముందు సాధకుడు కర్మలో ఆరితేరాలి. దీన్ని అనుసరించే రామానుజాచార్యులు, బ్రహ్మసూత్ర భాష్యంవ్రాస్తూ, మొదటి సూత్రానికి పూర్వమీమాంసారూపమైన కర్మ యోగానంతరం బ్రహ్మజిజ్ఞాసచేయాలని గట్టిగా చెప్పాడు.

ఇలా కర్మ చేస్తూఉంటే, కర్మసిద్ధికి కొన్నికట్టుబాట్లు అవసరంగా తోస్తయి. వాటిని సాధ్యం చేసుకొంటేనేగాని, కర్మ సక్రమంగా చేయటానికి వీలులేదేమో అనిపిస్తుంది. అంటే, కొన్నాళ్ళు కర్మ చేసినతర్వాత యీ అవసరాలన్నీ ముందుకు కనిపిస్తయి. వాటినన్నింటిని చేర్చి, పూర్వకాలంలోనే పతంజలి అనేమహర్షి ఒకగ్రంథం వ్రాశాడు. దాన్నే 'యోగసూత్రా'లంటారు. ఈ గ్రంథం నాలుగధ్యాయాలుగా ఉన్నప్పటికి, మన ప్రస్తుత విషయానికి రెండో అధ్యాయమైన సాధనప్రకరణం, మూడోదైన విభూతిప్రకరణం ముఖ్యం. కర్మకు ఉపయుక్తమై, తర్వాత భక్తి, జ్ఞానయోగాలకు ముఖ్యమైన లక్షణాలన్నింటిని పతంజలిమహర్షి క్రోడీకరించి, వాటిని విభజించి, ఎనిమిది సోపానాలుగా చెప్పేశాడు. దీన్నే 'అష్టాంగయోగం' అంటారు. ఈ 'అష్టాంగయోగం'లో చెప్పబడే విషయాలు చాలాముఖ్యం అన్నాను. అసలు సాధనసంపత్తిఅంటే యీవిషయాలే అనికూడా చాలావరకు చెప్పవచ్చు. కాబట్టి, యీ విషయాలు చాలాజాగ్రత్తగా నీవు అర్థం చేసుకోవాలి. వాటిని నీ నిత్యజీవితంలో ఆచరించాలి. అప్పుడే మన గ్రంథాలలోచెప్పబడ్డ, చెప్పబడని అపూర్వమైన అనుభవాలనుపొంది ఆనందిస్తావు. ఈరహస్యాన్ని తెలుసుకోలేక, చాలామంది వీటితో అగత్యంలేకుండానే కర్మలంటూ, భక్తిఅంటూ, జ్ఞానంఅంటూ కబుర్లు చెప్తుతూ, ఆ కబుర్లతోనే తృప్తిపొందుతూ ఉంటారు. ఇలా పునాది గట్టిలేకపోవటంచేత, వాళ్ళకు అనుభవాలనేవి రానేరావు. ఒకవేళ ఏదో అనుభవం, తమ తాత్కాలికమైన ఉద్రేకంచేతగాని, లేక సద్గురు అనుగ్రహంచేతగాని కలిగినా, అది నిలవక, ఆఅనుభవం పూర్తిఅయిన మరుక్షణమే మామూలు మనుష్యుల్లాగ ప్రవర్తిస్తుంటారు. అందుచేత, నీవు వాళ్ళుపడే పొరపాటుపడకుండా, వీటిని సాధించి పొందటానికై యత్నించుతల్లీ! ఎప్పుడైతే మనం తీవ్రంగా ఒకదానికై యత్నంచేస్తామో, అప్పుడు అదితప్పకుండామనకు లభ్యం అవుతుంది. 'అలాకాదు, భగవంతుని అనుగ్రహం ఉండాలి' అంటారు కొందరు. కాని ఆ మాటలున్నయ్యే చేతగానివాళ్ళమాటలు. చేసి సాధించే శక్తి లేని బలహీనులమాటలు. ధీరులంటే ఎలాగైనా సాధించాలని పట్టుదలతో యత్నించేవారన్నమాట. తీవ్రయత్నం వెనువెంటనేఉంటుంది ఫలితంకూడా.

'యత్నించినా సఫలంకావటంలేదే?' అంటారు. అలా ఫలవంతం కాకపోవటానికి, భగవదనుగ్రహం లేకపోవటంకారణం అంటారువాళ్లు. సరియైన యత్నం లేకపోవటమేకారణం అంటాను నేను. ఈ యత్నాన్నే పురుషకారం అంటారు గ్రంథాలలో. ఇట్టి పురుషకారం ఉన్నవాళ్ళకు భగవంతుడు దాసు డంటే నమ్ము. జోహారుచేస్తూ నిలబడేబంటు అన్నమాట. అందుచేత నీవు, యీ పురుషకారంఅనే ధీరత్వాన్ని సంపాదించుకొని, నేను చెప్పబోయే విషయాల్ని సాధించు. అప్పుడు, నీకు నేచెప్పేమార్గం చాలసులభం అయితీరుతుంది.

ఈ అష్టాంగయోగంలో ఎనిమిదిమెట్లన్నాను. అవి ఏవంటే 1. యమం 2. నియమం 3. ఆసనం 4. ప్రాణాయామం 5. ప్రత్యాహారం 6. ధ్యానం 7. ధారణ 8. సమాధి. వీటికి వివరణ చేయాలంటే, తమ్ముడూ! ఒక్కొక్క గ్రంథం వ్రాయాల్సివస్తుంది. అవి అంతముఖ్యంఅని గ్రహించుకో. కాని వివరాలు మెల్లగా తెలుసుకుందువుగాని. సాధ్యమైనంతక్లుప్తంలో వ్రాస్తాను. విషయాన్ని తగ్గించకుండా చూస్తానులే.

'యమం' అంటే ఏమిటి? ముందు నీవు వినబోయే సమాధివరకున్న గ్రంథానికంతా యీయమంముఖ్యం. పునాది. ఇది అయిదు అంతర్భాగాలుగా ఉంటుంది. వీటిని మనోవాక్కాయకర్మేణ అనుష్ఠించాలి. ఈ మనోవాక్కాయకర్మల్నే 'త్రికరణము' లంటారు. అందుచేత త్రికరణశుద్ధిగా ఆచరించాలి. అంటేఏమిటి? మనం, ఏకర్మచేసినా మూడువిధాలచేస్తాం. మొదటిది 'మానసికకర్మ'. అంటే మనంఏదైనా పనిచెయ్యాలంటే ముందు ఆలోచిస్తాం. ఆలోచించనిది ఏపనైనాచేస్తామా? ఆ యాలోచనారూపమైన కర్మనే మానసికకర్మ అంటాం. తర్వాత యీ ఆలోచించినదాన్ని మరొకరితో సలహాకొరకో సాయంకొరకో చెప్పేస్తాం. మనం పూర్వం ఆలోచించినదాన్ని, ముఖతఃఅంటే నోటితోచెప్పటం 'వాచికకర్మ' అంటాం. ఈ వాచికకర్మ రెండోది అయింది. అలాఆలోచించినదాన్ని శరీరంతోచేస్తాం. కాబట్టి యీ శరీరంచేత చేయబడిన కర్మ 'కాయికకర్మ' అవుతుంది. ఇది మూడోది. ఉదాహరణకు చూచుకో. నీవు యీరోజు మనశారదమ్మకు పూలదండ చక్కనిది కట్టాలనుకుంటావు.

దీన్నిగురించిముందు నీవే ఆలోచించి, తీర్మానించుకుంటావు. తర్వాత ఏమి చేస్తావు? ఈ నీతీర్మానాన్ని మీఅమ్మకు చెప్పుతావు. నీ స్నేహితులకుకూడా చెప్పుతావు. వీళ్ళసహాయంతో పూలు చాల చేరుస్తావు. తర్వాత ఆ పూలతో చక్కని దండకట్టి, శ్రీశారదామాయికివేసి సంతోషిస్తావు. దండ కట్టాలని ముందు ఆలోచించటం మానసికకర్మ. అవసరమైనవాళ్ళకు చెప్పటం వాచిక కర్మ. చివరకు దండకట్టడం కాయికకర్మ. అంటే, ముందు కర్మ మనస్సులో పుట్టి, పరిణామరూపంగా అభివృద్ధిచెంది, వాచికంగా మారుతుంది. తర్వాత యింకా బలంసంపాదించి కాయికంగా మారుతుంది. ఈయమంలో చెప్ప బోయేవాటిని, అంతేకాక, యీ గ్రంథాన్నిఅంతా మనోవాక్కాయకర్మేణ అను సరించితీరాలి. ఇంతగట్టిగా ఎందుకు చెప్పుతున్నానంటే, దొంగతనంచేయా లని ఒకడికి బుద్ధి పుట్టిందనుకో. దొంగబుద్ధితోనే మానసికంగా దొంగగా అయిపోయాడు ఆవ్యక్తి. తర్వాత మరొకరికిచెప్పి, వాడినికూడా సహాయంగా తీసుకుంటాడు. అప్పుడు వాచికంగాకూడా దొంగఅయ్యాడు. ఆపైన దొంగ తనం చేస్తాడు. దానివల్ల కాయికంగాకూడా దొంగఅయ్యాడన్నమాట. ఇలాగ కాయికంగా చేసినవాడు మూడువిధాల పూర్తిగా దొంగఅయ్యాడు. ఎవరికైనా భయపడి దొంగతనం కాయికంగాచేయడనుకో అయినప్పటికీ వాడు వాచికం గాను, మానసికంగాను దొంగేగా! పోనీ, చెప్పడానికికూడా మానేస్తాడందాం. అప్పటికైనా మానసికంగా దొంగకాలేదూ! అలాగ, దొంగతనంఅనేది మూడు రకాల కలిసిఉన్నా దొంగతనమే, లేక కేవలం మనసులోఉన్నా దొంగతనమే. ఈవిషయం నీవు బాగాగ్రహించాలి. కాయికంగాదొంగతనం చేశాడంటే వాడు చాలఘటికుడన్నమాట. అంటే వాడిబుద్ధి ఆదొంగతనంలో చాల గట్టిపడి ఉంటుంది. దానిబలం కొంచెంతక్కువైతే కాయికంగా మానేస్తాడు. కాని వాచి కంగా ఉంటుంది. ఇంకా ఆబుద్ధికి బలంతగ్గితే, చెప్పటానికికూడా ధైర్యంలేక మానేస్తాడు. కానిబుద్ధిలోమాత్రం దొంగతనం చేయాలనిభావం ఉంటుంది. ఇలాగే, మంచివిషయాలలోగూడా గొప్ప భక్తుడుకావాలంటే, లేక సన్న్యాసి అయి జ్ఞానికావాలంటే దీన్నిబట్టి ఆలోచించుకో. వాడికి ఆభక్తిమీద, లేక జ్ఞానంమీద, ఎంతతీవ్రత ఉండాలో! చెడువిషయాలైతే యీ మనోవాక్కాయ

కర్మేణ వాటిని చంపెయ్యాలి. మంచివిషయాలైతే, యీ త్రికరణములద్వారా చేయాలి, వృద్ధిపొందాలి. ఇదీరహస్యం. ఈ పరమరహస్యాన్ని నీకు బోధ పరచటానికే యింతచెప్పాను.

ఈ 'యమం' అయిదు అంతర్భాగాలు కలిగిఉందన్నాను. వాటిలో మొదటిది 'అహింస' అంటారు. 'సత్యం' రెండోది. 'అస్తేయం' అంటే దొంగతనంచేయకుండటం మూడోది. 'బ్రహ్మచర్యం' నాల్గోది. అయిదోది 'అపరిగ్రహం'. వీటివివరాలు మెల్లగా చూద్దాం.

అహింసఅంటే పతంజలిమహర్షి వ్రాశాడుగదా 'వైరత్యాగం' అని. వైర త్యాగం అనేది రెండు మాటలుగాఉన్నా అర్థం చాలాఉంది. వైరంఅంటే ఏమిటో ముందు తెలుసుకుంటే, తర్వాత దాన్ని త్యాగంచేయటం ఏమిటో తెలుస్తుంది. ఈ వైరంఅనేది ద్వేషంవల్ల వస్తుంది. అయితే, ద్వేషం ఎందుకు కలుగుతుంది? నీకు పూర్వం చెప్పినట్లు మనశారదమ్మకు దండకట్టటం విష యంలో ఎవరైన ఆటంకం కలుగజేస్తారనుకో. నీవు ఎంతోప్రేమతో దండకు యత్నంచేస్తుంటే 'పానకంలోపుడకలాగ' పూలకు పోవటంలోనో, కోయటం లోనో, ఎవరన్నా ఆటంకం కలుగజేశారంటే నీకెలాఉంటుంది? నీ కార్యక్ర మానికి అడ్డు వచ్చిందికాబట్టి మొదట ఆశాభంగం, తర్వాత విసుగు. ఆ పిమ్మట ఆయడ్డంకులు కలుగజేసినవారిపై కోపం వస్తుంది. అందుకనే వాళ్ళ మీద విరుచుకునిపడాలనో, లేక పూర్తిగా వాళ్ళమీదికి దూకటమో జరుగు తుంది. ఆ కోపానికి ఫలితంగా వాళ్ళమీద ద్వేషంపుట్టుతుంది. ఆ ద్వేషం చేతనే వాళ్ళను తిట్టటం, కొట్టటంకాకుండా యితర్లతో చెప్పి గోలచేస్తావు. అంతేకాదు తర్వాత వాళ్లు ఎక్కడకనిపించినా, మాట్లాడకపోవటం అటుం డగా ముఖం ముడుకుకుంటావు. ఈ ద్వేషమే ముదిరిపోయి వైరంగా మారు తుంది. ఈ వైరంవల్ల వాళ్ళు చేసేపనులకు నీవు ఆటంకాలు కలుగజేయటం, దానిచేత వాళ్ళకు నీమీద వైరంఎక్కువై, బాహాటంగా తిట్టుకోవటం జరుగు తుంది. 'ఈ విధమైనవైరం ఎవరిమీదకూడా లేకుండాఉండటం అహింస' అంటాడు పతంజలి. లేక యిలా వైరంలేకపోవటం అహింసయొక్క ఫలితం

అనిఅంటాడాయన. 'అయితే శారదమ్మకు దండకట్టటమే మానెయ్యాలా?' అంటావు. అదికాదు సూత్రం. వాళ్ళవల్ల ఆటంకం కలిగినా, వారిమీద కోపం కలిగించుకోక, వాళ్ళఅజ్ఞానానికి చింతించాలి. వారిఅజ్ఞానాన్ని పోగొట్టటానికి, సాధ్యమైనంతవరకు బోధించటానికి యత్నించాలి. అప్పటికివారిబుద్ధి మాను కోకపోతే, వారు ఆటంకాలు కలుగజేసినా, తిట్టినా, కొట్టినా, వాళ్ళమీద కొంచమైనా కోపంకాని, ద్వేషంకాని, వైరంకాని రానీయకుండా నీపనిని నీవు చేసుకోవాలి. నీ పట్టుమాత్రం నీవు వదలకూడదు. దానివల్ల నీకు, యింకా ముందు నేను చెప్పబోయే సత్వగుణంఅంటే శాంతం లభిస్తుంది. అహింసా వ్రతం సిద్ధిస్తుంది. నీపని సాగిపోతుంది. కొంతకాలానికి వాళ్ళుకూడా నీ మార్గానికే వస్తారు. అలాకాకుండా వైరంకలిగిందా, యీ ఫలితాలన్నీ నాశనం అవుతాయి. అందుచేత యీ విషయంలో చాల జాగ్రత్తవహించి, మనోవాక్కా యకర్మేణ వైరబుద్ధిని నశింపజేయాలి.

ఈ పైన వివరించిన అహింసానిర్వచనంలో ఒక విశేషంఉంది. వైరం ఎందుకు కలుగుతుందన్నాం? మనం తలంచినపనికి ఆటంకం కలుగజేసినవారి మీద వైరం వస్తుందిఅన్నాం. అయితే, మనం హింసచేసే ప్రతివిషయంలోను యీవైరంఅనేది తప్పకుండా ఉంటుందా? లేదు. ఒకవస్తువునుగూర్చి భయం వల్ల కొన్నిచోట్ల హింసచేస్తున్నాం. 'ఎలాగ' అంటావా? తేలుఉంది. అది కుట్టుతుందేమో అనేభయంచేత, కనబడగానే దాన్నిచంపేస్తాం. అలాగేపాము. కాని దీనిలోగూడ వైరం కారణంఅవుతున్నది. పూర్వంవలెనేగాక యీ వైరానికి యిక్కడ కారణం భయంఅన్నమాట. ఇలాగకాకుండా ఒకడు తినడా నికి ఒకమేకను చంపుతాడు. లేక చేపనుకోస్తాడు. ఇదికూడా హింసేగా. పూర్తిగా అసలుహింస అవుతుంది. ఇక్కడ మేకమీదగాని చేపమీదగాని వాడికి ద్వేషంలేదు, వైరంలేదు. మీదుమిక్కిలి ప్రేమఉంది అనవచ్చునేమో! అది యథార్థంగా ప్రేమఅవునో, కాదో అలాఉంచు. ఎందుకంటే, ఆమేకను పెంచే టప్పుడు అతడు ఎంతప్రేమను చూపిస్తాడు! అయితేదానిమీద ప్రేమచేతనా? దాని శ్రేయస్సును కోరేనా? కాదు. తనకు తింటానికి మంచిమాంసాన్ని యిస్తుందికదాఅని, యథార్థంగా తనమీద తనకున్నప్రేమను దానిమీద కన

పరచినట్లు బయటికి కనిపిస్తాడు. ఇందుకు బృహదారణ్యకోపనిషత్తులో 'ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి' అన్నారు. అంటే దేన్ని మనం ప్రేమిస్తున్నా మనకొరకేఅన్నమాట! అందుచేత యిది ప్రేమకాదు. ప్రేమంటే ప్రతిఫలాపేక్ష ఉండరాదు. మన శ్రేయస్సుగాక, ప్రేమింపబడేవారి యోగ క్షేమాలే ప్రేమలో తాండవిస్తూఉండాలి. మనసాయం పొందినవారివల్ల, మరల మనంతిరిగి సాయంపొందటంగాని లేక, చివరకు కృతజ్ఞతారూపమైన కనీస నమస్కారాన్నిఅయినా అపేక్షించగూడదు. అదీ నిష్కల్మషమైన ప్రేమ అంటే. పైవిషయాలనుబట్టి ఆలోచిస్తే, వాడు మేకను తనకొరకే ప్రేమిస్తున్నాడు, కాని దానిశ్రేయస్సుకోరి కాదుఅని తేలుతుంది. అందుచేత, ఆ జీవిప్రాణం వాడు తీస్తున్నాడంటే వైరంకాక కేవలంస్వార్థంఅవుతుంది. ఇది కూడాదోషయుక్తమే.

అందుచేతనే బుద్ధభగవానుడు అహింసా విషయంలో అన్నాడుగదా 'మనం మనోవాక్కాయాలచేత యేజీవికి హింసచేయకుండడమేకాకుండా, ఆ జీవికికూడా మనోవాక్కాయాలలో దేనికీ హింసఉండరా'దని. ఇది చాలగొప్ప విషయం. మన మనస్సులోనైనా ఏ జీవికీ హింసచేయ తలపెట్టరాదు. అంతే గాదు, ఆ జీవికైనా కాయికంగా హాని జరగకుండడమేకాకుండా, చివరికి దాని మనస్సుకుకూడ ఎలాంటికష్టం కలుగకూడదని దీనిరహస్యం. ఇదే ఆ మహా త్ముని అహింసాతత్త్వంలోఉండే అంతరార్థం. అంటే ఏ జీవికికూడా, చివరికి దానిమనస్సుకుకూడా, ఏమాత్రం కష్టంకలుగజేయకుండా ఎప్పుడుంటామో అప్పుడు మనం యీఅహింసావ్రతాన్ని సక్రమంగా సాగించుచున్నట్లు అని అర్థం అవుతుంది. ఇది చాల కష్టం. కాని కష్టంఅని మానేస్తే ఎలాగ? **కాబట్టి** సాధించాలిసిందే.

దీనికొక ఉదాహరణ చెప్పుతాను విను. నాకొక స్నేహితుడుండేవాడు. వాడికి అప్పుడప్పుడు దగ్గువస్తుండేది. ఒకరాత్రి మేమిద్దరం ఒక్కచోటనే పడు కున్నాం. ఒకరాత్రివేళకు, పాపంఅతనికి దగ్గుప్రారంభంఅయింది. దగ్గితే నాకు నిద్రాభంగం అవుతుంది. నిద్రాభంగం కలుగజేయడంకూడా హింసే. అందు చేత అతడేమిచేశాడు? చప్పుడుకాకుండా దగ్గును బిగపట్టి, మెల్లగా తలుపు

తీసి మరల దగ్గరగాఅయితే నాకు దగ్గువినపడి నిద్రాభంగం కలుగుతుందేమో అని, చాల దూరంవెళ్ళి దగ్గుకుంటున్నాడు. కాలవశాత్తు నేను మేల్కొన్నాను. స్నేహితుడు పడకమీదలేడు. ఆశ్చర్యం కలిగింది. బయటికి వెళ్ళిఉంటాడని అరగంటచూచాను కానిరాలేదు. పిలిచాను. మారుపలకలేదు. కొంత సేపటికి కళ్ళుఎర్రబడి, ముఖం భయంకరంగాఉండి వచ్చాడు మిత్రుడు. వాడి దీనస్థితికి దయ అలాఉండ, వాడి అహింసాదీక్షకు ఆశ్చర్యం, ప్రేమ నన్నుముంచేశాయి. అలాఉండాలి అహింసఅంటే. మనవల్ల ఏ జీవికి, దాని స్వేచ్ఛాప్రవృత్తిలో ఆటంకం కలుగకుండాఉండటమే అహింసాతత్త్వం. ఇంతెందుకు, అహింసా తత్త్వపరమావతారంఅయిన బుద్ధభగవానుడేమిచేశాడు? కొంగవిషయం చూడు. తనఒడిలో పడేటప్పటికి, దాన్ని రక్షించి, దాన్ని మరల తనసోద రుడైన దేవదత్తునికి యియ్యటానికి ఎదురు తిరిగాడు. తర్వాతమాత్రం! ఆ కుంటి మేకపిల్లనుచూచి, ఆపిల్లతల్లికంటె తానే ఎక్కువబాధపడి, అంతేకాదు, ఆ బాధపడే మేకపిల్లకంటే ఎక్కువ బాధ తానేచెంది, దాన్ని తనభుజాలమీద వేసుకొని యజ్ఞశాలకు వెళ్ళాడనివిన్నాం. ఆదెబ్బతో ఆమహానుభావుని దయా మృతప్రభావంవల్ల ఎన్నివేలజీవులు రక్షింపబడ్డాయి! అది అహింసాతత్త్వం అంటే. దయ పూర్ణత్వంపొందితే అహింసాతత్త్వం అవుతుందనవచ్చు. అలా ఉండాలి అహింసఅంటే. అర్థం అయిందా?

మరొక విషయంఉంది యీ అహింసావ్రతంలో. పైన చెప్పబడిన వైరం, భయం, స్వార్థాలుకాకుండా, హింసకుకారణం మరొకటుంది. అదే 'అకారణం' అంటే తమాషాఅన్నమాట. వీధిలో పడుకున్నకుక్కను, పై కారణాలేమాత్రంలేకుండా ఒక్కతన్నుతంతాడు కుర్రాడు. కారణం తమాషా. ఆ దెబ్బకు అది ఏడుస్తుంటే వీడు నవ్వుతుంటాడు. అలాగే, కొందరు కప్పల్ని తొండల్ని చంపుతుంటారు. ఇంతెందుకు, మన ఆశ్రమంలో ఎలక్ట్రిక్‌దీపం దగ్గరకు పురుగులువస్తుంటే, పిల్లలుచూడు, ఎలా చంపేస్తుంటారో! దాంట్లో కారణం ఏదన్నాఉందా? ఏమీలేదు. తోచకపోవడంచేత, ఏదో కాలయా పనకోసం, లేక తమాషాకొరకు అలాచేస్తుంటారు. అలాగే, సంక్రాంతిపండు గకు ఎన్నోచోట్ల కోడిపందాలు జరుగుతుంటాయి. పాపం, అవి అమాయి

కంగా పాడుచుకుని వస్తుంటే, చుట్టూఉన్న వంగలాదిజనం ఆనందోత్సాహా లతో గంతులేస్తుంటారు. అదోవినోదం, ఆనందం. కాని ఆజీవులకు ప్రాణాం తకం కదూ! ఇలాగ ఎన్నిరకాలపందాలో యీ ప్రపంచంలో! ఇదికూడా దోషమే. ఈ విధంగానైనా చేయకుండటం అహింసా అనుష్ఠానం అన్నమాట. ఇలా, యిన్నిరకాల తీవ్రంగా ఆలోచించి అహింసావ్రతాన్ని అనుసరించాలి. చూచావా, ఎంత కష్టమో! అయినా హింసారూపమైన ఏ చిన్నదోషంకూడా లేకుండటమే ఆధ్యాత్మికాభివృద్ధికి కారణం.

ఈ అహింసావ్రతం సాధ్యమా? తెల్లవారిలేచిందిమొదలు రాత్రిపడు కునేవరకు జీవహింసలేకుండా జీవి బ్రతికేది ఎలాగ? అన్నంతింటం హింస కాదా? కూరలుతినటం హింసకాదా? అంటారు కొందరు. హింసలేకుండా ఉంటానికి వీలులేదు. కాబట్టి మేకలు మొదలైన మృగాలనుతింటం హింస కాదంటారు యీరకంవాళ్ళు. కాని మొదట్లో నేను చెప్పినట్లు చరములు, అచ రములుఅని రెండు రకాలు జీవులు. వీటికే స్థావరజంగమాలనికూడా మరొక పేరుంది. జంగమాలలో జీవత్వం చాలా అభివృద్ధిగాంచి ఉంటుంది. స్థావరా లలో పరిణామంపొందిన పశువులనుచంపితే నేరంకాకపోయినా, ఆ పరిణామ చక్రంలోనే చాలాదూరంపోయిన మనిషిని చంపితే, నేరంగా పరిగణింపబడు తుంది యీ నాగరికప్రపంచంలో. అలాగే ఆధ్యాత్మిక లోకంలోగూడా పరిణా మాన్నిబట్టి ప్రాధాన్యం యిస్తారు. అందుకని సాధ్యమైతే, కొందరు ఋషుల వలె వాయుభక్షణతోనే ఉండవచ్చు. లేకపోతే ఎండుటాకులు తినిఉంటారు కొందరు. అదీ సాధ్యంకాకపోతే గడ్డలు, రాలినపండ్లు, అదీకాకపోతే పండ్లు, కాయలు, చివరకు శాకాహారాలవరకు ఆధ్యాత్మికనాగరికప్రపంచం ఒప్పు కుంటుంది. ప్రత్యక్షహింసారూపమైన మాంసభక్షణతో సంబంధం దానికేనా డును ఉండనేరదని నావాదం. అలా, మన శక్తినిబట్టి, అవసరాన్నిబట్టి, యీ అహింసాసిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టుతూ, క్రమక్రమంగా పర్యవసానమైన అనుభవానందాన్ని పొందాలి అని నాభావం.

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం.

(signature)
12-1-46

# 6
# యమము - సత్యము

తమ్ముడూ మాతాజీ!

పూర్వపుటుత్తరం, అహింసాతత్వాన్ని నీకు బోధిస్తూ, నీ మనస్సుకు కొంచెంఅలసట కలుగజేసిఉంటుంది. అయినా యీవరకు నీ మనస్సు మరల పాటులోపడ్డదనితోచి, మరలవ్రాయటం ప్రారంభంచేస్తున్నాను. భయంకాని, విసుగుకాని నీకుండరాదుసుమా! ఎప్పుడెప్పుడు యీవిషయాలు తెలుస్తాయాఅని తీవ్రకాంక్షతోఉండాలి నీచిత్తం. ఆకలితోఉన్నవాడు అన్నంకొరకు ఎలానిరీక్షిస్తాడో అలాఉండాలి నీ మనస్సు. అలాగఉంటే యిక విసుగుకుతావేది? అందుచేత యమంలోరెండోభాగం సత్యం విషయంఆలోచిద్దాం. ఈ సత్యానికికూడా అహింసలోవలె మనోవాక్కాయకర్మేణఅనేసూత్రం ప్రధానం అన్నమాట. దీనికేకాదు, తర్వాతవచ్చే అన్నిఅంతర్భాగాలకు యిది తప్పని సామాన్యసూత్రం. అందుకని ఆవిషయాన్నిచెప్పకుండా కేవలం సత్య నిర్వచనానికే పూనుకుంటున్నాను. మరల నీమనస్సుకు జాగ్రత్తచెప్పి శ్రద్ధగా విను.

'సత్యం' అంటే ఏమిటి? ఈపదం వేదాల్లో కర్మకాండలోనేకాక జ్ఞాన కాండలోగూడ వస్తుంది. 'సత్యం వద' అని వేదంలోగల విధివాక్యాలలో చాల ముఖ్యమైనవాక్యం యిది. విధివాక్యాలంటే ఏమిటంటావా? వేదంముఖ్యంగా, కర్మకాండలో రెండురకాల వాక్యాలను సామాన్యమానవునికి, అంటే ఆధ్యాత్మికంగా అభివృద్ధిచెందాలని కాంక్షతోఉండి, యింకా ప్రాథమిక స్థితులలో ఉండేవానికై చెప్పింది. అవే విధివాక్యాలు, నిషిద్ధవాక్యాలు. విధివాక్యాలంటే ఆ ముముక్షువు, మోక్షంకోరేవాడు తప్పకుండాచేయవలసిన, లేక పాటించవలసిన వాక్యాలనిఅర్థం. ఈవాక్యాలను అనుసరిస్తేగాని ఆధ్యాత్మికపరిణామ చక్రంలో వీడికి చోటులేదు. అలాగే కొన్నిపనులు అతడు ఆచరించరాదుగదా, వాటిపై దృష్టినైనా పడనీయరాదు. అందుచేత దయాస్వరూపిణిఅయిన వేదం వాడికొరకు 'యిది చెయ్యి' అనిచెప్పిన వాక్యాలు విధివాక్యాలంటారు. అలాగే 'చేయవద్దు' అనిచెప్పే వాక్యాలు నిషిద్ధవాక్యాలయ్యాయి. ఈ సూత్రం ప్రకారం 'సత్యంవద' అనేదివిధివాక్యం. 'నానృతంవదేత్' అనేది నిషిద్ధవాక్యం. 'ధర్మంచర' అనేది విధివాక్యం. 'న సురాం పిబేత్' అనేది నిషిద్ధవాక్యం. అంటే సారాయి త్రాగవద్దు అనిఅర్థం.

పై విధివాక్యాలన్నామే వాటిలో ప్రథమం, ప్రధానంఅయింది 'సత్యం వద' అనేవాక్యం. జ్ఞానకాండలోకూడా యీ సత్యం పదమే, 'సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ' అంటూ వస్తుంది. 'సత్యం వద' లోని సత్యానికి, 'సత్యం జ్ఞానం' లోని సత్యానికి, అర్థంలో చాల తారతమ్యంఉంది. జ్ఞానకాండలోని సత్యపదానికి 'సత్' త్రికాలాబాధ్యమైనఅని అర్థంవస్తుంది. అంటే ఒకకాలంలో ఉండి, మరొకకాలంలో లేకపోవటం కాకుండటం అనేఅర్థాన్ని సూచిస్తుంది. దీనకర్థం ఏమిటంటే మొదట్లో చెప్పినట్లు, యీలోకంలోఅన్నీ మొదట్లో లేక, అంటే పుట్టకముందులేక, తర్వాతలేక, అంటే మరణించినతర్వాత కూడా లేకుండాఉండేది. ఈరెండువిధాల లేకుండటాన్ని, అంటే లేమిని శాస్త్రంలో 'ప్రాగభావం' అని 'ప్రధ్వంసాభావం' అని అంటారు. ప్రాక్ + అభావం అంటే పుట్టకముందే లేకపోవడంఅని, ప్రధ్వంస + అభావం అంటే నశించినపిమ్మట లేకుండటంఅని యీ రెండుపదాలకు అర్థం. ముందూలేక,

వెనకాలేక మధ్యలోఉండటం యీలోకంతీరు అన్నమాట. ప్రస్తుతం మన విషయం చూచుకో. మనం పుట్టకముందున్నామా? ఉంటే, మీ అమ్మపెళ్ళికి నీవెన్నేళ్ళదానవు? నవ్వుతున్నావే? ఎలా ఉంటానంటావా? అయితే లేవన్న మాట. అలాగే మనంచనిపోయినతర్వాత? మనవాళ్లు మరణించినవా రున్నారా? లేరు. అలాగే మనంకూడా ఉండటానికి వీలులేదు. కాని యీ మధ్యలో, అనగా పుట్టినతర్వాత, చనిపోకముందుమాత్రంఉంటాం. నిజానికి మధ్యకూడా లేనేలేముఅంటారు జ్ఞానులు. ఆ పాములేనట్లు, మనంకూడా లేమంటారు పెద్దలు. ఇలాగ ఆబ్రహ్మంమొదలుకొని చీమవరకు లోకంఅంతా యింతే అనుకో. కాని బ్రహ్మంమాత్రం యిలాగ మొదట్లోలేక, చివరలేక, మధ్యలోమాత్రం ఉండేదికాదు. అది పుట్టకముందూఉంది, నశించిన తర్వాతఉంది. పుట్టకముందు బ్రహ్మం ఎలా ఉంటుందంటావా? నశించిన తర్వాత ఎలా ఉంటుందనా నీసందేహం? అదే రహస్యం. ఆ బ్రహ్మం అలా ఉంటుంది. 'అయితే పుట్టకముందు బ్రహ్మంఉంటే, పుట్టుక ఎలాగ ఉంటుంది అంటున్నావా?' అవును, నీ తెలివితేటలకు చాల సంతోషం. ఆ విషయం నీకు నేనుచెప్పాలనే అనుకున్నాను. నీవేగ్రహించావు. తాను పుట్టక ముందే ఉన్నదానికి పుట్టుకే లేదనిఅర్థం. అలాగే నశించినతర్వాతకూడా ఉండేదానికి చావులేదనికూడా అన్వయం. ఇలాగ యీ బ్రహ్మపదార్థం, చావు పుట్టుకలు లేనిదిఅని శాస్త్రంఅంటుంది. అందుకనే బ్రహ్మాన్ని ఆదిమధ్యాంత రహితం అన్నాయి శాస్త్రాలు. ఈ విషయాన్నింకా ముందు గ్రహిస్తావు. ఈ అంతరార్థాన్ని ఒక్కమాటలో సత్యం అని శాస్త్రాలు, ఆ బ్రహ్మలక్షణాన్ని చెప్పేశాయి. ప్రస్తుతం మనకు కావలసిన సత్యం అనేపదానికి యిది అర్థంకాదు. ఈ సందర్భంలో బ్రహ్మ విషయమేలేదు.

అయితే యీసత్యానికి అర్థం అబద్ధంచెప్పకుంటం అనుకోవచ్చు. సత్యంఅంటే ఉన్నదున్నట్లుచెప్పటం అనికూడా అనవచ్చు. ఏమాత్రం కల్పన లేకుండాచెప్పటం అనికూడా దీన్ని వివరించవచ్చు. మరొక అర్థంఉంది యీ సత్యానికి, ఆడినమాట తప్పకుండటంఅని. ఈరెండర్థాలే మన ప్రస్తుత విష యానికి కావలసిన అర్థాలు. ఈ విషయాన్ని సావకాశంగా ఆలోచిద్దాం.

పైన సత్యానికి చెప్పబడిన రెండర్థాలలో, మొదటిదైన ఉన్నదున్నట్లు చెప్పటం అనేదాన్నిగూర్చి కొంచెంసేపు చూద్దాం. అలంకారశాస్త్రంలో 'అతిశయోక్తి' అనే అలంకారండుంది. భాషారచనానికి మెరుగులుయిచ్చే శాస్త్రం అలంకారశాస్త్రం. దాంట్లోది అతిశయోక్తి. దీనిఅర్థం ఏమిటంటే, అసలు దానికంటే ఎక్కువగాచెప్పటం. అదిఎలాగలంటే, నీవు గోదావరిని చూచావు. దాని వెడల్పుకు ఆశ్చర్యంపొంది సముద్రంలాగ ఉందంటావు. సముద్రానికీ, గోదావరికి ఏమైనాసంబంధం నిజానికిఉందా? సముద్రంలో గోదావరి ఏ మూల? అయినా సముద్రంలాగ ఉందంటావు. ఇది అతిశయోక్తిఅంటే. అలాగే మనపురాణాలన్నీ, యిట్టి అతిశయోక్తులతో నిండివున్నాయి. భీమునివిషయం చూడు. నీకు యికయితరం చెప్పనక్కర లేదు. అతగాడట, పుట్టిబియ్యంఅన్నం చప్పరించేస్తాడట! తాడిచెట్టును పీకి, దాన్ని కర్రలాగ ఉపయోగించి పోట్లాడేవాడట! అదిసాధ్యమా? మానవుడు, ఎప్పుడూ అలా చేయనేలేడు. ఈవ్రాతంతా అతిశయోక్తిలన్నమాట. ఇలాంటివి, మన పురాణ పురుషులైన రాముడు, కృష్ణుడు, మొదలైనవారందరిలోనూ మిక్కుటంగా గోచరిస్తాయి. అయితే, యీపురాణాల అతిశయోక్తి ఎవరికీ హానిచేయదు. మీదుమిక్కిలి ఆరామునిమీద, కృష్ణునిమీద, మనకు గొప్ప భక్తివిశ్వాసాలు అభివృద్ధిచెందుతాయి. అందుకనే యీపురాణాలను వ్రాసిన శ్రీవ్యాసభగవానుడు, తన కవితాధోరణిలో అసలు జరిగినదాన్ని యింకాపెంచి, మనకందరికి ఆపురాణాలమీద భక్తికలిగేటట్లు వ్రాశాడు. అది తప్పుక్రిందరాదుకాని, సత్యానికి కొంచెం దూరంఅయినాడని అనాలి. మనంకూడా యిలాగే ప్రవర్తిస్తూ ఉంటాం. ఎలాగలంటే, మనకునచ్చినవాడిని ఇంద్రుడు, చంద్రుడుఅంటాం, వాడిలో మంచిలక్షణాలు మందులోకైనా లేకపోయినా. ఇదీ అసత్యమే. అలాగే మంచివాడైనా, మనకు నచ్చకపోతే శుద్ధచవటపెద్దమ్మగావర్ణిస్తుంటాం. ఇది తప్పు. నీకు వాడిమీద అభిమానంకలిగినప్పుడు వాడు గొప్పవాడైనాడా? అతనిమీదనే నీకు కోపం, ద్వేషం, అసూయ కలిగినప్పుడు దుర్మార్గుడయ్యాడా? ఈరెండులక్షణాలు లేనివాడు అవుతాడుఅతడు. అంటే సరియైన సత్యవ్రతాన్ని పాలించాలంటే, ఉన్నదున్నట్లు తెలుసుకోవాలంటే, యీ

రాగద్వేషాలులేని కళ్ళతో చూడాలి. ఒకర్ని అర్థం చేసుకొనేటప్పుడు నీ దృష్టితో, అంటే కల్మషదృష్టితో, పైనచెప్పినరీతిగాచూస్తే మంచైనా కల్మషం కాదూమరి! అందుకని నీ కల్మషదృష్టితోకాక, నీచేత తెలియబడేవాడి దృష్టితో చూడాలి. అప్పుడు యథార్థం బోధపడుతుంది. అదే సత్యం. ఎలా గంటే ప్రపంచంలో ఆడ, మగ, గొడవ చాలాఎక్కువగా! అందుచేత ఎవరో అన్న, చెల్లెలు కలిసి రైలుప్రయాణం చేస్తుంటే, వాళ్ళిద్దరినిచూచి అందరు అనుమానించేవారే! ఎందుచేత? ఆ యన్న, చెల్లెలు దృష్టితో వీరుచూస్తేగా! వీరిసంకుచితమైన, సామాన్యమైన పామరదృష్టితో చూస్తారుకాబట్టి. ఇలాంటి వెన్నో ఉదాహరణలు చెప్పవచ్చు. ఇక నీవు ఊహించుకోవచ్చు. కాన, సత్యం అంటే కల్మషదృష్టికాక, నిర్మలదృష్టి అన్నాను. ఇది అభ్యాసంలోపెట్టినవాడే ధన్యుడు. పైకారణాలవల్ల, ఎవ్విధమైన కల్పన లేకుండాచెప్పటం సత్యంఅని తేలింది. అమ్మాయీ! యీవిషయం చాలాముఖ్యం. అయినా అందరూ తప్పుచేసేదికూడా యిక్కడే. కాబట్టి దీన్ని సరిగ్గాగ్రహించి, నీవు ఆచరించాలి

ఈ సత్యానికి మరొకఅర్థం చెప్పాను, ఆడినమాట తప్పకుండటం. దీనకి ఉదాహరణలు చాలాఉన్నాయి మనకు. ఈవిషయంలో ప్రథముడై అగ్ర తాంబూలం అందుకున్నవాడెవ్వడు? హరిశ్చంద్రమహారాజు. సత్యం కొరకు కదూ యీచక్రవర్తి పెండ్లాంబిడ్డలను, సామ్రాజ్యాన్ని పోగొట్టుకొని బికారైపో యాడు! విశ్వామిత్రునికి తానిస్తానన్నపైకం యిస్తాననలేదని అన్నట్లయితే రాజ్యాలు, పెళ్ళాం, అంతా యిస్తానన్నాడుగదా ఆమహాముని! కాని ఒప్పు కున్నాడా? అతనికి యీ సత్యవాక్పరిపాలనలో ఫస్టుప్రైజు అన్నమాట. అలాగే దశరథుడుమాత్రం? మొదట్లో విశ్వామిత్రునివెంట, రామలక్ష్మణులను పంపటానికిజంకి తర్వాత పంపాడా! ఇంతెందుకు, కైకమ్మకు తానుయిచ్చిన వరాలు, అంటే ఏదడిగితే అది యిస్తానుఅనే వాగ్దానంవల్లనేకదూ పాపం, అతడు తన ప్రాణానికి ప్రాణంఅయిన ముద్దులరామచంద్రుని అడవిపాలు చేసుకున్నాడు. ప్రాణాలుకూడా పోగొట్టుకున్నాడు. ఇలాగే, మనరామకృష్ణుని సత్యశీలత్వాన్నిగూర్చి విన్నావా? ఒకరోజు, ఆయన ఒక భక్తునియింటికి వస్తానన్నాడు. కాని మరిచిపోయాడు, అనేకమందితో మాట్లాడుతూ ఉండ

టంచేత. అందరూ వెళ్ళినతర్వాత, రాత్రి పదిగంటలకు జ్ఞానకం వచ్చింది. వెంటనే ఏమిచేశాడు? హృదయరాముని లేపాడు. 'అబ్బాయీ! కలకత్తాకి వెళ్ళాలి' అన్నాడు. ఇదేమిటని హృదయరాముడు ఆశ్చర్యంపొందాడు. ఆ అర్ధరాత్రిలో, నాలుగైదుమైళ్ళ దూరానఉన్న కలకత్తాకు బండ్లు ఆ టైముకు ఏమీ ఉండవుకాబట్టి నడిచి మరీవెళ్ళాడు రామకృష్ణుడు. ఆ యింట్లో అందరు గాఢనిద్రలో ఉండటంచేత పలుకలేదేమో! ఆ తలుపుమీద తన చేవ్రాలుపెట్టి, తేదీ, టైము వేసివచ్చేశాడు. తన మాట, అలా కష్టపడిఅయినా చెల్లించాడు. ఇదీ అన్నమాటతప్పకుంటంఅంటే. సామ్రాజ్యాలుపోయే స్థితి వచ్చినా, జంకకుండా సత్యాన్నిపాటించాలి. అసలు ఏమీ నష్టంకలుగక పోయినా, యీసత్యదీక్షను కాపాడుకోవాలి. ఈసత్యదీక్ష సక్రమంగా ఉంటేనే గాని యీఆధ్యాత్మికమార్గం సున్నితంకాదు. అంతేకాక, అర్జునుడు తన సర్వస్వమైన కృష్ణునితో ఎందుకు యుద్ధం చేశాడు? తనను శరణుజొచ్చిన గయుని రక్షిస్తానని మాటయిచ్చాడు. తర్వాత తెలిసింది కృష్ణునితోనే విరోధంఅని. కాని తనఆప్తుడైన కృష్ణునితోనైనా యుద్ధం చేస్తానన్నాడుగాని గయునిమాత్రం విడువనన్నాడుకదూ! అది సత్యవాక్పరిపాలనంటే. అలాగే హనుమంతుడుకూడా. ఆడినమాటతప్పనని తన గురువు, దైవంఅయిన శ్రీరామునితోనే పోరాడాడు. అందుచేత మన పూర్వులు, యీ సత్యాన్ని సాధించటానికి ఎంతైనా త్యాగం చేశారు. సాధించారు. అందుకనే వారి పేర్లను మనమందరం యిప్పటికి చెప్పుకుంటున్నాం. ఇప్పుడేకాదు, వాళ్ళ పేర్లు ఎప్పటికీకూడా ఉంటాయి. అలాగ చిరకీర్తి సంపాదించాలంటే, వాళ్ళవలె నీవు కూడా, యీ సత్యదీక్షకై ఎంతత్యాగానికైనా పూనుకోవాలి తల్లీ!

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం.

(signature)
13-1-46

# 7
# యమము - అస్తేయము

ప్రియమైన మాతాజీ!

అమ్మా! పూర్వపుటుత్తరాలలో, యమానికి ప్రథమాంగాలుగా ఉన్న అహింసా, సత్యాలనుగూర్చి విన్నావు. నేను యీజవాబులు వ్రాస్తూఉంటే, నీవు నాముందున్నట్లే ఉందిసుమా! నీముఖం కనపడుతూనేఉంది. వీటిని నీవర్థం చేసుకుంటున్నట్లే, నీముఖవికాసంవల్ల నేనుగ్రహిస్తూ వ్రాస్తున్నాను. లేక పోతే వ్రాయటానికి నాకుఉత్సాహం ఎలాఉంటుంది? నాకు యీ వ్రాసే ఉత్సాహం నీముఖంనుండి ప్రవహించి నన్ను ముంచేస్తుంటే, కలంలోసిరా అర గంటలో అయిపోయేటట్లు వ్రాస్తాను. చెయ్యి హొప్పిపుట్టినా లెక్కసేయకుండా వ్రాయగల్గుతాను. అలా, శ్రద్ధతో అర్థంచేసుకుంటూ **చదువుతున్నావుకాబట్టే** యీయమంలో మూడోభాగంఅయిన అస్తేయాన్నిగూర్చి చెప్పుతాను విను. 'అస్తేయం' అనగా దొంగతనంచేయకుండటం అనిఅర్థం. ఈ అస్తేయాన్ని కూడా త్రికరణశుద్ధిగా పాటించాలని వేరుగా చెప్పటం ఎందుకు?

అసలు, దొంగతనం ఎందుకు చేస్తారో కొంచెం విచారిద్దాం. ఉన్న దానితో తృప్తిపొందకపోవటంవల్ల దొంగలవుతాడు. అంటే ఆశవల్ల దొంగతనంచేస్తాడు. సరియైనవాడైతే తనకున్నదానితో తృప్తిలేకపోతే, సక్రమమైన పద్ధతుల్లో కష్టించి, తనకు కావలసినదాన్ని పొందాలి. కాని అలా కష్టించటానికి మనసొప్పక, సోమరియై, అక్రమపద్ధతుల్లో ఉన్న్రాడియంగా సంపాదించాలని కుబుద్ధిఉంటంచేత దొంగగా మారుతాడు. అసలు, యీఆశ మన అన్ని దుఃఖాలకి మూలం అనవచ్చు. ఎలాగలంటావా? ఈఆశచేతనే మితిమీరిన కోరికలు బయలుదేరుతాయి. కోరికలు ఎంతెక్కువైతే అంతదుఃఖం కలుగుతుంది. దీన్నే మన గ్రంథాల్లో 'తృష్ణ' అన్నారు. ఈ తృష్ణ ఎలాతగ్గుతుందో ముందు తెలుసుకోవాలి. దాన్ని సరిగ్గాగ్రహిస్తే, తర్వాతదాన్ని నిగ్రహించే మార్గం బోధపడుతుంది.

ఈ తృష్ణ సాధారణంగా మూడురకాలు ఉంటుంది. వ్యక్తి, వస్తువు, భావంఅనే యీ మూడు తృష్ణను గలుగచేస్తాయి. వ్యక్తిలంటే మనుష్యులు అనుకో. వ్యక్తితృష్ణఅంటే మనుష్యులనుగూర్చితృష్ణ అనిఅర్థం. దీన్ని వివరిస్తానువిను. సాధారణంగా యిది కామ్యంగాఉంటుంది. అంటే ప్రపంచసుఖాల కొరకై ఉంటుంది. ఎలాగంటావా? భార్యకు భర్తపై తృష్ణ, భర్తకు భార్యపై తృష్ణ. ఈ తృష్ణవల్ల ఒకరికొకరు దాసులైపోతారు. వారి వ్యక్తిత్వాన్ని, స్వాతంత్ర్యాన్ని పూర్తిగా పోగొట్టుకుంటారు. ఈతృష్ణ విపరీతంగాపోతే, భార్యాభర్తలలోమాత్రమే యిమిడిఉండక, భర్తకు స్త్రీలమీద, భార్యకు పురుషులమీద పోతుంది. అంతటితో అనేకవిధాల దొంగతనాలు బయలుదేరుతాయి. ఈ తృష్ణవల్లనే యీర్ష్య, గర్వం, దుఃఖం, అసత్యం, వ్యభిచారం, వివరికి పరహత్య, లేక ఆత్మహత్యలాంటి అనేకదుర్లక్షణాలు ప్రవేశిస్తాయి. ఇలాగే ఒక భార్యావ్యక్తిమీదికేగాక, పిల్లలమీదికి, ప్రభువుమీదికి, యిలా ప్రపంచంలో మనకెంతమందివ్యక్తులతో సంబంధం కలుగుతుందో, అందరిమీదికి, ఒక్కోవ్యక్తి విధంగా యీతృష్ణ ప్రసరించి, దానికితగిన అనేక అనర్థాలకు కారణభూతం అవుతూఉంటుంది.

ఇదేవిధంగా తృష్ణ వస్తువులమీదికికూడా పోతుంది. అప్పుడు ఉన్న దానితో తృప్తిలేక, చూచిందల్లా కావాలనేకాంక్ష బయలుదేరుతుంది. ఆ వసువును సంపాదించడానికి సామ (మంచిగా), దాన (లంచంచే), భేద(విరోధం చేత), దండ (కొట్లాటచే)ములనే నాలుగువిధాలుగా యత్నించి, సాధ్యం కానప్పుడు, యీ అయిదో మార్గం చౌర్యానికి వస్తారు. ఇదే దొంగతనం.

తృష్ణకు మూడోఆధారం భావం అన్నాను. ఎవరి భావాలనో తీసుకొని గ్రంథంవ్రాసేది, తన సొంతంఅని ప్రకటించేది. ఈదొంగతనం సామాన్యంగా కవుల్లో, పండితుల్లో ఉంటుంది. కాబట్టే యిది పెద్దలదొంగతనం అనవచ్చు.

ఇలా, యీరకాల దొంగతనానికికారణం తృష్ణఅన్నాం. ఈ దొంగతనంచేతకాదూ రావణాసురుడు కులక్షయం పొందాడు! ఈ కాంక్షవల్లనే బ్రాహ్మణులైపుట్టికూడా రాక్షసులని పేరుపడ్డారు రావణుడు, హిరణ్యకశిపుడు మొదలైనవారు. ఇంతెందుకు, యీ దొంగతనాన్ని ఎంత సూక్ష్మంగా మనరామకృష్ణుడు చూచేవాడో, ఒకచిన్నసంగతి చెప్తుంతాను విను. ఒకనాడేమైందంటే, మనరామకృష్ణదేవుడు దక్షిణేశ్వరందగ్గరనేఉన్న ఒక డాక్టరు దగ్గరకు వెళ్ళాడు. ఆడాక్టరుతో పని పూర్తిఅయినాక, తిరిగివచ్చేటప్పుడు, డాక్టరుగారి కంపౌండరుదగ్గరకు వెళ్ళి, ఒకమందు అడిగాడు. డాక్టరును అడిగినా యిచ్చేవాడేకాని మాటవరసకి అడిగాడు. మందుని అలాపుచ్చుకొని రామకృష్ణుడు, తనబసకు కొంతదూరంవరకు వచ్చాడు మెల్లగా. కాని, రానురాను తనకళ్ళు తిరగటం, కనిపించకపోవటం మొదలుపెట్టింది. 'ఇదేమా' అని ఆలోచించాడు గురుదేవుడు. సూక్ష్మగ్రాహికాబట్టే వెంటనే గ్రహించుకున్నాడు. ఆ మందు డాక్టరుదిగాని కంపౌండరుదికాదుగా! అలాంటప్పుడు, ఆ డాక్టరు అనుమతిలేకుండా, ఆమందును తాను తీసుకొనిరావటం దోషం కాదూమరి! అది దొంగతనమే అవుతుంది. ఆయనది అతిసున్నితమైనతత్త్వం కాబట్టే ఆయనమీద ఆ దోషం ఆయనకు తెలియకుండానే పనిచేసింది. వెంటనే ఏమిచేశాడనుకున్నావు? మరల తిరిగి డాక్టరుదగ్గరకు వెళ్ళాడు. కాని తలుపులు వేసిఉన్నాయి. డాక్టరూలేడు, కంపౌండరూలేడు. అప్పుడు మన

భగవానుడు కిటికీలోనుంచి మందును ఆసుపత్రిలోనికి పడేసి వెనక్కితిరి గాడు. కళ్ళు బాగా కనిపిస్తున్నాయి, దారి తెలుస్తున్నది. చూచావా? యీ దొంగతనం అంటే ఎంత సూక్ష్మంగా ఉంటుందో! ఇలాంటి దోషాలు రాకుండా ఎంతోజాగ్రత్తగా ఉండాలిఅన్నమాట. ఇంతేకాదు. స్వప్నంలో అయినా దొంగతనంచేసినట్లు వచ్చిందాఅంటే, అదికూడాదోషమే. ఇలా స్వచ్ఛంగా ఉంటేనేగాని ఆధ్యాత్మికంగా మనకు స్థానంలేదు.

ఈకారణాలచేత యీఅస్తేయం మనకు లభ్యంకావాలంటే, మన మనస్సులో వేటివేటిమీద మనకు కాంక్షలున్నయ్యో ముందు తెలుసుకోవాలి. ఆ కాంక్షల్ని మెల్లగా తగ్గించితగ్గించి, అసలు లేకుండా చేసుకోవాలి. అప్పుడు యీ తృష్ణాపిశాచం నిర్మూలంఅయి, అస్తేయం మనసొమ్మవుతుంది. అంటే ఎవరికైతే యీలోకకాంక్షలు తగ్గిఉంటాయో, ఎవరైతే కోరికలను చంపేస్తారో, వాళ్ళకు యీఅస్తేయం సిద్ధిస్తుందిఅని తేలింది.

అయితే దేన్నీకోరకుండా, మొద్దులాగా ఉండాలంటారా అంటావేమో! అదికాదు నాభావం. సక్రమమైన కోరికలు కల్గిఉండవచ్చు. వాటిని పొందటానికి సక్రమపద్ధతుల్ని అనుసరించనూవచ్చు. అలాఉండటం దోషం కాదు. ఇది గృహస్థులు పాటించవలసినవిధానం. లేక ఆధ్యాత్మికంగా గొప్ప స్థితులకుపోవాలని తీవ్రంగాకాంక్షతో ఉండేవాళ్ళకు, యీతృష్ణపూర్తిగా పోయి తీరాలి. వివేకానందుడేమన్నాడంటే 'ఆనందాన్ని అనుభవించాలంటే ప్రపంచ విషయాలలో తృప్తిఉండాలి. ఆధ్యాత్మికజీవితంలో అసంతృప్తి ఉండాలి' అని. అప్పుడు ఏ చోరత్వదోషం మనమీదికి రానేరాదు.

కాబట్టి చెల్లీ! యీసూత్రాన్ని గ్రహించి, తృప్తిఅనే ఆనందాన్ని అనుభవిస్తూ, అస్తేయానికి అధిపతిగా కావటానికి తీవ్రంగా యత్నించు.

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం.

నాన్నగారు

15-1-46

# 8
# యమము - బ్రహ్మచర్యము

*చిట్టితల్లీ మాతాజీ!*

అమ్మాయీ! ఇంతవరకు మనం అష్టాంగయోగంలో ప్రథమాంగమైన యమంలో అహింసా, సత్య, అస్తేయాలనే మూడు అంతర్భాగాలవిషయం చూచాం. ఆమూడు విషయాలు ఒకఎత్తు, యిప్పుడు చర్చించబోయే విషయం బ్రహ్మచర్యం ఒకఎత్తు. దీన్ని సరిగ్గా గుర్తించలేక, యిది ఎక్కువ ప్రధానంకాదని చాలామంది నిర్లక్ష్యంగాఉండి, అనేకవిధాల యెంతకష్టపడినా ఫలితంలేక, ఆధ్యాత్మికమార్గంలో కొంచెమైనా అభివృద్ధిఅనేది లేకుండా ఉంటారు. యథార్థంగా దీన్ని గుర్తించాడుకాబట్టే పుట్టినవాటినుండి, అంటే తల్లిగర్భంలోనుండే 'కామినీ కాంచనం' అంటూ, 'వాటిని దగ్గర చేర్చకండి' అంటూ, ప్రకటనచేస్తూ వచ్చాడు మనరామకృష్ణుడు. ప్రహ్లాదుడికి గర్భంలో నుంచి హరిభక్తిఎలాగో, అభిమన్యుడికి పుట్టకముందునుంచి శస్త్రాస్త్ర ప్రయోగంఎలాగో, మనరామకృష్ణునికి పుట్టటానికి ముందునుండికూడా

బ్రహ్మచర్యంఅలాంటిది. వాళ్ళవాళ్ళ గొప్పదనం ఆయా విషయాల్లో ఏర్ప డితే, మనరామకృష్ణుని గొప్పదనం బ్రహ్మచర్యంమీద నిలబడిఉంది. **వేదాల్లో** బ్రహ్మచర్యాన్నిగురించి అక్కడక్కడా చెప్పినా, దాన్ని బ్రహ్మచర్య ఆశ్రమం లోను, వానప్రస్థ, సన్న్యాసాలలోమాత్రమే విధించాయి. కాని మనశ్రీరామ కృష్ణవేదంలో, యీబ్రహ్మచర్యాన్ని అన్నిఆశ్రమాలలోనికి తెచ్చి, విధిగా ఆశ్ర యించాలన్నాడు. ఇలా, అందరూ బ్రహ్మచర్యంపాటిస్తే చిక్కువస్తుందే అంటారు కొందరు. ఏమిటది? సృష్టి నిలిచిపోతుందే అంటారువాళ్ళు. సృష్టి వీళ్ళమీద ఆధారపడిఉన్నట్లు, సృష్టికర్తలు వీళ్ళే అయినట్లు! పోనీ అలాగే అందామాఅంటే వీళ్ళందరు అలాఉండగలరా? అందుకని, ఆ ఉత్తమాద ర్శాన్ని ముందుపెట్టుకొని అందరూ యత్నిస్తే, కోటికి ఒక్కడుమాత్రమే శ్రీ రామకృష్ణుని ఆదర్శాన్ని పొందుతాడు. అందుచేత వీళ్ళకి ఏ దిగులు అక్క ర్లేదు. అలా ఎలాగైనా ఉండలేరు అని, శాస్త్రాలు ఏమి చెప్పాయిఅంటే, 'నీ గృహస్థాశ్రమంలోకూడా కొంచెం జాగ్రత్తగాఉండు' అన్నాయి. ఇలాగా మంద బుద్ధులకై చెప్పిందేకాని, తీవ్రంగా ఆధ్యాత్మికాభివృద్ధిని కాంక్షించేవారివిషయం కాదు. ఈబ్రహ్మచర్యాన్ని ముఖ్యంగా తలచనివాడినిగూర్చి మన రామ కృష్ణుడు ఏమన్నాడు? చేనుకు నీళ్ళుపెట్టేముందు గట్లు బాగావేయకుండా, ఒకవైపు అసలే గట్టులేకపోయినా చూచుకోక, నీళ్ళుపెట్టే తెలివితక్కువ వాడిమాదిరి అన్నాడు. అలా నీళ్ళుపెట్టితే, ఆచేలో కొంచెమైనా నీళ్ళ నిలు స్తాయా? పంటలు పండుతాయా? అలాగే, మన హృదయంఅనే క్షేత్రానికి, బ్రహ్మచర్యంఅనేది గట్టన్నమాట. ముందు ఆబ్రహ్మచర్యాన్ని పాటించ కుండా, ఎంత జపంచేసినా, తపంచేసినా, త్యాగంచేసినా, ప్రయోజనం ఏమాత్రం లేదు. వ్యర్థం అయిపోవాలిసిందే. నీళ్ళు తూముగుండా ఆ చేలోకి పోతూనేఉంటాయి. కాని నిలిచేబొట్టు ఒక్కటైనా లేదు. అలాగే భజనలేమి, గ్రంథాలేమి, తపస్సులేమి, వేషాలేమి, అన్నీ సక్రమంగానే సాగుతూఉంటాయి. కాని ఆధ్యాత్మికంగా ఒకఅరంగుళమైనా ముందుకుసాగరు యిలాంటివారు. అది అంతముఖ్యం కాబట్టే, ఎలుగెత్తి ప్రబోధించాడు రామకృష్ణుడు.

ఈ బ్రహ్మచర్యపదానికి ముఖ్యంగా మూడర్థాలున్నాయి. వాటిని

కొంచెం తెలుసుకుందాం. వేదంరీతిగా ఆశ్రమాలు నాలుగు ఉన్నాయి. అందులో మొదటిది బ్రహ్మచర్యం. ఇది తర్వాతి ఆశ్రమాలకి పునాది వంటిది. ఆధ్యాత్మికరణరంగంలోకి దూకటానికి యిదేముఖద్వారం అన వచ్చు. పిల్లలకు, ఎనిమిదో సంవత్సరంలో 'ఉపనయనం' చేస్తారు. ఆ ఉప నయనంఅంటే ఏమిటనుకుంటున్నావు? ఒకజందెం మెడలో వేసుకోవటం కాదు. మంత్రాలలోకల్లా ఆదిమంత్రం, మూలమంత్రంఅయిన గాయత్రీ మంత్రాన్ని, ఉపదేశం ఆనాడుపొందటం ఉపనయనంఅంటే. గాయత్రీ మంత్రోపదేశంతో యింతవరకు ముడుచుకొనిఉన్న పైనేత్రంఅంటే జ్ఞాన నేత్రం విప్పారుతుంది. నాటినుండి యితడిని బ్రహ్మచారిఅంటారు. తర్వాత వీడికార్యక్రమం ఏమిటి? అరణ్యాలలో తపస్సు చేసుకుంటూ, శిష్యులకు ఆధ్యాత్మికవిద్యను ఉపదేశిస్తూఉండే గురువులదగ్గరకు వెళ్ళాలి. అక్కడ ఆ గురువులదగ్గర వేదం, తత్సంబంధమైన యితరవిద్యల్ని చదువుకోవాలి. ఈ వేదం త్వరగావస్తుందా? ఈకాలంలోలాగా జీతాలు పుచ్చుకొని చెప్పేవారా ఆనాటిగురువులు? మనకాలం గురువులకు డబ్బుపైకాంక్ష. ఆ గురువులకు విద్యపైకాంక్ష. మనకు వస్తున్నా రాకున్నా, మనగుణాలు ఎలాఉన్నా డబ్బిస్తే చాలు, మనపంతుళ్ళు రోజూ యింటికివచ్చి, మనకాళ్ళదగ్గర కూర్చుని చెప్పేసి పోతూఉంటారు. ఆకాలంవాళ్ళు అలాకాదు. కుర్రాడు తమదగ్గరకు వచ్చింది మొదలుకొని, వాడిని విషమపరీక్ష చేస్తారు. ఎలాగంటావా? వాళ్ళు చేసే పరీక్షలకు కాగితాలు, కలాలు లేవు. ఆ బ్రహ్మచారికి అనేక నియమాలు పెడతారు. ఆనియమాలుఅన్నీ, తర్వాత ఆశ్రమాలలో ఎక్కువగా ఉపయో గించేవిగానే ఉంటాయి. ఆ బ్రహ్మచారికి శ్రద్ధఉందా లేదాఅని, గురువుమీద నమ్మకం ఉందా, లేదాఅని పరీక్ష.

ఈ పరీక్ష విషయంలో, ఒక కథ చెప్పుతాను విను. ఒక గురువుకు, తనశిష్యుడిని పరీక్షచేయాలని బుద్ధి పుట్టింది. ఆకుర్రవాడు తనదగ్గరకు వచ్చినరోజే, తనభార్యకు ఏమిచెప్పాడంటే, శిష్యుడికి చేసేవంటకాలలో ఉప్పులేకుండా ఉండాలిఅన్నాడు. అలాగే చేస్తున్నది గురుపత్ని. అలాగే తింటు న్నాడు గురుపుత్రుడు. అలాగే, సంతోషిస్తూ విద్యను నేర్పుతున్నాడు గురు

దేవుడు. కొంతకాలంఅయింది. శిష్యుడు, కొంతవిద్యలో ప్రవీణు డయ్యాడు. ఒకదినం, తానొక్కడేఉండగా శిష్యుడికి ఒకయోచన తట్టింది. 'ఈగురువుగారింకా నాకేమిచెప్పగలరు? నాకంతా వచ్చేసింది' అని అనుకు న్నాడు. కాని గురువుగారితోచెప్ప సాహసించాడుకాడు. యథాప్రకారం ఆ నాడు అన్నానికి వచ్చాడు. కూర్చున్నాడు. భోజనం ప్రారంభించాడు. మొదటి అనుపాకంలో ఉప్పుతక్కువైంది. 'అమ్మగారూ! దీంట్లో ఉప్పు మరచారు' అన్నాడు. అలాగే అన్నిట్లోలేదన్నాడు. భోజనంఅయింది. శిష్యుడిని గురువు గారు పిల్చారు. 'అబ్బాయీ! ఇక నీకు నాదగ్గర విద్యరాదు. మరొకచోటికి వెళ్ళ'మన్నాడు. శిష్యుడు ఆశ్చర్యపోయాడు ఎలాతెలిసిందాఅని. 'ఇన్నాళ్ళ నుండికూడా నీకుమాత్రం ఉప్పులేనిభోజనం పెట్టుతూఉన్నా, రుచి తెలు సుకోలేని శ్రద్ధ నీకు విద్యమీదవుండేది. ఈనాడు నీకు విద్యమీద శ్రద్ధ తగ్గి పోయింది. ఇక నీకు విద్యరాదు పొమ్మ'న్నాడు గురువు. ఈకథ సారాంశం అర్థంఅయిందా? శ్రద్ధఉన్నప్పుడు యీరుచులు, షోకులు, అనవసర విష యాలు రానేరావు. ఆశ్రద్ధ ఎప్పుడుతగ్గుతుందో యివేకాక యింకా చాలా అప లక్షణాలు వచ్చేస్తాయి. అందుకని, యీబ్రహ్మచర్యాశ్రమంలో శ్రద్ధ చాలా ముఖ్యం. దీన్ని పెంపొందించటానికి యింకా అనేకనియమాలుంటాయి. చలి కాలంఅయినా తెల్లవారకముందే స్నానంచేయాలి. గురుసన్నిధిలో అధ్య యనంచేయాలి. తర్వాత గురువుగారింటి అవసరాలు చూడాలి. గురువుగారి పశువుల్ని కాయాలి. ఇల్లు తుడవాలి. ఒక్కటేంటి? గురువుగార్కి అవసర మైన సర్వవిషయాలలోనూ శ్రమిస్తూనే ఉండాలి. నేలమీదనే పరుండాలి. అంగవస్త్రాన్నిమాత్రం కట్టాలి. మధుకరిఅన్నం భుజించాలి. సుగంధాలమాట పనికిరానేరాదు. అస్ఖలితమైన బ్రహ్మచర్యం ఉండాలి. కల్లోనైనా స్త్రీవాంఛ కలుగరాదన్నమాట. పై విషయాలన్నింటిని నిర్దుష్టంగా పాటించాలంటే ఎంత కష్టమో ఆలోచించు. ఇవన్నీ సక్రమంగా నడుపుకుంటూ ఉంటే, అప్పుడు గురువుగారిఅనుగ్రహం వస్తుంది. ఈ మంచిలక్షణాలన్నీ ఎప్పుడైతే వీడికి సంప్రాప్తిస్తాయో, అప్పుడు ఆ గురువుగారి అనుగ్రహానికి, అంటే ఆధ్యాత్మిక విద్యకు వీడికి అధికారంవస్తుంది. ఈఆధ్యాత్మికవిద్యనే బ్రహ్మవిద్య

అంటారు. అదే వేదంఅన్నమాట. ఈఆశ్రమంలో వాడిబుద్ధి, అహో రాత్రాలు ఆబ్రహ్మారూపమైన ఆధ్యాత్మికవిద్యమీదనే, వేదంమీదనే నిలిచి ఉండి, అందులోనే లయించి, అందులోనే చరిస్తూఉంటంచేత, యీ మొదటిఆశ్రమాన్ని బ్రహ్మచర్యాశ్రమంఅని పెద్దలుఅన్నారు. ఈ ఆశ్రమంలో ఉన్న ఘనత ఏమిటంటే, ఆబ్రహ్మవిద్యను ఆర్జించటానికి అవసరమైన యోగ్యతను సంపాదించటం అనిఅర్థం. దీన్నే సాధనసంపత్తి అనికూడా అన వచ్చు. ముఖ్యంగా శమ, దమ, ఉపరతి, తితిక్ష, శ్రద్ధా, సమాధానాలనే ఆరు లక్షణాలు కలిగిఉంటేగాని ఆగురువులవద్ద విద్యనేర్చుకోటానికి వీలేఉండదు. ఇలాగా, పైలక్షణాలను సంపాదించటానికై అవసరమైన అభ్యాసాలన్నింటిని చేస్తూ, ఆసల్లక్షణాలను ఆర్జించి, సద్గురువులకృపకు పాత్రతపొందుతూ, బ్రహ్మంఅనబడే వేదంలో చరించటంచేత బ్రహ్మచర్యంఅని అంటారు యీ బ్రహ్మచర్యాశ్రమాన్ని అనుసరిస్తూ.

కాని, ప్రపంచంలో సామాన్యంగాఉండే అర్థం బ్రహ్మచర్యానికేమి టంటే స్త్రీ, పురుష సంబంధంలేకుండాఉంటం. ఈయర్థంలోగూడా రెండు అన్వయాలున్నాయి. మొదటిది గృహస్థులకు సంబంధించింది. రెండోది తీవ్రజిజ్ఞాసువులైన సన్న్యాసులకు చెందింది. సన్న్యాసులమాదిరి బ్రహ్మానుభవప్రాప్తికై తీవ్రమైన జిజ్ఞాసలేకుండా, అంటే అట్టియోగ్యతలులేని వారు ఆచరించేవిధానం యీ గృహస్థులది. వీరికి, భార్యాభర్తసంబంధం ఉంటుంది. ఆ భార్యాభర్తలిద్దరు కాలాన్ని అనుసరించి, కొన్నినియమాలకు లోబడి, అన్యోన్యాపేక్షతో తమసంబంధం పెట్టుకుంటూ, ఆ స్త్రీ పరపురు షుడిని కాంక్షించకుండా, ఆభర్త యితరస్త్రీలదిక్కుకేపోకుండా ఉండగలిగి నట్లయితే, వీరు బ్రహ్మచర్యాన్ని అనుసరిస్తూఉన్నట్లే అన్నారు పెద్దలు. కాని పూర్ణంగా బ్రహ్మచర్యంఉండి బ్రహ్మాన్ని సాధించలేనివారికి శాస్త్రం దారి చూపించవద్దా? అందుకనే, యిలా కొంతకాలంఉంటే, తర్వాతచూద్దాం అన్నది శాస్త్రం.

అసలు, యీనాలుగు ఆశ్రమాలధర్మాలు కొంచెం సూక్ష్మంగా చూచా

మంటే, నే చెప్పే పరిణామాన్నే సూచిస్తాయి. మొదట్లో బ్రహ్మవిద్యను చదువుకుంటాడు. దాన్ని అనుభవించటానికి తగుసామర్థ్యాలు అప్పుడే ఉన్నాయనాలంటే, ఆబ్రహ్మచర్య ఆశ్రమంలోనుండే సన్న్యాసం స్వీకరించ మన్నాయిశాస్త్రాలు. అలా చేతకాకపోతే, ఆశక్తిని సంపాదించుకుంటూ, అతి జాగ్రత్తగా, వాటికి తగునియమాలు పెట్టుకుని గృహస్థుగా ఉండమన్నాయి. అంటే యీగృహస్థాశ్రమం, ఆధ్యాత్మికవ్యాయామశాల అనిఅంటే బాగుం టుంది. ఆతర్వాత తీవ్రంగానే బ్రహ్మచర్యంవుంటూ, యితరసపర్యలకు మాత్రం భార్యను చెంతఉంచుకోమన్నాయి యీ శాస్త్రాలు. ఆ పిమ్మట 'ఆ భార్యకూడా వద్దు. అస్ఖలితబ్రహ్మచర్యం వుండు. దానివల్ల బ్రహ్మం నీకు లభిస్తుం'దన్నాయిశాస్త్రాలు. అందుచేత యీగృహస్థాశ్రమంలో బ్రహ్మచర్యం అంటే, సన్న్యాసాశ్రమంలోవుండే బ్రహ్మచర్యానికి దారిచూపే బ్రహ్మచర్యం అని అర్థంచేసుకోవాలి. అంటే, అస్ఖలితబ్రహ్మచర్యమే గృహస్థుయొక్క దృష్టిలోవుండాలిగాని, సంకుచితబ్రహ్మచర్యం అనేభావం ఉండరాదు. శాస్త్ర ప్రకారం అలాఅనటానికి వీలేలేదు. శాస్త్రమేకాదు, అనుభవమైనా పైభావాన్నే ఉపదేశిస్తుంది. దాన్ని సాధకులు అనుసరించాలి.

ఈ బ్రహ్మచర్యానికి మరొకవిధంగా అన్వయం చెప్తుతారు కొందరు. వాళ్ళకు, యిప్పుడు మనం చెప్పుకున్నఅర్థం తలనొప్పి కలుగజేస్తుంది. అలాంటి బ్రహ్మచర్యం చాలదోషభూయిష్ఠమని వీళ్ళతలంపు. వీరంటారు గదా 'మానవులకు సహజంగావుండే లక్షణాల్ని నిరోధించరా' దని. ఈ విష యాల్ని చర్చించాలంటే, చాల విపరీతంగాను నీచంగాను వుంటుంది. వీరు చాలకాలంనుండి అనుభవిస్తున్న, సంకుచితమైన యీకామాన్ని నిరోధించలేని అసమర్థతచేత చెప్పేమాటలేకాని యివి శాస్త్రబద్ధంకావు. అనుభవాన్ని అనుసరించికూడా లేవు. వీళ్ళకుతోడుగా కొందరు పాశ్చాత్యులుకూడా బయలుదేరారు. 'అస్ఖలితబ్రహ్మచర్యం దేహారోగ్యానికినష్టం' అంటారువీరు. ఇవన్నీ వట్టికబుర్లు. అసలు బ్రహ్మచర్యం అనుసరించేవారికుండే కాయిక, మానసిక, ఆధ్యాత్మికబలాన్ని కొంచెమైనా వీరు తెలుసుకునిఉంటే, యీ విధంగా అననేఅనరు. ఈబ్రహ్మచర్యం సక్రమంగా మనోవాక్కాయకర్మేణ

అనుసరించేవాడికేయే అవయవాలు ఎలా మారుతవో, ఆలోచించామంటే దిగ్భ్రమచెందిపోతాం. చూడు, బ్రహ్మతేజస్సంటాం. అది ఎలావస్తుంది? తపస్సువల్లకాదు, యీబ్రహ్మచర్యంవల్లనే. ఈబ్రహ్మచర్యం పన్నెండేండ్లు పాటిస్తే, వాడికి త్రిలోకరాజ్యాధిపత్యంకూడా వస్తుందంటే ఆశ్చర్యంలేదు. అంతేకాదు, ఆధ్యాత్మికగురుపీఠాన్నలంకరించి, యితర్లకుపదేశం చెయ్యాలంటే, అట్టివాడికే అధికారంఅని గట్టిగావ్రాశాడు వ్యాసభగవానుడు యోగ భాష్యంలో. బ్రహ్మచర్యంలోవుండే మొదటిలాభం స్థూలంగా కనిపించేది ఏమిటంటే, మనంతినే ఆహారంవల్లవచ్చే శక్తినంతా మనలోనేఉంచి, మన నరాలకు ఉపయోగించేటట్లు చేయుటం. ప్రపంచంలోవున్న అన్నిఆకర్షణల కంటే ప్రథమమైన, అతికష్టమైన, యీకామాన్ని నిరోధించటంచేత, బుద్ధికి గొప్పశక్తికూడా కలుగుతుంది. ఈశక్తివల్లనే మేధాశక్తి అభివృద్ధియై, మనబుద్ధి చాలగొప్పగా వికసిస్తుంది. అతిసూక్ష్మమైన తత్త్వవిషయాల్ని గ్రహించేశక్తి లభిస్తుంది. స్ఫుటమై కంఠస్వరం వస్తుంది. మనోవాక్కాయాలకుపయోగించే యీకామనిరోధంఅనే బ్రహ్మచర్యాన్ని, తులస్కారంగాచూచేవీళ్ళను ఏమనాలో ఆలోచించుకో! పాపం, అనిఊరుకుందాం. ఈమహత్తరమైన, సర్వాభివృద్ధికరమైనశక్తిని కొంతకాలానికైనా వీళ్ళు తెలుసుకుందురుగాకఅని మనం భగవంతుని ప్రార్థిద్దాం. ఇలాగ విపరీత వ్యాఖ్యానాలుచేస్తూ వీళ్ళేమంటారంటే 'బ్రహ్మచర్యం అంటే బ్రహ్మంలోచరించటం. అందుచేత యీ మీరు చేప్పే కామనిరోధమైన బ్రహ్మచర్యంకాదు. ఎందుకు అలా మనసహజమైన కామ ప్రవృత్తిని నిరోధంచేయుటం? అవసరంలేదు. దేహధర్మం అదిచేసుకుంటుంది. మేముమాత్రం ఎప్పుడూ ఆబ్రహ్మంలోనే చరిస్తూఉంటాం. ఇదీ బ్రహ్మచర్యంఅంటే సరియైన అర్థం' అని. ఆహా! ఎంతసుందరంగాఉంది యీనిర్వచనం! ఈ విపరీతసిద్ధాంతాన్ని నేనింక చర్చించను. ఎందుచేతనంటే వీరిమాటలకు, చేతలకు, సంబంధం ఉండకపోవటంచేత అసలు మన ఆర్య ధర్మానికే కళంకంఅంటాను. ఎప్పుడో మొదటినుంచీ నేను చెప్తుతూ వున్నట్లు, త్రికరణములుఏకమై ఏకర్మలోఉంటవో అదిసార్థకం. ఆధ్యాత్మికాభివృద్ధికి అదికారణంకాని, యిలాంటి అసంబద్ధములు కాదు. ఆ కారణంచేత

అసలు ఆచరణకే, సిద్ధాంతంలోనే వికటంగాపోయే యీ మూఢవలర్థం మనకువద్దు. బ్రహ్మంలో చరింపగలిగితే మంచిదేకాని, ఆచరించటం మనో వాక్కాయకర్మేణ త్రికరణశుద్ధిగా ఉండాలి. అప్పుడే అది సమగ్రమైన, అంటే పూర్ణమైన బ్రహ్మానుభూతి అవుతుంది. కాని దేహం ఒకమార్గంలోను, బుద్ధి మరొకదారిలోనూఉంటే, అది అనుభవమే కాదంటాను.

కాబట్టి, పూర్వకాలంలోఏమి, ఆధునికంలోఏమి, పెద్దలు యీ బ్రహ్మచర్యాన్ని సాధ్యంజేసుకొని బ్రహ్మాన్ని సాధించుకున్నారు. అసలు అనుభవప్రకారం చూస్తే, మన ఉద్రేకాల్లో యీకామోద్రేకం చెదపురుగులాంటిది. దీనివల్ల కాయికంగా, మానసికంగా, ఆధ్యాత్మికంగా మనం నశించిపోతాం. అందుచేత, దీన్నిదగ్గరకు చేరనియ్యనివాడుధన్యుడు. ముమ్మాటికి ధన్యుడు. ఈ విషయం కల్లోనైనా రాగూడదని పెద్దలు చెప్పేది.

ఒకసారి చాలా పేరుప్రఖ్యాతులుపొంది, గొప్ప గురువనిపించుకొన్న విజయకృష్ణగోస్వామి, పంజాబులో ఉపన్యసిస్తూ ఉన్నాడు. ఉపన్యాసం అయిన తర్వాత ఒకరాత్రి యీతనికి, తన అస్ఖలితబ్రహ్మచర్యానికి లోపంఅన్న దుస్స్వప్నం వచ్చింది. వెంటనే ఉలిక్కిపడి లేచాడు. 'ఛీ! యీ కపటజీవితం యికనాకు కూడ' దన్నాడు. 'నేను పైకి పలికేరీతిగా నా బుద్ధిలేదే!' అని ఏడిచాడు. 'దీనికి ప్రాయశ్చిత్తం చేసుకోవాలి' అని తీర్మానించాడు. 'ఆత్మహత్యయే దీనికి మందు' అని, నదీ ప్రవాహంలో దూకటానికి వెళ్ళాడు. చూచావా! అంతనిర్మలత్వం యీబ్రహ్మచర్యంలో ఉంటేనే ఆధ్యాత్మికంగా అభివృద్ధి. ఆపశ్చాత్తాపంతో మరల అట్టి ఘట్టాలు అతని జీవితంలోనేలేవు. ఆ కారణంచేత అతడు తర్వాత మహాత్ముడని, అవతారమని అనిపించుకున్నాడు. అదీ సూత్రం. దీన్ని గ్రహించి ఆచరించేవాడు ధన్యుడు.

ఇక, మన శారదారామకృష్ణులవిషయం చెప్పనక్కరలేదు. వీరిద్దరూ ఏకాంతంలో అర్ధరాత్రిపూటఉన్నా, ఒకరికొకరు తల్లులేగాని ఎట్టి మనోవికారం కలిగేదికాదు. 'ఈబ్రహ్మచర్యం ఎవరికైనాఅవసరమే. భార్యాభర్తలుగా

వున్నప్పటికి యిదిసాధ్యమే' అను నూతనసిద్ధాంతాన్ని, కొత్త అను భవాన్ని ప్రపంచానికి బోధించటానికే వీరిద్దరు యీ ప్రపంచంలో పుట్టారన్నమాట.

పై విషయాన్నంతా సూక్ష్మంగా విచారిస్తే, బ్రహ్మచర్యవ్రతంలేకుండా, ఆధ్యాత్మికగమ్యస్థానంఅయిన బ్రహ్మాన్ని పొందాలంటే దుర్లభంఅని తెలు తుంది. పూర్వంగాని, యిప్పుడుగాని, ఆబ్రహ్మానుభూతిని ఎవరైనా పొందా రంటే, యీబ్రహ్మచర్యం అవసరంలేకుండా అనుభవానందాన్ని పొందినామని ఎవరైనాఅంటే, అదివట్టిబూటకమన్నమాట. శ్రీవివేకానందస్వామివిషయం నీకు తెలిసిందేగా! ఆయన అట్టి బ్రహ్మచర్యనిష్ఠాగరిష్ఠుడు కాబట్టే ప్రపంచాన్ని జయించాడు తన ధీశక్తిచేత. 'ఒకవేళ భగవంతుడే నావద్దకు వచ్చి, నాకు భార్య ఉన్నదిఅంటే ఎగిరి ముఖానతంతాను' అన్న ధైర్యశాలి శ్రీ వివేకానందస్వామి. ఆ ధైర్యం ఎలా వచ్చిందంటావు? బ్రహ్మచర్యంవల్లనేఅని వేరేచెప్పాలా?

అన్నివిధాలా యీబ్రహ్మచర్యం ఆధ్యాత్మికాభివృద్ధికి మూలాధారం కావటంచేత, యింతగా చెప్పవలసివచ్చింది. దీన్ని నీవు మరలమరల చదివి, బాగా గ్రహించి, కుశాగ్రబుద్ధితో ఆచరించి, నాకత్యంత ప్రాణప్రదమైన అను భవానందాన్ని అనుభవిస్తావుగాక! ఆశారదారామకృష్ణులు నీపై వారి కృపారస మును ప్రవహింపజేసి, నిన్ను అట్టిఆదర్శాన్ని పొందేలాగ చేస్తారుగాక!

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం.

(signature)
16-1-46

# 9
# యమము - అపరిగ్రహము

చిరంజీవి మాతాజీ!

'అపరిగ్రహం' యమంలో అయిదోభాగంగా ఉంది. ఈఅపరిగ్రహం, అతిసూక్ష్మంగా సాధకుని మనస్సుమీద పనిచేస్తుంది. అతనికి అత్యవసరమైన స్వతంత్రజీవితాన్ని ప్రసాదింపచేస్తుంది. అపరిగ్రహంఅంటే 'దానానికి చేయి చాచకుండటం' అనిఅనాలి. ఇంక, కొంచెం సూక్ష్మంగాచూస్తే, అపరిగ్రహం అంటే 'ఎవరు ఏదృష్టిలో ఏదిచ్చినా స్వీకరించకుండటం' అని చెప్పవచ్చు. అలా, యీనియమాన్ని అనుసరించకుండాఉంటే దోషాలు అనేకంగా వస్తాయి. వాటిని కొన్నింటిని చెప్తుతాను.

అసలు 'స్వతంత్రత అంటే ఏమిటి? దాన్ని ఎప్పుడు మనం కోల్పోతాం?' అనేదేప్రశ్న. స్వతంత్రతఅంటే పరాపేక్షలేని జీవితం. ఎవరిమీద గాని, దేనికొరకుగాని ఆధారపడకుండాఉంటం స్వతంత్రతఅంటే అర్థం. చూడు, మన అన్నవస్త్రాలకు మనం ఎవరిమీద ఆధారపడమో, వాళ్ళు మనల్ని

ఏదైనాఅంటే మనం వెంటనేఏమంటాం? 'నీమోచేతిక్రింద నీళ్ళు త్రాగుతున్నామా? మమ్మల్ని పెట్టి పోషిస్తున్నావా?' అని అంటూఉంటాం. దీనిలో భావం చూచావా? ఎప్పుడైతే, మనం పైనచెప్పినట్లు ఒకరి మోచేతిక్రిందనీళ్లు త్రాగుతుంటామో, కాకఒకరు మనల్నిపెట్టిపోషిస్తున్నారో, వారికి మన స్వాతంత్ర్యాన్ని అమ్మేసుకున్నట్లే. అన్నివిషయాల్లో వాళ్ళని అనుసరించిపోవాల్సిందే. ఏవిషయంలోగాని, చివరికి, మన సొంతవిషయాల్లోకూడా, మన అభివృద్ధి కారకమైన విషయాల్లోకూడా వాళ్ళకి దాసులమై, మనవ్యక్తిత్వాన్ని చంపేసుకుని, వారిఅడుగులకు మడుగులొత్తుతూ, వారిచేతుల్లో కీలుబొమ్మల్లాగ ప్రవర్తించవలసిందే! అట్టిది చాలదుర్భరమైనజీవితం అనాలి. అట్టి బానిసత్వం కంటే మరణమే మేలనాలి. అందులో, ప్రపంచంఅంటే మనదగ్గర బంధువుల్లోకూడా, చివరకు భార్యకు భర్త, భర్తకు భార్య, తల్లి బిడ్డ, బిడ్డ తల్లి, తండ్రి సుతుడు, సుతుడు తండ్రి, ఒక సంబంధమేమిటి? అన్నిరకాల సంబంధాల్లో యీబానిసత్వం ఉండనేఉంది. కొంచెం కండబలంఉంటే అంతకంటే తక్కువబలంగలవాళ్ళను లొంగదీసుకుంటాడు. అంతేకాదు, బలహీనులు వాడిని ఆశ్రయిస్తారు. అంతటితో వారినాశనం ప్రారంభంఅన్నమాటే. అలాగే, ధనండున్నవాడిని పేదవాళ్లు ఆశ్రయించి, తమ స్వతంత్రతను పోగొట్టుకుంటారు. అలాగే, బుద్ధిబలం ఉన్నవాళ్ళను లేనివాళ్లుచేరి, తమ బుద్ధిని నశింపచేసుకుంటారు. దీనికంతా అర్థంఏమిటంటే, ఎప్పుడైతే యితరులను ఎంత చిన్నదానికైనాసరే ఆశ్రయిస్తామో, నాటినుండి మనగుంట మనం త్రవ్వుకున్నట్లే. 'అది పనికిరాదోయిసాధకా' అంటుంది యీఅపరిగ్రహం. 'స్వతంత్రతలేనిజీవితం నిర్జీవం' అంటుంది యీఅపరిగ్రహం. 'నీవు ఎప్పటికైనా, ఏ ఘనకార్యాన్నైనా చేయాలంటే, ఏగొప్ప విషయాన్నైనా సాధించాలంటే, నీ శక్తిమీద నీవు ఆధారపడవోయి' అంటుంది యీఅపరిగ్రహం. నీ విచక్షణా శక్తిమీద నీవు ఆధారపడితే, నీవు త్వరగా సాధించగలవు అనేది యీఅపరిగ్రహ సూత్రరహస్యం.

అయితే, ఎవరిసహాయంలేకుండా, ఒక్కడే ఏపనినైనా చేయగలడయ్యా, అనేసందేహం కలుగుతుంది. వీడిని, యితరులు ఆశ్రయించాలి

గాని, యితడుమాత్రం యితర్లను ఆశ్రయించటంలేదు. ఇతనికి, అంటే స్వతంత్రశక్తిగలవానికి ఒకఅమానుషశక్తికలిగి, సంకల్పమాత్రంచేతనే అనేకులు యితన్ని ఆశ్రయిస్తారు ఆపనిని పూర్తి చేయుటానికి. ఆ శక్తి లేకుంటే, యితడే యితర్లను ఆశ్రయిస్తాడు. వీడిదొకదారి, వీడికి సహాయంచేసేవాళ్ళదొక దారిగా, అసలుకే మోసం వస్తుంది.

అసలు, సహాయం ఎవరుకోరుతారు? శక్తిలేనివాడేగా! ఎవరి సహాయం కోర్తాడు? తనకంటే ఆవిషయంలో శక్తివంతుడిసహాయం కోర్తాడు. తన కంటే శక్తివంతుడిని ఎప్పుడైతే ఆశ్రయించాడో, అతనికి యితడు లొంగినట్లే. అందుకని, యికతనకంటే శక్తివంతునికిలొంగి, తాను పనిచేయాల్సివస్తుంది. అందుచేత 'దేనికిగాని యితర్లను ఆశ్రయించవద్దు' అంటుంది యీ అపరి గ్రహం. అయితే మరొక సందేహంవస్తుంది. 'డబ్బు ఆధ్యాత్మికచింతన లేనివాళ్ళను ఆశ్రయించివుంటున్నది. ఆధ్యాత్మికచింతఅనేది, మహత్కార్యాల చింతఅనేది పేదలను ఆశ్రయించి ఉంటున్నది. వీరిద్దరికి చాలా దూర మాయెనే! ఇక కార్యాలు జరిగేదెలాగ?' అనేదే ప్రశ్న. దీనికి యిందాక ఒక సమాధానం చెప్పాను. బలంఅనేది అనేకరకాలు. అది స్థూలంనుండి సూక్ష్మం లోకి, అక్కడనుండి అతిసూక్ష్మంలోకి పోతుంది. కండబలండుంది. అది ధన బలానికి లొంగుతుంది. ఆధనబలం బుద్ధిబలానికి లొంగితీరాలి. మరల ఆ బుద్ధిబలం ఆత్మబలానికి దాసోహం అంటుంది. అందుచేతనే ప్రజల్లోని కండబలాన్ని పెద్దజీతాలద్వారాకొనేసి యుద్ధాలు సాగిస్తున్నారు సామ్రాజ్యాలు కావాలనే చక్రవర్తులు, మరి యితరధనాఢ్యులు. అలాగే బుద్ధిబలాన్ని ఉపయో గించే మంత్రికిగాని, గొప్పకవికిగాని, గొప్పపండితునికిగాని లొంగిపోతారు యీ రాజాధిరాజులు. మరల యీపండితులు మొదలైన బుద్ధిమంతులంతా ఆత్మబలంగలవారికి పాదాక్రాంతమే! ఈవిషయం వేరుగా చెప్పాలీ! మన రామ కృష్ణుడే తార్కాణం. వివేకానికిఅధినాథుడైన వివేకానందుడేమి, పండితాగ్రేసరు లేమి, వీరేమిటి, వారేమిటి, అందరు వారిపాదాలదగ్గర పడిఉండేవాళ్ళంటే ఆశ్చర్యం ఏముంది? అందుకని యీఆత్మబలంగలవాళ్ళకు యీక్రింది బలాలవాళ్ళంతా, బుద్ధిబలంగలవాళ్లు, ధనబలంగలవాళ్లు, దేహబలంగలవాళ్లు

యింకా ప్రపంచంలో ఏవిధమైన బలండున్నా వీళ్ళకులొంగి ఆశ్రయిస్తారు. ఇక ఆఆధ్యాత్మికబలవంతుల సంకల్పంచాలు ప్రపంచాల్ని తలక్రిందులు చేస్తుంది. ఆకారణాన ఏదైనా సాధించాలంటే, ఆకార్యానికి సంబంధించిన బలానికి మించిన, పైతరగతిలోని బలాన్నిసాధించి సంపాదించితే, ఆ కార్యం యితరుల సహాయాన్ని కోరకుండానే వాళ్ళసేవవల్ల పూర్తిఅవుతుంది. సహాయానికి, సేవకు భేదం చాలాఉంది. సహాయం చేసేవాడిచెయ్యి పైనఉంటుంది. వాడు సహాయం పొందేవాడికంటే గొప్పవాడనేభావంతో పనిచేస్తాడు. అలాకాకుండా సేవచేసేవాడు సహాయం చేసేవాడికంటే ఎక్కువ పనిచేస్తున్నా, వీడు ఎవరికి సేవచేస్తున్నాడో, వాళ్ళకంటే తక్కువ అనేభావంతో చేస్తాడు. అందుచేత పని జరుగుతూనూ ఉంటుంది, పని సంకల్పంచేసినవాడి స్వాతంత్ర్యంకూడా నిల బడుతుంది. అదే పరాపేక్షారహితమైనకర్మ అనిఅర్థం. అదే స్వతంత్రకర్మ అంటాం. ఇలా చేసేవాడు ఎప్పుడూకూడా యీ అపరిగ్రహమహాసూత్రాన్ని అనుసరిస్తున్నట్లే.

ఇదంతా, ఘనకార్యాలు చేయాలని సంకల్పించేవాళ్ళ భోగట్టా అన్న మాట. ఈసంకల్పములేకుండా, తమసొంతవిధంగా ఆధ్యాత్మికాభివృద్ధిచెందే వాళ్ళవిషయం ఎలాగంటావు. ఈవిషయాన్ని శ్రీవివేకానందుడు తన రాజ యోగంలో బాగాచెప్పాడు. ముముక్షువు అనబడేవాడు యితర్లదగ్గరనుంచి ఏదీకోరకూడదని అంటమేకాకుండా, వాళ్ళు యిచ్చినా పుచ్చుకోరాదన్నాడు. ఈవిషయం చాలకష్టమే! దేహాన్ని పోషించుకోటానికి కాకపోయినా, రక్షించు కోటానికైనా యితర్లను ఆశ్రయించనక్కరలేదా? అంటాం. నిజమేకానీ, దీనికి పైనచెప్పినదే సమాధానం. ఆత్మబలంగనకఉంటే ప్రపంచం **మనపాదాలదగ్గ** రుంటుంది. దీన్నిగూర్చి శాస్త్రాల్లోఏమిటి, మన పెద్దవాళ్ళేమిటి కొన్ని విష యాలు చెప్పారు. అవి చెప్పుతాను విను.

ఆ ఆత్మబలం ఉంటేసరి, అంతా తాను కోరకపోయినా వచ్చిపడుతూ ఉంటుంది. ఒకసారి వివేకానందుడు దేశాలు తిరుగుతూ పరివ్రాజకుడుగా ఉండేటప్పుడు, గోవర్ధనగిరి ప్రాంతాల్లో, యీఅపరిగ్రహదీక్షను పూర్తిగా

పాటించాలని అనుకున్నాడు. అన్నవస్త్రాలకు ఎవరినీ అడగనన్నాడు. భీష్మించు కున్నాడు. గిరిప్రదక్షణానికి బయలుదేరాడు. రెండుదినాలైంది. ఆహారం లేదు. ఎవ్వరూ యివ్వనూలేదు, యీాయన ఎవర్నీఅడగనూలేదు. మూడో రోజు యీాయన పోతూఉంటే, వెనకాలనుండి ఎవరో పరుగెత్తుకుంటూ వచ్చి, బ్రతిమలాడి, యీాయన ఎంత తప్పించుకోవాలన్నా సమ్మతించక, వివేకానందునికి భిక్షవేయుటమేకాకుండా, వస్త్రాలుకూడాయిచ్చి సేవచేసు కున్నాడు. ఇలాంటివి ఆయనజీవితంలో ఎన్నోఘట్టాలు! వారం, పదిరోజులు కూడా తిండితిప్పలులేకుండా ఉండేవాడుఆయన. చివరకు భక్తులు వారం తటవారే వచ్చి, ఆయునకు సేవచేసేవాళ్ళు. అలా, యిలాంటి గొప్పవాళ్ళందరి జీవితాల్లోఉన్న రహస్యమే యిది. వారు ఆశ్రయించరు, కోరరు. కాని వాళ్ల దగ్గరకు అన్నీ వస్తూవుంటాయి.

రెండోరకానికి అంటే, అంతఆత్మబలం లేనివాళ్లవిషయుం ఏమన్నా రంటే, 'ఒరే! నీవు భీష్మించుకొని కూర్చుండవద్దు. ఎవరేది యిస్తే దాంతో తృప్తిపడు' అన్నారు. 'యదృచ్ఛాలాభసంతుష్టః' అని దీన్నేఅన్నారు. 'చిక్కినదె తిండి మంచిదేన్నెడ్డదేని మంచిచెడ్డల మదిలోన నెంచబోకు' అని వివేకానందు డన్నట్లు అన్నమాట. చాలావరకు మొదటిరకం, యీారెండోరకంఒకటే. కాని కొంచెం భేదంఉంది. మొదటివాళ్ళకు ప్రపంచమే అవసరంలేదు. కాని యిత రుల తృప్తికొరకు ఏదితటస్థపడినా దానితో తృప్తిపొందివుంటారు. అయితే దీంట్లో కొన్ని నియమాలుంటాయి. ఎవరేదియిచ్చినా దాన్నంతా పుచ్చు కుంటూఉంటే అది విపరీతంగా పోతుంది. తన ఆధ్యాత్మికజీవితానికి భంగం కలుగవచ్చు. అందుచేత 'అత్యంతావసరప్రవృత్తి' అన్నాం. తన ఆధ్యాత్మికాభి వృద్ధికి అది ఎంతవరకు అవసరమో, తీవ్రంగా యోచించి ఆపై స్వీకరించాలి. Is this essential for my spiritual growth? ఇది నా ఆధ్యాత్మికాభి వృద్ధికవసరమాఅని ఆలోచించాలి. లేకుంటే ఆధ్యాత్మికంగా దిగనాసిల్లిపో తాడు. ఇతరుల సంతోషానికని, తనతృప్తికని దేన్నిపడితే దాన్నిఒప్పుకొని, ఎందరు సన్న్యాసులు భ్రష్టులైనారనుకున్నావు! మొదట, మనకేమీ ఫరవాలేదులే

అనిపిస్తుంది. కాని, తర్వాత అవతలవారిబుద్ధి వీళ్ళమీద తీవ్రంగా పనిచేసి, లొంగదీస్తుంది. అందుకనే చాలజాగ్రత్తగా ఉండాలి యీవిషయంలో.

ఇది ఎలా పనిచేస్తుందో విను. ప్రపంచంలో ఎక్కడనైనా ఒక్కరు, మరొక్కరిని ఆశ్రయించారంటే స్వార్థంతోనేఅనుకో. అంటే తనకొరకే అన్నమాట. ఉదాహరణకు చూచుకో. నేను యిన్నిదేశాలు తిరుగుతున్నానుగదా! ఒక్కొక్కచోట ఎన్నెన్ని తమాషాలు జరుగుతుంటాయి అనుకుంటున్నావు! ఒకచోట, ఒకాయన, వరుసగా నాలుగురోజులు నమస్కారాలు చేశాడు. తర్వాత పండుతెచ్చాడు. అంతట భిక్షకుకూడాపిలిచాడు. ఇలా వారంఅయిన తర్వాత, తనకు నావల్ల కావలసినపనిని చేతులు నలుపుకుంటూ బయట పెట్టాడు. ఏమిటది? నాదగ్గరకు వస్తూవుండే మరొకరివల్ల, తనకు ఒక సాయం కావాలి. అలాంటివాటిల్లో నేను జోక్యం కలుగజేసుకోరాదన్నాను. అందుపై అతనికి కోపంవచ్చింది. తనయింట్లో భోజనంచేసికూడా యీ మాత్రం సాయంచేశానుకానని, యిక దుష్ప్రచారం సాగించాడు. ఇలాంటి రకాలు ఎందరుంటారనుకున్నావు? నాబుద్ధికి, సన్న్యాసులదగ్గరకు చేరేవాళ్ళందరూ యింతేనేమో అనిపిస్తుంది. అంటే, అంతా అలాకాదులే. నాలుగు దినాలు భిక్షయిచ్చి, స్వాములవారు తనచెప్పుచేతల్లో ఉండాలంటాడు ఒకాయన. తన శివాలయానికి సహాయం చేయరాదా అంటాడు మరొకడు. అందుచేతనే, నాదగ్గరకు చేరేవాళ్ళను, ఒకకంట కనిపెట్టేఉంటాను నేను. ఇలాగా యీస్వార్థలోకంఉందే, తమస్వార్థం చంపుకుని, దేవుడు దైవం అనుకునే సన్న్యాసులనుకూడా స్వాధీనంచేసుకుని, తమకొరకై ఉపయోగించుకోవాలని అంటుంది. కొంచెం జాగ్రత్త తప్పితే, యీముఖమాటాలలో మునిగిపోయి, బందిఖానాలోఉన్న వీరుడులాగా, బోనులోఉన్న సింహంలాగా ఉంటాడు మొదట్లో యీఅమాయకుడు. కాని రానురాను అదే, అంటే అస్వాతంత్ర్యమైనజీవితమే అలవాటుఅయిపోయి. బోనులోనుండి బయటికి విడిచిన గ్రామసింహంలాగాఅంటే కుక్కలాగ వాళ్ళను ఆశ్రయించుకొని ఉంటాడు. ఇట్టి పరిస్థితులు ఎప్పుడు కలుగుతాయి? ఎవరిదగ్గర ఒక చిల్లి

గవ్వైనా, పూచికపుల్లైనా స్వీకరిస్తామో, అప్పుడు యీ ముఖమాటాలు పెరుగుతాయి. ఆమొగమాటాలవల్ల అన్నివిధాలా దాస్యం కలుగుతుంది. ఆ దాస్యంవల్ల ఆధ్యాత్మికంగా నాశనం కలుగుతుంది. ఆకారణాన 'తస్మాత్ జాగ్రత! జాగ్రత!' అన్నారు పెద్దలు.

మరి, దారెట్లాలంటావేమో? ఎప్పుడు ప్రతివిషయంలోను యితరకంటే నీ ఆధిక్యతను గ్రహించి, నీకంటే తక్కువవారుగానున్న వారిదగ్గర, నీకు ఆధ్యాత్మికంగా ఆటంకంకాక, అత్యవసరమైనవాటిని మాత్రమే స్వీకరిస్తూ ఉంటావో, అప్పుడు యీదోషాలు నిన్ను ఏమీచేయలేవు. ఆధిక్యతలంటే ఏమిటోతెలుసునా? 'కౌపీనవంతః ఖలు భాగ్యవంతః' అన్నారుగదా జ్ఞానులు! ప్రాపంచికసుఖాలలో మునిగితేలుతూఉండే సామ్రాట్టుకంటే ఆ సుఖాలే అవసరంలేని సన్న్యాసిఅధికుడు. అంటే అవసరంలేనివాడు, అవసరాలున్నవాడికంటే గొప్పవాడని సూత్రం. అలాగ అన్నివిషయాల్లో అవసరాలులేనివాడు ధన్యుడు. బ్రహ్మాదిదేవతలకంటే అధికుడు. అలాంటివాళ్ళను చాలామందిని చూడగల్గే భాగ్యం నాకు కల్గింది. వాళ్ళవిషయం ప్రస్తుతం వద్దు. ధనరాసులు క్రుమ్మరించినా కాలదన్నేశాడు త్రిలింగస్వామి! పట్టుశాల్వలు అర్పణచేస్తే, గంగలోత్రొక్కి చించేశాడు రామకృష్ణుడు! రాజాధిరాజులే పాదాలదగ్గరున్నా వెర్రిగోపాలుడే శ్రీకృష్ణుడు! అలాంటివారి ఆధిక్యతను ఏకాలతచేతను కొలవలేము. అట్టి పరిపూర్ణమైన అపరిగ్రహం వస్తేనేగాని, యీఆధిక్యత సిద్ధించదు. అలాంటప్పుడు, యీప్రపంచం ఎక్కడుంటుందనుకున్నావు? అథోలోకంలో ఉండిపోవాలి యీలోకం లోకంలోనివాళ్ళంతాకూడా. అప్పటికైనా తన ఆధ్యాత్మికస్థానానికిగాని, ఆ యిచ్చేవారి ఆధ్యాత్మికశ్రేయస్సుకుగాని, మరి యితరుల ఆధ్యాత్మికశ్రేయస్సుకుగాని యేలోపం రాకుండాఉండేవాటినే సమ్మతిస్తూ, స్వీకరిస్తూఉండటం అతని ధర్మంఅన్నమాట.

అపరిగ్రహంలో, యింత నిగూఢత్వం యిమిడిఉన్నట్లు సాధారణంగా బయటికి తెలియదు. అతిసూక్ష్మంగా చూస్తేనేగాని దీనిబండారం బయటపడదు. ఇన్నిరకాల తీవ్రంగా ఆలోచిస్తూ, అతి జాగ్రత్తగా ఉండాలిసుమా!

ఈరహస్యాన్ని నీవు ఎలా ఆచరించుకుంటావో! ఇది సామాన్యంకాదు. ఒక్కసారిగా వచ్చేదికాదు. పూర్వం చెప్పినట్లు, ఒక్కొక్కదానిలో మనం బలాన్ని సాధ్యం చేసుకుంటేనేగాని యిదిసాధ్యంకాదు. అవసరమైన బుద్ధిబలం, దానికంటేమించిన ఆత్మబలాన్ని సంపాదించకుండా వెంటనే అపరిగ్రహంఅన్నామా అంటే, ఏమీ ప్రయోజనంలేదు. దీన్నిగ్రహించి, తెలివితేటలు ఉపయోగించి, దీన్ని సాధ్యం చేసుకుంటావని నమ్ముతున్నాను. అట్టిది నీకుసాధ్యం చేయుటానికి, మన అధిదేవతలు శ్రీరామకృష్ణశారదలు, నీకు సహాయం చేస్తారని కూడా గట్టిగా నమ్ముతున్నాను.

'అయితే, దేన్నికూడా ఎవరిదగ్గరనుండి అపేక్షించరాదన్నారు. ఇక మంచి, చెడును, యీతత్త్వవిషయాలనుకూడ ఎవరివద్దనైనా తెలుసుకోకపోతే ఎలా'గంటావు. అవును, యిదీ గట్టిప్రశ్నే. దానికి కొన్ని సూత్రాలున్నాయి. ఎవరిదగ్గరైతే ఆధ్యాత్మికవిషయాలు మనం తెలుసుకోవాలనుకుంటామో, వారుతప్పకుండా మనకంటే అధికులుగా ఉండాలన్నమాట నిజమే. కాని సద్గురువుగా ఉండాలి. అంటే, యింతవరకు చెప్పినట్లు సంపూర్ణంగా ఆత్మబలాన్ని సంపాదించి, మన ఆధ్యాత్మికఅభివృద్ధికోసంమాత్రమే, తన స్వార్థం యిసుమంతైనాలేకుండా ఉండేవాడుగాఉంటే అప్పుడు అది దోషం కాదు. అట్టివాడు దొరుకుతాడా? యీకాలంలో మరిన్నీ. అయినా వెతకాలి. కొన్నాళ్ళు పరీక్ష చేయాలి. సంపూర్ణంగా వుండవలసిన యోగ్యతలన్నీ వున్నాయాఅంటే, అతడిని ఆశ్రయించాలి. అతడు సంపూర్ణంగా బ్రహ్మవిదుడుగా వుండిఅన్నావుండాలి. అలా బ్రహ్మంలో మునిగిఉండి, మనందరికోసం అంటే లోకసంగ్రహణార్థం కృషి చేసేవాడైనా అయివుండాలి. అప్పుడు వాడు మనల్ని తనస్వార్థంకొరకు వుపయోగించుకోడు. మన శ్రేయస్సుకే, మన ఆధ్యాత్మికాభివృద్ధికై చూస్తుంటాడు. అట్టివాడు దొరికేదాక మనం యీ రకరకాలగురువులకు, దూరదూరంగానే వుండాలి. వాళ్ళలోవుండే సద్విషయాలనుమాత్రం గ్రహిస్తూఉండవచ్చును. కాని సంపూర్ణంగా స్వాధీనం కాగూడదు. దానివల్ల చాలబాధలు వస్తాయి. ఈవిషయంలో చాలమంది

మోసపోతూవుంటారు పాపం! దీన్ని నీవు ఒకకంటితో కనిపెట్టుతూ వుండాలి. అందుచేత అట్టి మహాత్ములను ఆశ్రయించటంవల్ల, మన స్వాతంత్ర్యానికి భంగంవాటిల్లదు సరిగదా, మనం ఆధ్యాత్మికంగా ఎక్కువ అభివృద్ధికి వస్తాం. కావున అది దోషంకాదని సారాంశం.

ఇంతటితో అపరిగ్రహం పూర్తిఅయింది. అపరిగ్రహంతో రాజయోగం అనబడే యోగమార్గంలో, ప్రథమభాగమైన యమం అనుఅంగం కూడా పూర్తిఅయిందన్నమాట. దీనివల్ల అష్టాంగరూపంగావుండే రాజయోగం, ఆధ్యాత్మికపరిణామంలో ఎంత ప్రధానమో నీకు గోచరించి వుంటుంది. అందుకనే, దీన్ని సాధనయోగంఅనికూడా అనవచ్చు.

ఈఉత్తరంతో, ఒక ముఖ్యఘట్టం పూర్తిఅయింది. కాబట్టి తర్వాత రాబోవు విషయాలకు నీమనస్సును సంసిద్ధం చేసుకోటానికి, పూర్వవిషయాలను ఒక్కసారి చదివివుంచుకో.

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం.

17-1-46

# 10

# రాజయోగము

## నియమము - శౌచము

*నా మాతాజీ!*

అమ్మాయీ! నీకు ఉత్తరంవ్రాసి వారంపైన అయింది. అపరిగ్రహాన్ని గూర్చి నీకు వ్రాసినతర్వాత బాపట్లకు వెళ్ళాను. అక్కడ మన సమాజకార్యాలలో మునిగిఉంటంచేత, నీకు లేఖలు వ్రాయటానికి తీరిక లేకపోయింది. మనస్సు ప్రశాంతంగా ఉంటేనేగాని యిట్టివ్రాతలు సాగవు. ఎలాగైతే నీళ్ళు నిశ్చలంగా ఉండేటప్పుడు, నీళ్ళకు అడుగుభాగంలోఉండే సర్వవస్తువులు పైకి కనిపిస్తూ ఉంటయ్యో, అలా నిశ్చలమైన మనస్సులోనుండి చూస్తేనేగాని, దాని అడుగునవుండే వివిధవిషయాలు గోచరించవు. ఆమనసుకు అడుగునవుండే భావాలను తెలుసుకొని, పైకిలాగి, కాగితంమీద పెట్టాలంటే మొదట ఆ మనస్సును నిశ్చలంచేయాలి. అందుకని, ఆరోజుల్లో ఏమీ వ్రాయలేకపోయాను. నిన్న సాయంకాలం మరల యిక్కడికి వచ్చాను. ఇక, వరుసగా అన్నిసంగతులు వివరాలతోగూడ నీకు వ్రాసేస్తాను. నీవుమాత్రం అశ్రద్ధ చేయకుండా, వెంట

వెంటనే చదువుకుంటూ, నీసందేహాలను పెద్దవాళ్ళను అడిగి తెలుసు కుంటూఉండు. ఇంకా సందేహాలుంటే, నేను వచ్చినప్పుడు అన్నీ వివరించి చెప్తుతాను. తెలిసిందా? జాగ్రత్త.

పూర్వపుటుత్తరంతో యమం పూర్తిఅయిందికదూ! ఇక 'నియ మాన్ని' గూర్చిచూద్దాం. ఈనియమంకూడా యమంలాగా అయిదు భాగా లుగాఉంది. వాటినే శౌచం, సంతోషం, తపస్సు, స్వాధ్యాయం, ఈశ్వర ప్రణిధానం అంటారు. వీటిని, పూర్వం అహింసాసత్యాస్తేయబ్రహ్మచర్యాపరి గ్రహాలను వివరించినట్లు, ఒక్కొక్కదాన్నే తీసుకుని చర్చిస్తాను. జాగ్రత్తగా తెలుసుకో. మొదట శౌచం విషయం చూద్దాం.

'శౌచం' అంటే శుచి, లేక పరిశుద్ధత అంటారు. మరల శుచి, బాహ్యంఅని, అంతరంఅని, రెండువిధాల ఉన్నది. మనస్సులో ఏ విధమైన కల్మషగుణాలు లేకుండాఉండటం అంతశ్శౌచం అంటారు. అంటే దురు ణాలు లేకుండాఉండటం అవుతుంది. దుర్గుణాలు ఎప్పుడు లేకుండా వుంటయ్యో సద్గుణాలు వెంటనేమనలోకి ప్రవేశిస్తాయి. అంటే, 'మైత్రీ కరుణాముదితోపేక్షాణాం సుఖదుఃఖపుణ్యపాపస్య విషయాణాం భావనా తచ్చిత్తప్రసాదనం' అని పతంజలిచెప్పాడు. అంటే, చిత్తం నిర్మలం అయిందం టానికి యీగుణాలు వచ్చిఉండాలి. వాటిల్లో మొదటిది మైత్రి. అందరి తోనూ స్నేహంగా ఉండటమే దీనికర్థం. ఎవరితోనూ పోట్లాడకుండా, కాట్లాడకుండా, కోపతాపాలులేకుండా, అసూయాద్వేషాలులేకుండాఉండాలి అన్నమాట. అహింసావ్రతం సక్రమంగా పాటిస్తూ ఉంటేనేగాని యిది సాధ్యం కాదు. రెండవది కరుణఅంటే దయ. మైత్రిఅనేది సమానస్థులతోఉంటుంది. కరుణ తక్కువవాళ్ళమీద కలుగుతుంది. అవతలవాళ్ళ దీనత్వం ఎప్పుడైతే మనకుబోధపడుతుందో, అప్పుడు యీకరుణ ఉద్భవిస్తుంది. దానికై, విశాల దృష్టి మనకుంటేనేగాని యీకరుణ కలగటానికి వీలులేదు. మూడోది ముదిత. అనగా సంతోషం. ఎప్పుడూ ఆనందంగా ఉండాలి. రాగద్వేషాలు ఎప్పుడు మనకుండవో అప్పుడు ఆనందం తాండవిస్తుంటుంది. దీన్నిగూర్చి

తర్వాత చర్చిస్తాను. సుఖదుఃఖాలంటేను, పుణ్యపాపాలంటేను ఉపేక్షతో ఉండటం నాల్గోవిషయం. అంటే సుఖంకలిగినా, దుఃఖంవచ్చినా, పుణ్యం చేసినా, పొరపాటున ఒకవేళ పాపంచేసినా, చలించకుండా నిర్లక్ష్యభావంతో ఉండాలి. ఇలా, యీ నాల్గుగుణాలు మనకు ఎప్పుడు లభ్యపడతాయో, అప్పుడు మనచిత్తం నిర్మలంఅయినట్లే. ఇలాంటి చిత్తంలోకే భక్తి, జ్ఞాన, వైరాగ్యాలులనే మోక్షమార్గానికి దారిచూపే లక్షణాలు దూరతాయి. మోక్షాన్ని కలుగజేస్తాయి. ఇదంతా అంతఃశౌచంఅన్నాను. ఈ అంతశ్శౌచం విషయం ప్రస్తుతం అంతముఖ్యంకాదు. ఇక్కడ అర్థంకూడా యిదికాదు. ఎందుచేతనంటే, యమంలోనే మనకు అహింసాసత్యాస్తేయబ్రహ్మచర్య అపరిగ్రహాలద్వారా చిత్తం చాలవరకు నిర్మలం అయిందనవచ్చు. ఈ యమం, మన బాహ్యకర్మలను పరిశుద్ధం చేసింది. మనకు, యితర్లకుఉండే సంబంధాన్ని నిర్మలంచేసింది. దానివల్ల చిత్తంకూడా తప్పకుండా నిర్మలం అయితీరాలి. ఇక యీనియమంలో మన స్వవిషయం చర్చిస్తాను. అందుకని యిక్కడ యీశౌచానికిఅర్థం, శారీరకపారిశుద్ధతఅంటే బాగుంటుంది. ఎందుకంటే, యీసంగతి యిదివరకు యమంలో రాలేదుకాబట్టి, యీ దేహపరిశుద్ధతకూడా సాధకునికి చాలా అవసరంకాబట్టి, యీ అర్థం చెప్పితే బాగుంటుందని కొంచెం చెప్పేస్తాను.

శౌచం అంటే ప్రస్తుతానికి 'శారీరకంగాపరిశుద్ధత' అనిఅర్థం చేద్దామన్నాను. శారీరకంగా పరిశుద్ధంఅంటే ఏమిటి? సాధన చేసేవాళ్ళకు దేహం చాలాఉపయుక్తం అనుకో. దేహం ఏమాత్రమైనా ఆటంకం కలుగజేసిందా, వాళ్ళసాధన సాగనేసాగదు. శరీరం ఆరోగ్యంగా ఉండాలి. పరిశుభ్రంగా ఉండాలి. ఆరోగ్యానికి మొదటికారణం పరిశుభ్రం. సాధారణంగా యీ పరిశుభ్రతను ఎంతకాపాడుకుంటూ ఉంటామో, అంతఆరోగ్యం మనకుండటంచేత సాధన అంతఎక్కువగా చేయటానికి అవకాశాలుకూడాఉంటయి. దేహం శుచిగాఉండకపోతే, గజ్జి, తీట మొదలైన చర్మవ్యాధులు ప్రారంభం అవుతయి. వాటివల్లకలిగే బాధచేత, వీడు ఎంతసాధనచేయాలని కూర్చున్నా,

మనస్సు వీటిమీదనే ఉంటుందికాని నిశ్చలంగా ఉండనేడుండదు. అందుచేత, సాధకుడు యీశరీరాన్ని చాలజాగ్రత్తగా, శుచిగా ఉంచుకోవాలి. స్నానపానాదు లందు చాల జాగ్రత్త వహించాలి. పూర్వకాలంలో బ్రహ్మచర్యాశ్రమంలోఉండే కుర్రవాళ్ళు తెల్లవారుజామున నిద్రలేచి, కాలకృత్యాధులన్నీ తీర్చుకొని, చన్నీ ళ్ళలో స్నానంచేసి, అధ్యయనానికి కూర్చోవాలన్నారు. మరల మధ్యాహ్నం స్నానం. అలాగే, సాయంకాలం స్నానం. ఇలా, త్రికాలాల చన్నీళ్లస్నానం చేశా మంటే ఏవిధమైన చర్మవ్యాధులు రానేరావు. ఇంతకూడా అక్కరలేదు. ప్రతి దినం ప్రొద్దున్నే సూర్యోదయంకాకపూర్వం చన్నీళ్ళస్నానం చేస్తేచాలు. చాల బాగుంటుంది. సరే, యిలా స్నానాలుచేసినా, కుళ్ళుగుడ్డలు కట్టుకొని సాధన చేయాలంటే లాభంలేదు. ఆగుడ్డలుకూడా శుభ్రంగా ఉండాలి. అందుచేతనే మనపూర్వులు, పెద్దవాళ్లు, మాటమాట్లాడితే మడిగుడ్డలని అనేవాళ్ళు. మడి అంటే ఉతికిఆరవేసినగుడ్డఅని అర్థం. దానికే శాస్త్రాలలో 'ధౌతవస్త్రం' అన్నారు. పరిశుభ్రంగా స్నానంచేసి, పరిశుభ్రమైన వస్త్రాన్నిధరించికూర్చుంటే, జపధ్యానాలకు చాల ఉపయోగం. వస్త్రం శుభ్రంగాలేకపోతే, దానిలో అనేక రకాల మకిలఉండి దుర్వాసన కలుగజజేస్తుంది. పురుగులేకాక తేళ్లుకూడా అందులో ఉండవచ్చు. ఇవన్నీ మనకు యిబ్బంది కలుగజేసేవేగా! అందుచేతనే మడిగుడ్డలు అన్నారు పెద్దలు.

అయితే పట్టుగుడ్డ కట్టుకుంటేనో అంటావా? అదీమంచిదే. నూలు గుడ్డకంటే పట్టుగుడ్డకు ఎందుకు ప్రాధాన్యం యిచ్చారంటే, నూలుగుడ్డకు త్వరగా దుమ్ము, ధూళి, నీరు మొదలైన అపరిశుభ్రమైన పదార్థాలు అంటు క్కుంటాయి. పట్టువస్త్రానికి అలాఅతుక్కోవు. ఒక వేళ దుమ్ముఅతుక్కున్నా, పట్టువస్త్రాన్ని గట్టిగా విదిలిస్తే, ఆదుమ్ము రాలిపోతుంది. నూలువస్త్రాన్ని, బాగా ఉతికితేగానిపోదు ఆమలినం. కాబట్టే పట్టువస్త్రాలకు ప్రాధాన్యం యిచ్చారు. కాని నాబుద్ధికిమాత్రం, పట్టుకంటే ప్రత్తివస్త్రాలే శ్రేష్ఠంఅని తోస్తుంది. ఎందుకంటావా? పత్తితో నూలు తయారు చేయటానికి, ఎట్టి హింసకూడాలేదు. కాని పట్టుదారం తీయడానికి, ఎన్నో పట్టుపురుగులు హతం అవుతాయి. ఒక్కగుడ్డను తయారుచేయటానికి, కొన్నివేల పురు

గులు చస్తేనేగాని దానికి కావలసిన దారంరాదు. అంటే, పట్టువస్త్రానికి హింస పునాదిఅయింది. అలా అన్నిపురుగుల్ని చంపి, ఆ గుడ్డనుకట్టటం ఎలా మంచి దంటావు? దాన్నికట్టి కులకడం నీచంఅని నాఉద్దేశం. ఆ పురుగుల రక్తాన్ని, వాటి మరణవేదనాన్ని స్ఫురింపజేస్తుండే ఆ వస్త్రాన్ని మడిఅని నేను అనను. ఆ వస్త్రాన్ని చూస్తేనే, ప్రతిదారంలోనుండి వాటి మరణవేదనానినాదాలు నాకు విన పడుతుంటాయి. అది సున్నితమైన మనస్సుగలవారికే అర్థంఅవుతుంది. కాన ప్రత్తివస్త్రాన్నే బాగాఉతికి, ఆరవేసి, కట్టుకోటం మంచిదిఅని నా దృఢభావం. అంతేకాదు, మనంచేసే ప్రతిపనిలోనూకూడా హింసలేకుండా ఉండటమే కాకుండా, ఆడంబరంకూడా లేకుండాలి. పట్టుగుడ్డ కట్టగానే అహంభావం వచ్చేస్తుంది. ఖరీదుగలగుడ్డకాబట్టి గర్వం, తళతళమంటూ మెరిసే అందమైన గుడ్డకాబట్టి మమకారం యింకాఅనేకఅవలక్షణాలు కలుగుతాయి. ఈ అహం కారమమకారాలేకాక, అనేక వికారాలుకూడా మనలో విజృంభిస్తుంటాయి.

స్నానంవిషయంలోగూడా యిలాగే. ఎంతవరకో అంతేకాకుండా అనేక రకాల సబ్బులు బయలుదేరాయి. ఆసబ్బులు ఉపయోగించటం ఆరో గ్యమా, కాదా అనేవిషయం అలాఉండగా, సుగంధద్రవ్యాలమీద చిత్తం పరి గెత్తుతుంది. వాటినిబట్టికూడా చిత్తం, అనేకవిధాల వికారాలకు లోనవు తుంది. అలాగే 'శౌచం' అనేపేరుతో సబ్బులద్వారా సుగంధాలమీదికి, పట్టు వస్త్రాలద్వారా అహంకారమమకారాలమీదికి చిత్తం పరుగెత్తుతుంటే యింకా సాధనేమిటి? మనం సాధించబోయే సాధనకు ఉపయుక్తంగా ఉండాలి యీ చిల్లరవిషయాలు. కాని, అసలు విషయమైన సాధనకే లోపం కలుగరాదు.

అలాగే, మన చుట్టుప్రక్కలగూడా శుచిగాఉండాలి. అంటే మనం సాధనచేసే స్థలంకూడా పరిశుభ్రంగా వుండాలి. దుర్వాసనకలుగజేసే వస్తువులు దగ్గరలో ఉండకూడదు. ఇల్లుఅయితే, పై కప్పుకుగాని గోడలకుగాని బూజు మొదలైన అసహ్యాకరపదార్థాలుండరాదు. శుభ్రంగా గోడలు వెల్లవేయబడి ఉండాలి. నేల మట్టిఅయితే, ఆవుపేడతోగాని, లేకపోతే పసుపుతోగాని బాగా అలికి, కొంచంగా ముగ్గులువేయబడి ఉండాలి. ఇలా, పరిశుభ్రంగా యిల్లు,

ముఖ్యంగా మనం సాధనచేసే స్థలం ఎప్పుడుంటుందో, అక్కడ దోమలు, ఈగలు, పురుగులు మొదలైనవిఉండవు. కాబట్టి వాటివల్ల మన సాధనకు భంగంరాదు. మనస్సు నిర్మలంగా ఉండిపోతుంది. గచ్చునేల అయితే బాగా కడిగి, ఆరిఉండాలి. ఆగదిలో గోడలకు అసలు ఏఫొటోలు, బొమ్మలు లేకుండటం శ్రేష్ఠం. లేక, మన ఆధ్యాత్మికాభివృద్ధికి సహాయపడేవారి చిత్ర పటాలు, మహాపురుషుల చిత్రాలుండవచ్చు. చిత్తవికారాలుకలుగజేసే పటాలు ఎంతమాత్రం ఉండకూడదు.

ఈవిధంగా అంతశ్శౌచం, దేహశౌచం, వస్త్రశౌచం, గృహశౌచం, పరిసరశౌచం, అనే పలువిధశౌచాలు కలిగిఉండటమే యీశౌచం అనేదానిలో ఉన్నఅంతరార్థం. వీటినన్నింటిని ఎప్పుడు మనం క్షుణ్ణంగా పాటిస్తామో, అప్పుడే సాధన సక్రమంగా మనకు సాగుతుంది. ఈరహస్యాన్ని గట్టిగానమ్ము. అలా ఆచరించుకో. సాధన అప్పుడు నీకు సాధ్యం అయితీరుతుంది.

అలా, నీవు ఆచరించుకుంటావని నమ్ముతూ, యీ శౌచం విషయం యిక నిలిపివేస్తున్నాను.

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం.

**26-1-46**

# 11

# నియమము

## సంతోషము

చిట్టీ నా మాతాజీ!

శ్లో. మోక్షద్వారే ద్వారపాలాశ్చత్వారః పరికీర్తితాః
శమో విచారస్సంతోషశ్చతుర్థస్సాధుసంగమః

ఈశ్లోకం చూచావా! ఎంతచక్కని శ్లోకమో! ముముక్షువుకు ముఖ్యావసరవిషయాల్ని, యీశ్లోకంలో యిమిడ్చిచెప్పేశాడు వసిష్ఠమహర్షి శ్రీరామచంద్రమూర్తికి, జ్ఞానవాసిష్ఠంలో. మోక్షానికి వెళ్ళేటప్పుడు ఆ మోక్షానికి ద్వారంఒకటుందట. ఆద్వారందగ్గర ద్వారపాలకులు నలుగురున్నారట. వారెవ్వరయ్యా అంటే శమంఅనేవాడు, విచారం, సంతోషం, సాధుసంగమం అనేవాళ్లు. వీళ్లు నలుగురు అక్కడుంటారు. ఈనలుగుర్ని మనం స్వాధీనం చేసుకుంటే, అంటే వాళ్ళను మంచిచేసుకుంటే, వాళ్లు మనల్ని లోపలికి పోనిస్తారు. లేకపోతేలేదు. వాళ్ళను మంచిచేసుకోటం ఎలాగ? వాళ్ళలక్షణాలను మనం ఎప్పుడుసంపాదిస్తామో అప్పుడు మనకువాళ్ళు స్వాధీనం అవుతారు. విద్వాం

సుడిని స్వాధీనంచేసుకోవాలంటే విద్యవల్లనే అవుతుంది. ధనికుని సాధ్యంచేసుకోవాలంటే ధనం సంపాదిస్తే, అప్పుడు వాడిగౌరవం పొందుతారు. అలాగే, యీపై నలుగురు ద్వారపాలకులుకూడా. మనకు వాళ్ళలక్షణాలు వచ్చినప్పుడు మనకుస్వాధీనంఅవుతారు. మనకు జోహారుచేస్తూ లోపలికిపోనిస్తారు.

ఈశ్లోకం ఎందుకు వ్రాశాను? ఈ శ్లోకంలోని మూడోవిషయం 'సంతోషం'. ఆసంతోషం మనం ప్రస్తుతం చర్చిస్తూఉన్న నియమంలో రెండోది. దానివల్ల పై శ్లోకాన్ని వ్రాయాల్సివచ్చింది. సంతోషం మొదటనుండి మార్గంలో మనవెంటవస్తూ, మోక్షద్వారందాకా వస్తుంది. సంతోషం మొదట్లో సంకుచితంగాఉండి, మోక్షస్థితిలో ఏగట్లులేనిసాగరం అయిపోతుంది. మోక్షంఅంటే ఆనందసాగరంఅన్నమాట. ఆబ్రహ్మాన్నిగూర్చి చెప్పేటప్పుడుకూడా 'సచ్చిదానందం బ్రహ్మ' అని 'విజ్ఞానమానందం బ్రహ్మ' అని 'ఆనందో బ్రహ్మ' అని, పలువిధాల యీఆనందమే బ్రహ్మమని శ్రుతులు చెప్పుతున్నాయి. శ్రుతులంటే వేదాలు, వాటిలోభాగాలైన ఉపనిషత్తులనిఅర్థం. స్మృతులంటే పురాణాలు, ధర్మశాస్త్రాలు మొదలైనవి. ఈశ్రుతిస్మృతిపురాణేతిహాసాలు అనబడే మనశాస్త్రాలన్నీ యీమాటే చెప్పుతున్నాయి.

అందుకని, అసలు సాధనలోఉండే రహస్యంప్రకారం గమ్యంలోఉండే లక్షణాలను సాధిస్తూ, మార్గంలోకూడా పాటిస్తూ పొందటానికి యత్నించాలి. అలాచూస్తే, మనగమ్యంలో వెల్లువగావుండే యీసంతోషాన్ని మొదటినుండి సాధించాలి. సాధించాలిఅనటం సులభమేకాని సాధించటంఅనేది చాల కష్టం. మనస్సును చలింపజేసే అవలక్షణాలను అన్నింటిని మనం ఎప్పుడు దూరంచేస్తామో, అప్పుడు యీసంతోషాన్ని సాధ్యంచేసుకోగలం. మనస్సు చలించటం ఏమాత్రంఉన్నా యీసంతోషం సాధ్యంకాదు. సంతోషసాధనలో ఉండే రహస్యం యిది.

సంతోషంగా వుండటంఅంటే ఎప్పుడూ విషయసుఖాల్లో మునిగి వుండటమా? అనేదేప్రశ్న. సంతోషంఅంటే అదికాదు. మనంఅనుకునేసుఖం

సంతోషంలాగా సున్నితమైనది కాదు. సుఖంలో ఉద్రేకంవుంది. సంతోషంలో మార్దవంఉంది. ఈలోకసంబంధవిషయాలవల్ల కలిగే ఆనందంలాంటితృప్తిని సుఖంఅంటాం. ప్రపంచవస్తువుల్ని కాంక్షించి దాన్ని పొందితే సుఖంఅంటాం. ఆవస్తువును పొందకపోతే దుఃఖంఅంటాం. దీనికర్థం ఏమిటంటే, యీ సుఖదుఃఖాలు యీప్రపంచవిషయాలపై ఆధాపడిఉంటాయి. కాని సంతోషం అనేది యీ సుఖదుఃఖాలతో సంబంధంలేకుండా, యీరెండు స్థితులకు అన్యంగాఉండేది. దీన్నే, ఉదాసీనభావం అనికూడా అనవచ్చు. చాలామంది యీఐహికవిషయాలను పొందటంవల్ల వచ్చేసుఖాన్నే సంతోషంగా చెప్పుతారు. కాని ఆనిర్వచనం తప్పుఅని దీనివల్లతేల్తుంది. ఇంకా, సుఖానికి సంతోషానికి తారతమ్యం చెప్పుతాను విను. సుఖంఅనేది పరాపేక్షతో ఉండేది. సంతోషమో స్వాపేక్షికం. ఈరెండుపదాలు నీకు యిదివరకే చెప్పాను. పరాపేక్షికం ఎప్పుడు అయిందో, యీసుఖం సంకుచితం అవుతుంది. స్వాపేక్షికం కావటంచేత సంతోషం విశాలం అయిఉంటుంది. సంతోషానికి దేశ, కాల, వస్తువులు కారణం కానేకావు. కొందరికి కొన్నిచోట్ల సుఖంగాఉంటుంది. కొన్నిచోట్ల సుఖం అనిపించదు. అలా, దేశాన్నిబట్టి ఆనందంకలిగితే, అది దేశబద్ధంఅయిందికాబట్టి సుఖంక్రిందలెక్కే. అలాగే, ఒకకాలంలో సుఖం మరొకకాలంలో దుఃఖం. అలాగే ఒకవస్తువువల్ల సుఖం, మరొక వస్తువువల్ల దుఃఖం అనుభవిస్తూఉంటాం. ఇలాంటి దేశకాలవస్తుబద్ధమైన సుఖాన్నిపొందటం సంతోషంకాదు. సంతోషంఅంటే, యీదేశ కాల వస్తువులకు సంబంధంలేనిది అన్నమాట. ఎక్కడున్నా, ఎట్టి పరిస్థితుల్లోఉన్నా, సుఖాన్నిగాని, దుఃఖాన్నిగాని, పొందకుండాఉండటం సంతోషం అనాలి. ఈ స్థితిని పొందటం చాలాకష్టం.

మరిఅది ఎలా కలుగుతుంది? అంటావా. సుఖదుఃఖాలకు కారణాలేవేవిఉన్నయో, వాటిని దూరంచేయుటచేత యీసంతోషం లభిస్తుంది. దీన్ని తెలుసుకోవాలంటే అయిదుసంవత్సరాల లోపలుండే పసిపిల్లల్నిఅడుగు. వాళ్ళకు లోపల ఆరోగ్యంగాఉంటే రాగాలు తీసుకుంటూ, ఆడుకుంటూ, నవ్వుకుంటూ, కారణంలేని ఆనందంలో ఉంటారు. అలాగే వెర్రివాళ్ళు.

వారినవ్వులకు కారణాలేవీ ఉండవు. ఎప్పుడైతే ప్రపంచవిషయాలు గోచరిస్తుంటయ్యో, ఆప్రపంచంవల్ల సకలవికారాలు తగులుతూ ఉంటయ్యో, వాటివల్ల మనస్సు కోతిలాగ గంతులేసి, వాటిఫలితంగా సుఖదుఃఖాలు మానవునికి సంప్రాప్తిస్తాయి. ఈప్రపంచదృష్టిలోనే ఎప్పుడుపడడో, దానివికారాలు చిత్తాన్ని ఎదుర్కొనవో, అంటే యీప్రపంచంలోఉండే మాయ చిత్తాన్ని స్వాధీనం చేసుకోదో, అప్పుడే యీసుఖదుఃఖాలు ఆచిత్తాన్ని చేరవు. దాన్నే అమాయకత్వంఅంటారు. ఈసంతోషంఅనేది యిట్టి అమాయకులసొమ్ము అనిఅర్థం. అలా ఎప్పుడు మనంవుంటామో, అప్పుడు యథార్థమైన సంతోషాన్ని మనం అనుభవిస్తాం. అలాకాక ప్రపంచంతో సంబంధంచేత సంతోషం పొందటం అంటే సుఖాన్ని పొందామన్నమాట. ఇప్పుడు తెలిసిందా సంతోషంఅంటే. చిత్తంనిశ్చలత్వం పొందితేగాని సంతోషం మనకుకలుగదు. ఎప్పుడూసుఖంగా వుండటంగాదు సంతోషంఅంటే. ఈవిధమైన సంతోషాన్ని పొందినప్పుడు, మనచిత్తం నిండుకుండలాగా నిశ్చలంగా వుంటుంది. చిన్నచిన్న విష యాలకు పొంగిపోదు. అలాగే కృంగిపోదు. పెద్ద దుమారంలాంటి సుఖదుఃఖాలు వచ్చినా కదలిపోదు. మేరుపర్వతంలాగా కదలకుండావుండటం యీ సంతోష లక్షణం. దీన్ని మనం సాధించాలి. దీనిలో ఆనందాన్ని పూర్తిగా త్రాగెయ్యాలి.

ఈసంతోషం ఎప్పుడూ వుండాలి. ఇది ఒక అంటువ్యాధిలాంటిది. ఇంతెందుకు? సుఖదుఃఖాలే అంటువ్యాధిలాంటివి. చూడు, ఒకరికొక కష్టం కలిగిందనుకో. ఆ కష్టంచేత వాళ్ళు ఏడుస్తూవుంటారు అనుకో. వాళ్ళను చూచేటప్పటికి మనకుకూడా ఏడుపువస్తుంది. ఇంతెందుకు? వాళ్ళఏడ్పు వింటే మనకు ఏడ్పువస్తుంది. అదీకూడా అవసరంలేదు. వాళ్ళు ముఖం దీనం చేసుకుని దిగాలుపడిఉంటే, మన ముఖాలుకూడా అలాగే పాడుగైపోతాయి. వారి హీనస్వరంతోపాటు మనకుకూడా హీనస్వరం పడిపోతుంది. అలా కాకుండా ఒకరు పెద్దగానవ్వేస్తుంటే మనకుకూడా నవ్వువచ్చేస్తుంది. వాళ్ళకు వలె ముఖంవికాసం అవుతుంది. అంటే యీసుఖదుఃఖాలు ఒక వ్యక్తివిబట్టి ఉండటమేకాకుండా, ఆవ్యక్తితో సంబంధించినవారందరికి తగిలి అంటు వ్యాధిలాగా పనిచేస్తయి. అందుకనే వివేకానందుడు, 'నీకు ఆనందం కలిగితే

ఒక్కడివే అనుభవించటానికి హక్కులేదు. దాన్ని అందరికి పంచిపెట్టు. నీకు దుఃఖంకలిగినప్పుడు ముసుగువేసుకొని యింట్లో మూలకూర్చో. బయటికి వెళ్ళి అంటువ్యాధిఅయిన నీదుఃఖాన్ని యితర్లకుకూడా కలుగజేయటానికి నీకు అధికారంలేదు' అని గద్దించాడు. అదీకూడా నిజమేసుమా! వీటికంటే బలంగలది యీసంతోషం. ఇదికూడా ఒక అంటువ్యాధే. అందుచేత, దీన్ని మనం పొందటమేకాకుండా యితర్లుకూడా కొంచెం అనుభవిస్తారు. ఈ సంతోషసందేశాన్ని సర్వత్రా వ్యాపింపచేద్దాం.

అంతేకాక, యీసంతోషం ఆరోగ్యాన్ని యిస్తుంది. జబ్బులులేనప్పుడు సంతోషంగాఉంటాం. బాగానేఉంది. అదేకాకుండా, సంతోషంగా ఉంటే జబ్బులు దగ్గరకు రానేరావు. అంతేకాదు వ్యాధి వచ్చినప్పుడుకూడా యీసంతోషంఅనే యీమందును సదా సేవిస్తూఉంటే, అంటే సంతోషాన్ని వదలకుండాఉంటే, ఆవ్యాధికూడా దూరంగా పారిపోతుంది. ఈవిధంగా సంతోషం సర్వవ్యాధులకు పరమౌషధంగా ఉంటుంది.

ఈ సంతోషాన్ని నిత్యం పానంచేసేవాళ్ళకు, కొన్ని లక్షణాలు వస్తాయి. శారీరకంగా చూశామంటే, శరీరానికి మంచితేజస్సు వస్తుంది. ముఖంలో కాంతి వెలుగుతూ ఉంటుంది. నేత్రాలు కళకళలాడుతూ ఒకమెరుపును కలిగి ఉంటాయి. కంఠం సున్నితంఅవుతుంది. నడక మందంఅవుతుంది. తొట్రుపాటు, తొందరపాటులుండవు. మానసికంగాచూస్తే సత్వబుద్ధి పెంపొందుతుంది. శాంతం తాండవిస్తుంది. మాటలు మధురత్వం, మృదుత్వం కలిగి ఉంటాయి. కామక్రోధాదులు సడలిపోతాయి. వీటిఅన్నింటివల్ల జ్ఞానాభివృది కలుగుతుంది.

ఈకారణంచేత, యిన్నిసదంశాలతో కూడిఉండుటచేత, యీసంతోషాన్ని తీసుకొనివెళ్ళి, మోక్షద్వారందగ్గరే ఉంచేశాడు మన వసిష్ఠమహర్షి. ఇప్పుడు, యీసంతోషం ఎంత ప్రధానమైనదో నీకు బోధపడిందికదా! ఈ ఒకదాన్ని సాధిస్తే చాలదూ! అన్నిసద్గుణాలూ దీనివెంటనే పరుగిడిరావూ!

దీని ప్రథమలక్ష్యం ఏమిటంటే, ఎప్పుడూ మందహాసంతో ఉండాలి. పెద్ద వెకిలినవ్వు పనికిరాదు. ఇంగ్లీషులో ఒకవాక్యం ఉంది. A loud laugh denotes a vacant mind పెద్దనవ్వు ఖాళీచిత్తాన్ని సూచిస్తుందిఅని దీని అర్థం. చిరునవ్వు ముత్యాలమూటఅనుకో. దాంట్లో అంతసొగసు, అంత పట్టుఉంది. దాంట్లో ఎంతోగొప్పదనం యిమిడిఉంది. అలా వుంటూ వుంటే, కొన్నాళ్ళకు మనముఖంమీద కండరాలు, అలాగే అభివృద్ధి పొందు తాయి. అందుకని మనంనవ్వకపోయినా ఎప్పుడూ మనముఖం నవ్వుతున్నట్లు గానేఉంటుంది. అట్టిముఖం అందరికి ఆనందదాయకంగానే వుంటుంది. దానిచే మనకు ఆనందమేకాకుండా మనతో సంబంధం ఉన్నవారికందరికి, యీఆనందాన్ని విరివిగా పంచిపెట్టినవారమవుతాం. ఇదివరకు చర్చించిన విషయాలన్నింటికంటే, యిది సులభంగా యితరులకు తెలిసిపోవటంచేత, ఎక్కువగా యితర్లకుకూడా ఉపయోగపడుతుంది. కాబట్టి యీ ముఖ్యలక్ష ణాన్నిబట్టి, చాలవరకు ఒకరి గొప్పదనాన్ని చెప్పివేయవచ్చు.

ఈవిధంగా, అతిముఖ్యమైన సంతోషాన్ని సదాఅనుభవిస్తూఉంటావని నమ్ముతూ, నేటి యీ జాబును ముగిస్తున్నాను.

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం.

రాంచంద్ర

**28-1-46**

# 12

# నియమము

## తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానము

నా చిట్టితల్లీ మాతాజీ!

పూర్వపుటుత్తరాలలో, నియమంలో, మొదటి రెండుభాగాలు శౌచ, సంతోషాలు చర్చించాం. మిగతా మూడింటిని యిప్పుడు చూద్దాం. 'తపః స్వాధ్యాయేశ్వరప్రణిధానాని' అనిపల్కుతూ వీటినే 'క్రియాయోగః' అన్నాడు పతంజలి. కర్మయోగానికి, యీక్రియాయోగానికి భేదంఉంది. కర్మ యోగంఅంటే బాహ్యకర్మ అనాలి. అలాగే యీకర్మయోగంవల్ల కలిగే ఫలితంకూడా బాహ్యంఅనవచ్చు. కర్మయోగాన్నిగూర్చి చర్చించేటప్పుడు ఏమన్నాం? కర్మయోగఫలితంగా పుణ్యలోకప్రాప్తి కలుగుతుంది. ఆలోకా లలో బాహ్యసుఖాలే కలుగుతాయి. అలాకాకుండా క్రియాయోగంవల్ల చిత్త పరిణామం కలుగుతుంది. చిత్తంనిర్మలంఅయి ఈశ్వరానుగ్రహం పొందు తుంది! ఈ రెండింటికి భేదం యిది. ప్రస్తుతం క్రియాయోగంఅనబడే యీ తపస్సు, స్వాధ్యాయం, ఈశ్వరప్రణిధానం అనే మూడుఅంశాలు ఏమిటో కొంచెం తెలుసుకుందాం.

తపస్సుఅంటే అనేక నిర్వచనాలు పెద్దలు చెప్పారు. తీవ్రంగా ఒక గ్రంథాన్ని చదవటం తపస్సు. ధ్యానంచేయుటం తపస్సు. జపంచేయుటం తపస్సు. నియమయుక్తంగా జీవనంచేయుటం తపస్సు. బ్రహ్మచర్యం తపస్సు. ఇలా ఏవిషయాన్నైనా, ముఖ్యంగా బుద్ధిని కేంద్రీకరింపజేసి, అంటే ఏకాగ్రం చేసి, అంటే ఒకచోటనిల్పి పనిచేస్తున్నామంటే, అది ఆవిషయంకొరకు తపస్సుఅనేచెప్పాలి. సూక్ష్మంగా చెప్తుతాను. మనస్సును ఒకదానిపై నియమించి తపింపజేయుటం తపస్సు. ఆతపస్సుయొక్క కారణం కామ్యం కావచ్చు, లేక నిష్కామ్యంకావచ్చు. అయినా అది తపస్సే. పూర్వం చూడు, హిరణ్యాకశిపుడు, రావణాసురుడు, కుంభకర్ణుడు మొదలైన రాక్షసులు తపస్సు చేశారన్నారు. వారుఉన్నచోటనుండి కదలక, ఏకాగ్రచిత్తంతో ఈశ్వరునిగూర్చో, బ్రహ్మదేవునికొరకో తపస్సుచేశారు. ఎందుకు? చావు లేకుంటానికో, త్రిలోకరాజ్యాధిపత్యానికో. అదీ తపస్సేఅన్నారు. అలాగే మృకండ మహర్షి తపస్సుచేశాడు. ఎందుకు? సంతానంకొరకు అన్నారు. అలాగే మార్కండేయుడు తపస్సు చేశాడు. ఎందుకు? చిరాయువుకోసం. ధృవుడు తపస్సు చేశాడు. కారణమేమిటి? రాజ్యాధికారంకోసం, తండ్రిఅంకతలం కోసం. ఇంకాయింకా అనేకమంది మహర్షులు తపస్సుచేశారు. కొందరు ఇంద్రత్వంకోసం, కొందరు బ్రహ్మత్వంకోసం. ఉద్దేశ్యం ఏదైనా హఠంతో దేహాన్ని లెక్కచేయకుండా శుష్కింపజేస్తూ, శీతోష్ణాలను సరకుచేయకుండా, ఆహారపానీయాలు మొదలైనవాటినివేటినిగూర్చి ఆలోచించకుండా, మనస్సును తనఉద్దేశంమీద నిలిపి, కదలకుండా చేసి, ఆ సంకల్పం సిద్ధించేవరకు అలాగేఉండటం తపస్సుఅంటారు. దీనికంతటికి పర్యవసానం బుద్ధిని ఒక్కచోట ఏకాగ్రంచేయుటం తపస్సు అనవచ్చు.

ఈతపస్సు అనేలక్షణం లేకపోతే, ముందురావలసిన లక్షణాలన్నీ వెనుక పడిపోతాయి. అలా, బుద్ధిని కట్టివేయుటానికి అవసరంఅయిన పట్టుదల, హఠాన్ని తపస్సు అనికూడా అనవచ్చునేమో! ఇలా, హఠంతోకూడిన ఏకాగ్రతను తపస్సుఅంటే యింకా బాగుంటుందేమో! ఇట్టి తపస్సు ఏ ఫలితాన్నైనా యివ్వటానికి కామధేనువులాంటిది. ఇలా ఏకాగ్రంఅయిన చిత్తం చాలా బలం

కలిగి, ఏ పనినైనా సాధించి తీరుతుంది. అందుకనే, యీ క్రియాయోగంఅనే పంథాలో, యీ తపస్సును మొదట్లో పెట్టారు అనుభవజ్ఞులు.

తర్వాత రెండోదిస్వాధ్యాయం. దీనికర్థం వేదాధ్యయనం అంటారు. ముముక్షువుఅనేవాడు వేదాన్నంతా చదువుకొని, అర్థాన్ని గ్రహించిఉండాలి. వేదాన్నంతా చదవాలిఅంటే, మొదటనే చెప్పబడిన తపస్సుండాలి. దానిమూలకంగా యీస్వాధ్యాయం సాధ్యంఅవుతుంది. వేదాన్ని సరిగా అర్థంచేసుకుంటేనేగాని అసలు తర్వాతమార్గం వాడికి సుగమంకాదు. ఇది మొదట బ్రహ్మచర్యాశ్రమంలో వస్తుంది. అచ్చటనే, యమనియమాభ్యాసాదులు సాధ్యం చేసుకునిఉండాలి. అలా తయారైనచిత్తానికి వేదాధ్యయనం సులభం అయిపోతుంది. అలాకాకపోయినా, తాను ఏవేదశాఖకు చెందినవాడో ఆశాఖనైనా అధ్యయనం చేయాలన్నారు. అంతమాత్రమైనా తెలియకపోతే వాడికి, తర్వాత గార్హస్త్యంలో చేయవలసిన విధులకు నష్టంకలుగుతుంది. అంతేకాదు. ఆ వేదార్థం గ్రహించివుంటేనేగాని వాడికి సక్రమమైన భగవద్భక్తి కలుగదు. అందుచేతనే గురువుఅయినవాడు శ్రోత్రియుడుగా ఉండాలన్నారువేదాలలో. అంటే, వేదార్థం బాగాగ్రహించినవాడుగా ఉండాలి. అలాచదివి అర్థం గ్రహించి ఉండటంచేత, భగవంతుడంటేఏమిటో, ప్రపంచంఅంటే ఏమిటో, జీవుడంటే ఎవడో, వీరివీరికి మధ్యగలసంబంధం ఎలాంటిదో, మొదలైన తాత్త్విక విషయాలన్నీ బాగాగ్రహించిఉండటంచేత, జీవుడైనవీడు, ఆ భగవంతుని పొందేమార్గాన్ని గ్రహించేవిధానం తెలుసుకుని తంటాలుపడటానికి ఎక్కువ అవకాశాలు స్వాధ్యాయపరుడైనవాడికి ఉంటాయి. వాడు తర్వాత గృహస్థుగా ఉన్నా, దృష్టిని ఆభగవంతునిపొందే మార్గంమీదనేఉంచి యత్నిస్తుంటాడు. ఆ కారణంచేత స్వాధ్యాయం అవసరంఅని క్రియాయోగంలో చేర్చారు.

సరే, పూర్వకాలానికి అది బాగానేఉంది. వేదంఅంటే ఏమిటో తెలిసి చెప్పేవారని యీకాలంలో స్వాధ్యాయం ఎలా అంటావేమో! **పూర్వమున్నట్లు** నిష్కల్మషమైన గురువులు యిప్పుడులేరని కాలాన్నంతా అలా త్రోసిరాజనరాదు. ఇప్పుడుకూడా అచ్చటచ్చట వేదార్థాన్ని క్షుణ్ణంగాగ్రహించి, నిష్కా

మంగా చెప్పగలిగే గురువులు లేకపోలేదు. కాని, వాళ్ళు చాలఅరుదుగా ఉండటంచేత అందరికి లభించరు. కాబట్టి ఏమి చేయాలంటావా? అచ్చు గ్రంథాలున్నాయి. సంస్కృతగ్రంథాలకు అనువాదాలున్నాయి. వాటిని చదువు కుంటూ, వాటిల్లోవచ్చే సందేహాలను, అలాంటి సత్పురుషులు లభించి నప్పుడు తీర్చుకుంటూ ఉండాలి. అదీ నీకు కుదరకపోతుందా? భక్తి, జ్ఞాన వైరాగ్యప్రబోధకమైన పురాణాలు, ఇతిహాసాలు, చరిత్రలు, కథలు, మహాపురు షుల జీవితాలు, ఉపదేశాలు అన్నిభాషలలో సులభంగా లభిస్తున్నాయిగా! వాటిని చదువుకున్నా స్వాధ్యాయంక్రిందే ప్రస్తుతకాలాన్నిబట్టి తీసుకోవచ్చు. ఏచదువైనా, యీ క్రియాయోగంలో చివరరాబోయే ఈశ్వరప్రణిధానానికి ఉపయోగించేదైతే స్వాధ్యాయంక్రింద పరిగణింపవచ్చు. అంటే వేదాలను చద వటమేకాక, మన రామకృష్ణచరిత్ర, వారి ఉపదేశాలు చదివినా, వాటివల్ల భక్తి కలిగిందంటే, అది స్వాధ్యాయంఅనే గట్టిగా అనవచ్చు.

ఈస్వాధ్యాయాన్ని ప్రతిదినం తప్పకుండాచేయాలి. ప్రతిదినం ఉద యమే స్నానాదులైనతర్వాత, గీతాపారాయణం చేయటంకూడా స్వాధ్యాయం అనవచ్చు. అలాగే, బుద్ధిని దినదినము భగవంతునిమీదికి త్రిప్పుతూ ఉంటా నికి, యీస్వాధ్యాయాన్ని తప్పకచేస్తూనేఉండాలి. అలా చేయక పోయామా అంటే బుద్ధి అన్యవిధంగాపోయి, లోకంపాలుకావటానికి చాల అవకాశాలుం టాయి. అందుచేత స్వాధ్యాయాన్ని మరచిపోకుండా, నిత్యం చేస్తూఉండాలి. సరీగ్గా స్వాధ్యాయం చేస్తూఉంటే, ఈశ్వరప్రణిధానం సాధ్యం అవుతుంది.

ఈశ్వరప్రణిధానంఅనేది క్రియాయోగంలో చివరివిషయం ఈశ్వర ప్రణిధానం. అంటే, ఈశ్వరుడు సర్వవ్యాపకుడని గ్రహించేటప్పటికి వెంటనే ఆభగవంతునిపై భక్తికుదిరిపోతుంది. అలా భగవంతుని గొప్పదనం గ్రహించి, అతనిపైన చిత్తాన్ని లగ్నంచేయటానికి భక్తిగలిగి యత్నించటం ఈశ్వర ప్రణిధానంఅంటారు. ఈశ్వరునివిషయం, భక్తివివరాలు, ముందు భక్తి యోగంలో యింకావివరంగా చెప్పుతాను. కాబట్టి ప్రస్తుతంక్లుప్తంగా ముగిస్తు న్నాను. ఈ ఈశ్వరజిజ్ఞాసవల్ల అంటే భక్తివల్ల సమాధిస్థితులు కలుగుతాయని

పతంజలి వాగ్దానం.

ఇలా, నియమంఅనే అంశంకూడా పూర్తిచేశాం. యమనియమాలలో ఉండేరహస్యం ఒకటుంది గ్రహించావో, లేదో! యమంలో అంగాలేమిటి? అహింసాసత్యాస్తేయబ్రహ్మచర్యాపరిగ్రహాలు. వీటిల్లో బాహ్యవిషయాలతో సంబంధంలేనిదేదీకూడా లేదు. అంటే, యమంఅనగానే బాహ్యప్రపంచానికి, నీకుఉండే సంబంధం, వ్యవహారంఅని తెలుతుంది. ప్రపంచంతో నీకుండే సంబంధాలు నిర్మలంగా ఉంచుకోటం యమంఅవుతుంది. నీ బహిప్ప్రవృత్తిని అంటే ప్రపంచంమీదికి పోయేబుద్ధిని నిరోధించుకుని, నిర్మలంగా ఉంచుకోటం యమంఅంటాం. సంయమనంఅనికూడా ఒకవిధంగా అనవచ్చు. నియమంఅంటే నియమించటం అవుతుంది. ఆనియమించటం అంతరంగా అని నియమంలోనిరహస్యం. అందుకనే శౌచ, సంతోష, తపస్స్వాధ్యాయేశ్వర ప్రణిధానాలు ఎక్కువగా అంతరాన్నే సూచిస్తున్నాయి. అందుచేత, **బుద్ధి** యొక్క బాహ్యనిరోధం యమంఅని, అంతర్నిరోధం నియమంఅంటే సులభంగా తెలుస్తుంది. తర్వాత రాబోయే అష్టాంగయోగాంగములన్నింటికి యీ యమనియమాలే మూలాధారం. ఇవిలేకుండా 'ఆసన, ప్రాణాయామాది సమాధిపర్యంతంగలవన్నీ కేవలం గారడీవిద్యలైపోతాయి. అందుకనే **సర్వజ్ఞు**డైన పతంజలిఋషి, కుశాగ్రబుద్ధియైన పతంజలిమహర్షి, యమనియమాల్ని మొదట్లోనే ఉంచి, 'ఒరే! అబ్బాయిల్లారా! అమ్మాయిల్లారా! మొదట వీటిని సాధించండి. ఇవి స్వాధీనం అయినతర్వాత పైవాటికి పొండి' అని గట్టిగా చెప్పినాడన్నట్లు, వీటినే ద్వారపాలకుల్లాగా ముందుంచాడు. ఇదీ రహస్యం. ఈ అంతరార్థం గ్రహించుకోలేని పెద్దలంతా పొరపాటుపడి, యీ మొదటి రెండింటిని అంటేయోగసిద్ధికి, అష్టాంగమార్గసిద్ధికి మూలమైన యమనియమాలను, వాటి దశాంతర్భాగాలతోగూడ పాటించక, ఆసనందగ్గరనుండే ప్రారంభించి చెడిపోతున్నారు. వారు చెడటమేకాకుండా, అనేకమందిని చెరుస్తున్నారు. అందుచేత తమ్ముడూ! నీవు యీరహస్యాన్ని బాగా గ్రహించి ప్రవర్తించాలి. ఇవి సాధ్యంకానిది, పై తరగతివేవిన్నీ అసలే సాధ్యంకావు. ఒకవేళ అయినట్లు కనుపించినా, అవి తాలుగింజలేగాని గట్టిగింజలుకావని నమ్ము.

యమనియమాలులేని సాధన నిష్ఫలంఅని గట్టిగానమ్ము తల్లీ! అందరూపడే పొరపాటు నీవుకూడాపడకుండా ఉంటావని నమ్ముతూ, యీ విషయాన్ని నీకు క్షుణ్ణంగా గ్రహింపజేసి, యమనియమాలలో నీకు ప్రజ్ఞను, పూర్తిఅనుభవాన్ని, శ్రీశారదారామకృష్ణులు ప్రసాదిస్తారుగాకఅని విశ్వసిస్తూ, యీ ఉత్తరాన్ని విరమిస్తున్నాను.

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం.

26-1-46

# 13

# రాజయోగము

## ఆసనము

*ప్రియమైన మాతాజీ!*

అసలు 'యోగి' అంటే పూర్వపుటుత్తరాలతో చర్చించిన యమనియమాలసంగతిఅనుకునేవాళ్ళేలేరు. అంతేకాదు తర్వాతవచ్చే ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులవిషయం ఎత్తుకునేవారుకూడా ఉండరు. యోగి అనగానే ఆసన ప్రాణాయామాలలో ఘటికుడనేఅర్థం పామరలోకంలో పరిపాటిఅయిపోయింది. కానిజాగ్రత్తగా పరీక్షించిచూస్తే, యమనియమాలను పునాదిగా గలిగి, ఆసన ప్రాణాయామాలను ఉపకరణములుగా పొంది, ప్రత్యాహార, ధ్యాన, ధారణలను మార్గాలుగాపొంది, సమాధిని పర్యవసానంగా కలిగిఉన్న విధానమే 'యోగం' అంటే. పైపద్ధతిప్రకారం ఆసమాధిస్థితినిపొందినవాడు యోగిఅనబడతాడు. కాని కేవలంప్రాణాయామంచేస్తున్నా, నాలుగాసనాలు వేస్తున్నావాడుయోగికానేకాడు. అందుకనే క్రితంఉత్తరాల్లో, యమనియమాలనుగూర్చి గట్టిగావ్రాశాను. ఇక ప్రస్తుతం, యీఆసనాలనుగూర్చి చూద్దాం.

ఆసనాలు అనేటప్పటికి, చాలమందికి శీర్షాసనం జ్ఞాపకంవస్తుంది. ఆసనాలు వేస్తున్నామని ఎవరన్నా అన్నారంటే, 'శీర్షాసనం వేయగలరా?' అని అడుగుతారు అందరూ. కాని యోగస్థితికి యీశీర్షాసనం అంతముఖ్యం కాదు సుమా! అయినా అది, ఆసనాల్లో ముఖ్యంగా పరిగణింపబడుతూ, ఆసనాలన్నింటికి రాజులాగా చూడబడుతుంది.

విచారణచేస్తే ఆసనాలురెండురకాలున్నాయి. ధ్యానాసనాలుఅనేవి మొదటిరకం. రెండోరకం యోగాసనాలు. తపస్సుకు, ధ్యానసమాధులకు ఉపకరించే ఆసనాలు ధ్యానాసనాలు అనబడతాయి. నాడీపటుత్వానికి, ఆరోగ్యానికి పనికివచ్చేవాటిని యోగాసనాలు అంటారు. ఈరెండురకాలు ముఖ్యమేగాని, ధ్యానాసనాలు అసలు యోగానికిముఖ్యం. వాటినే ఎల్లరు తెలుసుకొని ఉండాలి. వాటిలో అన్నింటినీకూడా గ్రహించవలసిన అవసరంలేదు. ఏదైనా ఒక్కఆసనాన్ని అభ్యాసంచేస్తేచాలు. అభ్యాసంఎంతవరకు చేయాలంటే, కదలకుండా ఆసనంమీద మూడుగంటలసేపు ఉండగలిగినప్పుడు, ఆ ఆసనం మనకు స్వాధీనంఅయినట్లు. దాన్నే ఆసనసిద్ధి కలిగిందంటారు. అలా ఆసనసిద్ధి కలిగితేనేగాని మనదేహం మనకులొంగి, మన ధ్యానాదులకు ఆటంకాలు కలుగజేయకుండా ఉండదు. దేహం ఆటంకాలను ఎప్పుడు కలుగజేయదో, అప్పుడు చిత్తం దానిఅభ్యాసాన్ని సాగించి, ఏకాగ్రత కావటానికి యత్నిస్తుంది. త్వరలో ఆఏకాగ్రతను సాధిస్తుందికూడాను. అందుకని సాధకుడు తప్పకుండా యీధ్యానాసనాలలో ఏదోఒకదాన్నైనా సాధించుకొనిఉండాలి.

అసలు ముందు 'ఆసనం' అంటేఏమిటో తెలుసుకొనిఉంటే, ఆసనం అనగానే భయముండదు. పతంజలి యీఆసనం నిర్వచనంచేస్తూ 'స్థిరసుఖమితి ఆసనం' అనిఅన్నాడు. స్థిరంగాఉండేది, సుఖంగాఉండేది ఆసనం. అంటే ఒకరకంగా కూర్చున్నామంటే, దేహంలో ఎక్కడైనానొప్పిగాని, తిమ్మిరిగానిఉండరాదు. కూర్చున్నంతసేపూ సుఖంగాఉండాలి. అందుకని ఏవిధంగా కూర్చున్నా బాధలేకుండా, ఎక్కువకాలం కూర్చోగలిగామంటే, అది ఆసనం అన్నమాటే. గ్రంథాలలో ఆవిధం చెప్పబడకపోయినా ఫరవాలేదు. మనకు

సుఖంగా, ధ్యానానికి ఉపయుక్తంగా ఉండే ఆసనాన్నే ఉపయోగించుకోవచ్చు. ఏమీ భయంలేదు.

ఈ ధ్యానాసనాలలో సూత్రం స్థిరత్వం, సౌకర్యం అన్నారు కదూ! ఆ రెండులక్షణాలు ఎలా కలుగుతాయిఅనేదే ప్రశ్న. మన పూర్వఋషులు, అనేక రకాల పరిశీలనచేశారు. అనేక ధ్యానాసనాలను తీర్మానించారు. వీటి కన్నింటికి కొన్నింటికి కొన్ని ముఖ్యసూత్రాలున్నాయి. వాటిలో మొదటిదేమిటంటే, వెన్నెముక నిటారుగా ఉంచటం. నడుమునుఏమాత్రం నడ్డిగా ఉంచినా, కొంచెంసేపులో నొప్పి ప్రారంభంఅవుతుంది. అలాగే, వెన్నెముక ముందుకు వంగిఉన్నా బాధ మొదలుపెట్టుతుంది. లేక వెనకాలకువ్రాలిఉంటే, కాళ్ళు పైకి లేచిపోతూ ఆసనమేకుదరదు. లేకముందుకువ్రాలితే, బాధాకరం అవుతుంది. కాబట్టి, ధ్యానాసనాలకు వెన్నెముక చాలాప్రధానమైనది. దాన్ని ఎప్పుడూ వంకరలేకుండా, నిటారుగా ఉంచాలిఅనేది ప్రథమసూత్రం. అలాగే మెడను కూడా ముందుకుగాని, వెనుకకుగాని, ప్రక్కకుగాని, వంచకుండా సరిగా ఉంచాలి. ఇది రెండోసూత్రం. ఇలా వెన్నెముక, మెడ, నిటారుగాఉంచినా, బిగింపులేకుండా సామాన్యంగానే ఉంచాలనేదే మూడోసూత్రం. బిగించా మంటే, నొప్పి ప్రారంభంకావటానికి ఎక్కువకాలం పట్టదు. ఇక కాళ్ళు పెట్టు టంలో అనేకమార్పులువస్తాయి. ఆమార్పులనుబట్టి ఆసనాలకుపేర్లు మారు తుంటాయి. ఆకాళ్ళనైనా అమర్చుకోటంలో చాలజాగ్రత్తఉండాలి. కాళ్ళు తిమ్మిర్లు ఎక్కరాదు. ఎట్టిబాధ కలుగరాదు. కాళ్ళఎముకలకుగాని, కండరా లకుగాని, వత్తిడిలేకుండా ఉంచుకోటమే చాల ముఖ్యవిషయం. ఇది నాలుగో సూత్రం. చేతులు ఎలాఉంచుకొన్నా ఫరవాలేదు. బాధలేకుండా, వాటిమీద ఏ భారంలేకుండా ఉంచటంతప్ప, మరేనిబంధన యీచేతుల్నిగురించి లేదు. అందుచేత చేతులమార్పునుబట్టి ఆసనంపేరుమారదు, ఆసనం మారదు. ఇప్పుడు ఆసనంఅంటే ఏమిటో, కొంతవరకు దాన్నిలోఉండే సామాన్య లక్ష ణాలు నీకు బోధపడినవని నమ్ముతున్నాను. ఇక ఆయా ఆసనాలలో ఉండే ప్రత్యేక లక్షణాలను, ముఖ్యమైనవాటిని చర్చిస్తాను విను.

# 1. పద్మాసనము

ఈ ధ్యానాసనాలకంతా మకుటంలాంటిది పద్మాసనంఅని చెప్ప వచ్చును. దీన్నే ఎక్కువమంది వాడుతూఉంటారు. అలాగా అందరూ దీన్నే అభ్యసించాలిఅని శాసనం లేదన్నానుసుమా! ఎవరిసౌకర్యం వాళ్ళది. దీనినివేసే విధానం చెప్పుతానువిను. మొదట కాళ్ళురెండు బారజాపుకొని కూర్చోవాలి. మోకాలిదగ్గర వంచుకుంటూ ఎడమపాదాన్నిగాని, కుడిపాదాన్నిగాని, మెల్లగా ఎత్తి రెండవకాలి తొడమీదపెట్టాలి. ఈపెట్టిన పాదాన్ని కదలనీయకుండా, రెండోకాలిపాదాన్నిమెల్లగా, ఆకాలిని మోకాలిదగ్గర వంచుకుంటూ, మొదటి కాలితొడమీద ఉంచాలి. పూర్వం చెప్పినట్లు నడుము సరిగాఉండాలి. చేతులు ఎలాఉంచుకొన్నా సరే. కుడిచేయి కొద్దిగా మోచేయిదగ్గరవంచిగాని, నిటా రుగాగాని కుడిమోకాలుమీద, అలాగే ఎడమచేయి ఎడమమోకాలుమీద ఉంచవచ్చు. లేకపోతే ఒకచేయిలో మరొకచేయిని పెట్టుకొని, రెంటిని పొట్ట క్రిందుగా కాళ్ళకుఆనించి పెట్టుకోవచ్చు. లేక వ్రేళ్ళలో వ్రేళ్ళుదూర్చి, పరమ రామకృష్ణుడు చేతుల్నిఉంచినట్లు ఉంచుకోవచ్చు. అలాకాకపోతే, రెండు చేతుల్ని రొమ్ముదగ్గర ఒకదానిలోఒకటి చేర్చిపెట్టవచ్చు. అది మనయిష్టం, మనసౌకర్యం. ఈ విధంగా ఉండేది పద్మాసనం అంటారు.

# 2. స్వస్తికాసనము

మొదట కాళ్ళురెండు బారజాపుకొని కూర్చోవాలి. మోకాలిదగ్గర వంచుకుంటూ, మొదటికాలివ్రేళ్ళను రెండోకాలితొడకు పిక్కకు మధ్యగా, పైకి కనిపించేలాగున పైకిలాగటం, రెండోకాలివ్రేళ్ళను మొదటికాలి తొడకు పిక్కకు మధ్యగా క్రిందకుతోయటం చేయాలి. అప్పుడది స్వస్తికాసనం అవు తుంది. అప్పుడు రెండుకాళ్లు ఒకముడిలాగా అవుతాయి. ఈ ఆసనంకూడా సులభమే. చాలమంది వుపయోగించుకుంటూ వుంటారుకూడా.

# 3. వజ్రాసనము

ఇంతవరకు చెప్పబడ్డ ఆసనాలలో, కాళ్ళలో కొంచెంమాత్రమే

మార్పులు. కాని, యికవచ్చే ఆసనాలలో చాలామార్పు ఉంటుంది. అలా, మార్పుండేఆసనాలలో వజ్రాసనంఒకటి. మొదట కాళ్ళుజాపుకుని కూర్చున్న పిమ్మట కుడికాలు మోకాలిదగ్గర వంచి, పాదాన్ని వెలికిల కుడిపిరుదుప్రక్కన ఉంచాలి అనుకునేటట్లు. అలాగే, ఎడమపాదాన్ని ఎడమ పిరుదుప్రక్కన ఉంచాలి. కాలివ్రేళ్ళు పిర్రలకు వెనకాలకు తిరిగిఉండాలి. దీన్ని వజ్రాసనం అంటారు. దీన్నే యింకాకొంచెం మార్పుతోకూడా వేస్తారు. ఇలా కూర్చున్న తర్వాత పాదాల్నిదగ్గరకుచేర్చి, పాదంమీదపాదంఉంచి, మడిమలను ప్రక్కకు వంచి, ఆపాదాలమీద కూర్చోవాలి. ఈరెండు విధానాలలో మోకాళ్లుమాత్రం కలిసేఉండాలి. ఈఆసనంకూడా చాల సుఖప్రదంగా ఉంటుంది. దీనిమీద ఎంతకాలమైనా ఉండవచ్చు. చేతుల్ని ఎలా ఉంచినా ఫరవాలేదు.

## 4. గోముఖాసనము

కాళ్ళుచాపుకుని కూర్చున్నమీదట, మొదటికాలువంచుకుని, ఆ కాలి మడిమను రెండోవైపు పిరుదుకు ఆనేటట్లు ఉంచాలి. ఇక రెండోకాలిని మొదటికాలికిపైగా ఎత్తి, దాని మడిమను ఎదుటివైపు పిర్రప్రక్కకు **అనేటట్లు** ఉంచాలి. మొదటికాలి మోకాలుమీద రెండోకాలి మోకాలుండాలి. ఎడమ చేతిని వీపువెనుకనుండితీసి వ్రేళ్ళనుచాచాలి. కుడిచేతిని పైకిఎత్తి, మెడవెనుక భాగమునకు దించి, చాచిఉంచిన ఎడమచేతివ్రేళ్ళను పట్టుకోవాలి. ఇది ఒక విధానం. అలాకాక కాళ్లు పైనచెప్పినట్లు ఉంచుకొని, చేతులను వెనుకకు పెట్టక, వ్రేళ్ళలో వ్రేళ్లుచేర్చి పైమోకాలును పట్టుకునిఉంచుతారు. ఈ ఆసనం కూడా ధ్యానానికి చాలఉపయోగం.

## 5. వీరాసనము

గోముఖంలాగే కాళ్ళుపెట్టుతూ, రెండోకాలిపాదాన్ని పిర్రవరకు పోనీయకుండా, మొదటికాలి తొడమీదనేఉంచితే వీరాసనం అవుతుంది. అప్పుడు మోకాలుమీద మోకాలుఉండదు. పైమోకాలిని చేతులతో పట్టుకోవచ్చు. లేక ఒకమోకాలిపై ఒకచేతిని, రెండవమోకాలిపై రెండవచేతిని పెట్టు కొన వచ్చును.

# 6. శవాసనము

ఈఆసనం అన్నింటికంటె చాలసులభం. ఎంతసులభమో అంతకష్టం. కాబట్టి ఎవ్వరూ ధ్యానానికి దీన్ని ఉపయోగించరనే చెప్పాలి. ధ్యానంలో చాలా ఆరితేరినవారికిగాని యిది సాధ్యంకాదు. కాళ్ళు, చేతులు చాచి, వెలికిలాగాని, బోరిగిలిగాని, ప్రక్కకుగాని పరుండాలి. ఏ అవయవాన్ని బిగించి ఉంచరాదు. ఎక్కువగా వెలికిలానే యీఆసనాన్ని వాడతారుఅందరూ. ఈఆసనం యితర ఆసనాలన్నింటికంటే బాగా మోసంచేస్తుంది. కాబట్టే చాలకష్టంఅన్నాను. సాధకునికి తెలియకుండానే, ధ్యానానికి పూనుకున్న మనస్సును నిద్రలోకి దించేస్తుంది. ధ్యానానికిబదులు సుఖంగా నిద్రను అనుభవిస్తాడు యీశవాసనాన్ని ఉపయోగించేవాడు. కాబట్టే యితరాసనాల్ని వేటినైనా ఉపయోగించవచ్చుగాని, యీఆసనాన్ని మాత్రం ధ్యానానికి అందరూ వాడరాదు.

ఇంకా యీధ్యానాసనాలు అనేవి చాలరకాలున్నా, ప్రస్తుతం వాటిలో ముఖ్యం అయినవాటినిమాత్రమే చెప్పాను. వీటిలో ఏ ఒక్కదాన్నైనా అభ్యాసం చేస్తే చాలును అని మొదట్లోనే చెప్పానుగదా! అందుకని, నీకు ఏ ఆసనం సులభమని తోస్తుందో దాన్నిమాత్రం, గట్టిగా పట్టుదలతోవేస్తూ సాధ్యంచేసుకో.

ఈఆసనాలకంతా ముఖ్యసూత్రం, దేహం మన ధ్యానానికి అంతరాయం కలగకుండా చేయటానికిఅని అన్నాను. దానికై ఎప్పుడో రోజుకు ఒక అరగంట ప్రయత్నం చేస్తుంటే, యీఆసనాలు సాధ్యంకావు. దేహాన్ని స్వాధీనం చేసుకోటానికి, ఎప్పుడూ ఒకకన్నును దానిమీదేఉంచాలి. ఎక్కడైనా కూర్చున్నామంటే వీలైనంతవరకు, మనం మన అభ్యాసయోగ్యమైన ఆసనంలోనే కూర్చోవాలి. లేక ఏదోఒక ఆసనంమీద కూర్చోవాలి. అలాకాకపోయినా నడుమునైనా నిటారుగా ఉంచుతూ, దేన్నిఆనుకోకుండా కూర్చోవాలి. ఇలాంటి నిరంతరాభ్యాసంవల్ల ఆసనం కుదురుతుంది. అంత దేహం స్వాధీనం అవుతుంది. ఈదేహం స్వాధీనంఅయ్యేంతవరకు మనలక్ష్యం యీ దేహంమీదనే ఉంచాలిఅన్నమాట. ఇక ధ్యానకాలంలో మనఆసనాన్ని వదలనే

రాదు. అదీకాకుండా రోజురోజుకు ఆసనాన్ని మార్చరాదు. మొదట్లోనే అన్ని ఆసనాలు వేసిచూచుకుని, ఏఆసనం నీకు సులభంగాఉంటుందో చూచు కుని, ఒకరోజులో కాకపోయినా, వారం పదిరోజులలోనైనా ఒక ఆసనాన్ని నిశ్చయం చేసుకొని, ధ్యానానికి, జపానికి తప్పకుండా ఆయాసనాన్నే ఉపయో గిస్తూ ఉండాలి. అప్పుడు అది మనకు బాగాఅలవాటైపోతుంది. ఈ ఆసనా భ్యాసవిషయంలో చాలపట్టుదల చూపిస్తేనేగాని, మనకు దేహం లొంగదు సుమా! కాబట్టి జాగ్రత్త. ఈ ధ్యానాసనాలు కుదరటానికి కొంచెం దేహబలం అవసరం. ఆరోగ్యంబాగాఉండాలి. అందుకైచెప్పారు యోగాసనాలు. వీటిలో ముఖ్యమైనవాటిని కొన్నిటిని నీవుకూడా తెలిసికొనిఉండాలి. ఈ యోగా సనాలు స్త్రీలకుఅవసరమా అనేప్రశ్న ఒకటుంది. ఈవిషయంలో చాలా భేదా భిప్రాయాలున్నాయి. గర్భిణీస్త్రీలకు బొత్తిగాకూడదు హానికరంకాబట్టి. ఇతర్లకుపయుక్తమేఅని కొందరంటారు. అసలుస్త్రీలకే, వాళ్ళు సంసారులైనా, సన్న్యాసులైనా పనికేరాదంటారు యింకాకొందరు. యిందరు ఎల్లా అంటున్నా సంసారసంబంధంలేని, బ్రహ్మచర్యంలోఉండే స్త్రీలు పురుషులవలె యీఆస నాలను ఉపయోగించవచ్చును అనేవాళ్ళల్లో నేనొకడిని. సంసారిఅయినా గర్భ వతికాకపోతే, సూక్ష్మంగా ఆసనాభ్యాసం చేయవచ్చుఅనికూడా అంటాను. దీనివల్ల ప్రమాదంఉండదని నావాదం. ఏది ఎల్లాఉన్నా వాటినిగురించి తెలుసు కోటంలో తప్పులేదుగా! అందుచేత కొంచెం వివరిస్తాను.

## 7. శీర్షాసనము

యోగాసనాలలో రాజులాంటిది శీర్షాసనం అన్నాను. దీన్నే కపాలాసన మనికూడాఅంటారు. శీర్షంఅన్నా, కపాలంఅన్నా తలఅనిఅర్థం. ఒక్కతల మీద మన శరీరంఅంతా నిలిచిఉంటుందికాబట్టి, యీఆసనానికి తల ముఖ్యా ధారంకాబట్టి ఆపేర్లు పెట్టారు. దీన్నే వృక్షాసనంఅని, తాడాసనం అనికూడా అంటారు. ఈఆసనంలోఉన్న సూత్రం ఏమిటంటే, ఒక్కతలపైన దేహం అంతా నిటారుగా నిలవాలి. అందుకనే యీఆసనం చాలా కష్టం. జాగ్రత తప్పితే చాలఅపాయకరం. దీన్ని సాధించడానికి ఏగోడనో, స్తంభాన్నో,

ఆధారంచేసుకుని వేస్తారు కొందరు. కాని అలాచేయటం మంచిదికాదు. మొదట్లో క్రిందపడుతూవున్నా, విశాలమైనస్థలంలో దీన్ని సాధించాలి. నేల మీద మెత్తగా ఆసనంగాని, గుడ్డనుకాని నాలుగైదు మడతలతో వేసుకోవాలి. దానిమీద, పాదాలమీదకూర్చుని, ముందుకువంగి, చేతివ్రేళ్ళల్లో వ్రేళ్ళనుచేర్చి ముడిలాగా గట్టిగాఉంచుకుని, ఆచేతులలో తలనుపెట్టాలి. తల మధ్యభాగం సరిగా నేలకుఆనాలి. చేతులముడి గట్టిగామాత్రం వుండాలి. తర్వాత మెల్లగా నడుమును ముందుపైకిఎత్తాలి. అంత కాళ్ళనుకూడా ఎత్తాలి. తొందర పడ కూడదు. మొదట నడుమువరకు ముడుచుకొనిఎత్తి, చివరికి కాళ్ళు పైకి జాచాలి. కాళ్ళు ఏమాత్రంవెనకకున్నా, ముందుకున్నా ప్రక్కకున్నా పడిపో తారు. అంతేకాక కాళ్లు కదలరాదు. మెడ వంగకూడదు. దేహంఅంతా వంకర లేని ఒక కర్రలాగ నిలిచివుండాలి. ఇలాంటి లక్షణాలు కలిగింది శీర్షాసనం.

దీనివల్ల నాడీపటుత్వం, బుద్ధికుశలత, ఇంద్రియనిగ్రహం మొదలైన ఫలితాలు కలుగుతాయి. దీన్ని చాలాజాగ్రత్తగామాత్రం అభ్యసించాలి. ఆసనం కుదరకపోతే దుష్ఫలితాలుకూడా వస్తాయి. ఎంతకాలం వేయాలో, వాటికి నియమాలుకూడావున్నాయి. ఈవిషయాల్ని అన్నింటిని అనుభవజ్ఞులను విచారించి, వారిసలహా, సహాయంపైనమాత్రమే యీయాసనం అభ్యసిం చాలి. అంటే, స్వతంత్రించి యీ శీర్షాసనం అభ్యసించరాదు. ఈ ఆసనం కుదిరి, అభ్యాసంచేస్తే చాల ప్రయోజనంమాత్రం వుంది.

## 8. సర్వాంగాసనము

ఈఆసనంకూడా చాలాముఖ్యం. శీర్షాసనంఅంత ప్రాధాన్యతగలది. అన్ని ఫలితాలనుకూడా యిస్తుంది. కాని అంతకంటేసులభం. ఈఆసనాన్ని వేయటానికిముందు వెలికిలాపడుకోవాలి. తర్వాతమెల్లగా కాళ్ళను వంచ కుండా నడుమువరకు నిటారుగాఎత్తాలి. ఆపైన నడుమునుకూడా మెల్లగా పైకెత్తి, నడుముక్రింద పూటీలుగా రెండుచేతుల్నిపెట్టి, మోచేతుల్ని నేల మీదనే వుంచి, వాటిమీద బరువును మోపుతూఉండాలి. తల వెనుకభాగం, మెడ, భుజాలు, నేలకు ఆనివుంటయి. భుజాలదగ్గరనుండి కాలివ్రేళ్ళవరకు, నిటారుగా ఒక కర్రలాగా నిలబడివుండాలి. ఈ సర్వాంగాసనం చాల శ్రేష్ఠం.

కపాల, సర్వాంగాసనాలవల్ల అజీర్ణ మలబద్ధక వ్యాధులుకూడా నివారణ మౌతాయి. కాని తలభాగంలో జబ్బులుండేవారు, గుండెజబ్బున్నవారు వీటిని అభ్యసించరాదు. ఆరోగ్యవంతులుమాత్రం ఎన్నో ఫలితాలను పొందుతారు.

## 9. భుజంగాసనము

పేరులోనే దీనిరహస్యం వుంది. భుజంగంఅంటే పాముగదా! కాబట్టి పాములాగా ముందు తలఎత్తివుండటం భుజంగాసనముఖ్యాంశం. కాళ్ళ వ్రేళ్ళు మొదలుకొని బొడ్డువరకు నేలను ఆనివుండాలి. దీనికని ముందు బోర్లాపరుండాలి. తల, రొమ్ము, బొడ్డువరకు పైకెత్తాలి. చేతులమీద ఆధారపడకూడదు. చేతుల్ని తొడప్రక్కనే ఉంచిగాని, లేక నామమాత్రంగా భుజాలకు ప్రక్కనే నేలమీద వుంచిగాని, దేహంయొక్క ముందుభాగాన్ని పైకెత్తాలి. దీన్ని భుజంగాసనం అంటారు. దీనివల్ల జీర్ణశక్తి అభివృద్ధి అవుతుంది.

## 10. శలభాసనము

శలభంఅంటే మిడుత. భుజంగాసనంలోలాగా ముందుకు పడుకుని, ముందుభాగంకాకుండా, బొడ్డునుండి కాలివ్రేళ్ళవరకు, వెనుకభాగాన్ని వంకర లేకుండా పైకెత్తటం శలభాసనలక్షణం. లేక, కేవలం బొడ్డుమీద దేహభారం అంతావుండేటట్లు, ముందుభాగం పైకిఎత్తటంకూడా శలభాసనంఅంటారు.

## 11. ధనురాసనము

ఈఆసనం వేసినతర్వాత దేహం ఒకవిల్లులాగావుంటుది. కాబట్టి ధనురాసనంఅన్నారు. పూర్వంలాగా ముందుకుపరుండి, కాళ్ళచీలమండలను వెనుకనుంచి చేతులతోగట్టిగాపట్టుకోవాలి. మోకాళ్ళను దగ్గరకుచేర్చి, బొడ్డుమీద శరీరంఅంతా వుండేటట్లు మోకాళ్ళు, రొమ్ము, తల పైకిఎత్తాలి. దీన్ని ధనురాసనంఅంటారు. పైమూడు ఆసనాలు చాలవరకు ఒకేఫలితాన్నియిస్తాయి.

## 12. హలాసనము

హలం అంటే నాగలి. ఈ ఆసనంలో భుజంగాసనంలో మాదిరిగా

ముందుకుకాకుండా, వెనుకకు వెల్లికిలా పడుకోవాలి. చేతులు, తొడలకు ప్రక్కగా సాపుగావుంచాలి. మొదట, కాళ్ళు నడుమువరకు మెల్లగా ఎత్తాలి. తర్వాత, కాళ్ళు రెండుకలిపి, తల వెనుకకు వచ్చేటట్లు నడుమును పైకెత్తాలి. కాళ్ళు మోకాళ్ళదగ్గర ఏమాత్రం వంచకూడదు. తర్వాత, మెల్లగా కాలివ్రేళ్ళు నేలకు ఆనేటట్లు చేయాలి. మొదట్లో సాధ్యంకాదు. కాని తొందరలేకుండా అభ్యసిస్తూఉంటే, రెండు మూడు దినాలలో కుదురుతుంది.

# 13. యోగముద్రాసనము

ముందు పద్మాసనంవేయాలి. చేతులురెండు వెనకాలవుంచి, ఒక చేతితో మరొకచేతిని మణికట్టుదగ్గర పట్టుకోవాలి. వెన్నెముక వంగకుండా నడుముదగ్గరనుంచి పైభాగాన్ని ముందుకువంచాలి. ముఖాన్ని నేలకు ఆనించాలి. ఇది యోగముద్ర అనబడుతుంది.

# 14. పశ్చిమతానసము

కాళ్ళు ముందుకుచాచుకుని కూర్చోవాలి. కాళ్ళు కొంచెంగానైనా మోకాళ్ళదగ్గర వంగకుండా, కాలి బొటనవ్రేళ్ళను చేతుల్తోపట్టుకోవాలి. కొందరికి యిదికూడా మొదట్లో కుదరదు. అభ్యాసంమీద కుదురుతుంది. తర్వాత నడుమును, తలను ముందుకు మెల్లగావంచి, కాళ్ళువంగకుండా తల మోకాళ్ళను తాకాలి. ఇది చాలకష్టం. ఎక్కువ అభ్యాసం చేస్తేకానిరాదు.

# 15. మయూరాసనము

ఈఆసనంకూడా కష్టమే. పొరపాటుపడితే చేతులు విరిగిపోతాయి. అందుచేత, చాలజాగ్రత్తగాఉండాలి. తొందరఏమాత్రం పనికిరాదు. ముందు కాలివ్రేళ్ళమీద కూర్చోవాలి. రెండు చేతుల్ని మోకాళ్ళమధ్యగా చేతి వ్రేళ్ళను వెనుకకు త్రిప్పి, కొంచెంగా వంచి, మోచేతుల్ని బొడ్డుకు గట్టిగా మోపాలి. దానికై అప్పుడు వెన్నెముకను కొంచెం వంచవలసివస్తుంది. తర్వాత చేతుల

స్థానం కదలకుండా, రెండు కాళ్ళను ఒకేసారి వెనుకకు జరిపేయాలి. అంత బొడ్డుదగ్గరఉన్న మోచేతులపైన శరీరాన్నంతా నిలుపుతూ, తలదగ్గరనుండి కాళ్ళవరకు ఒకేకర్రలాగా అడ్డంగా, భూమికి సమానఎత్తులో ఉండేటట్లు నిల పాలి. దీన్ని మయూరాసనంఅంటారు. మయూరంఅంటేనెమలి. ఈఆసనం వల్లకూడా అజీర్ణనివారణం, ఇంద్రియనిగ్రహం, రక్తశుద్ధి మొదలైనవెన్నో ప్రయోజనాలు కలుగుతాయి.

ఇలాగ, ధ్యానానికికాకుండా దేహపటుత్వానికి, నాడీదార్ఢ్యతకు, రక్త శుద్ధికి, ఇంద్రియనిగ్రహానికి, యింకా పలువిధములైన శారీరక సామర్థ్యాలకు ఉపయుక్తంఅయ్యే ఆసనాలుచాలఉన్నాయి. వాటిలో ముఖ్యంగాఉండేవి, సర్వే సర్వత్రా ఎక్కువగా వాడుకలోఉండేవిఅయిన ఆసనాలను క్లుప్తంగావర్ణించాను. అనుభవప్రకారం యీఆసనాలలక్షణాలు తెలిసినవాడు చెప్పుతుంటేనేగాని వీటిని అభ్యాసం చేయరాదు.

యమనియమాలవల్ల కలిగిన ఈశ్వరదర్శనకాంక్ష సఫలం కావటానికి దేహం అవసరంకాబట్టి, అందుకు యీదేహం కొంచెం శక్తివంతంగా ఉండాలి కాబట్టి, యీఆసనాలవల్ల ఆధ్యాత్మికాభివృద్ధికి ఎంతశారీరకబలం అవసరమో అంతబలమే వస్తుందికాబట్టి, ఆసనాలు కొంతవరకు ఆబలంలేనివాళ్ళకు అవ సరం అంటున్నాను. ఆబలం సంపాదించినతర్వాత ధ్యానాసనాలు సులభం అవుతాయి. వాటివల్ల ముందుకార్యక్రమం సులువైపోతుంది.

ఈ ఆసనాలకుబదులు, శరీరవ్యాయామం చేయకూడదా అంటా వేమో! అది పనికిరాదు. ఎందుకంటే శరీరవ్యాయామంవల్ల కండలు పెరుగు తాయి. ఆసనాలవల్ల నాడులు శక్తివంతంఅవుతాయి. కండబలం బుద్ధి మాంద్యాన్ని కలుగజేస్తుంది. నాడీబలం బుద్ధిబలాన్ని యిస్తుంది. కండబలం ఉన్నా ఆరోగ్యంఉండదు. నాడీబలంలో ఆరోగ్యం తప్పకుండాఉంటుంది. అంటే వ్యాయామంవల్ల కండలు పెరుగుతాయిగాని ఆరోగ్యంసున్న. ఆసనాల వల్ల కండలు పెరగకపోయినా ఆరోగ్యం కలుగుతుంది. ఆరోగ్యంలోనే అసలు బలంఅనేదిఉంది. ఆకారణంచేత ముముక్షువు ఆరోగ్యానికి యత్నించాలిగాని

కండబలానికి పాటుపడరాదు. కాబట్టే, ముముక్షువులకు ఆసనాలు ముఖ్యం అంటారు పెద్దలు. అయినా అదేపిచ్చిలో పడిపోయి, ఆసనాభ్యాసమే మోక్షం అన్నవెర్రిలో ఉండకుండా, వాటినైనా, మనకెంతవరకు అవసరమో అంతవరకే ఉపయోగించుకోవాలి. కానియోగాసనాలవలెకాకుండా ధ్యానాసనాలుమాత్రం సర్వకాలాల్లో అవసరం.

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం.

1-2-46



1. పద్మాసనము



2. స్వస్తికాసనము



3. వజ్రాసనము



4. గోముఖాసనము



4. గోముఖాసనము



5. వీరాసనము



6. శవాసనము





7. శీర్షాసనము



9. భుజంగాసనము



8. సర్వాంగాసనము



10. శలభాసనము



11. ధనురాసనము

13. యోగముద్రాసనము

12. హలాసనము





14. పశ్చిమతాసనము



15. మయూరాసనము.



# 14

# రాజయోగము

## ప్రాణాయామము-కుండలినీ

*మాతాజీ సోదరీ!*

ఆధ్యాత్మికమార్గంలో అభివృద్ధిఅంటే, దానిలోఉండే అనుభవాలను సులభంగా పొందాలంటే, యీప్రాణాయామవిధానం చాలామంచిదని, చాల మంది పిచ్చిఅపోహకలిగిఉంటారు. మనలో కుండలినీ అనేశక్తి ఒకటున్నదనీ, అది నిద్రపోతూ, మూలాధారంఅనే చక్రందగ్గరుంటుందనీ, రేచకపూరకాల ద్వారా ఎప్పుడైతే ప్రాణాయామం చేస్తామో, అప్పుడు సర్పంలాంటి ఆ కుండ లినీశక్తికి ఉద్రేకం కలిగి, వేడెక్కి పైకి ఎక్కుతుందని, ఆ కుండలినీ సుషుమ్న అనే నాళంగుండా పైకిఎక్కినకొద్దీ అనేకవిధాల అనుభవాలు కలుగుతుంట య్యనీ అదిఎప్పుడైతే సహస్రారంలోకి చేరుతుందో అప్పుడు వర్ణింప శక్యం గాని ఆనందంలోమునిగి, సమాధిని ఆసాధకుడు పొందుతాడని శాస్త్రాలు, అనుభవజ్ఞులు చెప్పుతుంటారు. ఆమాట నిజమే. కాని, ఆ కుండలినీ ప్రకోపంఅనేది అంతసులభంకాదు అనే రహస్యం గ్రహించరు అందరూ. ఈ

కుండలినీ, ప్రాణాయామాలు 'త్యాగం కావాలి' అని శాసిస్తుండే జ్ఞానమార్గం కంటే 'సర్వం ఈశ్వరార్పణబుద్ధితో వెయ్యి' అనే భక్తియోగకంటే, చాలా సులభం అనిపిస్తుంది. అంతేకాక, కుండలినీప్రబోధంలోఉండే అనుభవాలు వింటానికి చాలా ఆకర్షవంతంగాకూడా ఉంటాయి. కాబట్టి చాలామంది సాధనలంటే వెంటనే యీ 'ప్రాణాయామం' అని, 'కుండలీనీప్రకోపం'అని 'షట్చక్రభేదనం' అని తీర్మానం చేసుకుంటూఉంటారు. మోక్షానికి యిదే సాధన అనుకోటంతప్పు. అంతేకాదు. ఈప్రాణాయామం మోక్షాన్ని యిస్తుందిఅని అనుకోవటంకూడాతప్పే. అయినా యీ ప్రాణాయామ అభ్యాసంవల్ల నాడీశుద్ధికల్గి ధ్యాననిమగ్నతకు ఎక్కువఅవకాశం కలుగుతుంది. కాబట్టి నీవు, కొంచెం దీనిరహస్యంకూడా తెలుసుకొని ఉండాలి. అందుచేత యీఉత్తరంలో ప్రాణాయామాన్నిగురించి కొంచెంగా చర్చిస్తాను. చూడు.

ప్రాణాయామంఅంటే అసలు అర్థం ఏమిటి? అని చూస్తే చాలా భేద భావాలు పండితుల్లోను, అనుభవజ్ఞులలోనూ కనిపిస్తున్నాయి. 'ప్రాణ' అంటే వాయువు. ఈవాయువును మనం అనుక్షణం పీలుస్తూఉంటాం. ఆ వాయువులో భాగంగాఉండే ప్రాణవాయువే మనకు ప్రాణాధారం. కాబట్టి, మనం పీల్చే వాయువులోవుండే ప్రాణవాయువును లోపలనిరోధించి, అదిఎక్కువగా మనకు ఉపయోగపడేటట్లు చేయటం ప్రాణాయామంఅంటారు కొందరు. మనలో 'కుండలినీ' అనే శక్తిఉంది మూలాధారంలో. ప్రాణాయామంలో భస్త్రికవిధానంచేత, లేక కేవలకుంభకంచేత వేడెక్కించి, ఆకుండలినీని రేకెత్తించి, వీణకుమెట్లులాగా వెన్నెముకలోగల ఆరుచక్రాలనుదాటించి, సహస్రారంఅనే శిరస్సులోని చక్రంలోకి, ఆకుండలినీని చేర్చటం ప్రాణాయామం అంటారు మరికొందరు. 'అలాకాదు. ప్రాణఅంటే యీప్రాణవాయువు కానే కాదు. ప్రాణంఅంటే, అసలు జగత్తుకంతాఆధారమై జీవత్వానికే మూలాధారమైన శుద్ధమాయయే ప్రాణశబ్దార్థం. దాన్ని నిరోధించటం ప్రాణాయామం' అంటారు యింకాకొందరు. వీళ్ళేగాక యింకాఅనేకులు, అనేకరకాల దీన్ని నిర్వచన చేస్తూఉంటారు.

వీటినిగూర్చి యింకా కొంచెం వివరంగా తెలుసుకుందాం. మనం

గాలిని ముక్కురంధ్రాలద్వారా పీలుస్తున్నాం. ఆ గాలి కుత్తుకరంధ్రంగుండా రొమ్ము, ఎముకల మధ్యలో వలల్లాగ చిల్లులతో నిండిఉన్న ఊపిరితిత్తుల్లోకి పోతుంది. అక్కడ, ఆఊపిరితిత్తులకు తేనేపట్టు గూళ్ళలాంటి చిన్నచిన్న రంధ్రాలుంటాయి. ఈగూళ్ళన్నీ, ప్రక్కనేఉన్న గుండెకాయనుండివచ్చిన నల్లరక్తంతో నిండిఉంటయి. గుండెఅంటే వినిఉంటావనుకుంటాను. క్రిందికి వంగిఉన్న తామరమొగ్గలాంటి ఆకారంకలిగి, మనగుప్పెటంత ఒకతోలుసంచి రొమ్ములో, ఎడమభాగంలోఉంటుంది. అది నాలుగుభాగాలుగాఉంటుంది. రెండుభాగాల్లో మంచిరక్తం, రెండింటిలో చెడురక్తం ఉంటుంది. ఆగుండె ఎప్పుడూ విశ్రాంతికోసం నిలవకుండా, మన దేహానికంతా శుద్ధరక్తాన్ని సప్లై చేసే ఒకఫ్యాక్టరీ అన్నమాట. దాన్ని సృజించిన ఆభగవంతునితెలివి ఎలాం టిదో ఆలోచించుకో! మనం తినే ఆహారంఅంతా జీర్ణంఅయి, రక్తంగామారి, యీగుండెలకి చేరుకుంటుంది. మరల గుండెనుండి యీమంచిరక్తం మన శరీరం అంతటికి పెద్దకాలువలు, చిన్నకాలువలు యింకా చిన్నకాలువలద్వారా అంతా ప్రసరిస్తుంది. ఉపయోగపడుతుంది. ఉపయోగపడినపిమ్మట ఆరక్తం చెడిపోతుంది. అది శుద్ధంచేయబడితేగాని మరల ఉపయోగించదు. కాబట్టి అది, వేరువేరు, చిన్న, పెద్దకాలువలద్వారా గుండెలోకి, చెడురక్తానికి కేటా యింపబడిన భాగాలలోకి ప్రవహిస్తుంది. అక్కడనుండి అది ఊపిరితిత్తుల్లోకి వచ్చి, లక్షలు కోట్లుగాఉండే చిన్నచిన్న రంధ్రాలలోకి వెళ్ళుతుంది. ఆ ఊపిరితిత్తులలోకే మనం పీల్చినగాలి చేరుతుందన్నానుకదూ! ఈపీల్చబడిన వాయువులో, ప్రాణవాయువులనేది, యీచెడురక్తాన్ని బాగా శుభ్రంచేస్తుంది. ఆబాగైనరక్తం మరల తిరిగి గుండెలోకిపోయి, దేహంఅంతా పోవటానికి సిద్ధం అవుతుంది. సూక్ష్మంగా, యీగుండె, ఊపిరితిత్తులవిధానం యిది. గుండె లోకి రక్తంరావటం, పోవటంవల్ల కలిగేశబ్దాన్నే నాడిఅంటారు. అది గుండె దగ్గరే కాకుండా రక్తనాళాల్లోగుండ ప్రతిధ్వనిస్తుంది.

కాని, యీఊపిరితిత్తుల్లోఉండే యీచిన్న రక్తపుగూళ్ళు చాలభాగం నిరుపయోగంగా ఉండిపోతాయి. సామాన్యులకు, సగానికిసగం వృథాగా ఉంటాయంటారు. అలా, నిరుపయుక్తంగా ఉన్నవాటిని సరియైనమార్గంలో

పెట్టి, రక్తశుద్ధిని ఎక్కువ చేసుకోవటమే ప్రాణాయామవిధానంలోఉండే అసలు రహస్యం.

ఎలాగంటావా, విను చెప్తుతాను. మనం గాలిని పీల్చేది రెండు ముక్కు రంధ్రాలద్వారా అన్నాను. వాటినే, ఇడా, పింగలా, నాడులంటారు. ఎడమ ముక్కు ఇడా, కుడిముక్కు పింగలా. ఈరెంటికిమధ్య భ్రూమధ్య స్థానందగ్గర సుషుమ్న అనేది, కంటికి గోచరించని మరొక చిన్నరంధ్రం ఉంటుంది. ఈ సుషుమ్నానాడినిగూర్చి మరల చెప్తుతాను. మొదట ఒక ధ్యానాసనంమీద కూర్చోవాలి. ఎక్కడ కూర్చోవాలో, ఎలా కూర్చోవాలో అనే విషయాలన్నింటికి చాల నియమాలున్నాయి. స్థలం శుభ్రంగా ఉండాలనేది ముఖ్యవిషయం. చుట్టుప్రక్కల వాయువుకూడా పరిశుభ్రంగాఉండేలాగా చూడాలి. నేలమీద కాకుండా పీటమీద మెత్తగాఉంటానికి గుడ్డనుగాని, యింకా దేన్నైనా వేసుకుని కూర్చోవాలి. శౌచంలోచెప్పినే అవన్నీ పాటించాలి. అలా ఆసనశుద్ధిగా కూర్చుని, కుడిచేతితో ముక్కును పట్టుకోవాలి. ఎలాగ? బొటనవ్రేలిని కుడిముక్కుమీద, ఉంగరపువ్రేలిని ఎడమముక్కుమీద ఉంచాలి. తర్వాత బొటనవ్రేలితో కుడిముక్కును నొక్కిఉంచి ఎడమముక్కుద్వారా మెల్లగా గాలిని పీల్చాలి. ఇంక గాలి పీల్చలేమన్నంతవరకు పీల్చాలి. పీల్చినగాలిని ఊపిరితిత్తులలో నిలిపిఉంచాలి కొంచెంసేపు. ఆ నిలిపిఉంచేటప్పుడు ఎడమ ముక్కునుగూడ వుంగరపువ్రేలితో నొక్కి మూయాలి. పీల్చినగాలి కుత్తుకకు పైకి రానేకూడదు. తర్వాత మెల్లగా కుడిముక్కును వదలి, చాలా మెల్లగా గాలిని బయటికి వదలివేయాలి. ఇదంతాకలిసి ఒక్క ప్రాణాయామం అంటారు. గాలినిపీల్చటం 'పూరకం'అని, దాన్నిలోపలనిలపటం'కుంభకం' అని, తిరిగివదలటం 'రేచకం' అనిఅంటారు. ఈరేచక, కుంభక, పూరకాలు మూడున్నూకలిసి ఒకప్రాణాయామం అన్నారు. ఈ ప్రాణాయామకాలంలో ఎప్పుడూ, కొంచెమైనా శ్రమఉండకూడదు. తర్వాత మరల గాలిని పూరించటానికి కుడిముక్కును ఉపయోగించాలి. వదలటానికి ఎడమ. మరల ఎడమలతో పీల్చటం కుడితో వదలటం. ఇదీ ప్రాణాయామవిధానం.

ఎప్పుడైతే, వాయువును లోపల ఊపిరితిత్తులలో కుంభించామో ఆ

గాలియొక్కవత్తిడిచేత మూసుకొనిఉన్న ఊపిరితిత్తుల రంధ్రాలన్నీ తెరుచు కుంటాయి. అలా తెరుచుకొని, చెడురక్తాన్ని ఎక్కువగా పీల్చుకుంటాయి. అప్పుడు ఆ చెడురక్తంఅంతా కుంభింపఁబడిన వాయువులోవున్న ప్రాణ వాయువు వల్ల బాగుపడుతుంది. అలాగ ఎక్కువ రంధ్రాలు వుపయోగంలోకి రావటంచేత, ఎక్కువచెడురక్తం బాగుపడుతుంది. అందుచేత యిదివరకు కంటే ఎక్కువ చెడురక్తం శుభ్రంఅవుతుంది. దానివల్ల మొత్తానికి రక్తశుద్ధి ఏర్పడుతుంది. రక్తంమీద ఆధారపడేవికాబట్టి నాడులన్నీకూడా శక్తివంతం అవుతయి. దానితో దేహారోగ్యం, బలం, బుద్ధివికాసం మొదలైన మంచి లక్షణాలెన్నో యీప్రాణాయామంవల్ల లభిస్తుంటాయి. ఇదీ ప్రాణా యామంలోవుండే రహస్యం.

ఇలా, సులభంగా నేను చెప్పినా ప్రాణాయామం అంతసులభం కాదు. దీనలో చాలా సాధకబాధకాలున్నాయి. అసలు సూక్ష్మం, గాలిని పీల్చటం, కుంభించటం వదలటంలోనేఉంది. చేయటంలో ఏ చిన్నపొరపాటు వచ్చినా, ఆరోగ్యం పూర్తిగా చెడిపోతుంది. ఇంకా అనేకప్రమాదాలు కలుగుతాయి. అందుకని చాల జాగ్రత్తగా చేయాలి. ఈప్రాణాయామంలో బాగా ఆరితేరిన గురువు, తోడునీడలాగా ఉంటేనేగాని యీఅభ్యాసం చేయరాదు. మొదట్లో మన నాడులన్నీ శుద్ధంఅయితేనేగాని ప్రాణాయామం పూనరాదని అనుభవ జ్ఞులు చెప్పుతారు. దానికై కొన్నిమాసాలు కుంభకంలేకుండా, రేచకపూరకాల తోనే కాలంగడపాలి. తర్వాతకొద్దిగా కుంభకం యత్నించాలి. పిమ్మట, మెల్ల మెల్లగా కుంభకాన్ని ఎక్కువచేయాలి. ఇది సామాన్యప్రాణాయామం అన బడుతుంది. ఎంతకాలం గాలిని పీలుస్తామో, దానికి నాలుగింతలుకాలం కుంభకం, పూరకానికి రెట్టింపురేచకం దీనిలోమాత్రం. ఈవిధంగాచేస్తుంటే, యిందాక చెప్పినట్లు రక్తశుద్ధి, నాడీబలం కలగటంచేత, ఒకవిధమైనతేజస్సు దేహంలోవెలువడుతుంది. కంఠస్వరం మృదువుఅవుతుంది. కళ్ళల్లోతళుకుం టుంది. జ్ఞాపకశక్తి ఎక్కువ అవుతుంది. ఇలాంటి ఫలితాలెన్నో కలుగుతాయి.

కాని, యీ ప్రాణాయామకాలంలో చాల నియమాలున్నాయి. ఎన్ని మాసాలు, లేక సంవత్సరాలు ప్రాణాయామాభ్యాసం సాగిస్తుంటారో, అంత

కాలం తీవ్రమైన బ్రహ్మచర్యంఉండాలి. ఎట్టిఉద్రేకం కలుగజేసుకోరాదు. అందుచేతనే యమనియమాలు యీప్రాణాయామం చేసేవారికి తప్పకుండా ఉండాలన్నారు. అంతేకాదు. ఆహారనియమంకూడా పాటించాలి.

ఇలాకాకుండా, కుంభకకాలం ఎక్కువచేస్తారు యోగులు. దాన్నే కేవల కుంభకం అంటారు. ఈకేవలకుంభకంచేత వేడిపుట్టి, మూలాధారంలో నిద్ర పోతున్న కుండలినీశక్తి మేల్కొంటుంది. లేక భస్త్రికఅనే ప్రాణాయామం వల్లకూడా కుండలినీ మేల్కొంటుంది. కొలిమితిత్తుల్లాగ రెండు ముక్కు లను, వెంటవెంటనే కొన్నిపర్యాయాలు పూరకరేచకాలు చేయటం భస్త్రిక అనిపేరు. ఈ భస్త్రికనే చేసి, కొంచెంసేపు కుంభించామంటే కపాలభాతి అంటారు. ఈరెండు పద్ధతులప్రకారంకూడా కుండలీనీ మేల్కొంటుంది. ఆ మేల్కొన్న కుండలినీ ఏమిచేస్తుంది?

ఇందాక సుషుమ్నానాడి పేరెత్తాను. జ్ఞానకం ఉందా? అది చాలా సూక్ష్మంగా వుంటుంది. అంటే, మన సన్ననివెంట్రుక చివరిభాగాన్ని వెయ్యి చీలికలుచేస్తే ఎంతసన్నమో, అంతకంటే సన్నంఅన్నారు యీ సుషుమ్నానాడి. అలాంటిది కంటికి గోచరమవుతుందా? కంటికేకాదు అతిశక్తివంతమైన దుర్భిణీయంత్రాలు పెట్టిచూచినా అది కనబడదు. ఆసుషుమ్నానాడి ఇడా, పింగళా నాడులకు మధ్యగా బయలుదేరి మూలాధారచక్రంవరకు పోతుంది క్రింద. పైనశిరస్సుయొక్క చివరిభాగంలోఉన్న సహస్రారంవరకుఉంటుంది.

మూలాధారచక్రం, సహస్రారచక్రంఅన్నాను. ఈచక్రాలవిషయం చెప్ప టానికి చాలాకష్టం. చెప్పటం మొదలుపెట్టితే ఒకగ్రంథం అయిపోతుంది. ప్రస్తుతం నీకు అంత ముఖ్యంకాదుకూడా. అందుచేత సులభంగా, క్లుప్తంగా చెప్పివేస్తాను. ఈచక్రాలు ఆరు. కాన షట్చక్రాలుగా వ్యవహరిస్తారు. మొదటిది మూలాధారచక్రం. ఇది గుదస్థానందగ్గరఉంటుంది. ఈస్థానాన్నే పాయుస్థానం అన్నాం కర్మేంద్రియాల్లో. రెండోది స్వాధిష్ఠానచక్రం. ఇది మర్మస్థానందగ్గరుం టుంది. ఉపస్థేంద్రియందగ్గరన్నమాట. మూడోది మణిపూరకచక్రం. నాభి స్థానం దీనికియునికి. నాల్గోది అనాహతచక్రం. హృదయస్థానందగ్గరుం

టుంది. ఐదోదివిశుద్ధచక్రం. ఇది కుత్తుకదగ్గరుంటుంది. ఆరోదిఆజ్ఞాచక్రం. భ్రూమధ్యస్థానంలోఅంటే కనుబొమ్మలమధ్య నాసికేంద్రియం కలిసేచోట ఉంటుంది. ఈఆరుచక్రాలకుపైన, శిరస్సుకుపైన సహస్రారంఅనే చక్రం ఉంది. కాని దీన్ని వీటిలో లెక్కవేయరు.

ఈసుషుమ్నానాడి మూలాధారంనుండి సహస్రారంవరకు ఉంటుం దన్నాం. దీనికి మార్గం ఎలాగఅంటావు. వెన్నెముకమధ్యలో ఉంటుం దన్నారు. వెన్నెముకను పగులగొట్టిచూస్తే కనపడుతుందా యీ సుషుమ్నా? భూతద్దాలకుకూడా చేతకాదు దీన్ని తెలుసుకోటానికని యిందాకచెప్పాను. ఆయారుచక్రాలుకూడా వెన్నెముకలోనే, పైన చెప్పిన స్థానాలకు ఎదురుగుండా ఉంటాయి. ఈ వెన్నెముకనే వీణాదండంఅనికూడా అంటారు.

పైనగల ఆరుచక్రములకు ఆరుగురు అధిపతులుఉన్నారు. మూలా ధారానికి గణపతి, స్వాధిష్ఠానానికి చతుర్ముఖబహ్మ, మణిపూరకానికి విష్ణువు, అనాహతానికి శివుడు, విశుద్ధానికి సదాశివుడు, ఆజ్ఞానికి శక్తియును అధిష్ఠాన మూర్తులు.

అంతేకాక యీ షట్చక్రాలకు రంగులున్నాయి. ఒక్కొక్కచక్రం కొన్ని కొన్నిదళాలతో కూడుకుని ఉంటుందికూడా. ఆదళాలన్నీ అకారాది క్షకా రమువరకుగల అక్షరములతో కూడిఉంటాయి. మూలాధారచక్రం సువర్ణ వర్ణం కలిగిఉంటుంది. దీనికి 4 దళాలుంటయి. ఇందు 4 దళాలకు వ,శ,ష, స అను 4 అక్షరాలుఉన్నవి. రెండవచక్రం స్వాధిష్ఠానం. ఇది దానిమ్మపూవు రంగు కలిగి, 6 దళాలతో ఉంటుంది. దీనియందు బ, భ, మ, య, ర, ల అను 6 అక్షరములుకలవు. తర్వాతిచక్రం మణిపూరకం. దీనిరంగు మేఘ శ్యామలం. దీనియందు 10 దళాలు డ,ఢ,ణ,త,థ,ద,ధ,న,ప,ఫ, అను 10 అక్షరాలుకలవు. ఇక నాలుగవచక్రం అనాహతం. ఇది బంధూకపూవురంగుతో 12 దళాలతో, క,ఖ,గ,ఘ,ఙ,చ,ఛ,జ,ఝ,ఞ,ట,ఠ, అను 12 అక్షరము లతో ప్రకాశిస్తుంది. విశుద్ధచక్రం అయిదవది. ఇది పొగరంగు కలిగిఉండి, 16 దళాలతో, అ,ఆ,ఇ,ఈ,ఉ,ఊ,ఋ,ౠ ,ఌ,ౡ,ఏ,ఐ,ఓ,ఔ,అం,అః

అను 16 అక్షరముల కలిగియున్నది. ఇక ఆరవదైన ఆజ్ఞాచక్రం, శ్వేతవర్ణంలో ఉంటుంది. ఇది 2 దళముల కలిగి, హ, క్ష అను 2 అక్షరములతో నున్నది.

శాక్తేయగ్రంథాలలో ముఖ్యమైన శ్రీ లలితాసహస్రనామాలుకూడా 1. మూలాధారైకనిలయా, మూలాధారాంబుజారూఢా 2. స్వాధిష్ఠానాంబుజగతా 3. మణిపూరాంతరుదితా, మణిపూరాబ్జనిలయా 4. అనాహతాబ్జనిలయా 5. విశుద్ధిచక్రనిలయా 6. ఆజ్ఞాచక్రాంతరాళస్థా, ఆజ్ఞాచక్రాబ్జనిలయా అనియు, ఆజగన్మాతనే మరల 'షట్చక్రోపరిసంస్థితా' అని, షట్చక్రములకుపైన అనగా 'సహస్రదళపద్మస్థా' 'సహస్రారాంబుజారూఢా' అని వర్ణించి, షట్చక్రములగల 50 అక్షరములను ఆతల్లియే ధరించినట్లు 'అక్షమాలాదిధరా' అనికూడా స్తుతించియున్నవి. ఈశక్తియే ఆ కుండలినీశక్తి.

మానవదేహంలో పంచభూతములున్నవని శాస్త్రవచనం. పాదముల నుండి మోకాళ్లవరకు పృథ్వీభూతం, మోకాళ్లనుండి గుదస్థానంవరకు జలభూతం, గుదస్థానంనుండి హృదయంవరకు అగ్నిభూతం, హృదయంనుండి భ్రూమధ్యంవరకు వాయుభూతం, భ్రూమధ్యంనుండి శిరస్సుపైభాగంవరకు ఆకాశభూతంఉన్నవి. వాటికే వరుసగా లం, వం, రం, యం, హం, బీజములుకలవు. మూలాధారచక్రంనుండి విశుద్ధచక్రంవరకు పంచభూతాలను వరుసగా అన్వయించుకొని, అదే క్రమంలో పంచజ్ఞానేంద్రియాలను, వాటిగుణాలైన శబ్దస్పర్శాదులను అవగాస్థూలంనుండి సూక్ష్మానికిపంపి, ఆజ్ఞాచక్రంలోమహత్తును, మనస్సును కలుపుకోవాలి. అనగాక్రిందనుండి ఒక్కొక్క చక్రంలో ప్రవేశించాలనిఅర్థం. ఈవిధంగా కుండలినీజాగరణ కలుగుతుంది.

కుండలినీప్రబోధం జరిగి, అది పైకిఎక్కటానికి బయలుదేరేటప్పటికి సాధకుని స్థితినిబట్టి పురుగునడక, కప్పగంతులు, కోతిగంతులు, పక్షివిగురుట మొదలైన నడకలతో ఊర్ధ్వగమనం చేస్తుందని ఒక్కొక్క చక్రందగ్గర ఒక్కొక్కఅనుభవం యిస్తుందని, అనేక శబ్దాలను వినిపింపజేస్తుందని, ఆ శబ్దాలను దశవిధనాదాలంటారని, మొదలైన విషయాలు చాలా ఉన్నాయి.

'ఎంతకాలం యీ కుండలినీ శక్తి మూలాధార–మణిపూరక చక్రముల

మధ్య తిరుగుతూఉంటుందో అంతకాలం మానవుడు తిండి, నిద్ర, సంసార ములమధ్య తన్నుకుంటాడు. ఈక్రింది మూడు చక్రములనుదాటి, అనాహతంనుండి పైమూడింటిని ఆరోహించినపుడే సాధకునికి దివ్యభావములు కలుగుట, దివ్యపురుషులసందర్శనం, దివ్యజీవనవిధానం లభిస్తాయి' అని సాధనావతారమగు శ్రీ రామకృష్ణదేవుని వచనం.

కుండలినీశక్తి చుట్టుకునియుండు సర్పము తనతోకను నోటితోపట్టుకున్నట్లుగా మహాత్ములనిర్వచనం. కాన యీకుండలినీ సర్పమువలె నున్నదని వర్ణించటంలోకూడా ఒకఅంతరార్థం ఉన్నదనితోస్తుంది. సర్పం వాయుభక్షణ చేస్తుంది. అదేవిధంగా ప్రాణాయామంతో అనగా పూరక, కుంభక, రేచకములతో పామువంటి కుండలినీశక్తిని మేల్కొలిపి, పైకి తీసుకొనివెళ్లుట అను రీతిలో అర్థంచక్కగా సరిపోయిందిగదా! గాలిని పీల్చుకొనే జీవిస్తాడు మానవుడు. ఒక క్రమపద్ధతిలో గాలినిపీల్చి, కుంభించి, ప్రాణాయామంఅనే సాధనతో, కుండలినీని జాగృతంచేసుకొని ఆనందించగలడు. పామునకు 'నాగ' అని మరియొక పదముకలదు. నాగ అనగా ఏనుగు అనికూడా వేరొక అర్థం ఉన్నది. ఈ 'నాగ–నాగ' భేదమును సాధకుడు గ్రహించుకుని, నాగ అనగా ఏనుగుయొక్క స్థూలరూపం, స్థూలఆహారం, స్థూలగమనాదికాలను దూరీకృతం గావించి, నాగ అనగా సర్పంయొక్క సూక్ష్మరూపం, సూక్ష్మఆహారం, సూక్ష్మగమనాదికములను అవలంబిస్తాడు. సూక్ష్మమనగా గాలిని పీల్చుటలో అని అర్థం. ఏనుగువలె బరువుకాక పామువలె తేలికయ్యై జీవించగలడు.

ఇలా, ఊర్ధ్వంగా పయనమైన కుండలినీ, భ్రూమధ్యస్థానంలో ఉండే ఆజ్ఞాచక్రందగ్గరకు వచ్చేటప్పటికి ద్వైతభావం నశిస్తుంది. అంటే అంతవరకు భగవంతుడువేరు, నేనువేరు అనేభావాలుంటాయి. తర్వాత'అహంబ్రహ్మాస్మి' అనేభావం దృఢంఅయిపోయి, తర్వాత అదిసహస్రారం చేరేటప్పటికి, అనిర్వచనీయమైన ఆనందంలోకలిసిపోయి, ఆబ్రహ్మానందంలో లీనంఅయి ఉంటాడు సాధకుడుఅని పెద్దలు చెప్పుతారు. దీన్నే కుండలినీయోగం అని కూడా అంటారు. పూర్వంచెప్పినట్లు వినటానికి చాలాసులభంగాను, ఆకర్షవంతంగాను యిదిఉంటుంది. కాని, ఆచరించి ఆ స్థితికిరావటం చాలా కష్టం.

నూటికి, కోటికి, ఒక్కడుకూడా రాలేడని గట్టిగాచెప్పవచ్చు. పైకి యింత సులభంగా కనిపించినా యితరమార్గాలన్నిటికంటే యిది చాలకష్టం. మీదు మిక్కిలి అపాయకరం. ఇతర మార్గాలలో ఒకవేళ పొరపాటుపడినా ప్రాణహాని ఉండదు. కానిదీనిలో అంతవరకుకూడా వస్తుంది. అందుచేతనే, అనుభవ జ్ఞానిసహాయం ప్రతిక్షణం లేకుంటే యీమార్గంలో దిగనేరాదని, పెద్దలు గట్టిగాచెప్పారు.

ఇలాకాకుండా, 'కొంచెం సామాన్యప్రాణాయామంతో తృప్తిపడి, అసలు సృష్టికి మూలాధారమైన ప్రాణఅనబడే మాయను, లేక అజ్ఞానాన్ని నిరోధించటం అసలువిషయం' అన్నారు వివేకానందాది అనుభవజ్ఞులు. దీనికి ప్రాణవాయువుతో పనిలేకుండానే, బుద్ధికుశలతను ఉపయోగించి, అజ్ఞానం అనే ప్రాణాన్ని నిరోధించాలి. ఇది అన్నిటికంటే కష్టం. శుద్ధజ్ఞానమార్గంలోకి దిగిపోతుంది. అయినాచేయాలి ధైర్యంతో, పట్టుదలతో. మొదట్లోనే అజ్ఞాన నిరోధంఅయితే, యింకా ధ్యాన, ధారణ, సమాధులు ఎందుకు అనే సందేహంవస్తుంది. ఆయత్నాన్ని ప్రారంభించాలి అనిఅర్థం తీసుకోవాలి. సమాధితో యీప్రయత్నం సమాప్తి చెందుతుంది. లేక యీఅజ్ఞానాన్ని ముందు గ్రహిస్తేనేగాని, ప్రత్యాహారంఅనే తర్వాతిమెట్టులో దాన్ని త్రోసివేసి, ధ్యానానికి సంసిద్ధం చేయలేము అనాలి. ఎలాగైనా యీఅర్థం గ్రహించటానికి, పూర్వపుటర్థాలకంటే కష్టం. ఇంక ఆచరించటానికో?

'అయితే యీప్రాణాయామం చేయకపోతేఎలాగ? నాడీశుద్ధికావద్దా? కుండలినీ లేవద్దా?' అంటావు నిజమే. కాని అందరికి యీప్రాణాయామం, కుండలినీజాగరణం జరుగుతుంది. కాని తెలియబడదు. యోగులు మాత్రం, ప్రయత్నంచేత దృష్టులను దానిమీదఉంచి చేస్తారుకాబట్టి దాన్ని తెలుసుకుంటారు. దాన్ని తెలుసుకున్నా, తెలుసుకొనకపోయినా, ఫలితాలలో ఏమార్పు ఉండనేఉండదు. ఈ ప్రాణాయామఫలితంగా వచ్చే సర్వఫలితాలు, అష్టసిద్ధులు, యింకాఅనేక మహత్తులన్నీకూడా తెలిసినవాడికి, తెలియని వాడికి సమానమే. ఆవిషయంలో భేదం ఏమాత్రంలేదు. అందుకనే, తీవ్రంగా భక్తిలో తన్మయత్వాలు పొందుతూఉండే మహాభక్తునికికూడా, కుండలినీ యోగంచేత కలిగిన అన్నిలక్షణాలు కలుగుతాయి. సిద్ధులన్నీ కలుగుతాయి. తేజస్సు ఉంటుంది. సంకల్పసిద్ధి పూర్తిగాఉంటుంది. ఒకటేమిటి? అన్ని సద్విషయాలు యిద్దరికీసమానమే. అలాగే, జ్ఞానివిషయంలోకూడా. దీనిలో

రహస్యం ఏమిటంటే, భక్తిచేతగాని, భావంచేతగాని, బుద్ధి ఎప్పుడు ఒక్క-చోట నిలిచిపోతుందో, మనస్సు ఏకాగ్రంఅవుతుందో అప్పుడు మనకు తెలియకుండానే శ్వాసనిలుస్తుంది. లేక చాలాసున్నితంగా నడుస్తుంది. ఒక్కొక్కప్పుడు, కేవలకుంభకంకూడా కలుగుతుంది. దీనివల్లవెంటనే కుండలినీజాగరణం జరగటం, అది ఊర్ధ్వగమనంకావటం, సహస్రారాన్ని చేరటం మొదలైన సంఘటనలన్నీ జరుగుతాయి. ఇకసిద్ధులకు కొరవ ఏముంటుంది? ఈవిషయంలో మన రామకృష్ణుడే మనకు సర్వాదర్శం. ఆయన హఠయోగం చేసి, యీ ప్రాణాయామంవల్ల కలిగే సిద్ధులన్నీ భగవద్దర్శనానికి ఆటంకాలనీ, మొదట భగవంతునిదర్శిస్తే యీసిద్ధులు వాటంతటవే సిద్ధిస్తాయనీ తనశిష్యులకు తెలియజేస్తూ దీనికి ప్రాధాన్యతనీయలేదు. అందుచేతనే ఒకసారి ఆయన నరేంద్రుని (స్వామి వివేకానంద) తో 'నరేన్! జగన్మాత నాకు అనేకసిద్ధుల్ని ప్రసాదించింది. వాటిని నీకుయిస్తాను తీసుకో' అన్నాడు. 'ఆ సిద్ధులవల్ల భగవంతుడు కనిపిస్తాడా?' అని తిరిగి ప్రశ్నించాడు నరేంద్రుడు. 'ఈ సిద్ధులవల్ల జనాకర్షణ, పేరుప్రఖ్యాతులు లభిస్తాయికాని భగవద్దర్శనంకలగదు' అని సమాధానం యిచ్చాడు రామకృష్ణుడు. 'అయితే అవినాకు అవసరంలేదు' అని నిరాకరించాడు నరేంద్రుడు. వాళ్ల గురువుకుమించిన శిష్యుడు, శిష్యుడికిమించిన గురువు. కాబట్టి యీసిద్ధులకోసం తాపత్రయం అనవసరం. అందుకని ప్రాణాయామం చేయలేదే, కుండలినీజాగరణం కలుగలేదే, అనేవిచారం ఎపరికీ అవసరంలేదు. మనమార్గాన మనం పోతూవుంటే, యీకుండలినీశక్తి మనవెంట కుక్కపిల్లలాగా వస్తూనేఉంటుంది. దానికొరకై ఏ తాపత్రయం, చింత అవసరంలేదని నా తీర్మానం. ప్రస్తుతం నీకుయింతవరకు చాలు.

**ఈవిషయాన్నంతా నీకు తెలియజేయుటానికి చెప్పానుకాని, నీవు వీటిని ఆచరించటానికికాదు. తెలిసిందా? అవసరాన్నిబట్టి, వాటి ఆచరణ విధానం తెలుసుకుందువుగాని. ఇప్పుడే ఆరాటపడవద్దు. ఇక తర్వాత విషయాలకుపోదాం.**

**ఆతడే మన దిక్కు.**
**ఆతడే మన గమ్యం.**

[signature]

**3-2-46**

# 15

# రాజయోగము

## ప్రత్యాహారము

ప్రియమైన మాతాజీ!

నేను వ్రాసేజాబులు చదువుతున్నావనీ, అవి నీకుసులభంగా అర్థం అవుతున్నాయని వింటానికి చాలసంతోషం. ఏదైనా, ఆచరణలోకిరావాలంటే అదేమిటో ముందు అర్థంకావాలిగా! అర్థంఅయినతర్వాత ఆచరణ. అందుకని నీవు అర్థంచేసుకున్నావంటే, మెల్లగా ఆచరణలోకి తెచ్చుకోటానికి అవకాశాలు నీకుఎక్కువగా ఉన్నాయనిఅర్థం. చెప్పింది అర్థమేకాకపోతే, యింకఆచరణలో పెట్టుకోటం, అనుభవాన్నిపొందటం, అనుభవంలోగల ఆనందంలో మునగటం సాధ్యమా? కాబట్టి ప్రథమంగా అవసరమైన అర్థజ్ఞానండుండాలి. అట్టి జ్ఞానం నీకున్నందుకు సంతోషిస్తున్నాను. అంతమాత్రం అర్థం చేసుకుంటేనే గాని యింకాయింకా చెప్పటానికి నాకుబుద్ధిపుట్టదు. ఇక చెప్పినదాన్నిచేస్తుంటే చెప్పేవాడికెంత ఆనందమో వేరుగాచెప్పాలా! అంతఆనందం అన్నమాట.

గురువులకుచేసే శుశ్రూషల్ని నాలుగురకాలన్నారుశాస్త్రంలో. వాటిని సక్రమంగా అనుసరించామాఅంటే, బ్రహ్మవిద్యకూడా సులభమే అయిపో

తుంది. ఇకచిల్లరవిద్యల లెక్కేమిటి? అవి స్థాన, అంగ, భావ, ఆత్మ శుశ్రూష లని నాలుగువిధాలంటారు. స్థానశుశ్రూషఅంటే గురువుండటానికి యిల్లు వాకిలి, లేక ఆశ్రమం యిలాంటివి ఏర్పాటు చేయటం అన్నమాట. అంగ శుశ్రూష అంటే గురువుయొక్క పాదసేవ చేయటం, మొదలైన శారీరకసేవలు అవుతుంది. 'ఇదేమిటి? అదేమిటి? ఈగ్రంథంచెప్పండి, ఆగ్రంథంచెప్పండి' అంటూ, గురువువల్ల అనేకవిషయాలు చెప్పించుకుంటూ వింటూఉంటే, గురువుకు భావవిజృంభణఅయి, ఎక్కువవిషయాలు శిష్యులకు చెప్పుతాడు. ఇలాచేయటం భావశుశ్రూష అవుతుంది. విన్నవిషయాలను ఆచరించు కుంటూ అభివృద్ధి చెందుతూఉంటే, గురువుగారికెంత ఆనందమో చెప్ప లేము. అలా, గురువుకు ఆనందం కలుగచేయటం ఆత్మశుశ్రూష అనబడు తుంది. అలాగ, నీవు యీసాధనంటే ఏమిటో తెలుసుకోటానికి ప్రశ్నిం చటమేకాకుండా, చెప్పినదాన్ని అర్థం చేసుకొంటూఉన్నావంటే, ఒకవేళ నీకు నేను గురువుగాఅయియుంటే, భావశుశ్రూష చేసినదానివి అవుతావు. అలాగే, ఆత్మశుశ్రూషకూడా చేయటానికి శక్తిసామర్థ్యాలు గలదానివిగాకూడా అవుతా వని గట్టిగా విశ్వసిస్తున్నాను.

ఇక ప్రస్తుతవిషయానికివద్దాం. రాజయోగంలో నాల్గు సోపానాలు దాటాం. అయిదో సోపంచాఎక్కాలి. దీన్నే ప్రత్యాహారంఅంటారు. ఇంత వరకు ఆధ్యాత్మికాభివృద్ధికి అవసరమైన లక్షణాలను అంటే గుణాలను, యమ నియమాలద్వారా గ్రహించాం. యమనియమాలంటే జ్ఞాపకంఉందా? అహింసాసత్యాస్తేయబ్రహ్మచర్యాపరిగ్రహరూపమైన యమంద్వారా మన బాహ్యప్రవర్తనాన్ని పవిత్రం చేసుకున్నాం. శౌచసంతోషతపఃస్వాధ్యాయేశ్వర ప్రణిధానరూపనియమంద్వారా, మనచిత్తాన్ని రాబోయే ఆధ్యాత్మికానుభవ రాశిని పొందటానికి ఉన్ముఖంచేశాం. ఆసనప్రాణాయామాలద్వారా మన దేహాన్ని దృఢంచేసి, సాధనకు సిద్ధంచేశాం. ఇంతవరకు, మనం అసలు సాధన లోకి దిగనేలేదు. మొదటి యీనాల్గు ప్రక్రియలుకూడా మనమనస్సును సాధ నకు యోగ్యం చేయటానికి ఉపయోగపడే విషయాలేగాని సాధన కానేకాదు.

నా చిన్నతనంలో, నీమాదిరిగానే నాకుకూడా యీ ఆధ్యాత్మికపిచ్చి

తీవ్రంగాఉండేది. దానిచేత కనబడ్డవాళ్ళనల్లా అడిగేవాడిని. ఏమిటనుకు న్నావు? 'సాధనంటే ఏమిటి? ఎలా చేయాలి?' అని. కొందరు, ఆసనాలే వేయమన్నారు. కొందరు, ప్రాణాయామంఅన్నారు. ఇంతెందుకు, శనివా రాలు భజనచేయమన్నారు మరికొందరు. రామాయణం, భాగవతం, గీత మొదలైనగ్రంథాల్ని నిత్యమూపఠించమన్నారు యింకాకొందరు. గురూపదేశం లేనిదే ప్రయోజనంఏమీలేదు. అందుచేత ఎవరినైనా ఆశ్రయించి, ఒకమంత్రం ఉపదేశంపొంది రోజూ జపంచేయి అని బోధించారు కొందరు. ప్రొద్దున్నే స్నానంచేసి సంధ్యావార్చుకుంటే చాలు. దానికిమించిన సాధనేముందన్నారు యింకాకొందరు. ఇంతమంది, యిన్నిరకాల చెప్పుతున్నా, నాకు సాధనంటే ఏమిటో పిసరంతైనా అర్థంకాలేదు. 'అయ్యో! నాకు తెలియకపోయెనే' అని కుళ్ళిపోయేవాడిని. అలాతంటాలుపడగా, నాకర్థమయిందేమిటంటే 'యివన్నీ సాధనేకాదు. కానియివన్నీ సాధనే' అని. ఇదేమిటి యిలాఅంటారేంఅంటావా? ఇల్లు కట్టాలనుకున్నాం. ఇటుక కాల్పిస్తున్నాం. సున్నం గానుగ వేయిస్తున్నాం. మనుష్యుల్ని మాట్లాడుతున్నాం. స్థలం బాగుచేయిస్తున్నాం. కలప తెప్పి స్తున్నాం. ఇన్ని చేయిస్తున్నా యివి యిల్లేకాదు. అయినా యివియిల్లే. ఎలా గంటే, యివి లేకపోతే, యిలా అన్నీ తయారుచేయకపోతే యిల్లేకాదు. వీటి అన్నింటిమీద ఆధారపడి ఉంటుంది యిల్లు. ఇవన్నీకలిసి యిల్లైంది. వీటి నన్నింటిని ఉపయోగించి యిల్లు కట్టుతాం. మెరుగు పెట్టుతాం. అప్పుడు యిల్లు కట్టాంఅంటాం. అలాగే పైన చెప్పిన విషయాలన్నీ యిల్లు కట్టడానికి మొదటచేసిన యత్నాలలాంటివి. అవి లేకపోతే అసలు సాధనేలేదు. అందుకని యిందాకచెప్పినట్లు యీఅష్టాంగమార్గంలో మొదటి నాలుగుమెట్లలో వచ్చే స్థాయి, నాకు సాధనంటేఏమిటో చెప్పినవారి మాటలన్నీ. అసలు సాధనంటే, యిక ప్రారంభంఅవుతుంది. అందుకని, యీమొదటి నాలుగువిధాల సాధన సాధనకి తయారయి యిక సౌధనిర్మాణానికి పూనుకుందాం.

అయితే, సాధన యీప్రత్యాహారంతో ప్రారంభమాఅంటే, పూర్తిగా కాదు. ఎలాగంటే యిల్లుకట్టడానికి స్థలం బాగుచేయడంలాంటిది, యీ ప్రత్యాహారం. పిత్తవాలు చల్లేముందు కలుపుతీయడంలాంటిది యీ ప్రత్యా

హారంఅంటే. అనేకరకాల గుంటలు, మెట్టలు, చెట్లు, చేమలుంటే ఇంటినెలా కట్టుతావు? అన్నింటినీ తీసివేసి చదరంచెయ్యాలి. అనేకరకాల మొక్కలు మోడులుంటే విత్తనాలు ఎలాచల్లుతావు? ఆగింజలు మొలుస్తాయా? ఒకవేళ మొలిచినా బ్రతుకుతయ్యా? అలాగే, ధ్యానంలో వెయ్యబోయే విత్తనాలకు మన హృదయక్షేత్రాన్ని శుభ్రంచేసి, ఏఆటంకాలులేకుండా మొక్క, మోడు రూప యితర భావాలను తీసేసిఉంచటం ప్రత్యాహారం అంటారు.

ఇందుకనే అరవిందులు, యీవిషయాన్ని చక్కగా ఒకఉపమానంలో వివరించారు. దాన్నిచెప్పుతాను విను. ఒక చెరువు, దానిలో అలలు వస్తూ ఉంటాయి. ఆకెరటాలు ఎందుకువస్తుంటాయి? గాలికొట్టుతుంటే అల లెక్కువౌతాయి. చెరువులో యీకెరటాలెప్పుడు తగ్గుతాయి? గాలి తగ్గి నప్పుడు. అలాగే, మనచిత్తం ఆచెరువులాంటిది. భావాలు కెరటాలు అవు తాయి. ప్రపంచంలోఉండే విషయవాంఛలు అంటే లౌకికసుఖాలు, వాటిని గూర్చిన అపేక్షలు గాలిఅన్నమాట. అప్పుడు మనమనస్సుఅనే చెరువు ఏ అలలుఅంటే భావాలులేకుండా నిశ్చలంగా ఎప్పుడుంటుంది? చెరువుమీదికి గాలిరాకపోతే కెరటాలులేనట్లు, మన మనస్సుమీదికి, యీ లోకంలోఉండే సుఖాలమీదికోర్కెలు పోకుండావుండాలి. ఆ కోరికలు ఎప్పుడుండవో, మన స్సులో భావాలు లేకపోవడంచేత అది నిశ్చలంగాఉంటుంది. అలా, మన స్సులో ఏలౌకికభావాలు లేకుండాఉంచటం అనేదే యీప్రత్యాహారం. అబ్బా! ఎంత సులభం! చాలసులభం. చెరువుమీదికి గాలిరాకుండాచేయటం ఎంత సులభమో, అంతసులభం మన మనస్సులోకి భావాలు రాకుండాచేయటం! అంటే అంతకష్టం అన్నమాట. తెలిసిందా?

ఈవిధంగా మనస్సులో భావాలులేకుండా చెయ్యాలంటే, ఇంద్రి యాలుఅని చెప్పాను జ్ఞాపకంఉందా? ఆ పదియింద్రియాలను, స్వాధీనం చేసుకునిఉండాలి. అప్పుడుగాని యిదిసాధ్యంకాదు. మనం ధ్యానంచేయాలని కూర్చుంటే, కొన్నికొన్ని ఆటంకాలు వస్తుంటాయి. ఈఆటంకాల్ని నాల్గు రకాలుగా విభజించిచెప్పారు పెద్దలు, మనం తెలుసుకుని వాటిని దాటటాని కని. మొదటిది బాహ్యప్రపంచంవల్ల కలిగే అంతరాయం. అది ఎలాగంటే,

మనం కూర్చోటానికిముందు అనేకపనులు వస్తాయి. అవన్నీ మన ధ్యానానికి ఆటంకాలేగా! అలాంటిపనుల్ని అసలు తీసేసుకోటమో, తగ్గించుకోటమో చేసుకున్నతర్వాత, ధ్యానానికికూర్చోటం చెయ్యాలి. అలా, అన్నీ సర్దుబాటు చేసుకునికూర్చున్నా పిల్లలగోల, యింకా యితరసందడి ఎక్కువ ఆటంకంగా ఉంటుంది. అందుకని యిలాంటి ఆటంకాలులేని ఏకాంతస్థలమో, లేక తలుపులు కిటికీలు బిగించుకోటానికి వీలైనగదో ఉండాలి. అలా కూర్చున్నా దేహంలో గజ్జి, తీట మొదలైనచర్మవ్యాధులో, బలహీనతో ఉంటుంది. అలా దేహంకూడా అంతరాయం కలుగజేయకుండాఉంటానికి, ఆసనాలు మొదలైనవివేస్తూ ఆరోగ్యం కాపాడుకుంటూఉండాలి. పోనీ, యమందగ్గరనుండి ప్రాణాయామంవరకుఉన్న అన్నిలక్షణాలు సంపాదించి కూర్చున్నా బయట శబ్దాలు, పిలుపులు, అన్నీ మనధ్యానానికి అడ్డంతగులుతయి. ఇలాగ మన మనస్సులోనుంచికాకుండా బయటనుండివచ్చే ఆటంకాలను శాస్త్రంలో 'విక్షేపాలు' అంటారు. ఈబాహ్యవిక్షేపాలు పోవాలంటే, మొదటినాలుగు పద్ధతులు సంపాదిస్తే సులభమైపోతుంది. ప్రపంచసంబంధాలు పూర్తిగా తగ్గించుకుంటేగాని, యీవిక్షేపాలు పోవనేదిరూఢివాక్యం. ఎలా సాధ్యమయ్యాలంటే 'అభ్యాసవైరాగ్యాభ్యాం' అన్నాడు పతంజలి. దీన్నే 'అవు' నన్నాడు కృష్ణుడు గీతలో 'అభ్యాసం చెయ్యి. పోతయి. ఆఅభ్యాసం వైరాగ్యంతో కలిపిచెయ్యి. వట్టిఅభ్యాసం ప్రయోజనంలేదు' అని గట్టిగాచెప్పాడు ఆ మహాత్ముడు. అందుచేత విక్షేపాలుతగ్గాలంటే వైరాగ్యం బాగాఉండాలి.

సరే, అలా విక్షేపాలు బయటనుండి కలగకుండా, చాల కట్టుదిట్టాలు చేసి కూర్చున్నామనుకో. అంతటితో ఊరుకుంటయ్యా యీ ఆటంకాలు? భావాల్లాగా మన మనస్సులోనుండే బయలుదేరుతాయి. 'ఇది కావాలే, అది కావాలే, అక్కడికిపోవాలే, యీపని చేయలేదే, వాడామాటన్నాడే, నేనూరుకుంటానా?' అన్నట్లు ఒక్కటేమిటి, వెయ్యిరకాలభావాలు ఉసుళ్ళగుంపులాగా పుట్టుతుంటాయి. ఇక ఎలా ధ్యానం కుదురుతుంది? ధ్యానంఅంటే, ఒక్కభావంమీద బుద్ధినిలబడాలి. 'ఎలాగ పరమేశ్వరుడా!' అనిపిస్తుంది. ఇలాగా, మనస్సులోనుండే భావాలరూపంగావచ్చే ఆటంకాలను 'కషాయం'

అంటారు. ఇదంతా, పూర్వం మనకూ ప్రపంచానికీఉండే సంబంధాలన్నీకలిసి, మనస్సులోఉండి మెల్లగా తలలెత్తుతుంటాయి. వీటినే సంస్కారాలంటారు కూడా. దీనికికూడా ఒకటేసూత్రం 'అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే' అనేగీతావాక్యం. అంటే మనోనిగ్రహం అభ్యాసవైరాగ్యములచేతనే అగునుఅని తాత్పర్యం. అసలు 'అభ్యాసవైరాగ్యాభ్యాం' అనేది మహామంత్రం అనుకో. ఈసూత్రంద్వారానే ఆబ్రహ్మవస్తువు సాధ్యంఅవుతుందనుకో. అందుకని, యీకషాయంఅనే సంస్కారరూపమైన ఆటంకాన్నికూడా ఏదో విధంగా దాటేస్తేనేగాని ధ్యానంకుదరదు.

అలాగెల్చినా ధ్యానంకుదరదుగా! కొంచెం మనస్సుఏకాగ్రం అయేటప్పటికి వచ్చిపడుతుంది పెద్దమ్మ నిద్రాదేవత. తమోగుణం ఎక్కువగా ఉంటేనే వస్తుంది యీనిద్ర. దీన్నే 'లయం' అంటారు. ఇదీకూడా ఆటంకమేగా! యమనియమాలు బాగాఉండి, ఆసనాదులవల్ల ఆరోగ్యం బాగాఉంటే తమస్సు ఎందుకుంటుంది? ఇకనిద్ర ఎలావస్తుంది? అందుకని పునాదిగట్టిగా ముందుగానే వేసుకోవాలి, యీలయం అనే ఆటంకాన్ని జయించటానికి.

నాలుగో ఆటంకం 'రసాస్వాదనం' అంటారు. ఇది ఒకవిధమైన ఆనందం. ఏ కోరికలు లేకపోవటంచేత కలిగే ఆనందంయిది. దీన్నిగూర్చి తర్వాత అవసరంవచ్చినప్పుడు తెలుసుకుందువుగాని.

ఈ నాలుగువిధాల ఆటంకాల్ని రానీయకుండ, ధ్యానానికి మనచిత్తాన్ని సంసిద్ధంచేసిఉంచడం ప్రత్యాహారంఅన్నమాట. ఇంద్రియాలన్నీ సంపూర్ణంగా స్వాధీనం అయిఉంటేనేగాని యీ ప్రత్యాహారం కుదరనేకుదరదు. ధ్యానం ఒకచక్రవర్తి అనుకో. జనాన్ని పక్కకునెట్టుతూ 'రాజుగారువస్తున్నారు. లెండి. లెండి. అడ్డం రావద్దు, పొండిపొండి' అనిఅరుస్తూ, దారిని విశాలంచేస్తూ, అన్ని ఆటంకాలను ప్రక్కకుతీసే జవానులాంటిది యీప్రత్యాహారం అంటే. ఇందాకటినుండి చక్రవర్తి దూరానఉన్నారుకాని యీబిళ్ళజవాను కనబడేటప్పటికి చక్రవర్తి, దగ్గరకు వచ్చాడన్నమాటే. కొంచెం నిదానించిచూస్తే, రాజుగారు కనబడతారు, ఆనందిస్తాము. అలాగే, యమనియమాలన్నింటికంటే

యీ ప్రత్యాహారం ధ్యానానికి చాల సన్నిహితంకావటంచేత, యీ ప్రత్యాహారం కలిగిందంటే ధ్యానాన్నిపొందటం యికసులభమే. ధ్యానంఅనే మహాపట్నంలో ప్రవేశింపబోతున్నట్లే. ధ్యానంఅనే రాజభవనంలోని గుమ్మందగ్గరకు వచ్చినట్లే. ధ్యానంఅనే పాయసాన్ని నోటిదగ్గరకు చేర్చుకున్నట్లే.

ఇప్పుడు తెలిసిందా ప్రత్యాహారంఅంటే ఏమిటో! దాని ప్రాముఖ్యత గ్రహించావా? ఇక దానికై ప్రయత్నించు తల్లీ! దీనిమీదనే యిక నీ దృష్టినంతా ఉంచుకో. ఇక ఎలాగైనా దీన్ని సాధించటానికి తీవ్రంగా కృషిచేయి. దీన్ని సాధించావంటే నాకూ ఆనందం, నీకూ ఆనందం.

3-2-46

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం.

# 16
# రాజయోగము - ధ్యానము

అమ్మాయీ మాతాజీ!

క్రిందటిఉత్తరంలో, ప్రత్యాహారంవిషయం తెలుసుకున్నావు. సూర్యోదయానికి పూర్వంవచ్చే అరుణకాంతుల్లాంటిది యీప్రత్యాహారంఅంటే అని గ్రహించిఉంటావు. సూర్యుడులేని సంధ్యారాగం ఏమిలాభం? ఇల్లులేని పునాది ఎందుకు? కాబట్టి, యీప్రత్యాహారంవల్ల కలుగబోయే ధ్యానాన్ని గూర్చి యీజాబులో తెలుసుకుందాం.

ధ్యానాన్నిగూర్చి తెలుసుకోవాలని, ధ్యానం చేయాలని అందరికీ కాంక్ష ఉంటుంది. ధ్యానం చేయాలని చాలామంది ప్రయత్నిస్తుంటారుకూడా. ఈ ధ్యానసాధనగూర్చి ఎంతమంది నన్నడిగారో! కాని ధ్యానం అందరికీసాధ్యం అయ్యేదికాదు. అందుకని, ఒకవేళచెప్పినా నాల్గురోజుల్లోనే, 'ఏమండీ ధ్యానం కుదరటంలేదే! ఎంత ప్రయత్నించినా, బుద్ధి నిలవటంలేదండీ. బుద్ధిని నిలిపే ఉపాయం చెపుదురూ' అని మరల దగ్గరకువస్తుంటారు. దీనికికారణం ఏమి టనుకున్నావు? ధ్యానానికి కావలసిన పరికరాలను సంపాదించుకోకుండానే,

వీళ్ళకు ధ్యాననిమగ్నతకావాలి. త్యాగంలేకుండానే భగవంతుడుకావాలి అనేవా రెంతమందిలేరూ! అలాగే యీధ్యానం కోరేవారుసైతంఅంతే. ఆ యోగ్యతలను ముందు సంపాదించుకొని, ధ్యానం కుదరలేదంటే సమాధానం ఉంటుంది. అందుచేతనే ప్రత్యాహారాన్నిగురించి గట్టిగావ్రాశాను. ప్రత్యాహారం తెలియకపోతే ధ్యానమేలేదన్నాను. ఆప్రత్యాహారానికి యమనియమాలు ముఖ్యమన్నాను. కాన, ధ్యానంకుదరాలంటే యమంచగ్గరనుండి ప్రారంభించి, అభ్యాసవైరాగ్యాలద్వారా ప్రత్యాహారంపొందితే ధ్యానం కుదరటానికేమి? సులభంగానే కుదురుతుంది. కాని అంతఓపికేది! శ్రమలేకుండా, త్యాగంలేకుండా, ధ్యాననిమగ్నత వీళ్ళకు కుదరాలాయె. అంతసులభంగా ఆకాశంనుండి ఊడి, వీరినోట్లో పడేదికాదు ధ్యానం. అలాటి పిచ్చిభావాలు నీకు లేవుకదా! ఉంటే మార్చుకో, పొరపాటు పడేవు!

ఆధ్యాత్మికమార్గంఅంటే ఏమిటో, అందుగల అనుభవాలేమిటో, వాటినిపొందే విధానాలేమిటో తెలియనివాళ్ళంతా, యిలాగే ధ్యానం కన్నుమూయగానే వస్తుందనుకుంటారు. నిజంచెప్పుతాను విను. లోకంలో పాపలా డబ్బులు సంపాదించటానికిమానవుడు ఎంతశ్రమ పడుతున్నాడో చూడావా! ఆపూట తిండిగింజలకోసం, ఒక్కఅరగంటలో అరిగిపోయే తిండికోసం, అతడెంతచెమట ఊడుస్తాడు! అలాంటప్పుడు జన్మజన్మాలకు మనవెంట వచ్చే ఆధ్యాత్మికాహారంకోసం, జన్మరాహిత్యాన్నే ప్రసాదించి, ఆనందసాగరంలోముంచేసే జ్ఞానధనంకోసం ఎన్నిశ్రమలకోర్వాలో ఆలోచించు! చెమటకాదు, రక్తంతీయాలి. బొట్లుగాకాదు, ధారలుగాపారాలి. కళ్ళముందే అమిత ఆకర్షవంతంగా గోచరిస్తూ, అందుకుంటే అందుతూఉండే ప్రపంచసుఖాలన్నిటినీ కాలతన్నెయ్యాలి. అప్పుడూ ధ్యానంకుదరటం! అనుభవం రావటం! ఆనందంకలగటం! అందాక యివన్నీకూడా సున్న. ఇది గట్టిగానమ్ము. ఇక యీ ధ్యానంవిషయం కొంచెం చెప్పుతాను విను.

కలుపుతీసిన తర్వాత బాగా సాగుచెయ్యబడ్డ చేనులో, విత్తనాలు వేయటం ధ్యానంఅంటే అన్నాను. ఆగింజలే ధ్యానవస్తువు. దాన్నే ధ్యేయం అంటారు. దేన్నిగురించి ధ్యానించటం? అనేది మరల ఒక విషమప్రశ్న. దీన్ని

తీర్మానించటానికే నియమంలో ఉపాంగాలైన స్వాధ్యాయం, ఈశ్వరప్రణి ధానాలవిషయం వచ్చింది. వేదాధ్యయనం చేసి, బ్రహ్మవస్తువును తెలుసుకోవాలి. 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' అని బ్రహ్మసూత్రాల్లో చెప్పినట్లు తీర్మానం చేసుకుని, ఆబ్రహ్మం ఎలాంటిది? అనేటప్పటికి 'జన్మాద్యస్య యతః' ఎక్కడనుండి యీ సృష్టిఅంతా పుట్టిందో, అని సమాధానం వేదాల్లోనుంచే స్మరణకు తెచ్చుకుని, 'ఎక్కడనుండి?' అని ప్రశ్నవేసుకుని, 'ఔపనిషదం పురుషం' ఉపనిషత్తులలో చర్చించబడిన పురుషునివల్లఅని తీర్మానించుకుని, 'అతడెలాంటివాడు?' 'ప్రణిధానాత్' సర్వవ్యాపకుడు, 'ఎవడు వాడు?' 'ఈశ్వరః' అని తీర్మానానికిరావాలి. ఆకారణంచేతనే, నియమంలో ఈశ్వర ప్రణిధానంఅనే ఈశ్వరభక్తిలోకిదిగేశాం. అంటే యీ ప్రపంచానికంతా సృష్టికర అయినవాడును, పరిపాలకుడును, ధర్మప్రభువును, మహాత్ముడును అయిన ఏపరమేశ్వరుడున్నాడో, వాడిని తెలుసుకోవాలిఅని తీర్మానంచేయబడింది. ఆపరమాత్మస్వరూపుడైన భగవంతుడే యీధ్యానంలో ధ్యేయపదార్థం. అంటే ధ్యానంవల్ల తెలియబడవలసినవాడు యీ పరమేశ్వరుడన్నమాట.

ఈ పరమేశ్వరుని ఎలా ధ్యానించాలి? ఇతని రూపం ఏది? అనేవి మరల ప్రశ్నలు. అతని రూపాన్నిగురించి ఉపనిషత్తులలో ఎక్కడా స్పష్టంగా వర్ణించలేదు. సరిగదా కొంచెం విమర్శనాదృష్టితోచూస్తే, అతడికి రూపమే లేనట్లు తోస్తుంది. 'అయితే ఎలాగ? పోనీ గుణాలన్నా ఉన్నాయా? ఆ గుణాలన్నా ధ్యానిద్దాం!' అంటే అదీకూడా సందేహంగానేఉంది. ఇప్పుడెలాగ? అన్నివిధాలచిక్కువచ్చిపడ్డది. ఈవిషయం భక్తి, జ్ఞానమార్గాలలో తర్వాత అవసరాన్నిబట్టి చర్చిస్తాను. ప్రస్తుతం కొంచెం మార్గంచూపించి చర్చమానేస్తాను.

ఆఉపనిషత్తులలో చెప్పబడ్డ, యీసృష్టిస్థితిలయకర్త అయిన ఈశ్వరుని పురాణాలలో, ఒకపురుషునిగా చేశారు. వాడికి ఈశ్వరుడని పేరు పెట్టారు. వాడినిమరల ముగ్గురుగామార్చారు. వాళ్ళనుబ్రహ్మవిష్ణుమహేశ్వరులన్నారు. వాళ్ళను యింకా విభజనచేశారు. ముప్పదిమూడుకోట్ల దేవతలన్నారు. ఇక మనకు ధ్యేయవస్తువుకు ఏమికొదువ? వీళ్ళందరికి రూపాలున్నాయి. ఆకారణంచేత త్రిమూర్తులదగ్గరనుండి దశావతారాలు, మహా

ఋషులు, మహాపురుషులు, మహాత్ములు, యింతెందుకు మన గ్రామాల్లో ఉండే నూకాలమ్మ, పోలేరమ్మ, ముత్యాలమ్మలేకాకుండా, రావిచెట్టు, తులసి చెట్టు, వేపచెట్టేకాకుండా, పాము, ఆవు, కుక్క వరకు యింకా, అగ్గిపుల్లవరకు ఉండే సర్వాన్ని ధ్యానవస్తువులుగా ఉపయోగిస్తున్నారు మనవాళ్ళు. ఇలా చేయటంచేత దోషం, నష్టం ఏమీలేదు. కాని ప్రయోజనంలోమాత్రం తేడాలున్నాయి. కాబట్టి వీటిలో, దేన్నైనా నుసం ఉపాస్యంగా ఉంచుకోవచ్చు.

రూపంసంగతి తేల్చుకున్నాం. రూపండున్నదానికి నామం ఉంటుంది గదా! అందుచేత అందరికి పేర్లుకూడా తెలిసిపోతాయి. ఇక రూపం, నామం ఉంటే మేమెందుకుండం? అంటూ వచ్చేస్తాయిగుణాలు. ఈగుణాలవెంటనే క్రియలు వస్తుంటయి. అంటే వారువారు చేసే కార్యాలుఅన్నమాట. ఇలా తీగతీస్తే పొదకదిలినట్లు, ఒకదానివెంటఒకటి కదలి వచ్చి పడుతూఉండగా, యింకా ధ్యేయానికేమి తక్కువ? ఇది కొండవీటిచేంతాడు అనుకో. కొండ వీటిసీమలో బావులు చాలాలోతు. చేంతాడు బావిలోకి వేస్తుంటే పోతూనే ఉంటుంది. ఎంతవరకుపోవాలో తెలియనేతెలియదు. త్రాడుకొస వచ్చేదాక వెయ్యాలి. అలా, మరల లాగేటప్పుడు లాగుతునేఉండాలి. ఎప్పటికీ పూర్తి కాదుగదా! తీస్తున్నకొద్దీ వస్తూనేఉంటుంది. అలాంటిది యీ ధ్యేయపదార్థం అంటే, దీని గుణగణాలంటేనూ. అందుకనే అనంతకల్యాణగుణాలున్నాయ న్నాడుశ్రీరామానుజులు శ్రీమహావిష్ణువుకు. ఒక్కఅనంతంఏమిటి? కోటి అనంతాలనేవాడిని నేనైతే. ఇక, ధ్యానం దేనిగురించిచేయాలి అనేసమస్య ఏది? రూపాలున్నాయి నామాలున్నాయి గుణాలున్నాయి యింకా కార్యాలున్నాయి.

పైవిషయాలనుబట్టి ఆలోచిస్తే ధ్యానంఅనేది యిన్నిరకాలా ఉండ వచ్చు. ఆభగవంతునియొక్కమూర్తిని, అంటే రూపాన్నిగురించి ధ్యానం చేయవచ్చు. అతనినామాన్ని ధ్యానించవచ్చు. గుణాలమీద ధ్యానం సాగించ వచ్చు. లేక ఆమూర్తిచేసిన కార్యాలమీద ధ్యానంకుదర్చవచ్చు. రూపంమీద బుద్ధిఉంచితే దాన్నిరూపధ్యానంఅంటారు. నామంమీద మనస్సునిలిపితే నామ ధ్యానంఅంటారు. దీన్నే జపంఅనికూడా అంటారు. గుణాలు ధ్యానంలో నిలిస్తే గుణధ్యానంఅవుతుంది. మహత్కార్యాలమీద బుద్ధిఉంటే భావధ్యానం అని నామం. ఇన్నిరకాలకూడా ధ్యానం నిలుస్తుంది.

అయితే యిన్నిమూర్తుల్ని చెప్పారే, ఏమూర్తిమీద ధ్యానం నిలపాలి అంటావు. నిజమే యీప్రశ్నకూడా ముఖ్యమే. అది, మన యిష్టాయిష్టాలు, మన సంస్కారాలమీద ఆధారపడుతుంది. తమోగుణప్రధానంగా సాధకుడు ఉంటే, త్రాగితందనాలాడుతుందిఅనే నూకాలమ్మ, అంకాలమ్మ, కలిగోళ్ళమ్మలు ధ్యేయంగాఅవుతారు వాడికి. రజోగుణం ఎక్కువగా ఉన్నవాడు వీరభద్రుడో, ఏఉగ్రనరసింహుడో ఏరుద్రకాళికో, వీరాంజనేయుడో, యిలాంటి రౌద్రమూర్తుల్ని ధ్యానంలో పెట్టుకుంటాడు. సత్వగుణాధిక్యంగలవాడు శాంతస్వరూపుడైన శివుడు, ప్రేమస్వరూపుడైన కృష్ణుడు, కళ్యాణగుణ పరిష్కృడైన రాముడు, సత్వస్వరూపుడైన రామకృష్ణుడు, మాతృస్వరూపిణి అయిన శారదాదేవి మొదలైన దేవతలను ఉపాస్యలనుగా ఎంచుకుంటాడు. అంటే సాధ్యమైనంతవరకు సత్వగుణప్రధానమైన దేవతను తీసుకోటం ఉత్తమం. కాక, సంస్కారలోపంచేత ప్రస్తుతం అట్టిదేవతానీకం నచ్చక పోయినా, మెల్లమెల్లగానైనా అలాంటిమూర్తిని స్వీకరించటానికి యత్నించాలి.

అలా, మనకు ఎక్కువగా ప్రేమపాత్రుడైనమూర్తియొక్క రూపాన్ని, ధ్యానకాలంలో మనదృష్టిలో నిలుపుకోటం, రూపధ్యానంఅని పెద్దలభావం. ఆరూపం దృఢంగా ధ్యానంలో నిలిపేటందుకు కొన్నాళ్ళు, ఆ మూర్తియొక్క పటాన్నో, విగ్రహాన్నో, కళ్ళుతెరిచి ఏకాగ్రచిత్తంతో చూడాలి. తర్వాత కళ్ళు మూసినా, ఆమూర్తి చిత్తంలో హత్తుకునిపోయి, సర్వకాలాల గోచరిస్తూ ప్రశాంతిని యిస్తుంది.

అలాగే, నామధ్యానం. ఆ మూర్తియొక్క నామాన్ని, మొదట బిగ్గరగా పెదవులతో ఉచ్చరిస్తూఉండాలి. దాన్నే సంకీర్తనఅనికూడా అనవచ్చు. తర్వాత శబ్దంరాకుండా పెదవులతో ఉచ్చరించాలి. పిమ్మట పెదవులుకూడా కదలకుండా లోలోపలనే పలకాలి. ఆపలకడంకూడా నిలిచిపోయి అక్షరాలే గోచరించాలి తర్వాత. ఆపిమ్మట అక్షరాలుకూడాలేకుండా శబ్దమేఉండాలి. తర్వాత – తర్వాత? ఆ విషయాలన్నీ ముందుచెప్తాను. ఇదే నామధ్యానం, జపం అంటారు.

భావధ్యానంలో గుణాలు, ఆమూర్తియొక్క మహత్కార్యాలువస్తాయి. ఆమూర్తిని గుణాలద్వారా కార్యాలద్వారా స్తుతించటం, ప్రార్థించటం, మొద లైనవన్నీ యీలెక్కలో వస్తాయి. ఇదికూడా నామధ్యానంలోమాదిరే మెట్లు మెట్లుగా పరిణమిస్తుంది. మొదట గ్రంథాలుచదవటం తర్వాత పదిమందితో చేరి భజనలో ఆమూర్తినిగూర్చి పాడటం, అటుపిమ్మట ఏకాంతంగా పద్యాలు, కీర్తనలు పాడుకొని ఆనందించటం, పై శబ్దాలుమానేసి లోపలనే పద్యాల, కీర్తనలభావాలు మననంచేయటం, తర్వాత వాటినికూడా క్లుప్తంచేసి స్మరించటం, వేడటం, యింకా అదీతగ్గించి ఒక మంత్రంలాగా చేసి, ఆ భావాన్నే పదేపదే స్మరించటం, జపించటం. ఇదంతా భావధ్యానం.

మొదట్లో భావధ్యానం, దాంట్లోనుంచి నామధ్యానం వస్తుంది. ఈ రెంటికీఉపయుక్తం రూపధ్యానం. ఇలాగా భావాన్నిగాని, రూపాన్నిగాని, నామాన్నిగాని, ప్రత్యాహారంచేత పరిశుభ్రం చేయబడిన, ప్రాపంచికభావాల్ని రానీయకుండాఉన్న మనస్సులో ఉంచటం ధ్యానంఅన్నమాట. ఈవిషయం యింకా భక్తియోగంలో చర్చించాలికాబట్టి ప్రస్తుతం నిలుపుతాను.

ఆయిష్టదైవాన్ని బుద్ధిలోనిలపటం అంత సులభంకాదు. ఎంతకాలమో యత్నించాలి. ముఖ్యంగా ప్రత్యాహారం క్షుణ్ణంగాఉండాలి. అది అంతకష్టం కాబట్టే, విక్షేపాలులేకుండా ఆమూర్తిని, మనస్సులో కనీసం ఏడుసెకెండ్ల కాలం నిలుపగలిగితే ధ్యానం కుదిరినట్లని అనుభవజ్ఞులంటారు. ఏడుసెకెండ్ల కాలం పరిమితిపెట్టారంటే ధ్యానంకుదరటం ఎంతకష్టమో యింకాచెప్పాలా! రామకృష్ణుడు చెప్పినట్లు పాచిపట్టినచెరువులో నీళ్ళుకావాలంటే, చేతులతో ఆ పాచినిప్రక్కకు తోస్తునేఉండాలి. కొంచెంఏమరుపాటు కలిగిందాఅంటే మరల పాచి ఆశుభ్రజలాన్నికప్పేస్తుంది. ఆపాచినిప్రక్కకునిలిపి ఆనీళ్ళను త్రాగాలంటే ఎంతజాగ్రత్త ఉండాలి? అలాగే శుద్ధమైన మనస్సులోనుంచి యిష్ట దైవాన్ని అనుభవించాలంటే అతిజాగ్రత్త అవసరమని యింకాఎందుకు చెప్పటం? ఆకారణంచేతనే ఏడుసెకెండ్లకాలమే నిర్ణయించారు ధ్యాననిర్వచనానికి.

దీన్ని తెలుసుకోలేక, ధ్యానాదులు గంటలుగంటలు చేస్తుంటారు చాల

మంది. ఏమిచేస్తున్నారని యింట్లోవాళ్ళనేకాక, తర్వాత వాళ్ళనులడిగినా ధ్యాన నిష్ఠలో ఉన్నారంటారు. అది ధ్యానంకానేకాదు. బాహ్యావిక్షేపాల్లోపడి తన్ను కోపటమో, లేక అంతర్విక్షేపాలలో యీదులాడటమో, అదీకాక ప్రశాంతంగా లయంఅనే నిద్రలో ఆనందిస్తూఉండటమో అయిఉంటుంది. కాని ధ్యానం అయిఉండదు. అలాకాక యీమూడు స్థితుల్నిదాటిన సాధకుడైతే, ఆయిష్టదైవమూర్తిని నిలుపుతూఉంటే, అది క్షణంలో జారిపోతూఉంటే, మరలపైకెత్తుతూ, మరలజారిపోతూ, యిలాగా క్షణక్షణపోరాటంలో ఉండటం అయిఉంటుంది. కాని ధ్యానం కానేకాదు.

ఈధ్యానం కొంచెంకుదిరేటప్పటికి, అంతెందుకు ప్రత్యాహారం కుదిరేటప్పటికే, సాధకునిదృష్టి అంతర్ముఖత్వం పొందుతుంది. అంటే దృష్టి ప్రపంచంమీదికిపోక బుద్ధి లోపలికేపోతుంటుంది. మంచి తేజస్సు ప్రబలుతుంది. ప్రపంచవిషయాలమీద విరాగంప్రజ్వలిస్తుంది. ఏకాంతవాసం అభివృద్ధి గాంచుతుంది. అనవసరప్రసంగాలు అడుగంటుతాయి. ఇంక సిద్ధుల విషయం చెప్పనేఅక్కరలేదు. అవి అతనిమీదికి దూకుతుంటాయి. ప్రపంచం నుంచి గౌరవం ప్రవహిస్తుంది. అనేకరకాల అధికుడైపోతాడు. ఈలక్షణాలన్నీ మహాపురుషుల జీవితాలలోనుంచిచూచుకో. వాడు దాగి, ఎవరికీ తెలియకుండాఉందామన్నా ఉండలేడుగదా! వాడికి బయటపడాలనే బుద్ధిలేకపోయినా, వాడు చెప్పకుండానే ప్రపంచం గుర్తుపట్టేస్తుంది. వెంటపడుతుంది.

ఇదీ ధ్యానంలోఉండే రహస్యం. దీనికోసం బాగా సాధించు. తప్పకుండా నీకు సిద్ధిస్తుంది.

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం.

6-2-46

# 17

# రాజయోగము - ధారణ - సమాధి

అమ్మాయీ మాతాజీ!

ధ్యానాన్నిగూర్చి చర్చించిన ఉత్తరంలోని విషయాలను బాగా గ్రహించావనుకుంటాను. మనస్సు సర్వవిక్షేపాలను ప్రక్కకుత్రోసివేసి, ధ్యేయపదార్థం మీద బాగా లగ్నంఅయి నిలిచిపోతే, దాన్ని ధ్యానంఅని నిర్వచనచేశారు పెద్దలు అన్నాను. అసలు శాస్త్రంప్రకారం మనస్సు యీప్రాపంచిక విషయాలనుంచి ఎప్పుడు దూరంఅవుతుందో, అప్పుడు అది కేవలం భగవత్స్వరూపమే అన్నారు. అలాంటి శుద్ధమనస్సు బ్రహ్మమేఅన్నారు. ఆమనస్సునుండి యీ ప్రపంచవాసనలుఅనే మలినంఅంతా ఎప్పుడుజారిపోతుందో, అంటే నిర్మలం అవుతుందో, అలా ఎప్పుడు ఆమనస్సు బ్రహ్మమేఅయిపోతుందో, ఆ మనస్సే మనం, మనస్సే బ్రహ్మంఅయినప్పుడు మనం బ్రహ్మపదార్థం అయిపోతాం. అలా చిత్తాన్ని శుద్ధంచేసుకొని బ్రహ్మమేఅయినవాడు ముక్తిని పొందినట్లు. ముక్తిఅంటేనూ, మోక్షంఅంటేనూ అర్థంఅదే. అంటే, యీప్రాపంచికవిషయాలనే పాశాలలోఉండి, వాటికట్టుబాట్లలో యిరుక్కుని, కష్టసుఖపరం

పరలో మునుగుతూ, తేలుతూ, దరిగానక ఏడుస్తూ, పరీక్షలో మార్కులు తక్కువవస్తే, మరలమరల పరీక్షకు కూర్చున్నట్లు, మరలమరల పుట్టుతూ చస్తూ, ఆపాశాలను త్రెంపలేకత్రెంపలేక, పుట్టిపుట్టి, బలం క్రమంగా సంపాదించి, జ్ఞానంఅనే ఖడ్గంచేత ఆముడులను కోసి, త్రెంపివేసి, ఆబంధాలను ఛేదించి దూరంగా, స్వేచ్ఛగా నిలబడటాన్నే 'ముక్తి' అంటారు. అదే మోక్షం. ముక్తి అనేపదానికి అసలుఅర్థంకూడా విడివడటం అవుతుంది. వేటినుండి విడిబడటం? అంటే యీప్రపంచవిషయపాశాలనుండి, లేక యీజనన మరణపరంపరనుండిఅని అర్థం. మనం యిప్పుడు యీలోకంలో అనుభవించే కష్టసుఖాల్లో శ్రమఉంది, దుఃఖంఉందిగాని యీమోక్షంఅనే ఆనందంలో అలాంటిదేదీఉండదు. దీని లక్షణాన్ని 'సంతోషం' వ్రాసేటప్పుడు కొంచెం వ్రాశాను.

పైనచెప్పిన రెండు, మూడు, ఉత్తరాలలో చర్చించిన విషయాల ప్రకారం, ప్రత్యాహార, ధ్యానాలను పొందినవాడు ముక్తుడన్నమాటే. వాడు యీప్రపంచపాశాలను, బంధాలను త్రెంచేశాడు. వాడు ఆభగవంతుడిలో ఐక్యంఅయ్యాడు. 'కాని అదెంతసేపు' అంటున్నావా? ఏడుసెకెండ్లకాలం. 'ఆహా! గొప్ప ముక్తే' అంటున్నావా? అవును అదే ముక్తి, ముమ్మాటికీ ముక్తే. పంచదారకొండ ఉందనుకో. దాన్నిఅంతా తింటేనేనా చక్కెరతిన్నట్లు? ఒక్క పలుకుతింటే చక్కెర తిన్నట్లుకాదూ! అలాగే ఆ ముక్తిఅనే అమృతాన్ని, ఆ ఆనందరసాన్ని కొంచెంగా ఏడుసెకెండ్లేకాదు. ఒక్కసెకెండైనా రుచిమూచామంటే అదీ ముక్తిక్రిందలెక్కే. దానికి సందేహం ఏమీలేదు.

కాని తెలివిగలవాడేమిచేస్తాడంటే మన రామకృష్ణుడులాగా చేస్తాడు. ఆయన ఏమిచేశాడు? చిన్నపిల్లవాడిలాగా ప్రవర్తించాడు లోకైకమాత కాళికాదేవితో. అమ్మ, అప్పచ్చులు వండుతుంటే పొయ్యిదగ్గరకు చేరి, 'అమ్మా! ఒక్కటి పెట్టే, ఒక్కటేనే. ఇంకా అక్కర్లేదే, ఒక్కటైనా పెట్టవే, వెళ్ళిపోతానే' అని అనేకవిధాల బ్రతిమాలి, ఒక్క ముక్కను పుచ్చుకుంటాడు పిల్లవాడు. కొంచెం రుచిమూస్తాడు. పుచ్చుకున్నముక్క పూర్తికాకముందే 'అమ్మా! యింకో ముక్కే, యిక అడగనే' అంటాడు. ఇలా పళ్ళెంలోఅన్నీ పూర్తిఅయిం

దాకా వదులుతాడా? అన్నీ తనకేపెట్టమని వేధిస్తాడుపిల్లవాడు. రామకృష్ణుడు మట్టుకు అలాచేయులేదూ! ఒక్కసారి కనిపించమని ఏడ్చి మొత్తుకొని, కత్తితో స్వంకంఠానికికూడా తెగించి, కాళికాదేవి కనిపించగానే, ఎప్పుడూ తన ముందు కూర్చోవాలని హఠంపట్టాడు, గెల్చాడు! అదే యోగులలక్షణం, యీఆధ్యాత్మికప్రపంచంలో. అలాగే, ఆముక్తిరసాన్ని ఒక్కక్షణమైనా రుచి చూచిన అదృష్టశాలి ఏమిచేయాలి? ఎప్పుడూ దాన్నే త్రాగుతూఉండాలి. 'ఇక నాకు యీలోకసుఖాలు వద్దు' అంటూ మోక్షమనే అమృతసాగరంలో మునిగిఉంటానికి యత్నించాలి. దానికొరకు ఏడ్వాలి. దాన్ని పొందడానికై, ఎంత త్యాగాన్నైనా చెయ్యాలి.

ఆవిధంగా, ఏడుసెకెండ్లకాలం ఆధ్యానమాధుర్యాన్ని చవిచూచిన వాడు యత్నించియత్నించి, శ్రమించి, తన దివ్యమూర్తిని, యిష్టదైవాన్ని, తన దృక్పథంలో ధ్యానానికి ఏడురెట్లెక్కువకాలం నిలిపినాడాలంటే దాన్ని ధారణ అంటారు. అంటే ఎంతకాలం అన్నమాట? నలభైతొమ్మిదిసెకెండ్లు. ఇంకా పూర్తిగా నిమిషంకూడా కాదు. ఇంకా కొసరికొసరి, ధారణకు ఏడురెట్లు ఎక్కువకాలం ఆఅనుభవంలో నిలిచాడంటే సమాధి అంటారు. ఎంతకాలం? అయిదు నిమిషాల నలభైమూడుసెకెండ్లు అయింది. మరి యీనిమిషాలను, సెకెండ్లను లెక్కించేది ఎలాగంటావు. ఇదంతా ఉరామరిక లెక్కలేగాని, గడియారాలు దగ్గరపెట్టుకుని చూచుకోనక్కరలేదు. సంపూర్ణంగా తన ధ్యేయంలో మునిగిపోవటాన్ని సమాధిఅంటారని తీర్మానించుకో. దాన్నే 'తన్మయత్వం' అని, 'తదాకారవృత్తి' అని శాస్త్రాలు అన్నాయి. ధ్యేయంతో ఏకంకావటంఅని అర్థం.

ఏకం ఎలాఅవుతామంటావేమో! ఆరునెలలు స్నేహంచేస్తే వారువీరవుతారని అంటున్నామా? అలా సాంగత్యమహిమచేతనో, సహవాసదోషం చేతనో, ఒకరిలక్షణాలు మరొకరికి వస్తున్నాయాలేదా? అంతకంటే త్వరగా, ఏడుస్తున్నవాళ్ళనుచూస్తే మనకు ఏడుపు రావటంలేదూ? అలాగే, నవ్వుతూ ఉండేవాళ్ళను చూడగానే వెంటనే మనంనవ్వటంలేదూ? నవ్వేగ్రామఫోను ప్లేటుపెట్టినప్పుడు అలాగా నవ్వనివాళ్ళెందరుంటారు? ఈ లోకానుభవా

ల్లోనే, లక్షణాలలోనే వాళ్ళువీళ్ళు అవుతూఉంటే, యిక ఆధ్యాత్మికవిష యాలలో చెప్పాలీ! ఈలోకంలోఉండే అనుభవాలకంటే, ఆధ్యాత్మికఅను భవాలకు శక్తి చాలాఎక్కువఉంటుంది. కాబట్టి ఆఅనుభవించే కొంచెంసేపైనా ఆనందంలోనో, ఆయిష్టదైవ స్వరూపంలోనో, ఏకంకావటంలో సందేహం కించిన్మాత్రమైనా లేదు.

ఈవిధంగా కన్నుమూసి సమాధిలోఉండే ఆఅయిదునిమిషాలే కాకుండా, కళ్ళుతెరిచినా, అందరిలాగా లోకంలోతిరుగుతున్నా, ఆ యానం దాన్ని యేఅంతరాయంలేకుండా అనుభవించవచ్చునంటారు అనుభవజ్ఞులు. అలాఉండటం 'జీవన్ముక్తి' అంటారు. అందరిలాగాఉంటూ, ఆ దివ్యాను భవాన్నిపొందుతూ, దానిలో మునిగితేలుతూఉండటం అన్నమాట **జీవన్ముక్తి** అంటే. భగవద్గీత చదువుతున్నావుగా! రెండోఅధ్యాయం చివరిశ్లోకాలు బాగా చూచుకో. జీవన్ముక్తుని లక్షణాలుఅన్నీ నీకు బోధపడుతాయి.

అయితే యీస్థితులు పొందాలంటే చాలకష్టపడాలి. గొప్ప జ్ఞానం ఉండాలి. వైరాగ్యం మేరుపర్వతంలాగా రూపొందాలి. అప్పుడే యీ స్థితులు సాధ్యంఅయ్యేది. దీన్నిపొందే మార్గాల్నిగురించి చర్చిస్తూ, **పతంజలిమహర్షి** అంటాడుగదా 'పరంవైరాగ్యం' కావాలని. అంటే ఉత్కృష్టవైరాగ్యం అనిఅర్థం. అది ఎప్పుడులభిస్తుంది? తనఆధిక్యతను గ్రహించాలంటాడు. అప్పుడు యీ అసమానవైరాగ్యం కలుగుతుందట. తన ఆధిక్యతఅంటే ఏమిటి? అందరికంటే తాను గొప్పవాడనిఅర్థమా? అందరిని తులస్కారంగా చూడా లని భావమా? దేన్నీ లెక్కసేయరాదని ఉద్దేశ్యమా? అలాకాదు. తన ఆధిక్య తను తెలుసుకోటానికి మార్గాలున్నాయి. చూడు, పదిరూపాయల జీతగాడికి దమ్మిడి ఒకలెక్కకాదు. వందరూపాయలవాడికి పదిరూపాయలు లెక్కకాదు. వెయ్యి సంపాదించేవాడు వందరూపాయలు ఎడంచేత్తో పారేస్తాడు. లక్షాధి కారికి వెయ్యంటే అంతే. కోటీశ్వరుడికి? లక్షఅంటే లెక్కేలేదు. దీనికంతా అర్థంఏమిటి? ఎక్కువ ధనంకలవారికి తక్కువడబ్బంటే గడ్డిపరక. నైజాం నవాబు కారుమీదపోతుంటే, వీధిలో ఒకపదిరూపాయలకాగితం ఉందనుకో.

కారునులాపి ఆకాగితం తీసుకుంటాడా? 'ఛీ నీచం' అంటాడు. అదే పేదవా డైతే? ఆతురతతో గబాలున దానిపైబడి, నలిగిపోతుందనికూడా ఆలోచన లేకుండా తీసుకొనిదాచేస్తాడు. దాన్ని ఎలాఖర్చుపెట్టాలో వెయ్యిప్లాన్లు వేస్తాడు. కాని కోటీశ్వరుడైననవాబు తనఆధిక్యతను, ధనవిషయంలోనేఅనుకో, తెలుసుకున్నవాడై దానికైఆశపడడు. ఆకారణంచేత ఏవికారంచెందడు. అలాగే యీప్రపంచంలోఉన్న సుఖాలన్నింటెని గడ్డిపరకలాగా చూచేస్థితి ఎవడికి వస్తుందో, వాడు సరిగ్గా తనఆధిక్యతను గ్రహించాడనిఅనాలి. అంటే యీ ప్రపంచసుఖాలకంటే మంచిసుఖాన్ని పొందుతూఉంటే, తన సుఖంముందు యీలోకంలోసుఖాలన్నీ కలిసికూడా ఒకఅణుప్రాయంఅని లాను తెలుసు కుంటే, తనఆనందసాగరంలోఉండే ఒక్కబొట్టుతోకూడా యీ విషయ సుఖాలన్నీచేర్చినా తులతూగవని గ్రహిస్తే, అప్పుడు అతడు తన ఆధిక్యాన్ని గ్రహించాడన్నమాట. ఈవిషయాన్నేఅంటే సమాధిలోఉండే ఆ ఆనందా నికి, లోకంలోఉండే యీసుఖానికి పోల్చిచూచి, దాంట్లో యిదిఒక పరమా ణువు అన్నారు బృహదారణ్యకోపనిషత్తులో.

ఈవిధంగా తన ఆధిక్యతను, అంటే తన అనుభవానందంయొక్క గొప్పదనాన్ని ఎవరైతే గ్రహించుకుంటారో, వారికి ఉత్కృష్టవైరాగ్యం లభి స్తుంది. కొంచెమన్నా ఆయానందాన్ని అనుభవించకపోతే, ఎలా పోల్చు కోటం? ఎలాతెలుసుకోటం? కాని ప్రయత్నంచేత, ప్రత్యాహార, ధ్యానాలలో కొంచెం రుచిచూడాలన్నాంగదా! ఆమాత్రం ప్రస్తుతానికిచాలు. దాన్ని పెంచేసే యాలి. వైరాగ్యాన్ని వృద్ధిచేయాలి. దానితోపాటు తనఆధిక్యతను యింకా ఎక్కువగా తెలుసుకోవాలి. ఈరెండు చేదోడువాదోడుగా అభివృద్ధి చెందు తూఉంటే, ప్రవాహరూపంగా వచ్చి మీదపడుతుంది ఆనందాను భవం. పోనుపోను కళ్ళు మూతలుపడిపోయి, అసలు యీలోకాన్ని చూడటానికే బుద్ధిపుట్టదు. అప్పుడు ఒకముద్దులాగా పడిఉంటాడు సాధకుడు. వీడినే సిద్ధుడంటారు. ఈ స్థితినే 'జడసమాధి' అంటారు.

ఈసమాధుల్లో అనేకరకాలుంటాయి. ధ్యానంలోఉండేమూర్తియొక్క రూపంమీద బుద్ధినిలిచిపోతే 'భావసమాధి' అంటారు. గుణంమీద నిలిస్తే

'సవికల్పసమాధి' అంటారు. ఈ నామ, రూప, గుణాలనుదాటి, కేవలం ఆనందంలో మునిగిఉంటే 'నిర్వికల్పం' అంటారు. ఈఆనందంకూడా తెలియబడకుండాఉంటే 'అసంప్రజ్ఞాతసమాధి'అంటారు. ఇవేమిటి ఇంకా ఎన్నో రకాలున్నాయి. ఈసమాధులనన్నింటిని, అనగా సగుణ, నిర్గుణ సంబంధమైనవానిని అన్నింటిని అనుభవించిన మహాత్ముడు మనరామకృష్ణుడు. ఒక్కొక్కదానికిఉండే స్థితుల్ని, వాటివాటి భేదాల్ని గ్రహించటానికి చాలకష్టం. బుద్ధిసూక్ష్మత చాలఎక్కువగా ఉండాలి. కొంచెంఅయినా వాటిల్లో అనుభవం ఉండాలి. లేకపోతే వాటినిగురించి అసలు అర్థమేకాదు. నీవు చిన్నపిల్లవు. ఇంకా అనుభవం లేనిదానవు. కాబట్టి యీవిషయాలు యింక నిలిపేస్తాను. అంటే, నీకు యీవిషయాలు అసలుచెప్పనని అర్థంకాదుసుమా! నీకు అవసరంఅని నాకుతోచినప్పుడు వీటిల్లోఉండే అనేకరహస్యాలు తెలియ పరుస్తాను. ప్రస్తుతం నీవు చెయ్యాలి. అన్ని విషయాలను ముందు చేసి సాధించు. అప్పుడు పై విషయాలు ఆలోచిద్దాం. కాబట్టి విరమిస్తున్నాను.

బిడ్డా! మాతాజీ! ఈఉత్తరంతో రాజయోగం పూర్తిఅయింది. ఇన్ని ఉత్తరాలలోగాని అష్టాంగయోగం పూర్తికాలేదు. దీన్నిబట్టి దీనికెంత ప్రాధాన్యత ఆధ్యాత్మికమార్గంలోఉందో ఆలోచించుకో. కాబట్టి, దీన్ని ముముక్షువు అయినవాడు సాధనచేసి, ఆసర్వాతీత అనుభవసంపదనుపొందాలని అనుకునేవాడు, యీఅష్టాంగాల్ని ఎలా జీర్ణంచేసుకోవాలో ఆలోచించుకో. ఇంత ముఖ్యంకాబట్టి దీన్ని రాజయోగంఅన్నారని గుర్తుఉంచుకో. ఆఅనుభవానందాన్ని పొందటానికి ఆధ్యాత్మికంగా ఓనమాలనుండి ఎం. ఏ. వరకు, యింకా ఎక్కువ పాండిత్యంవరకు, యీఅష్టాంగపథంలోనే ఉంది. అసలు దీన్నిసక్రమంగా అనుసరిస్తేచాలు ఆసమాధిస్థితుల్లో మునిగిపోవటానికి. అంతేకాదు. దీన్ని కొంచెమైనా ఏపొరపాటుకూడాలేకుండా అనుసరిస్తేగాని పై అనుభవాలురావు. పైఅనుభవాలేకాదు. మొదటి అనుభవాలైనా, ఆధ్యాత్మికంగా పిసరంత అనుభవంఅయినా చవిచూడలేడు సాధకుడు. ఈమార్గంలో పునాదినుండి గట్టిగావేస్తాం అనుభవానందసౌధానికి. అలాకట్టిన యీ ఆధ్యాత్మికానందమహల్, ఎన్నితుఫానులుకొట్టినా కదలనేకదలదు. ఈ రాజనగరుయొక్క

శిఖరమైనా చెక్కుచెదరదు. ఈరహస్యాన్ని గ్రహించి, ప్రాజ్ఞులైనవారు మొదటి నుండి, యీ రాజయోగాన్ని అనుసరించిరావాలి. ఆధ్యాత్మిక మేరుపర్వతాన్ని అధిరోహించాలి. వేరు మార్గంలేదు. లేదు ముమ్మాటికీ లేదు.

ఇక నీసంగతిచెప్తాలీ! చిన్నదానివి, తెలివిగలదానివి. సాధన చేయుటా నికి శక్తిఉంది. ఉత్సాహంఉంది. శ్రద్ధఉంది. ప్రవేశించావాలంటే, ఒక ప్రవా హంలాగా సాధన సాగిపోతుంది. త్వరలోనే ఆశిఖరాన్ని పొందేస్తావు. ఆ నమ్మకం నాకుబాగాఉంది. మన ఆరాధ్యదేవతలైన శ్రీశారదారామకృష్ణుల అనుగ్రహం నీపై ఉన్నదిసుమా! ఇక నీయిష్టం. ఈమార్గాన్ని అనుసరించి యీప్రపంచాతీతమైన అనుభవానందసాగరంలో యీదులాడుతానంటావో, లేక యీప్రపంచంలో నలుగురిలాఉండి, ఒక పేడపురుగులాగా, సంకుచిత మైన సుఖాల్లోమునిగి, వాటితో తృప్తిచెంది, కొంచెంసేపు ఏడుస్తూ, కొంచెం సేపునవ్వుతూ ఉంటానంటావో నిర్ణయించుకో. ఇది నీయిష్టం అవుతుంది గాని, నాయిష్టంకాదు. ఈఆధ్యాత్మికసంస్థితులు ఒకరిబలవంతంచేత వచ్చేవి కావు. ఒంట్లోనుండి పుట్టుకురావాలి. స్వయంకృషితో జన్మించాలి. ఒకరి అనుగ్రహంవల్ల ఉట్రొడియంగా లభించేవికావు. రక్తం ధారపోయాలి. ప్రాణా న్నైనా త్యాగంచేయాలి. అందుకనినీవే తీర్మానంచేసుకొని, యీమార్గాన్నిఅను సరిస్తానన్నావా అంటే యీఅష్టాంగమార్గాన్ని పుల్‌స్టాపు కమాలతోగూడా అను సరించు, సాధించు, అనుభవించు, ఆనందించు. జన్మసార్థకం అవుతుంది.

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం.

[signature]
8-2-46

# 18
# భక్తియోగము

*చెల్లీ మాతాజీ!*

ఇంతవరకు వ్రాయబడిన ఉత్తరాలద్వారా కర్మయోగాన్ని, రాజయోగం అనే అష్టాంగమార్గాన్ని కొంతవరకు తెలుసుకున్నావు. దీనివల్ల, ఆధ్యాత్మిక గ్రంథాలలో వస్తూవుండే కొన్ని మాటలు, భావాలు నీకు తెలిసినయి. దాన్నే పరిభాషలంటారు. అంటే యీఉత్తరాలద్వారా నీకు యీవేదాంతపరిభాష తెలిసిందనుకోవచ్చు. దాన్ని తప్పకుండా తెలిసికొనిఉండాలి. ఆపరిభాషను గ్రహించకపోతే ఆధ్యాత్మికమార్గం చాలా అగమ్యగోచరం అయిపోతుంది. అసలు ఆధ్యాత్మికమార్గంఏమిటో, ఆమార్గాన ఎందుకు ప్రవేశించాలో, ప్రవే శించడానికి యేయే యోగ్యతలుండాలో, ప్రవేశానికి మనకు సహాయం యివ్వ గలవాడెవడో, అతగాని లక్షణాలెలాఉంటాయో, యింతా ప్రవేశించినతర్వాత ఎట్టిఅనుభవాలువస్తాయో, వాటిని గుర్తించేదిఎలాగో, ప్రస్తుతం మనకట్టి అను భవాలేవైనా వస్తున్నయ్యో, ప్రస్తుతం మనస్థానం యీ ఆధ్యాత్మికరంగంలో ఎక్కడో, యింకా యేయే లక్షణాలురావాలో, వాటిని ఎలా పొందాలో, మొద

లైన సహస్రసంఖ్యగాఉండే ప్రశ్నలకు సమాధానాలు సక్రమంగా పొందటం ఏదుందో అది అవసరంకాదూమరి! లేకపోతే అడుగడుగుకు సందేహాలే. ఈ సందేహపరంపరలో అడుగుసాగదుగా! అందుచేత ముందుగా యీ విష యాలు తెలుసుకోటం చాలఅవసరమని పెద్దలసలహా.

ఇలా రాబోయే అనుభవాన్ని ముందుగా తెలుసుకోటాన్నే 'పరోక్ష జ్ఞానం' అన్నారు శాస్త్రాల్లో. ఈపరోక్షజ్ఞానంలో, ప్రత్యక్షంగా అనుభవం ఉండేదిలేదు. ప్రత్యక్షంగాలేదంటే, ఆయా అనుభవాల స్థితిగతులను అనుభ వజ్ఞులనుండి వింటున్నామన్నమాట. అర్థంచేసుకొని, మనం ఉపయోగించు కోటానికి ఉంచుకుంటాం. ఇలా, దాచిడంచుకున్న వినికిడిజ్ఞానాన్ని, ప్రత్య క్షంగా మనంమనకుగా అనుభవానికి తెచ్చుకొని ఎప్పుడు ఆనందిస్తామో అప్పుడుదాన్ని 'అపరోక్షజ్ఞానం' అంటారు. ఇప్పుడు యీపరోక్షజ్ఞానానికి, అపరోక్షజ్ఞానానికిన్నీఉన్న తారతమ్యం నీకు బోధపడిందా? 'సరే ఈ రెండు జ్ఞానాలకిభేదం తెలిసింది. కాని యీపరోక్షజ్ఞానానికిన్నీ, ముందుచెప్పబడిన ప్రత్యక్షజ్ఞానం అనేదానికిన్నీ భేదండుందా? లేక రెండూ ఒకటేనా' అంటావు. ఆరెంటికీ భేదంఉంది. కొంచెంకాదు. చాలాభేదం. ఈపరోక్ష, అపరోక్షాలకు భేదంకొంచెమే. ఎలాగంటే, పరోక్షంగా ముందుతెలుసుకున్నదాన్నే అపరో క్షంలో, అనుభవంలో తెలుసుకుంటూ, యింకా ఎక్కువగాగ్రహిస్తాం. అలా కాదు యీప్రత్యక్ష, అపరోక్షాలు. ప్రత్యక్షజ్ఞానంఅంటే ఏమిటో మొదటి ఉత్తరంలోనే చెప్పాను. ఏమన్నాను? మన పదియింద్రియాలద్వారా గ్రహించే ఏప్రపంచజ్ఞానండుందో, అది ప్రత్యక్షజ్ఞానంఅని అప్పుడు చెప్పానుగదా! అలా కాదు అపరోక్షంఅంటే. ఇక్కడ ఆ ఇంద్రియాలూ లేవు ఆప్రపంచమూ ఉండదు. మరి అదెల్లాగంటావు! అపరోక్షజ్ఞానం అంటే ప్రాపంచికవిషయం కాక భగవద్విషయం అన్నమాట. ఆభగవంతుడిని తెలుసుకోటానికి, యీ మన స్థూలయింద్రియాలు పనికిరావు. ఈ స్థూలయింద్రియాలచేత, యీ స్థూలవిషయాన్నే అంటే యీలోకాన్నే తెలుసుకోవాలి. కాని సూక్ష్మాతి సూక్ష్మంగా ఉండే ఆ భగవంతుడిని గ్రహించలేము.

అసలు స్థూలత్వంఅంటే ఏమిటో కొంచెంచెపుతాను. ఏదైతే భూతాల

చేత చేయబడిందో అది స్థూలంక్రిందలెక్క. భూతాలంటే దయ్యాలు కాదు సుమా! మనం నిత్యం చూస్తూవుండే యీభూమి, నీళ్ళు, నిప్పు, గాలి, ఆకాశం, యివన్నీ భూతాలుఅనబడుతాయి. వాటినే సంస్కృతంలో పృథ్వ్యప్తేజోవాయురాకాశములంటారు. పృథ్వి అంటే భూమి, అప్-నీరు, తేజస్సు -అగ్ని, వాయువు-గాలి, ఆకాశంఅంటే ఆకాశమే. ఇవి అయిదు. ఈ అయిదింటిని పంచమహాభూతాలంటారు. ఈభూతాలకూడికే యీ సృష్టిఅంతా. అంటే యీఅయిదుభూతాలు కలిస్తేనేగాని ప్రపంచంలో ఏవస్తువు కాలేదు. మనంచూచే అన్నింటిలో యీఅయిదు ఉండితీరాలి. అంటే నీళ్ళలో నిప్పు కూడా ఉంటుంది. అలాగే గాలిలో మట్టిఉంటుంది. ఆకాశంలో, మిగతా నాలుగూ ఉండితీరాలి. దేనిలోఅయితే ఒక్కభూతాంశం ఎక్కువగా ఉంటుందో, దానికి ఆభూతంపేరు వస్తుంది. వీటిని అయిదింటిని స్థూల భూతాలంటారు. అయితే సూక్ష్మభూతాలుకూడా ఉంటయ్యా అనే సందేహం నీకు కలుగుతుంది. ఆహా! ఉన్నాయి సూక్ష్మభూతాలు. ఈ సూక్ష్మభూతాల్ని 'తన్మాత్రలు' అంటారుశాస్త్రంలో. ఈతన్మాత్రలు కంటికి గోచరించవు. యంత్రాలకుకూడా గోచరించని యీసూక్ష్మభూతాలు ఆత్మ వస్తువునుండి మాయద్వారా కలిగాయి. అవి మరల, ఒకదానిలో ఒకటికలిసి స్థూలంఅయినాయి. ఈ కలియటాన్ని శాస్త్రాలలో 'పంచీకరణం' అంటారు. ఈపంచీకరణం నీవు యిదివరకు విన్నవిషయమే. కాని నీకు మరోసారి చెప్పు తాను విను. భూతాలు తన్మాత్రలరూపంగా మొదట ఉన్నాయన్నాను. వాటిని పృథ్వి, అప్, తేజస్సు, వాయువు, ఆకాశం అన్నాం. ఇవి తమలోతాము కలిసి, స్థూలభూతాలయ్యాయి అన్నాను. ఈకలయిక ఎలాపడితేఅలాకాక, ఒకక్రమ ప్రకారం అవుతుంది. ఆక్రమం తప్పటానికేవీలులేదు. ఆక్రమాన్నే 'పంచీ కరణం' అంటారు. మొదట యీ అయిదు భూతాల్లో ఒకదాన్ని తీసు కుందాం. ఆకాశంఅనుకో. స్థూలమైనఆకాశం ఎలాఏర్పడిందో మొదట తెలుసుకుందాం. సూక్ష్మంగాఉన్న ఆకాశాన్ని మొదట, సగంచేద్దాం. అలాగే తక్కిన నాలుగుభూతాల్నికూడా సగంసగంచేసేద్దాం. ప్రతిభూతంలో ఒక్కొక్క సగాన్ని, వేరువేరుగా ఉంచుదాం. ప్రతిభూతంలోఉండే రెండో సగాలను,

మరల నాలుగేసి భాగాలుగాచేద్దాం. అంటే యీఒక్కొక్క చిన్నభాగం, మొత్తం భూతంలో ఎనిమిదోవంతు అయిందన్నమాట. మొదటనే వేరుగాఉంచిన ఆకాశభూతంయొక్క అర్ధభాగంలో తక్కిన నాలుగుభూతాల ఎనిమిదోవంతు భాగాలను ఒక్కొక్క భాగంవంతునతీసి కలిపివేయాలి. అప్పుడు ఆకాశ భూతం సగభాగం, వాయువు ఎనిమిదోవంతుభాగం, అగ్ని ఎనిమిదోవంతు, అలాగే ఎనిమిదోవంతు జలం, అలాగే భూమి కలిశాయి. మొత్తం ఒకటిగా మరల ఆకాశభూతం లెక్కకులయిందిగాని, దానిలో తక్కిన భూతాలుకూడ అర్ధభాగంవరకు కలిసిఉన్నాయి. ఇలా యితరభూతాలలో, యీలెక్కప్రకారం కలిసిఉన్న ఆకాశభూతాన్ని, స్థూలఆకాశభూతం అన్నారుపెద్దలు. ఇలాగే యీక్రమంప్రకారమే వాయువు సగంభాగం, తక్కిన నాలుగు భూతాలలో ఎని మిదోవంతు భాగాలుచేరి స్థూలమైన వాయుభూతం అయింది. తక్కిన అగ్ని, జల, పృథ్వీభూతాల స్థూలత్వంకూడా యిలాగే ఏర్పడిందిఅని తెలుసుకో. ఇలాగ సూక్ష్మంగా నేత్రాలకు గోచరించకుండా, తన్మాత్రలరూపంగాఉండే పృథ్వ్యప్తేజోవాయురాకాశములనే భూతాలు స్థూలంకావటాన్ని పంచీకరణం అంటారు. ఈ స్థూలభూతాల్ని పంచీకృతభూతాలనిన్నీ, సూక్ష్మభూతాల్ని అపంచీకృతభూతాలనికూడా అంటారు.

ఈవిధంగా పంచీకృతమై స్థూలంగాఉన్న భూతాలను, ఆయా భూతాలచేతనే ఏర్పడ్డ మన దశేంద్రియాలచేత గ్రహించటం ఏదుందో, దాన్ని ప్రత్యక్షజ్ఞానం అన్నారు. భగవంతుడందామూఅంటే, యీభూతాలచేత చేయ బడనివాడుకాబట్టి, అతడిని యీయింద్రియాలతో తెలుసుకోలేము. మరి ఎలాతెలుసుకోవటం? అంటే తెలుసుకుంటాం, అనుభవిస్తాం, ఆనందిస్తాం, కాని అదిఎలాగో చెప్పలేము. భగవదనుభవంఅంటే అనిర్వాచ్యం అన్నారు పెద్దలు. అలా అనిర్వచనీయ భగవదనుభవం ఏదిఉన్నదో దాన్ని అపరోక్షాను భూతిఅని అపరోక్షజ్ఞానంఅని అంటారు అనుభవజ్ఞులు. ఇది, యీ మూడు రకాల జ్ఞానాలకు అంటే, ప్రత్యక్ష, పరోక్ష, అపరోక్షాలనే జ్ఞానాలకు పరస్ప రంగావుండే తారతమ్యం.

అందుకని యింతకూ, నేను చెప్పేది ఏమిటంటే ముందుకలుగబోయే

యీఅపరోక్షానుభూతికి అనుగుణంగాఉండి, దానికి కొంతవరకుదారిచూపే యీపరోక్షజ్ఞానం అవసరంఅని చెప్పుతున్నాను. ఇలా, పరోక్షజ్ఞానం బాగా గ్రహించినవాళ్ళు, సాధారణంగా పొరపాటుపడరు. అంటే పండితులనేకు లున్నారుగదా, 'వాళ్ళందరూ అపరోక్షంలోకూడాగట్టెక్కేరా?' అనేసందేహం నీకు కలుగుతుంది. కేవలంపరోక్షజ్ఞానం నేర్చుకున్నంతమాత్రాన లాభంలేదు. పరోక్షజ్ఞానంగలవాడు పండితుడవుతాడుకాని సాధకుడుకాడు. తాను చదువు కున్న ఆరెండుముక్కలు, తన అపరోక్షజ్ఞానప్రాప్తికి ఉపయోగించకుండా దానితో తృప్తిపడో, దాన్ని పొట్టకూటికో, లేక లోకాన్ని మోసగించటానికో ఉపయోగించటం అసలు పాండిత్యమేకాదు. చదువుకున్నదాన్ని ఎప్పుడు అనుభవంలోకి తెచ్చుకుంటాడో అప్పుడు వాడు పండితుడౌతాడు. అప్పుడే ఆచదువుకూడా సార్థకంఅవుతుంది. అలా సార్థకంఅయ్యేదిఅంటే అపరోక్షా నుభూతికి దారి చూపి, దాన్ని కలిగించే యేచదువున్నదో దాన్నే పరోక్షజ్ఞానం అంటే మరీబాగుంటుంది. అలాగే అందాం. ఇలాంటి పరోక్షజ్ఞానాన్ని నీవు తెలుసుకుంటున్నందుకు నాకు చాలసంతోషం.

పైన జరిగిన మీమాంసలో, అంటే చర్చలో, ప్రత్యక్షజ్ఞానానికి ఆధార భూతమైన ఏప్రపంచంఉందో, దాన్ని తెలుసుకుంటున్న చతుర్విధ జీవరాసుల రూపంగాఉన్న ఏజీవులైతేఉన్నారో, వీటినన్నింటినికలిపి చరాచరాత్మకమైన యీప్రపంచంఅంతా, యింకా ఆకాశంలో ప్రతిదినమూ కనిపిస్తూఉండే సూర్యచంద్రాదిగ్రహాలూ, నక్షత్రాలూ, మొత్తంఅంతాకలిసి, సృష్టి అనబడు తుంది. సృష్టిరూపంగాఉన్న యీబ్రహ్మాండాన్నంతా ఎవరు కల్పించారు? ఎవరుసృజించారు? అంటే ఎవరివల్ల యిదంతా పుట్టింది అనేప్రశ్న వస్తుందని, ఆప్రశ్నకు సమాధానంగా దీనికి ఉపాదానకారణంఅనేది ఒకటి, ఆ ఉపాదాన కారణాన్ని ఉపయోగించి యీరూపంగా తయారుచేసే నిమిత్తకారణం మరొ కటి ఉందని, పూర్వం నీకు చెప్పాను. ఆనిమిత్తకారణం, ఉపాదానకారణం, రెండూకలిసి ఆపరమేశ్వరుడే అయ్యాడని, అంటే ఆభగవంతుడే యీ సృష్టి సంతా సృజించాడని, సక్రమంగానడిపించువాడని తీర్మానంచేసుకోవాలి శాస్త్ర లనుబట్టి, యింకా ఆలోచననుబట్టి. ఒక చిన్నవస్తువును చక్కగాచేస్తేనే

వాడెంతతెలివిగలవాడోఅని ఆశ్చర్యపడిపోతామే. ఇక యీ అనంతసృష్టిని యింత చిత్రవిచిత్రంగా సృజించినవాడి తెలివినేమనాలో ఆలోచించు! ఎంత అందంగాఉందో ఆసూర్యోదయాన్ని, దానిలోని ఆసువర్ణకాంతిని చూడు! ఎంతగంభీరమో, ఆసముద్రాన్ని, దానిగొప్పదనాన్ని చూడు! ఎంతఉన్నతమో ఆహిమాలయపర్వతాల్ని, వాటి ఔన్నత్యాన్ని, ఠీవిని చూడు! ఎంత ఆహ్లాద కరం, ఆగులాబిపువ్వును, దానిలోని రెక్కలతీరు, పరిమళముయొక్క సొబ గును చూడు! ఇంకా ఎంతఎంత వింతగానో యీసృష్టినంతా కల్పించిన ఆ భగవంతుని తెలివెంతగొప్పదో ఎవరుచెప్పగలరు? ఇలా యోచించియోచించి నోరు తెరవాలిసిందే! అతని తెలివితేటల పరిమితిని ఎవరు తెలుసుకోగలరు? అందుకనే అతనితెలివి అనంతంఅనటానికని అతడిని సర్వజ్ఞుడు అన్నారు. అంటే అతనికి తెలియనిదేది లేదన్నమాట. అతనికి అన్నివిషయాలలోనూ ప్రజ్ఞఉందని అర్థం. అప్పటికి, తన సొంతతెలివిచేత యీయనంతసృష్టిని కలుగజేశాడుకాబట్టి అతడిని ఏమనాలి? తండ్రిఅనాలి. అందుకనే అతడిని జగత్పిత అన్నారు. సృజించాడు బాగానేఉంది, కాని సంబంధంలేకుండా పారే శాడా? అలాగేకనక చేసిఉంటే, తండ్రి యింట్లోలేకపోతే పిల్లకాయుల అల్లరి పోట్లాటలలాగా, యీప్రపంచంఅంతా అల్లకల్లోలంకావాలి. సూర్యుడు వాడి యిష్టంవచ్చినట్లు మధ్యాహ్నానికే అస్తమించాలి విశ్రమించటానికని. వర్షాకాలం లోనే ఎండలుమండిపోవాలి. చంద్రుడు అలసట తీర్చుకోటానికై ఆరు మాసాలు సెలవుపెట్టాలి. పర్వతాలు మహోదయస్నానానికని సముద్రానికి రావాలి. ఇంకా యిలాంటివిపరీతాలు ఎన్నోజరిగి, సృష్టిఅంతా తలక్రిందైపోయి ఉండాలి. అలా జరగటంలేదు. కాబట్టి సృజించిన ఆఈశ్వరుడు యీ సృష్టి నంతా జాగ్రత్తగా ఏఅల్లరులులేకుండా, శాసనకర్తలాగా నియమిస్తూ, పాలిస్తూ ఉంటాడని తీర్మానించాలి. అందుకని ఆ పరమేశ్వరుడు జగత్పాలకుడన్నారు. ప్రచండశాసనుడు అనికూడాఅన్నారు. వీటిమీదప్రేమలేకపోతే అసలు పాలనే ఉండదు. కాబట్టి ఎలాగూ యీసృష్టికంతా కర్తకాబట్టి, ప్రేమస్వరూపుడు అనికూడాఅన్నారు. ఈవిధంగా జీవకోటినంతా పుట్టించి, పాలించేవాడెవడైతే ఉన్నాడో, వాడు తప్పకుండా అసమానశక్తిసంపన్నుడుగా ఉండాలి. కాన సర్వ

శక్తుడుఅన్నారు. ఈవిధంగా, యీకనబడే సృష్టిమూలంగా, యీ భగవం తుడికి లెక్కలేనన్నిగుణాలు చెప్పాలిసివచ్చింది. అందుకనే శ్రీరామానుజా చార్యులవారిదృష్టిలో అనంతకళ్యాణగుణాలున్నాయి యీ భగవంతుడికి.

మొన్న గాంధీమహాత్ముడు చెన్నపట్నం వెళ్లుతుంటే, ప్రతిస్టేషనుదగ్గర ఎన్నిలక్షలజనంచేరారు వారిదర్శనంకోసం! ఆయన చేసిన ఘనకార్యాలేమిటి? హిందూదేశానికి స్వాతంత్ర్యంకావాలని, తాను దానికోసం అసమాన త్యాగం చేసి అనేకమందికళ్లు తెరిపించాడు. సత్యం, అహింసఅనే సద్గుణాలను అను ష్ఠించేవాడు. అంతేగదాయీయన గొప్పదనం! కేవలం మానవమాత్రుడు, అనంతవిశ్వంలో ఒకరేణువులాగా హిందూదేశానికి ఉపయోగపడుతున్నాడని అనంతంగాఉండే మంచిలక్షణాల్లో కొన్ని ఆయనలోఉన్నాయని, అతనికోసం యిన్నికోట్లజనం పిచ్చెత్తి పరుగెత్తుతూఉంటే, యిక యీప్రపంచాన్నంతా సృజించి, ప్రేమించి పాలించి నడిపించుతూ యిలాచేయటానికి ఒకటేమిటి? లక్ష యేమిటి? అనంతఅనంతకోటి సద్గుణాలరాసియైన ఆభగవంతుడు వచ్చాడంటే, సర్వజీవకోటికూడ తొక్కుకునివచ్చిపోదూ! అలాగే మనల్ని కని, పెంచిన తండ్రిని చూడటానికి ఎవరు తాపత్రయపడరు! కొంచెంసేపు కోపం, కొంచెంసేపు ప్రేమచూపిస్తూ, అప్పుడప్పుడూ కొట్టుతూఉండే సంకుచితమైన తండ్రిని చూట్టానికే మనం అంత తహతహ పడుతూఉంటే, యిక యీప్రపంచాన్నంతా సృజిస్తూ, ప్రేమిస్తూఉన్న తండ్రిని, ఆ పరమేశ్వ రుని చూట్టానికి ఎవరుఅపేక్షపడరు! అతడెలాఉంటాడో! అతడికెన్ని చేతులో! మరి రెండుచేతులతో యింతసృష్టిని ఎలాచేశాడో! ఎంత సౌందర్యవంతుడో! అతడుండే యిల్లుఎలాంటిదో! అతనివాహనమో! మొద లైనవాటినన్నింటిని తెలుసుకోటానికి ఎవరి హృదయం ఉవ్విళ్ళూరదు! ఇంతెందుకు? ఆప్రేమమూర్తితో ఒక్కమాటమాట్లాడితే చాలదూ! అతడు, మనల్నిచూచి ఒక్కచిరునవ్వు, బంగారునవ్వు నవ్వితేచాలదూ! అంతకూడా వద్దమ్మా. ఆసువర్ణచ్ఛాయలాంటి దేహంగలవాడు ప్రేమరసం చిందులుద్రొక్కే ముఖంగలవాడుండే ఊళ్ళోఉంటే చాలదుటమ్మా! దినమూ, అతని దగ్గరకు వెళ్ళి, మనసా నమస్కారంచేసుకుని వస్తూఉండవచ్చు. పోనీ, అదీకాకపోయినా

యీ పాడులోకంనుంచి వెళ్ళిపోయి ఆ కరుణాసముద్రుడుండే ఆ లోకంలోనే ఉంటూఉంటే చాలదూ! అప్పుడైనా కనిపిస్తుంటాడుఅని యిలా అనేకవిధాల ఆప్రేమమూర్తి, లోకైకమోహనాంగుడు, కల్యాణగుణసముద్రుడు, సువర్ణ ఛాయాస్వరూపుడు, నిత్యమంగళకరుడు, ఆనందవార్నిధియైన ఆ పరమేశ్వరుని, ఆ జగదీశ్వరుని, పరాత్పరుని దర్శింప కాంక్షింపనివాడెవడుంటాడు!

పై విధాన, యీ జగములన్సృజించి, పెంచు జగత్పిత, జగత్పాలకుడైన ఈశ్వరుడొకడు కలడని, అతని దర్శనభాగ్యంచేతనే మన పాపాలు, దుఃఖాలు నశిస్తాయని, అతని కరుణాకటాక్షవీక్షణ ప్రసారంచేతనే ఆనందసాగరంఅయిన మోక్షంలభిస్తుందని, అంతటితో యీజననమరణప్రవాహరూపమైన సంసార దుఃఖం అడుగంటుతుందని, శాస్త్రవాక్యంచేతనో, ఆప్తవాక్యంచేతనో విని, మహాత్ముల అనుభవాలను, వాక్యాలను తార్కాణంగా తీసుకుని, అలాంటి మహదానందప్రాప్తికై తపిస్తూ, వానికై ఎంతటిత్యాగాన్నైనా చేయుటానికి సిద్ధం కావటం, దానికై తీవ్ర యత్నం ఏమందో దాన్ని భక్తి అంటారు.

ఆభక్తిఅంటే ఏమిటో, ఎన్నివిధాలో, ఎలా పొందాలో, దాని ఫలితం ఏమిటో, మొదలైన విషయాలు చూశాం. నేటికింతటితో ముగిస్తున్నాను.

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం.

10-2-46

# 19

# భక్తియోగము

## త్యాగము - ప్రేమ

కుమారీ మాతాజీ!

క్రిందటి ఉత్తరంలో భక్తియోగాన్నిగూర్చి ప్రారంభించాం. ఈ విషయం మనఉత్తరాల్లో మధ్యమధ్యలో అనేకపర్యాయాలు వస్తూ ఉన్నప్ప టికీ, దాన్నిగూర్చి ప్రత్యేకంగా వివరింపవలసినఅవసరం చాలాఉంది. ఎందు కంటే అసలు మానవుడై పుట్టినవాడల్లా యీభక్తిని కలిగినవాడుగానే ముందుం టాడు. ఇంతెందుకు, మొత్తం రెండువందలనలభైకోట్ల ప్రపంచజనాభాలో, ఏవెయ్యిమందైనా భక్తిమార్గంలో ఉండనివారుండరు. అంటే అందరికి సర్వే సర్వత్రా యిదే ఉపయోగపడుతూఉంటుంది. ఇంతెందుకు, ప్రపంచంలో వుండే అన్నిమతాలు యీభక్తిమార్గానికే చెందినయిఅంటేనమ్ము. హిందూ మతంలో, నూటికి ఏపదిమందైనావుండరు జ్ఞానమార్గంఅనే అద్వైతమార్గాన్ని అనుసరించేవారు. జ్ఞానులమని, అద్వైతులమని అనేవాళ్ళు ఒకవేళఉండినా, వారిలో మనోవాక్కాయకర్మేణ కోటికి ఒకడుంటాడో వుండడో, సరియైన ఆచరణానుభవాలతోకూడిన జ్ఞానిఅనబడేవాడు. అలాంటప్పుడు యీ **భక్తి**

మార్గంలనేది ప్రపంచానికి ఎంత వుపయోగపడుతూ వున్నదో చూచుకో. ఇక కర్మమార్గం అంటే వేదకర్మాచరణ చేసేవారికేకదా! నిష్కామకర్మయోగం అందామన్న దాన్నినిష్కల్మషంగా అనుసరించేవారు, అంతేకాదు అనుసరిస్తున్నా మని చెప్పేవారైనా చాలఅరుదు. ఇక రాజయోగులందామాఅంటే, సంసార ములోవుండి, సర్వసుఖకారాలు కల్గివున్నా, 'ఆత్మసన్న్యాసంలో వున్నాము. మేము రాజయోగులం' అనే యోగరాజులున్నారుగాని, మన ఉత్తరాలలో చెప్పబడినట్లు ఆచరించే రాజయోగులు లేరనుకో. అందుకని అన్నిటికన్నా సులభంఅయింది, ఎక్కడపడితే అక్కడదొరికేది, ఎవరుపడితేవారు చెప్పేది, సర్వత్రా వ్యాపించివుండేది యీభక్తియోగం. కాబట్టి దీన్నికూడా బాగా తెలిసి వుండాలి ముముక్షువులు.

దీన్నిబట్టిచూస్తే భక్తిస్వరూపం అందరికీ తెలిసిందేనా? అంటావు. అవును తెలిసిందేనంటున్నాను. ఎలా తెలుసునో చెప్పుతాను విను.

తల్లి, తన అయిదేండ్లబిడ్డను నడిపించుకుంటూ వీధిలో పోతున్నది. ఇంతలో కారు వచ్చింది. పిల్లవాడు తల్లి వ్రేలువదలి రోడ్డుమీదికి పరుగెత్తాడు. వేగంగావచ్చేకారు, యింకా గజందూరంలోఉంది కుర్రాడికి. అప్పుడు ఆతల్లి ఏమిచేసింది? ఒక్కగంతువేసింది ముందుకు. కుర్రవాడిని, అవతలికి ఒక్క త్రోపుత్రోసింది. కుర్రవాడు కారును తప్పించుకుని రోడ్డుకు అవతలపడ్డాడు. కానిపాపం ఆతల్లి కారుక్రిందపడిపోయింది. ఆమిలటరీవాడు కారును ఆపాడు కాడు. తీవ్రగాయాలు తగిలాయి. ఏగాయాలులేక బిత్తరపోయి చూస్తూవున్న తనపుత్రుని, ఆరక్తపాతంలయిన ముఖంతో, విరిగిపోయిన శరీరంతో, చితికి పోయిన కన్నులలోనుండి పారినరక్తం రెండోకంటిలోకి జారుతూవుండగా, ఆ తనప్రాణాన్ని చూచింది. ఒకే చిన్ననవ్వు నవ్వింది. కన్ను మూసింది. మూసిన కన్ను మరల తెరవలేదు. జనంమూగారు. కంట తడిపెట్టనివారులేరు. ఆ అయిదేళ్ళగుంటడికోసం ఆమె ఎందుకు తన అసువులబాసింది? ఏమి సంబంధం? ప్రేమ!

అలాగేచూచుకో. భర్తప్రాణాపాయస్థితిలో వున్నాడు. కుదరనిరోగం.

వైద్యుల యత్నాలు పూర్తిఅయ్యాయి. అంతటా నిరాశే తాండవిస్తూవుంది. దారి ఏమిటోతెలియటంలేదు. ఎవరూ సలహా చెప్పేవాళ్లైనాలేరు. ధైర్యంచెప్పే పురుగైనాలేదు. గజగజమనే శరీరంతో, సంస్కారం ఎరుగని తలకట్టుతో, శుభ్రం తెలియనివస్త్రంతో, రక్తమే ధారగా కారుతున్నదాఅనే కన్నీటిధారతో, దుఃఖమే యిలాఅవతరించిందాఅని ఆశ్చర్యంకలిగించేభార్య సుమారు పదారు సంవత్సరములచిన్నది గుమ్మందగ్గరకూర్చున్నది. ఎదురుగా కదలికమెదలికలు లేక కొనప్రాణాలతో, మధ్యమధ్య చిన్నమూల్గులతోనున్న, తన ప్రాణనాథుని ముఖముపై ఆమెదృష్టి కేంద్రీకరింపబడివుంది. ఆ సూర్యభగవానుడుకూడా యీామెఆర్తితోపాటు తానుచింతించి, ముఖం ఎర్రబారి, తనకడసారి చూడ్కులనీమె ముఖానికొప్పజెప్పి అంతర్హితుడైనాడు. చిన్న దీపంమాత్రం వుంది. ఇంతలో దేవుళ్ళాగవచ్చాడు ఒకగోసాయి. అమ్మాయికి ప్రాణం లేచి వచ్చింది. గోసాయీాలు ఘనవైద్యులు. అనేకక్రియలు వాళ్ళకు తెలిసి వుంటాయి. సత్కరించింది. ప్రార్థించింది. దారి చూపమన్నది. ఏదడిగినా యిస్తానన్నది. మందులవల్ల కాదనుకున్నాడు. దీనికి పరమౌషధం ఉంద న్నాడు. అతనికి సావిత్రీసత్యవంతులు మనస్సుకు తట్టారు. 'ఊఁ' అన్నాడు. 'అమ్మాయీ! ఒకటే మందుఉంది. దానితో తేలిపోవాలి' అన్నాడు గోసాయి. ఆనందంకలిగింది అమ్మాయికి. నాథుడు లేస్తునట్లు గోచరించింది అమ్మాయికి. 'శలవు' అన్నది అమ్మాయి. 'దేవుడిని ప్రార్థన చేసుకో. నీ స్తనాన్ని ఒక్కదాన్ని కోసేయి. కూరగా చేయి. అతనికి పెట్టు. యిక అతనికేమీ ఫరవాలేదు' అన్నాడు గోసాయి. ఇంత త్యాగంకంటే వేరుసూత్రం లేదన్నాడు, వెళ్ళిపోయాడు గోసాయి. విన్నది, వంటశాలకువెళ్ళింది. కొన్ని నిమిషాలలో, సెకెండ్లలో తిరిగివచ్చింది నాథునిసన్నిధికి. అదృష్టవశాత్తు కన్నుతెరిచాడు నాథుడు. ఔషధసేవకాకముందే నాథుడుబ్రతికాడని ఆనందంతో, పళ్ళెంలో నుండి కూరలాంటి పదార్థాన్ని నాథునినోట్లో పెట్టుతున్నదివంగి. ఏమిటో అడగలేకపోయాడు నాథుడు. మందుగా చప్పరిస్తున్నాడు. నాథునికళ్లురక్తంతో తడిసిముద్దయి, బొట్లుగా క్రిందికిరక్తాన్ని వదుల్తూఉన్న జాకెట్టు ఎడమవైపున పడ్డాయి. నాథుడు ప్రాణంఎగిరిపోయేటట్లు చూచాడు నివ్వెరపాటుతో భార్య

ముఖంవైపు. చూచాడే నాథుడులని గ్రహించింది సాధ్వి. ఇంతలో మైకం కమ్ముతూడుంది. కళ్లు తిరుగుతూవున్నాయి. నాథుని ముఖం, శరీరం, ప్రపంచంఅంతాతిరుగుతూవుంది. అందులోనాథుడు నవ్వుతూడున్నట్లు లేస్తు న్నట్లు, తనదగ్గర కూర్చున్నట్లుచూస్తూ కన్నుమూసింది. నేలమీద వ్రాలింది. ఎందుకూ యీత్యాగం? దీనికి సూత్రం ఏమిటి? ప్రేమ! ప్రేమ!! ప్రేమ!!!

ఇట్టి అసాధారణమైన ప్రేమబంధం, సర్వజీవరాసుల్లో అనేకవిధాల పట్టుకునేడుంది. ఈప్రేమతత్త్వం తెలియనట్టిజీవి భువనత్రయంలో వెతికి చూచినా లేదు. తల్లిమీద ప్రేమ, బిడ్డమీద ప్రేమ, భర్తమీద ప్రేమ, భార్యమీద ప్రేమ, రాజుమీద ప్రేమ, సేవకుడిమీద ప్రేమ, పక్షిమీద ప్రేమ, పశువుమీద ప్రేమ, అన్నమీద ప్రేమ, తమ్ముడిమీద ప్రేమ. ఇలా యీప్రేమ ఎన్ని విధా లుందో తెలుపటానికి ఆబ్రహ్మదేవుడికైనా చెప్పటానికి వీలుకాదనవచ్చు. ఇంతెందుకు, యీజగత్తే ప్రేమస్వరూపం అనవచ్చు. ప్రేమలేకుండా అసలు ప్రపంచం ఏదీ? ప్రేమలేకపోతే యీలోకమేలేదు. ఈప్రేమనే భక్తిఅంటాను. ఈప్రేమతత్త్వాన్ని గ్రహిస్తే భక్తితత్త్వాన్ని గ్రహించినట్లు అంటాను.

'అయితే ప్రేమలేనివాళ్ళు లోకంలోనేలేరుకదా! ఇక అందరు భక్తిగల వాళ్ళేగదా! అప్పుడు అందర్ని భక్తులనరేమి? కొందర్నే అంటారు?' అనే సందేహం నీకుకలిగింది. అదికూడానిజమే. ఇది భక్తేకాని, సక్రమమైన భక్తి మాత్రంకాదు. లేక సంపూర్ణభక్తికాదు. ఈపైని చెప్పబడిన ప్రేమస్వరూపం కేవలంలౌకికం. ఐహికవాంఛలకోసం వున్నదేకాని విషయవాంఛారహితంకాదు. తనకుమారుడు చనిపోతాడేమోఅను మమకారంచేత, ఆతల్లి దూకిందికాని తానే చచ్చిపోతానేమో అనుభావం ఆఉద్రేకంలో తెలియదు. అలాగే, భర్తమీద మమ కారంచేత ఆసాధ్వి త్యాగంచేసిందికాని, ఆత్యాగం తనప్రాణానికే ముప్పు తెస్తుందని పాపంతెలియదు. ఈప్రేమ తమప్రాణాలకే మోసంఅని ముందు తెలిసిఉంటే, త్యాగానికే పూనిఉండరు యీతల్లి, యీభార్య. అలాకాకుండా యీప్రేమ, యీప్రపంచసుఖదూరమై, స్వార్థరహితమై ఎప్పుడుఒప్పారు తుందో దాన్ని భక్తిఅంటారు. ఇలాంటి స్వార్థరహితమైనస్థితిని యీప్రేమ ఎప్పుడు సమీపిస్తూవుంటుందో దీన్నికూడా భక్తిఅంటూ వుంటారు. **పతిభక్తి**

అంటున్నాం. రాజభక్తిఅంటున్నాం దేశభక్తిఅంటున్నాం గురుభక్తిఅంటున్నాం. ఇలా నేను నిర్వచించిన యీపలువిధభక్తులు స్వార్ధరహితభక్తిని సమీపిస్తూవున్న ప్రేమరూపాలే అన్నమాట.

ఈభక్తికే, మరొకవిధంగాకూడా నిర్వచనంచేయువచ్చు. మనం పుట్టి నప్పటినుండి యీప్రేమతత్త్వం ఎలాపెరిగిందో చూచుకోవాలి. మొదటి నిర్వ చనాన్ని గ్రహించాలంటే, మనం తల్లిగర్భంలో పిండరూపాన ఉన్నప్పుడు 'ఈ గర్భనరకంలో మరల ప్రవేశింపచేశావా పరమేశ్వరా! దీనినుండి తప్పించరా పరాత్పరా!' అంటూ ఆపిండరూపంగాఉన్న జీవుడు దృష్టులను, బుద్ధిని, ఆ భగవంతునిపైనేవుంచి, ఆతడినేప్రేమిస్తూ, ప్రస్తుతంతనస్థితికి అలమరుగుతూ వుంటాడు. అంటే అప్పటిస్థితిలో తనప్రేమ భగవంతునికే చూపుతాడు. కాని భూపతనంకాగానే, శిశువు అనబడగానే ఆదృష్టి పోతుంది. పరమేశ్వరునిపై ప్రసరిస్తూవుండే ఆభక్తి జారిపోతుంది. తల్లిని చూస్తాడు. పూర్వప్రేమను యిటు త్రిప్పుతాడు. తల్లిద్వారా తండ్రికికూడా తనప్రేమను పంచుతాడు. తనప్రేమను యింకాస్నేహితులకు, భార్యాబిడ్డలకు, పశుపక్ష్యాదులకు, గృహ క్షేత్రాదులకు విరివిగాపంచేస్తాడు ఖండిస్తూ. అలా ముక్కముక్కలుగా అయి పోయిన యీప్రేమ క్రమంగా చాలసంకుచితమై ఎక్కడా పూర్తిచెందక, ఎటూ కాకుండా వుంటుంది. అలాకాకుండా, యిలా ఛిన్నాభిన్నాలైపోయిన యీ ప్రేమప్రవాహాన్ని మరల వెనక్కిపిలవాలి. ఏకంచేయాలి. ముక్కల్ని అన్నింటిని చేర్చి ఒక్కటిగాచేయాలి. అంటే పూర్ణంచేయాలి. ఇలా పూర్ణంఅయి, సంకు చితత్వం ఏమాత్రంలేకుండా, ఏకప్రవాహంగా, ఎడతెరిపిలేకుండా, మరల భగవంతునిమీదికి ప్రసరించడం ఎప్పుడు మొదలుపెట్టుతుందో దాన్ని భక్తి అంటానునేను. తక్కినవన్నీ భక్తి అనేపేరుతోవున్నా అవి భక్తిలోచేరటానికి వీలు లేదంటాను. ఆపరిపూర్ణభక్తివాహినిముందు ప్రపంచమేలేదు. తల్లిదండ్రులే లేరు. భార్యాబిడ్డలేలేరు. ఆఏకైకస్వరూపుడైన, ప్రేమైకకేంద్రమైన, ఆ భగవం తునిపైనే చిత్తంలగ్నంఅయి, నిశ్చంచలస్థితిలో నిలిచిపోవాలి. దాన్ని భక్తిఅని నిర్వచిస్తాను నేను. నాకు యీ నిర్వచనమే ఉత్తమంగా తోస్తుంది.

ఇప్పుడు భక్తిఅంటే కొంతవరకు గ్రహించావనుకుంటాను. సరే కాని,

యీభక్తిని పొందేమార్గం ఏమిటంటావు. ఇక విను. ఇలాంటి, నిర్మలభక్తిని
పొందాలంటే మరల, యిందాకవివరించిన ప్రేమతత్వానికేవద్దాం. నీముందు
కొన్ని అణాలు, పైసలు, కానీలు, రూపాయలు, నోట్లకాగితాలు వెయ్యివరకు
ఉంచాం. 'అమ్మాయీ! మొగమాటం వద్దు. నీకు కావలసింది తీసుకో. కాని
ఒక్కటికంటే ఎక్కువ తీసుకోవద్దులన్నాం. అన్నింటివిలువ నీకు తెలుసు.
ఏమి చేస్తావు? వెయ్యిరూపాయల కాగితాన్ని తీసుకుంటావు. ఎందుచేత?
మిగతావాటిమీద ద్వేషం నీకులేదు. మరి దాన్నెందుకు తీసుకున్నావు? వాటి
కంటే యిది ఎక్కువకాబట్టి. అంటే వాటికంటే దీనికి అధిక్యత ఉందికాబట్టి.
అలాగే ఒక డబ్బువిషయంలోనేకాదు, ప్రపంచంలో ప్రతివిషయంలోనూ
మనం, ఒకవస్తువునుకాని, మనిషినికాని, ప్రేమిస్తున్నాంఅంటే, దానికి కారణం
యితర్లమీందద్వేషంకాక, ఆవస్తువు, లేక వ్యక్తియొక్క అధిక్యతయేకారణం అని
తీరాలి అందరూనూ. అంటే ఎప్పుడైతే మనకు ఒకవస్తువుయొక్క అధిక్యత
తెలుస్తుందో, యితర వస్తువుల్ని లెక్క వేయకుండా ఆవస్తువును ప్రేమిస్తాం.
ఆవస్తువునే స్మరిస్తూవుంటాం. దానితోనే ఎప్పుడూ వుంటూవుంటాం. ఇదీ
ప్రేమలోఉండే రహస్యం.

అలాగేభగవంతుడిని మనం ఎప్పుడుప్రేమిస్తాం, అనేదే ప్రశ్న. ఎప్పుడైతే
మనం భగవంతుడిని యితరపదార్థాలకంటే అధికంఅనిగ్రహిస్తామో, అన్నిటి
కంటే అతని అధిక్యతను ఎప్పుడు తెలుసుకుంటామో అప్పుడు అతడిని
మనంప్రేమిస్తాం. భగవంతుడుకాక యితరపదార్థాలన్నామే ఏమిటవి? సర్వ
ప్రపంచమూ. అంటే లౌకికసంబంధాలతో కూడుకునిఉన్న తల్లి, తండ్రి,
భార్యా, భర్త, బిడ్డ, గొడ్డు, ధనం, ధాన్యం యిలా ప్రపంచంలో మనకు అను
భవంలోఉన్న సర్వమూ, యీయితరపదార్థాలలో వచ్చేస్తుంది. అంటే
ఏమైందిఅన్నమాట? నీతల్లినికంటే, నీతండ్రినికంటే, నీభార్యనికంటే, నీభర్త
నికంటే, యిలాంటి అన్నిప్రాపంచికసంబంధాలకంటే, ఆభగవంతుడు వాల
అధికుడని నీవు ఎప్పుడుగ్రహిస్తావో, అప్పుడు ఎవరూ చెప్పకుండానే ఆ భగ
వంతుని నీవుప్రేమిస్తావు. అలా నీవుగ్రహించనంతకాలం ఎందరు బోధించినా,
ఎన్ని గ్రంథాలుచదివినా, ఎన్నిజపాలు, తపాలుచేసినా, నీకు ఆ భగవంతుని

మీదయింకా ప్రేమ జనించలేదని చెప్పాలి. అంటే, యింకా అతనిమీద భక్తి కుదరలేదన్నమాట.

ఆభగవంతుని ఆధిక్యత ఎప్పుడుగ్రహిస్తాం యీ అన్నింటికంటే అనేది మరొకప్రశ్న వస్తుంది. దీన్ని గ్రహించటానికి చాల తెలివితేటలుండాలి. గొప్ప ప్రజ్ఞ వుండాలి. అంటే చదువుకాదు. చదువువల్ల బుద్ధివికాసం కాకపోవచ్చు. పెద్ద పండితుడనబడేవాడు గొప్పమూర్ఖుడులాగా, హృదయమేలేని రక్కసుడు లాగా, ప్రవర్తిస్తుండే ఘట్టాలు ఎన్నోఉన్నాయి. కాని ప్రజ్ఞఉన్నచోట యీ చదువు ఉండవలెనని నీమంలేదు. ప్రజ్ఞ, బుద్ధివికాసాన్ని తెలుపుతుంది. అసలు ఆధ్యాత్మికపరిణామంఅంటే చదువులోలేదు, బుద్ధియొక్క పరిణామంమీద ఆధారపడివుంటుందని యిదివరకేచెప్పాను. మనశారదమ్మకు చేవ్రాలు చేయా లంటేతెలుసునా? ఆమె ఆధ్యాత్మికశిఖరాన్ని అధిరోహించలేదూ! నందనారు ఏపరీక్షలు ప్యాసుఅయినాడు? కన్నప్ప ఏకావ్యాలు చదివాడు? మన అద్భుతానందుడు ఏభాష్యాలు చదివి ఆనిరుపమానస్థితికి వచ్చాడు? ఇక వివేకానందుడివిషయంఅంటావా, ఆయనదంతా ప్రత్యేకం. అందుకని, ఆ భగవంతుని ఆధిక్యత గ్రహించటానికి చదువులు, పాండిత్యాలుకాక కేవలం బుద్ధివికాసం ఉండాలి. అది ఎలాగంటే విను.

ముందు వ్రాయబోయే సాధనచతుష్టయసంపత్తిలో, యీవిషయం యింకా విపులంచేస్తాను. దానిలో మొదటిది 'వివేకం' అన్నారు. దాన్నే, నిత్యా నిత్యవస్తువివేకం అన్నారు. అంటే మనం చూస్తుండేవాటిల్లో, అనుభవిస్తూ ఉన్నవాటిల్లో, ఏదిశాశ్వతం అనేవిమర్శ, లేక వాటిల్లో ఏదిఎక్కువకాలం వుంటుంది అనేప్రశ్న, దానితీర్మానం వివేకంఅవుతుంది. అంటే ఏ అనుభవం కంటేఏదిఅధికం? పోనీ అన్నింటికంటే దేనికి ఆధిక్యతఉంది? అని ప్రశ్నించు కుని, విమర్శించుకుని, తీర్మానించుకోటం వివేకంఅంటారు. ఇలా, తీవ్ర విమర్శాదృష్టితో ప్రారంభించామంటే, యీమన అనుభవాలన్నీ చాలనీచం అయినవని, అనిత్యమని, నీటిబుడగల్లాంటివని, యిలా అనేకవిధాల తెలుసు కుంటాం. అంటే ఆ భగవంతుని ఆధిక్యతను తెలుసుకోటానికిముందే, యీ ప్రపంచంయొక్క హేయత్వాన్ని, క్షణికత్వాన్ని గ్రహించాలి. ఆతర్వాత

గ్రంథాలవల్ల, అనుభవజ్ఞులైనగురువులవల్ల, ఆపరమేశ్వరుని ఆధిక్యత తెలుస్తుంది. 'అదెల్లాగ?' అంటావు. 'ముందు భగవంతుని ఆధిక్యతతెలిస్తే, తర్వాత దాన్నిబట్టి యీప్రపంచంయొక్క హీనత్వంతెలుస్తుంది. పైకొమ్మ అందకముందే క్రిందకొమ్మమీద కాలుతీస్తేఎలాగ?' అంటావు. ఆధ్యాత్మిక విషయంలోమాత్రం అలాకాదు. లౌకికానికి దైవానికి తలక్రిందులబేరం అనుకో! 'ప్రపంచాన్ని వదులుతాను. ముందు చేయిని అందియ్యవయ్యా, ఓ భగవంతుడా!'అంటాడు జీవుడు. 'కాదురా అబ్బాయీ! ముందు దాన్ని నీవు వదిలెయ్యి. దానితో అన్నిసంబంధాలు తెంచేసెయ్యి. అప్పుడు ఒక్క చెయ్యి అందియ్యటమేకాదు, నేనే ఆస్వర్గంనుండిదూకి, నిన్ను అమాంతంగాఎత్తుకు పోతా' నంటాడు భగవంతుడు. భాగవతంలోచూడు. గజేంద్రుడికి ఎలా విష్ణువు సాయంచేశాడో! వెయ్యేళ్ళనుండి యుద్ధం చేస్తూవున్నా, 'నీవేతప్ప నితఃపరంబెరుగ'అని కాళ్ళు, తొండం పైకిఎత్తేటప్పటికి 'సిరికిం జెప్పడు' అనే పద్యంలోలాగ ఒక్కగంతువేశాడు. అలాగే, ద్రౌపదీమానసంరక్షణంలోను. ఎంతసేపు ఆమె చేతితో పమిటను పట్టుకున్నదో, అంతకాలం శ్రీ కృష్ణుడు కదలనేలేదు. సత్యభామతో ఆటలతో సరిపోయింది. కాని ఎప్పుడు ఆమె రెండు చేతులనుపైకెత్తి, సర్వంభగవదాయత్తంచేసిందో, అప్పుడు 'అక్షయం' అన్నాడు శ్రీకృష్ణుడు. ఇలావుంటుంది యీఆధ్యాత్మికలోకంలో న్యాయం. ప్రపంచంమీదకంటే అతనిమీద నీకునమ్మకం, భక్తిఉన్నట్లు, అతనికి విశదం కావాలిముందు. తర్వాతఅంటే, సంవత్సరాలుగాని, మాసాలుగాని, రోజులు గాని దొర్లకముందు, ఆఖరికి సెకెండ్లుకూడాజరుగకముందే ఆప్రేమస్వరూపుడైనభగవంతుడు తోడునీడయైనిలుస్తాడు. ఇది అసలు భక్తిలోవుండేసూత్రం.

ఆకారణంచేత, వివేకంచేత ముందు యీప్రపంచంయొక్క నశ్వరత్వాన్ని తెలుసుకోవాలి. దానికి అనేకఉపాయాలున్నాయి చూచుకో. మన అనుభవాల్లో ఏది శాశ్వతంగాఉంది? పోనీ శాశ్వతం కాకపోయినా వెంటనే దుఃఖాన్ని కలుగజేయంది ఏది? ఆహా! ఎంత ఆహ్లాదకరంగా ఉందన్నాం సూర్యాస్తమయాన్ని. వెంటనే, చీకట్లు వచ్చిపడ్డాయి. ఎంత సౌందర్యం అన్నాం గులాబిపుష్పాన్ని. పట్టుకోగానే రెక్కలురాలిపోయాయి. ఎంత రుచిగా

ఉంది పదార్థం అన్నాం. చేసినంతసేపు పట్టలేదు తినటానికి. దానిచేతవచ్చే రోగాలతో పీక్కోటానికి ఎన్నిసంవత్సరాలు కావాలో! ఇలాంటివేఅనుకో యీ ప్రాపంచిక అనుభవాలన్నీ. నీకు అనుభవంలోఉన్నవన్నీ, యిలాగా ఆలోచించి చూచుకో. నీకు అనుభవంలో లేనివాటిని అనుభవించేవాళ్ళను విచారించి తెలుసుకో. దానితో తేలిపోతుంది యీప్రాపంచికబండారంఅంతా. ఈ విధంగా యీప్రపంచంయొక్క క్షణికత్వాన్ని నిశ్చయంచేసుకున్నవాడు, త్వరగా ఆభగవంతుడియొక్క ఆధిక్యతను తెలుసుకుంటాడు. ఈవిధంగా కాకవేరు మార్గం లేనేలేదు. ఇక్కడ, ఏ వాదాలు తర్కాలు పనికేరావు.

ఈవిధంగా అనుభవంచేతనేమి, తెలివిచేతనేమి యీ ప్రపంచసుఖాల హేయత్వాన్ని గ్రహించి, దానికి చెప్పటానికి వీలులేనన్నిరెట్లెక్కువఅయిన ఆ భగవంతుని ఆధిక్యతను శాస్త్రవాక్యంచేతను, ఆప్తప్రమాణంచేతను తెలుసుకుని, ఆభగవంతుడినే ప్రేమిస్తూ, ఆభగవంతునికి యితరమైన యీ సర్వ లోకానుభవాలను దూరంచేయటం ఏదిఉందో, దాన్నే భక్తిఅంటాను నేను. అలా భక్తిసంపాదించాలంటే, చాల ధైర్యస్థైర్యాలు, గొప్ప త్యాగం, గొప్ప ధీబలం, అనంతమైన సద్గుణాలు అన్నీ యిమిడివుంటేగాని సాధ్యంకాదు. ఇట్టి విషయాలలో తూచిచూస్తే, ప్రపంచంలోఉండేభక్తుల్లో, లేక భక్తులన బడేవాళ్ళలో ఎందరు సిసలైనభక్తులు తేలుతారో ఆలోచించుకో.

ఇప్పటికి ఆభక్తిఅనేదాని నిర్వచనం, దాన్నిపొందటానికి మార్గం తెలుసుకున్నావు. ఇక యితరవిషయాలు తర్వాత వ్రాస్తాను. ఈదినానికి దీనితో విరమిస్తున్నాను.

ప్రస్తుతానికి, తెలుసుకున్నదానిని బాగాచదువుకుని, బాగామననం చేసుకో. తర్వాత ఆచరణకు దిగుదువుగాని.

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం.

(signature)
15-2-46

# 20

# భక్తియోగము - పంచభావములు

నా ప్రియమైన మాతాజీ!

పై రెండు ఉత్తరాలద్వారా, భక్తిఅంటే ఏమిటో కొంత గ్రహించి ఉంటావు. ఈభక్తినిర్వచన యింకా కొంచెంచేసి, యిక ఆభక్తిలోఉండే తారతమ్యాలకు వస్తాను. ప్రేమతత్త్వంలోఉండే రహస్యాన్ని గ్రహిస్తే, భక్తిలోఉండే మరొక మహత్తరవిషయం గోచరిస్తుంది. అదేమిటంటావా విను.

మొన్న, అనేక దృష్టాంతాలు ఆప్రేమను వివరించడానికి నీకు తెలిపాను. తక్కువవిలువగల నాణాలను వద్దన్నావు. ఎక్కువ ఖరీదుగలదాన్ని తీసుకున్నావు నీవు. తనకు అపాయమనిఅయినా తెలుసుకోలేక దూకింది కుర్రవాడికోసం తల్లి. తనబాధను పాటించక, తనప్రాణనాథునికోసం అంతపనిచేసింది ఆసాధ్వి. ఇలాంటివెన్నో! వీటికన్నింటికి పూసల్లోవుండే దారంలాగా ఒక రహస్యం యిమిడిఉంది. అదేమిటి? త్యాగం. ఎప్పుడైతే ఒకదాని ఆధిక్యతను గ్రహిస్తావో, దాన్నిప్రేమించటానికని, దాన్నిపొందటానికని, దానికంటే తక్కువగా కనిపించే యితరాన్నంతా తోసేస్తావు. వాటిని తోసివేయటంలో వాటిని

గూర్చిభయంగాని, ద్వేషంగానిఉందా? లేదుగా! ఎప్పుడైతే, ఒక పదార్థంమీద మనచిత్తం లయించిందో, ఆచిత్తంలో మరి యితరవస్తువులకు చోటేది? ఇంతెందుకు నేను భీమునిపట్టణంనుండి బాపట్లకువచ్చాను. భీమునిపట్ట ణము వదిలిపెట్టడానికి, ఏదైనా ద్వేషంగాని భయంగానిఉందా? లేదుగా! అలాగే బాపట్లనుండి భీమిలివచ్చినప్పుడూ అంతేగా! అంటే ఒక వస్తువుమీద మనసు నిలిచిందంటే, యితరవస్తువులమీద లేకపోవటం అనిఅర్థమే. నీవు చదువుకుంటున్నావు రేపు ఇంగ్లీషు పరీక్షకాబట్టి. పిల్లలు గోలచేస్తుంటారు. ఏమిచేస్తావు? అక్కడనుండి లేస్తావు. గోలలేకుండా ఉండేచోటుకు వెళ్తావు. లేక గదితలుపులు వేసుకుంటావు. ఇంట్లో ఏదోపనికి నిన్నుపిలిచారు, పల కవు. ఇంకాపిలిస్తే రానంటావు. దీన్నిబట్టిచూస్తే, నీకు చదువుమీద చిత్తం నిలి చేటప్పటికి, పిల్లలసంబంధం, యింటిసంబంధం, ఆటలు, పాటలు తగ్గి స్తావు. ఇంకా, పెద్దచదువులవాళ్లు వాటినిపూర్తిగా మానేస్తారు బాగా ప్యాసు కావటానికి. అలాగే, పెద్దఉద్యోగంకొరకు పోయేవాడు చిన్నఉద్యోగాన్ని వది లేస్తాడు. ఇదంతాఏమిటి? త్యాగంఅంటాను. కాదంటావా? అలా అనటానికి వీలేలేదు. దేన్ని త్యాగం? చిన్నవాటిని. దేనికోసం? పెద్దదానికోసం. త్యాగం దేన్నిచేయటం? మనకుఅవసరంకానిదానిని, ప్రయోజనంలేనిదానిని. అంటే, మనం దేన్ని కావాలనుకుంటామో, దానిమీద మనస్సు లగ్నంఅయ్యేటప్ప టికి, దానికిఅన్యంగా ఉండేవాటిమీద దృష్టిపోనేపోదు. అలా దృష్టి ప్రసరించ కుండటం త్యాగంఅన్నాం. దృష్టిలగ్నంకావటం భక్తిఅన్నాం. ఈ రెంటికీ భేదం ఏమిటి? అసలుఏమీ తారతమ్యం లేదంటాను. మనకు ప్రేమపాత్రమైన వస్తువుద్వారా చూచామంటే అది భక్తిఅయింది. ఆప్రేమింపబడు పదార్థంకాక యితరంద్వారా చూచామాఅంటే అదే త్యాగంఅయింది. అందుకనే త్యాగం అంటేనే సన్న్యాసంఅన్నారు కొందరు. అసలు అర్థంచూస్తే, సన్న్యాసం అనే పదంలో త్యాగంఅనే అర్థం లేనేలేదు. సత్ + న్యాసం అంటే సత్పదార్థంతో కల యికఅనిఅర్థం వస్తుంది. క్షణికంఅని సంకుచితమని హేయమని తీర్మానం చేసుకున్న ఏప్రపంచంఉందో, దానిఅల్పత్వాన్ని గ్రహించి, దీనికంటే అనేక రెట్లు అధికంగా ఆనందరూపంగాఉండే ఆబ్రహ్మపదార్థంతో ఐక్యంకావటం

సన్న్యాసంఅంటే. దానికర్థం ఏమిటి? హేయమైన యీప్రపంచాన్నికాదని, ఎప్పుడైతే యీజగత్తుకు సృష్టిస్థితిలయకర్తలయిన ఆపరమేశ్వరునిపైన దృష్టి నిలుపుతామో అదీ సన్న్యాసంఅంటే. ఇక భక్తిఅంటేనో? అదేగాఅర్థం! అందు కని, ఆభగవంతుని మనదృష్టిలో పెట్టుకొని చూచామాఅంటే సన్న్యాసం అన్నా, భక్తిఅన్నా ఒకటేఅయింది. అలాకాక, యీప్రపంచాన్ని మనమనస్సులో ఉంచుకుని చూచామంటే, సన్న్యాసంఅన్నా భక్తిఅన్నా త్యాగరూపం దాలు స్తాయి. ఈదృష్టిభేదంచేతనే సన్న్యాసానికీ, భక్తికీ, భేదమున్నట్లు తోస్తుంది. కాని అసలుకొంచెం విమర్శాదృష్టితో ఆలోచిస్తే రెండూ ఒక్కటే అవుతాయి. కాబట్టి యిప్పుడు తీర్మానంఏమిటి? ఎప్పుడైతే యీప్రపంచంయొక్క అల్పత్వం తెలుసుకుని, ఆపరాత్పరుని ఆధిక్యతను గ్రహించుకుంటామో, అలాగ్రహించి ఆపరమాత్మునిమీద బుద్ధిని నిలపటానికి యీసంకుచితమైన ప్రపంచాన్ని ఎప్పుడుత్రోసిపుచ్చుతామో, మరలఅలా అనావశ్యకమైన యీ విషయసుఖసంబంధాలను వర్జించి, ఆదేవదేవునిమీద బుద్ధిని నిలుపుతామో అప్పుడు మనకు భక్తికుదిరినట్లు, లేక భక్తిమార్గంలో ప్రవేశించినట్లు. దాన్నే జ్ఞానులు జ్ఞానమార్గంఅంటారు. రెంటికీతేడా చాలాస్వల్పం అయింది. అసలే తారతమ్యం లేదనికూడాచెప్పవచ్చు. అందుకనే భక్తిఅంటే త్యాగం, త్యాగం అంటే భక్తిఅని అంటున్నాను. ఆకారణంచేత మార్గం బయటికి ఎలాఉన్నా, లేక మనం ఏమార్గాన్ని అనుసరిస్తున్నామని చెప్పుకుంటున్నా, యీత్యాగం అనేదిలేకపోతే, యీప్రపంచబంధాలను త్రెంపకపోతే, మనంఅసలు ఏ మార్గం లోనూ ప్రవేశించలేదని గట్టిగానమ్మాలి. అందుచేత యీనిర్వచనప్రకారం భక్తి అంటే త్యాగంఅని తేలుతుంది.

భక్తి, నిర్వచనానికి యిలాఉన్నా, ఆచరణలోకి వచ్చేటప్పటికి దీనిలో చాలాభేదాలు వచ్చిపడ్డాయి. అన్నింటికీసూత్రం ఒకటేఅయినా మనస్సు ఆభగ వంతునిపై లగ్నంకావటంలోఉండే తారతమ్యాన్నిబట్టి, యీభక్తిఅనుష్ఠాన విధానంలోకూడా యీభేదాలు ఏర్పడ్డాయి. వాటిని అయిదువిధాల పేర్కొ న్నాయిభక్తిశాస్త్రాలన్నీ. శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర భావాలని నామకరణంకూడా చేశాయి. వీటిని కొంచెం చెప్పుతాను.

మొదటిది 'శాంతభావం' అన్నాను. ఆభగవంతుడు యీ ప్రపంచాన్నంతాసృజించిన సృష్టికర్తఅని, దాన్ని క్రమంతప్పకుండా ధర్మపరిపాలనచేసే మహాప్రభువని, ఎవరైతే ధర్మప్రవర్తన కలిగిఉంటారో వాళ్ళను తన అనుగ్రహం చేతకాపాడుతూ, పోషిస్తూ, సంతోషపెట్టుతూఉంటాడు అనేనమ్మకంతో ఉండి, అట్టిరాజాధిరాజుయొక్క శాసనంప్రకారంఉంటూ, అతడికి తమధర్మ వర్తనచేత సంతోషాన్నియిస్తూ, దానిఫలితంగా అతని అనుగ్రహరూపమైన సౌఖ్యాన్ని పొందటానికి యత్నించటం శాంతభావం అంటారు. ఒక చక్రవర్తి దగ్గర అతనిప్రజ ఎలాప్రవర్తిస్తారో, ఎంత గౌరవమర్యాదలతో మెలుగుతుంటారో, ఎంతభయభక్తులతో. ఉంటారో అలాఉంటాడు శాంతభావంలో ఉండేభక్తుడు భగవంతునితో. దగ్గరకుపోవటానికి వీలులేదుగదా! ఇక, చనువుగా ఎలా మాట్లాడుతాడు? దూరాన్నుంచి నమస్కారాలేగాని, దగ్గరనిలబడి విసరటానికికూడా వీలులేదుగదా! అలా దూరాన్నుండే గౌరవిస్తూ, దగ్గరకు పోవటమే నేరంగాచూచుకుంటూ, కానుకలు అర్పించుకుంటూఉండటం యీశాంతభావంలోనివిధానం. ఈపద్ధతి ఎక్కువగా దక్షిణదేశంలో ఆచరణలోఉంది. అక్కడిదేవాలయాల్లోకి అంటేగర్భాలయాల్లోకి, ఎవరూపోవటానికివీలులేదు. రాజుగారిదగ్గరకుమంత్రుల్లాగా యీదేవతలదగ్గరకు అర్చకులు మాత్రంవెళ్ళి కట్నాలుకానుకలుఅందుకొని భక్తునితరఫున దేవునికిఅర్పిస్తారు.

అలాకాకుండా, ఆభగవంతుడు మనకు యజమానిఅనీ, అతడిని ఒక మహాచక్రవర్తిలాగా దూరాన్నుంచకుండా అంటే అతనిదగ్గరకు పోవటమే నేరమని తలంచకుండా, దగ్గరకుచేరి విసరవచ్చుననీ, స్నానంచేయిస్తూ దేహాన్ని తోమవచ్చుననీ, ఆయన విశ్రమిస్తూఉంటే వారిపాదాలుపట్టుతూ ఉండవచ్చునని భావిస్తూ, ఆభగవంతునికి పూర్వం శాంతభావంలోకంటే యింకాకొంచం దగ్గరకుచేరటం 'దాస్యభావం' అని అంటారు. ఈరకంగా అనుసరించిన వాళ్ళలో శ్రీఆంజనేయస్వామిని ముఖ్యంగా తీసుకుంటారు. ఈపద్ధతి మన తెలుగుదేశంలో ఎక్కువ వాడుకలోఉంది. ఈవిధానం ఆభగవంతునిదగ్గరికి ఎప్పుడూకాకపోయినా, అప్పుడప్పుడుఅయినా పోతూఉండవచ్చు. కాని మనం, మనదేవాలయాలలో తమిళసంప్రదాయానికి సంబంధించినవాళ్ళను

అర్చకులుగా పెట్టేటప్పటికి, ఆదక్షిణాదిపద్ధతే యిక్కడికికూడాదిగి, శాంత భావం ఆచరణలోకివచ్చేసింది. అయినా పేరుకుమాత్రం దాసు, దాసు, అనే పేర్లు మనభక్తులందరికి మిగిలిపోయాయి. అందుకనే రామదాసు, నరశింహ దాసు, సింగరిదాసు, మొదలైనపేర్లు, యింకామనకు వాడుకలోవున్నాయి.

ఇలా యీదాస్యభావంలోకాకుండా 'సఖ్యభావం'లో, ఆ భగవంతు డితోయింకా సన్నిహితసంబంధం సంపాదిస్తాడుభక్తుడు. సఖ్యభావంలంటే ఏమిటి? సఖ్యతఅంటే స్నేహం. అంటే ఇద్దరు స్నేహితులకుండే మైత్రి. ఇద్దరూ ఎప్పుడూకలిసివుంటారు. ఒక్కపడకలోనే పడుకుంటారు. ఒక్క చోటనేఉంటారు. ఒక్కటిలాగానేఉంటారు. ఈపద్ధతే సుదాములను పేరుగలి గిన కుచేలునిభక్తి. ఇంకాఎందరో గోపాలకులున్నారుకూడా. బృందావనంలో కూడాఉంది యీవిధానం. ఎక్కువగా మహారాష్ట్రదేశంలో శ్రీవిఠలనాథుడైన పాండురంగనిపట్ల కనిపిస్తూఉంటుంది. పండరిభక్తులు ఎక్కువగా, యీ పద్ధతిలోనివాళ్ళే. కొంతవరకు పూరిజగన్నాథ ప్రాంతంలోకూడాఉంది.

తర్వాత 'వాత్సల్యభావం'. ఇదివరకు తెలిసినవాటిలో యింకామనకు, భగవంతుడికి కొంచెముఎడమున్నది. ఎంతస్నేహితుడైనా కొడుకుకంటేదూర మేగా? తనసొంతకొడుకును ప్రేమించినట్లు, స్నేహితుడిని ఎవరూకూడా ప్రేమించరు. ఆస్తిలో భాగంయిస్తారా స్నేహితుడికి? నోట్లో అన్నం పెట్టి తారా స్నేహితుడికి? కష్టం వచ్చినా, సుఖం వచ్చినా తోడునీడయి నిలుస్తారా స్నేహితుడికి? ఇద్దరంఅభేదంఅని ఏకంఅవుతారా స్నేహితుడితో? కొడుకు తోనే అన్నివిధాల అలా ఏకత్వంఅయ్యేది. కాబట్టే, ఆభగవంతుడిని తన కుమారుడులాగా చూచుకోవటమే యీవాత్సల్యభావంలోఉండే రహస్యం. వాత్సల్యభావం అనగానే శ్రీకృష్ణుడు తలపుకొస్తాడు. ఈ వాత్సల్యభావానికి, బాలకృష్ణుడినే భక్తులు ఎక్కువగాతీసుకుంటారు. కొందరు రామచంద్రుడిని కూడా గైకొంటారుగాని, బాలకృష్ణుడిలోఉన్న ముద్దుమురిపాలు, ఆ జగ న్మోహనత్వం, సర్వాకర్షణీయమైనకొంటెతనం, బాలరాముడిలో లేకపోవడం చేత, యీకృష్ణకిశోరుడినే, వాత్సల్యానికి అధిష్ఠానంగా అందరూ స్వీకరిస్తారు. ఈభావాన్ని అనుసరించినవారు, ఆనాటి యశోదానందాదులేకాక తర్వాత

కూడా అనేకులున్నారు. శ్రీ రామకృష్ణునికాలంలో అఘోరమణిలేదూ? ఈపద్దతిలో శాంతభావంలో దూరంగాఉన్న భగవంతుడు, దాస్యంలో అప్పు డప్పుడు దగ్గరకుచేరనిచ్చి, సేవలు చేయించుకున్న భగవంతుడు, సఖ్యంలో భుజాలమీద చేయివేసినా కొంచెం దూరాన్నేఉన్న భగవంతుడు మీదెక్కుతాడు యీవాత్సల్యంలో. మారాంపెట్టుతాడు. అన్నివిధాల మనప్రేమను ఆకర్షించ టమేకాకుండా, అవసరంవస్తే డిమాండుచేసి, ఏడ్చి, ఏడిపించిఅయినా పుచ్చు కుంటాడు. ఈవాత్సల్యభక్తికి ఉదాహరణగా రామకృష్ణునిజీవితంలో బాల రామఉపాసకుడైన జటధారి, బాలకృష్ణ ఉపాసకురాలైన అఘోరమణీదేవి కని పిస్తారుమనకు. ఆబాలదేవతలను ఎత్తుకుని, లాలించి, పాలించి, ఆడించి, ముద్దుపెట్టుకుని ఆనందించిన ధన్యజీవులువారు. ఇక మన రామకృష్ణుని విషయం నీకుతెలిసిందే! అందుకని పైమూడువిధాలకంటే యిది గొప్పది అయింది ఆ భగవ త్సాన్నిధ్యంచేత.

ఇక, అయిదోది అన్నింటికంటే చాలముఖ్యం అయింది, యీ భక్తి మార్గానికల్లా మకుటంలాంటిది. దీన్నిదాటంగానే అద్వైతమార్గానికి దారి అవ గాహనంఅవుతుంది. ఇదే 'మధురభావం' అంటారు, ప్రేమభావంఅంటారు. దీనిఉత్కృష్టత వేరేచెప్పాలీ! ప్రపంచంలో ఎన్నియిబ్బందులు వచ్చినా ఏ ప్రేమ బంధంతెగదో, ఏప్రేమలో కొంచెమైనాభేదంలేక, రహస్యాలులేక, బట్టబయ లుగా ఎచ్చటఉంటుందో, అలాంటి భార్యాభర్తలప్రేమయే మధురభావంలోని రహస్యం. దీనికి ఎన్నిఅడ్డాలువచ్చినా అవితెగిపోతాయి. ఇది చాల బలీయంగా ఉండి, ప్రపంచాన్నే మరచిపోయేటట్లు చేసేస్తుంది. అలాంటిది మధురభావం అంటే. ఎంతత్యాగానికైనా ఒడిగట్టుతుంది యీమధురభావం. ఈ భావంలో కూడా, జగన్మోహనాకారుడైన శ్రీకృష్ణుడే ఆకర్షవంతమైన అధిష్ఠాత. ఈ మూర్తికంటే మరొకమూర్తి వేరేలేనేలేరు. ఆకాలంలోనే, ఒక్క రాధికాది భార్యలేకాకుండా, పదారువేల గోపికాస్త్రీలు, వాళ్ళేమిటి, ఆఊరంతా, చుట్టుపక్కలఊళ్ళుకూడా, ఆలోకైకమోహనుడైన, త్రిలోకసుందరుడైన శ్రీ కృష్ణునికోసం పరిగెత్తారు. రాసక్రీడలుచేశారు. ఆడారు, పాడారు, గంతు లేశారు. ఒక్కక్షణం ఆయనకనపడకపోతే చచ్చిపోయారంటేనమ్ము. యమునా

నదిలోకి దూకేసిందిరాధ ఒకనాడు, ఆయన ఎడబాటును సహించలేక. తర్వాతమాత్రం, అలాంటిభక్తులు ఎందరోఉన్నారు, ఆమార్గాన్ని అనుసరించేవాళ్ళు. వాళ్ళందరిలో శ్రీకృష్ణచైతన్యఅని ప్రఖ్యాతిగడించిన, గౌరాంగ మహాప్రభువు ప్రథముడు. ఉత్తముడు. ఆయన ఆవిరహవేదనను అంచే శ్రీకృష్ణునిఎడబాటును సహించలేక, జగన్నాథంలో సముద్రంలోకేగెంతేసాడు. నేటికీ, యీమార్గాన్ని అనుసరించేవాళ్ళు ఎందరోఉన్నారు ఉత్తర దేశంలో. ఇక, పైఅయిదుమార్గాలను సంపూర్తిగా అవలంబించి, ఆయా అనుభవాల్ని అనుభవించిన మహాభక్తుడు మన శ్రీరామకృష్ణపరమహంస దేవుడు. ఆయనతో పోల్చదగిన భక్తుడు ఎప్పుడూ, ఎక్కడా, లేనేలేడు, ఉండడుకూడా. ఆయనజీవితాన్నంతా [illegible]వావాలంటే, యీ అయిదు భావాలు నీకు యింకా బాగా అర్థం అవుతాయి.

ఈవిధంగా, భక్తిఅనేది భగవంతునితోఉండే సంబంధాన్నిబట్టి, సన్నిహితత్వాన్నిబట్టి, ప్రేమాధిక్యతనుబట్టి, యిన్నివిధాలుగా మారింది. కాని ప్రేమ, త్యాగం అనేవిరెండు ముఖ్యసూత్రాలుగా ఉండితీరాలి. కాని తరతమ భావంలోమాత్రం కొంచెం తేడాతోఉంటాయి. దాన్నిబట్టి వేరువేరు పేరు వచ్చాయి. ఇంతమాత్రమే.

అయితే యీఅయిదుమార్గాలలో, మనకు ప్రపంచంలోఉండే అన్ని సంబంధాలు వచ్చాయికాని, ఒకటిమాత్రం చాలముఖ్యంఅయింది రాలేదంటావా? అదేమిటో నాకుతెలుసు. భగవంతుడిని మనబిడ్డలాగా చూచుకోటంచెప్పారుగాని, ఆభగవంతుడినే మనతల్లిలాగా చూచుకోవటం చెప్పారు కాదేమి అంటావుకదూ! తొందరపడకు. ఆవిషయాన్నే వివరిద్దామని అనుకుంటున్నాను. దీనివిషయం శ్రీరామకృష్ణుడిని అనుసరించేవాళ్ళందరికీ పరిచయంఅయిందే. అయినా సూక్ష్మంగా చెప్పేస్తాను.

పైఅయిదుమార్గాలలో భక్తుడికి స్వాతంత్ర్యంబాగావుంది. భగవంతుడిమీద సంపూర్ణంగా ఆధారపడటంఅనేదిలేదు. కొంతవరకు ప్రత్యేకత, స్వాధీనతఉంది. కాని యీశ్రీరామకృష్ణవిధానంలో, సంపూర్ణంగా భక్తుడు పరాధీ

నుడు. అన్నింటికి ఆ భగవంతునిపైనే ఆధారపడిఉంటాడు. దీన్ని, మన రామకృష్ణుడు 'మార్జాలకిశోరన్యాయం' అన్నాడు. అంటే పిల్లి, పిల్లలను పెట్టి, అనేకచోట్లకు త్రిప్పుతూఉంటుంది. అవి నడవలేవు. అప్పుడు అది ఏమిచేస్తుంది? ఆపిల్లలను నోటితో పట్టుకుంటుంది. ఆనోటితోనే ఎలుకను పట్టుకున్నప్పుడు, ఆఎలుకకు ప్రాణాంతకం అవుతుందిగదా! కాని తనపిల్లను పట్టుకున్నప్పుడు, ఆపళ్ళు ఏమీచేయవుగదా ఆకూనను! ఆమాహాత్మ్యం ప్రేమలోఉంది. అలాగ, నొప్పికలగకుండా తల్లియైన ఆపిల్లి, ఆకూనలను యిల్లిల్లూ త్రిప్పుతుంది. కాని కాసంతైనా హానికాదు పిల్లకు. దీనికికారణం ఏమిటి? ఆపిల్ల, తనశక్తిమీదనే ఆధారపడి ఉండినట్లైతే, పొరపాటుగనైనా దానికి దెబ్బతగులుతుంది. ఎలాగంటే కోతుల్ని ఎప్పుడైనా చూచావా? వాటిలో తల్లీపిల్లల్ని చూచావా? తల్లిపొట్టకు అతుక్కున్నట్లు ఆపిల్ల లానే తన చేతులు, కాళ్ళతోనే తనతల్లికడుపును గట్టిగాపట్టుకుంటుంది. తల్లికోతి చెట్టుమీదనుండిచెట్టుమీదికి, రాయినుండిరాయికి దూకేటప్పుడు, ఒకవేళ ఆపిల్లపట్టు జారవచ్చు. చిన్నపిల్లగా! అప్పుడాకోతిపిల్లకు ఎంతప్రమాదం? ఇలా తనతల్లిమీదకాక, తనమీదనే ఆధారపడే కోతిపిల్లకూడా శాస్త్రంలో కెక్కింది. దీన్ని ఉదాహరణకుచూపుతూ 'మర్కటకిశోరన్యాయం' అంటారు శాస్త్రజ్ఞులు. ఇలాకాకుండా, అల్పమైన తనశక్తిపైన ఆధారపడక, తనకెప్పుడు, ఏదికావాలో తెలుసుకొని, తనయోగక్షేమాలకోసం తాపత్రయపడే పిల్లిపిల్లను చూపుతూ, అది మంచిమార్గమని చెప్పుతూ 'మార్జాలకిశోరన్యాయం' అన్నారు పెద్దలు.

పైన చెప్పబడిన శాంతంనుండి మధురంవరకున్న భక్తిభావాలన్నీ ఒకవేళ యీ 'మర్కటకిశోరన్యాయం' క్రింద వస్తాయేమో అనిపిస్తుంది. కాని యీ శ్రీరామకృష్ణభావంఉందే ఆదేవదేవి లోకైకమాత, ప్రేమస్వరూపిణి, ఆనంద మాయియైన ఆకాళికమీదనో, మరితర ఏశక్తిమీదనో, సంపూర్ణంగా తన బాధ్యతను తనపైకొంచెమైనా ఉంచుకోకుండా, 'సర్వార్పణమస్తు' అంటూ ఆమెపై విడిచిపెట్టేస్థితిఉందే అది 'మార్జాలకిశోరన్యాయం' అవుతుంది. దీనిలోఏమాత్రం హాని, అపాయం లేదంటేనమ్ము. ఈమార్గంలోఉండే ఆధి

క్యతయిది. తల్లిదగ్గరఉండే పసిపిల్లవాడిలాగా ప్రవర్తించటమే యీమార్గంలో ఉండేరహస్యం. ఈమార్గాన్ని శాక్తేయంఅని, దానిలోఉండే రహస్యాన్ని గ్రహించినవాళ్ళు భావిస్తూఉంటారు. కాని, మామూలుగా శాక్తేయం అనబడే దానికి, యీపద్ధతికి అసలు సంబంధమేలేదు. అసలు శాక్తేయంలోఉండే తీవ్ర సాధనలుగాని, పొరబడితే భ్రష్టతకుతెచ్చే అపాయకరమైన సాధనలుగానిలేక, పరమపవిత్రమైన, కించిన్మాత్రదోషమైనాలేని ప్రేమగాక దీనిలో అన్యంలేదు. తల్లినిప్రేమించే బిడ్డడికి ఏదోషం దగ్గరకు చేరగలదు? తీవ్ర దృష్టులచూస్తూ, తిట్టుతూ, కొట్టుతూఉండే తల్లిలోకూడా ఆతల్లియొక్క అపారప్రేమనే చూచే ఆబిడ్డలో ఏదోషంఉంటుంది? లోపంఏముంటుంది? ఆ బిడ్డకేమైనా అపాయంకలుగుతుందా? అట్టిది శ్రీరామకృష్ణునిమార్గం. దీనిలో ఏ మాత్ర మైనా దోషంఉంటానికే అవకాశంలేదు. అలా ఉన్నదనేవాళ్ళదృష్టిలో ఉన్నది దోషం.

ఇంతవరకు చెప్పబడిన సృష్టికర్త, పోషణకర్త, లయకర్త పురుషవాచక మైన భగవంతుడుకాక, స్త్రీవాచకమైన భగవతియేఅవుతుంది. ఈ మార్గంలో ఆమెశక్తిస్వరూపిణి. ఆమె సహాయమేలేకపోతే ఆభగవంతుడు ఒక గడ్డిపరకను గూడా సృజింపలేడుఅని దీనిభావం. శక్తిలేనివాడేపని చేయగలడు? ఆ భగవం తుడికికూడా యీశక్తియే ఆధారభూతంకాబట్టి ఆమెనేప్రార్థిద్దాం. ఆమె అను గ్రహాన్నిపొందాలని, ఆమెను నిష్కల్మషంగా ప్రేమిస్తూఉంటమే దీనిరహస్యం.

ఈఆరుప్రకారాల ఆ భగవంతుడినిప్రార్థిస్తూ, అన్నివిధాలా ప్రేమిస్తూ, అతనికొరకు సర్వంత్యాగంచేస్తూ, అతడి అనుగ్రహంపొంది, దానివల్ల అతని దర్శన, స్పర్శన, సంభాషణమొదలైన సర్వవిధభాగ్యాలు పొందటానికై యత్నిం చటం భక్తియోగంఅంటారు. ప్రస్తుతం యింతవరకు చాలు నిలుపుతాను.

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం.

(signature)
18-2-46

# 21
# భక్తియోగము - వైధి - పరాభక్తులు

నా మాతాజీ!

మూడు, నాలుగు ఉత్తరాలవల్ల చెప్పబడిన ఏ భక్తిఉందో, అది మరల ముఖ్యంగా రెండురకాలయినది. ఏ భక్తినైతే కర్మకాండతోగూడా కలిపి, కర్మను, దాని ఆచరణకవసరమయ్యే స్నాన, జపోపాసన మొదలైన విధులతో గూడ ఆచరిస్తామో, ఆభక్తిని 'వైధిభక్తి' అంటారు. దాన్నే 'గౌణభక్తి' అని కూడాఅంటారు. దీనిప్రకారం శాస్త్రంలో ఏదేవతను, ఏవిధంగా ఉపాసన చేయాలనిఉంటుందో, ఆఉపాసనలో మొదలేమిటో, మధ్యేమిటో, చివరేమిటో తెలుసుకుని, క్రమంకొంచెమైనా తప్పకుండా ఆచరించటం వైధిభక్తి. పూజించవలసినదైవం విగ్రహమూర్తిగాఉండాలా? లేక విగ్రహసూచకమైన చిహ్నంగాఉండాలా? ఆమూర్తి ఎలాఉండాలి? ఎంతకొలతల్లో ఉండాలి? బంగారంతోచేయాలా? తామ్రంతోచేయాలా? మట్టితోనేచేయాలా? ఆ విగ్రహాన్ని తూర్పుముఖంగావుంచాలా? ఏవైపుకు త్రిప్పివుంచాలి? ఆలయం, ఎంత, ఎలావుండాలి? అనేసమస్యల దగ్గరనుండి, స్నానశౌచాద్యులలోనూ, వస్త్రధారణంలోనూ, పీఠాన్ని అమర్చటంల్లోనూ, ఒకటేమిటి, 'కేశవాయ

స్వాహా' అనే ఆచమనవిధినుండి 'తత్సత్ బ్రహ్మార్పణమస్తు' అని పూజ అయినతర్వాత, సర్వాన్ని ఆదైవానికి అర్పించేపర్యంతం వీడు స్వతంత్రించి కప లటమైనాలేకుండా, ప్రతిక్రియ, ప్రక్రియలను శాస్త్రప్రకారం నిర్వర్తించటాన్ని వైధిభక్తిలంటారు. అందుకని, దైవంమీదకంటె యీమర్యాదల్లోనే బుద్ధి ప్రసరిస్తూవుంటుంది యీభక్తి విధానంలో.

అలాకాక, యీకట్టుబాట్లనన్నింటిని తెగకోసేది మరొకభక్తివుంది. అదిఎలాగంటే, భర్త దూరానఉండటంచేత అతనిమీదదృష్టినుంచి, గంధా లతో, పూలతో, క్రమంతప్పకుండా పూజిస్తూవుంటుంది భర్తచిత్రపటాన్ని సాధ్వి. కాని, అతని ప్రేమమూర్తియే తనసన్నిధానంలోకి వస్తే, యీ మర్యాద లన్నీ ఏమవుతయ్యో! ఆఆనందంలో, ఆప్రేమప్రవాహంలో, యీ ఆచారా లన్నీ ఎక్కడికి పారిపోతయ్యో! లేక ఆభర్తకొరకై దు:ఖంఎక్కువైతే, యీ క్రమంఅంతా ఎక్కడకుపోతుందో! అలాంటి దుర్భరమైన విరహవేదనా ప్రవా హంలో యీశాస్త్రసీమాలన్నీ కొట్టుకొనిపోతాయి. లేక ఆభగవత్సన్నిధాన మాధుర్యాన్ని గ్రోలుతూ, ఆ ఆనందసాగరంలో విహారంచేస్తూఉంటే యీ శాస్త్రవాక్యాలన్నీ ఒడ్డునే ఉండిపోవూమరి! ఇలాగ, రెండువిధాల గట్లుతెగి ప్రవహించే భక్తివాహినిని 'పరాభక్తి' అంటారు. దీనిలో విధినియమాలనేవి లేవు. 'ప్రేమమూర్తియైన తల్లికి రోజూనమస్కారాలు చేస్తావటయ్యా వెర్రి వాడా!' అంటాడు శ్రీరామకృష్ణుడు, యీపరాభక్తిసాగరంలో యీదులా డుతూ. 'సవతితల్లిని మర్యాదచేసినట్లు, పెంపుడుతల్లిని సంతోషపెట్టటానికై ప్రేమను ప్రకటించినట్లు ఎందుకురా! యీప్రేమతత్వాన్ని గ్రహించలేక యిలా బాహ్యకర్మ, బాహ్యభక్తిలో పడిపోతావు పిచ్చివాడా!' అంటాడు మరొక భక్త శిఖామణి. 'భగవంతుడిమీద నిజంగా నీచిత్తం లగ్నమేఅయితే యీ బాహ్యా చరణలో ఎలాఉంటావురా అజ్ఞానీ' అంటాడు మరొక భక్తాగ్రేసరుడు. 'పూజల్లోలేదు, సంకీర్తనలోలేదు, వేషాలలోలేదు, భాషలలోలేదు, గుళ్ళలో లేదు, అరణ్యాలలోలేదు, ఎక్కడుందయ్యా మోక్షానికి మార్గం అయినభక్తి అంటే, నీ హృదయంలోనేఉందని పాడేసింది, యీపరాభక్తి తన్మయత్వంలో మహాభక్త మీరాబాయి.

ఇప్పుడేమి అర్థంఅయింది? ఈవైధిభక్తిఅనేది ప్రథమసోపానం, పరాభక్తిఅనేది చివరిమెట్టు అనితేలింది. వైధిభక్తిలో ఉండేవాడికి 'యీదేవుడు వేరు, ఆదేవుడువేరు, యిదిచేయాలి, అదిచేయరాదు' అనే భేదబుద్ధి యింకా వుంటుంది. కాని పరాభక్తిలో యీసంకుచిత భావాలకు చోటులేదు. పరాభక్తిలోనుంచిచూస్తే యీప్రపంచంఅంతా, అందులోఉన్న సర్వస్థావరజంగమాది భూతకోటిఅంతా, ఆప్రేమమూర్తిలోలీనమై, మునుగుతూతేలుతూ, ఆహృదయ విహారునితో ఏకమై ప్రకాశిస్తూ వుంటుంది. ఈ ప్రపంచానికిన్నీ, యీచిత్తవశీకరమూర్తికిన్నీ భేదంఏమాత్రం గోచరించనేగోచరించదు. అంతా ఆయిష్టదేవతాస్వరూపమే. అంతా ఆదివ్యమూర్తియొక్క తేజోపుంజమే. ఇట్టి స్థితిని 'మహాభావసమాధి' అంటారు. దేన్నిచూచినా ఆమూర్తే! దేన్నివిన్నా ఆ మూర్తియొక్కపలుకే? దేన్నిఆఘ్రాణించినా ఆమూర్తియొక్క సుగంధ పరిమళమే! ఇంతెందుకు, యీమహాభావసమాధిలో ఆప్రకాశస్వరూపుడు కానిదేదీ లేదనిపిస్తుంది. అందుకనే ఆ అనుభవాన్నిబట్టి ఉపనిషత్తుల్లో 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అన్నారు.

అలాకాకుండా, అంటే అనుక్షణంకాకుండా, బుద్ధిని ప్రసరింపచేసినప్పుడే ఆతేజోరూపం గోచరిస్తూఉంటే ఆస్థితిని 'భావసమాధి' అంటారు. ఈరెంటిని సవికల్పసమాధులంటారని యిదివరకేచెప్పాను. ఎందుకని? ఆసమాధుల్లో రూపమో, భావమోఉంటంచేత. అదీకూడాలేకపోతే కేవలం నిర్వికల్పంఅయిపోతుంది. ఈనిర్వికల్పసమాధిఅనేది యీ భక్తియోగంలో రానేరాదు. ఎందుచేతనంటే భక్తియోగంలో ఏస్థితికి వెళ్ళినా, ఆ భగవంతుడు భక్తునికి వేరుగనేఉంటాడు. అంటే ఆభగవంతుడే నేను అనే స్థితి, ఆభక్తునికి కలుగనే కలుగదు.

ఈభక్తియోగంలోని భక్తుడు, దేహపతనానంతరంకూడా భగవంతునికంటే అన్యంగానేఉంటాడు. శాస్త్రాలనుబట్టి భక్తులకు మరణానంతరం మోక్షం నాలుగురకాలుంటుంది. అవికూడా ఒకదానికంటే ఒకటి శ్రేష్ఠం. ఈ శ్రేష్ఠత్వం ఎలాకలుగుతుంది అంటే, భక్తునియొక్క భక్తిశ్రేష్ఠత్వాన్నిబట్టి

ఉంటుంది. ఆనాలుగింట్లో మొదటిది 'సాలోక్యమోక్షం'. దీని ప్రకారం భక్తుడు మరణించిన పిమ్మట ఆ పరాత్పరుడుండే వైకుంఠానికో, కైలాసానికో వెళ్ళి ఆలోకంలోఉంటాడు. తర్వాతిది 'సామీప్యమోక్షం'. దీనిప్రకారం భక్తుడు, మొదటివానివలెగాక యింకా ఆభగవంతుడికి దగ్గరగాఉండేటట్లు, ఆడూళ్ళోనే, లేక ఆగృహంలోనేఉంటాడు. తర్వాతయింకా అధికుడైనభక్తుడు 'సారూప్యం' అనేమోక్షాన్ని పొందుతాడు. ఈభక్తుడికి విష్ణువులాగా నాలుగు చేతులు రూపంకలుగుతుంది. ఆతర్వాత యింకాఉత్తమభక్తుడు, 'సాయుజ్య మోక్షాన్ని' పొందుతాడు. అంటే ఆభగవంతునికున్న శక్తుల్లో కొన్ని శక్తులు కూడా వస్తాయి.

కాని యింతైనాకూడా, ఆభగవంతుడే పూర్తిగా కావటానికిమాత్రం అసలు వీలేలేదు భక్తిమార్గంప్రకారం. ఈరకంగా భగవంతుడువేరు, జీవుడు వేరు అనేపద్ధతిని ద్వైతమార్గంఅంటారు. అలాకాక, ఆబ్రహ్మమే నేను, నేనే బ్రహ్మన్ని అనేప్రకారం 'అహం బ్రహ్మాస్మి' అనేస్థితికి ఉపనిషత్తులప్రకారం ఏ ముముక్షువువస్తాడో, వాడిని జ్ఞానిఅని, అద్వైతిఅని, బ్రహ్మవిదుడని అంటారు. ఈ చివరిమార్గాన్ని యిక తెలుసుకుంటావు.

అమ్మాయీ! ఈఉత్తరంలో భక్తి అంటేఏమిటో, దాని నిర్వచనం ఏమిటో, అది ఎన్ని రకాలో, దానిస్థితి ఏమిటో, దాని పర్యవసానంఏమిటో మొదలైన విషయాలన్నీవిన్నావు. ఈభక్తియోగంయొక్క ఔన్నత్యం, సౌలభ్యం విన్నావు. ఇక మిగిలిఉన్నదేమిటి? విన్నదాన్ని తింటానికి యత్నించాలి. ఒక పండు రుచివిన్నావు. 'అహో! ఎంతరుచి! ఎంతరుచి!' అన్నాను. నీవు విన్నావు. ఏమి ప్రయోజనం? దానిమాధుర్యం నీకుతెలిసిందా? నీకుఏమైనా తృప్తి కలిగిందా? అలాలేనప్పుడు యీనా చెప్పటందేనికి? నీవుయిలా శ్రమపడి చదువుకోటం వినటంఎందుకు? అందుచేత విన్నదాన్ని ఆలోచించాలి. ఆలోచించినదాన్ని అనుభవించాలి. వీటినే శ్రవణ, మనన, నిదిధ్యాసనాలంటారు శాస్త్రాలలో. నీవు, అలా ఆచరించుకుంటావని నమ్ముతున్నాను.

ఇంకా, భక్తి అభ్యాసానికి మార్గాలనుగూర్చి, ఆ యనుభవాలనుగూర్చి చెప్పాలిసింది బండ్లకుగాఉంది. అవన్నీ, ప్రస్తుతం నీవు అర్థంచేసుకోలేవు. కాబట్టి, యీ భక్తియోగాన్ని యింతటితో ముగిస్తున్నాను. అమ్మాయీ! ఇక దాని మాధుర్యాన్ని త్రాగటానికిపూనుకో.

ఆతడే మన దిక్కు.

ఆతడే మన గమ్యం.

20.2.46.

# జ్ఞానయోగము

*మాతాజీ అమ్మాయీ!*

ఇంతవరకు, ఆధ్యాత్మికానుభవప్రాప్తికి దారి చూపే మార్గాలలో, మొదటి మూడు మార్గాలగూర్చి అంటే కర్మ, రాజ, భక్తియోగాలగూర్చి విన్నావు. ఇక ఆఆధ్యాత్మికమార్గాలలో పర్యవసానమైన జ్ఞానయోగం విషయం తెలుసుకుంటావు. ఆమార్గాలవలె యీమార్గం, అంతసులభంగా ఉండదు గ్రహించటానికైనా. ఇక, దాన్నిఅనుసరించటం ఎంతకష్టమో, దాని అనుభవాలనుపొందటం యింకెంతకష్టమో వేరేచెప్పాలీ! చాలాకష్టం. అందుకనే యీ జ్ఞానమార్గంఅంటే ప్రపంచంలో అతికష్టంఅని ప్రతీతి పడిపోయింది. కాబట్టే ఎవరైనా అర్థంకాకుండామాట్లాడితే 'ఆవేదాంతాలు మాకు అర్థంకావంటారు' లోకంలో. ఏదైనా తెలుసుకోవాలంటే సులభంఅని చెప్పటానికి 'అదేమి బ్రహ్మవిద్యా' అంటారు. దానికర్థం ఏమిటి? బ్రహ్మవిద్య అయితే చాలాకష్టం అనితీర్మానం. ఇలా, చాలాకష్టమైనది యీజ్ఞానమార్గం, అది బ్రహ్మవిద్యతో కూడియున్నదికాబట్టే. దీన్ని అర్థంచేసుకునేవాళ్ళే చాలతక్కువైతే, యిక దీని అనుభవాలు పొందినవాళ్ళెందరుంటారు? అసలు దీనిపేరుచెప్పితేనే భయపడే

వాళ్ళు ఎందరులేరు? అయినా, దీన్ని తెలుసుకోకపోతే, ఆధ్యాత్మికవిద్య పూర్తి కానేకాదు. ఆఅనుభవం పొందకపోతే, ఆధ్యాత్మికానుభవం పూర్తికాలేదన్న మాట. అందుకని, దీన్నిఅందరు తెలుసుకునైనాఉండాలి. తర్వాత అనుభవం సంగతి ఆలోచిద్దాం.

అసలు దీనికింతకష్టం ఎలావచ్చిందంటే, యీమార్గాన్ని గ్రహించాలంటే, సంస్కృతభాష తెలిసిఉండాలి. దీనిభావాలన్నీ ఉపనిషత్తులలో, వాటి నిగూర్చి ఉన్నభాష్యాలలో, యింకా యితర పండితగ్రంథాలలో ఉన్నాయి. భాష్యాలుఅంటే ఆఉపనిషత్తులను వివరించే గ్రంథాలన్నమాట. వ్రాసిన శ్రీ శంకరాచార్యులవారు, వారిశిష్యులు. ఇంకా తర్వాతివాళ్ళందరు సంస్కృత భాషనే ఉపయోగించారు. కాని వాడుకభాష వ్రాశారుకారు. అందుకని, అందరికి అందుబాటులో లేకపోయింది. అంతేకాకుండా యీభావాల్ని సరిగాఅర్థం చేసుకోవాలంటే, షడ్దర్శనాలనబడే శాస్త్రాలన్నీ తెలిసివుండాలి. ఆ షడ్దర్శనాలేవంటే, మొదటిది 'న్యాయదర్శనం'. దీనిలో ఎక్కువ తర్కంఅంటే వాదించే విధానం, వానికట్టుబాట్లు ఉంటాయి. దీనివల్ల బుద్ధి చాలచురుకైపోతుంది. దీన్ని గౌతమమహర్షి వ్రాశాడు. రెండోది 'వైశేషికదర్శనం'. దీనిలో ఎక్కువగా ఆతర్కాన్నే అనుసరిస్తూ, కొంతతత్త్వచర్చకూడాచేశారు. దీన్ని **కణాదమహర్షి** వ్రాశాడు. మూడోది 'సాంఖ్యదర్శనం'. దీనిలో, మొదట న్యాయదర్శనాన్ని కొంత ఉపయోగించుకుంటూ, యీసృష్టి ఎలావచ్చింది అనేప్రశ్నను తీర్మానించారు. దీన్ని కపిలమహర్షి వ్రాశాడు. నాల్గోది 'యోగదర్శనం'. దీని సంగతి రాజయోగంలో కొంచెంవ్రాశాను. ఎక్కువ సాధనను గూర్చి చెప్పుతుంది. దీన్ని పతంజలిమహర్షి వ్రాశాడు. అయిదోది 'పూర్వమీమాంసా దర్శనం'. ఇది వేదాల్లో మొదటిభాగంఅన్నాం. అది కర్మకాండనుగూర్చి చర్చిస్తుంది. దీన్ని జైమినిమహర్షి వ్రాశాడు. చివరిది 'ఉత్తరమీమాంసా దర్శనం' అనబడే యీవేదాంతం. దీన్ని వ్యాసమహర్షివ్రాశాడు. దీనితో పై దర్శనాలన్నీ ఖండింపబడి, ఉపనిషత్తులనే ప్రమాణం, అంటే ఆధారంగా తీసుకుని, తత్త్వవిమర్శలోఉండే అన్నిసందేహాల్ని చర్చించారు వ్యాసులు. వీటిని ఆరింటిని షడ్దర్శనాలంటారు. ఉత్తరమీమాంస అనేది పూర్తిగా ఉపనిషత్తుల

మీద ఆధారపడి వుండటంచేత, దీన్ని 'వేదాంతం' అని అంటారు. వీటినే 'వేదాంతసూత్రాలు' అనికూడాఅంటారు. బ్రహ్మవిషయాలుతీర్మానించింది కాబట్టి బ్రహ్మసూత్రాలంటారు. వ్యాసమహర్షి వ్రాశాడుకాన వ్యాససూత్రాలనికూడా వ్యవహారముంది. ఆవ్యాసులనే, బాదరాయణుడని అంటారు. అందుచేత, వీటిని బాదరాయణసూత్రాలనికూడా అంటారు. ఇలా, యిన్ని విధాలపేరుపడ్డ యీఉత్తరమీమాంసాసూత్రాలు చాలముఖ్యంకాబట్టి తత్త్వ విషయాలన్నీ వాటిలోఉండే సందేహాలన్నింటిని తీర్మానించాయికాబట్టి వీటికి చాలప్రాముఖ్యం వచ్చింది. వాటిని వివరించటానికి అనేకమంది సిద్ధాంతులు పూనుకున్నారు. అందులో శ్రీశంకరాచార్యులు ముఖ్యులు, ప్రథములు అని కూడా చెప్పవచ్చును. ఆయనకు పూర్వంకూడా, చిన్నచిన్న వివరణగ్రంథాలుండేవిగాని అవిలెక్కలోకే రాలేదు. అందుకని శ్రీశంకరులే మొదటివారనాలి. ఆయన వాటినివివరించటానికి, అంతా అద్వైతపరంగా, అంటే యిక నేనుచెప్పబోయే జ్ఞానపరంగావ్రాశారు తనభాష్యాన్ని. అంతటితో ఊరుకోకుండా ఆయన యీవ్యాససూత్రాలకు ఆధారంగావున్న ఉపనిషత్తులకు కూడా భాష్యం వ్రాసేశారు, ఆ సిద్ధాంతపరంగానే.

ఉపనిషత్తులంటే నీకు ఏమిటోతెలుసా? చెప్తానువిను. ఇవి చాల ఉన్నాయి. వేదాలలోవిఅన్నానుకదూ! వేదాలెన్నిఅనుకుంటున్నావు? నాలుగు. ఋగ్వేదం మొదటిది, యజుర్వేదం రెండోది, సామవేదం మూడోది, నాలుగోది అథర్వణవేదం. ఈనాలుగు వేదాలు, ఒక్కొక్కటి కొన్నిభాగాలుగా ఉన్నవి. ఋగ్వేదానికి ఇరవైఒక్కభాగాలు, యజుర్వేదానికి నూటతొమ్మిది, సామానికి వెయ్యి, అథర్వణానికి యాభైభాగాలున్నాయి. ఒక్కొక్క భాగానికి, ఒక్కొక్క ఉపనిషత్తుంటుంది. ఇలామొత్తానికి 1180 ఉపనిషత్తులయినాయి. కానివాటిలో ప్రస్తుతం ప్రచారంలోకి వచ్చినవి నూటఎనిమిది. వాటిలో మరల ముఖ్యం ముప్పదిమూడు. వాటిలో పన్నెండే యింకాముఖ్యం. వీటినే ద్వాదశోపనిషత్తులంటారు. ఈ పన్నెండు ఉపనిషత్తులకు శ్రీశంకరులు భాష్యాలు వ్రాశారు. ఆఉపనిషత్తులుఏమిటంటే 1.ఈశావాస్య 2.కేన 3.కఠ 4.ప్రశ్న 5.ముండక 6.మాండూక్య 7.తైత్తిరీయ 8.ఐతరేయ 9. ఛాందోగ్య 10.బృహ

దారణ్యక 11. శ్వేతాశ్వతర 12. కౌషీతకి. ఈపన్నెండింటిలో పదే చాల ముఖ్యంఅయి, దశోపనిషత్తులని ప్రఖ్యాతిపొందాయి. అంతేకాక చాల ప్రతీతి గాంచిఉన్న భగవద్గీతకుకూడా శ్రీశంకరాచార్యులు భాష్యంవ్రాశారు. అంటే ఆచార్యులవారు 1. బ్రహ్మసూత్రాలు 2. దశోపనిషత్తులు 3. గీతకు భాష్యాలు రచించారు. ఈమూడు గ్రంథాలనే ప్రస్థానత్రయం అనిఅంటారు. పూర్వ కాలంలో, హిందూమతంలో, ఒకసిద్ధాంతాన్ని ప్రచారంచెయ్యాలంటే, యీ ప్రస్థానాలకు భాష్యాలువ్రాస్తేనేగాని లాభంలేదు. అందుచేతనే శ్రీశంకరులు కూడా వీటికి వ్యాఖ్యానాలు వ్రాయవలసివచ్చింది. అందుచేత, అద్వైతం అన బడే యీజ్ఞానమార్గంఅంతా, యీమూడింటిమీదనే ఆధారపడిఉంది. శంకరభాష్యం బాగాగ్రహించాలంటే, యిందాకచెప్పిన దర్శనాలను చదివి వుండాలంటారు. అలాఅయితే ఎప్పటికి వీటినిచదవటం? ఎప్పటికి అర్థం చేసుకోటం? ఒక్కొక్కదాన్ని తెలుసుకోటానికే కొన్నిసంవత్సరాలు కావాలి. ఆకారణంచేత కష్టంఅన్నారు.

ఇంతేకాదు, యీజ్ఞానమార్గం అనగానే, పూర్వపు మూడుమార్గా లలో, అణిగిమణిగివుండే త్యాగం ముందుకు వచ్చేస్తుంది. 'ముందు నా సంగతిచెప్పి యీమార్గంలోదిగు' అంటుంది. అంటే త్యాగంకావాలి. ప్రపంచ సంబంధాలు వదులుకుంటేనే యిది బాగా అర్థంఅయ్యేది. ఆత్యాగం లేకపోతే అనుభవంరానేరాదు యీమార్గంలో. అలా ప్రపంచాన్నంతా, పెళ్ళాంబిడ్డలతో సహావదిలేసి దీన్నెవరు తెలుసుకోటానికి పూనుకుంటారు? ఎవరన్నా పూను కున్నారాఅంటే, వాళ్ళు సన్న్యాసులైపోతారు. ఆకారణంచేత యీవిద్యఅంతా యీసన్న్యాసుల్లో ఉండిపోయింది. ఆసన్న్యాసులు చెప్పుతారాఅంటే త్యాగం వుంటేనేగాని సాధ్యంగాని విషయాలను త్యాగంలేనివారికిచెప్పి ప్రయోజనం ఏమిటి? అందుచేత వాళ్ళు చెప్పనేచెప్పరు. ఒకవేళచెప్పినా, త్యాగంలేనివాళ్ళకవి అనుభవంలోకిరానేరావు. ఆసన్న్యాసులు చెప్పినవిషయాలను కొంచెంగ్రహించి చదువుకున్నా, శాస్త్రంలో, చర్చలో, వాగ్ధోరణిలో పండితుడు కాగలడుగాని అనుభవం కాసంతైనా రానేరాదు త్యాగరహితునికి. ఆకారణాన యీవిద్య సామాన్యులకు దూరంఅయిపోయింది.

దీనికితోడుగా యీవిద్యలో అభివృద్ధి గాంచాలంటే 'అబ్బాయీ! నాలుగువిషయాలు ముందు సపాందించుకో' అన్నారు శంకరాదులు. వాటినే సాధనచతుష్టయం అంటారు. మొదటిది నిత్యానిత్యవస్తువివేకం. రెండోది ఇహాముత్రఫలభోగవిరాగం. మూడోది శమాదిషట్కసంపత్తి. నాల్గోది ముముక్షుత్వం. ఈనాలుగు లక్షణాలవిషయం తర్వాత వివరంగా తెలుపుతాను. ఈనాలుగు లక్షణాలుపొందివుంటేనే నాగ్రంథాలుతాకు, లేకపోతే వద్దన్నట్లు 'యీప్రపంచంమీద అసహ్యంకలిగి, మోక్షానికై తాపత్రయపడేవాళ్ళకే యీగ్రంథం వ్రాస్తున్నాను' అని ప్రతిగ్రంథారంభంలో వ్రాశారు శంకరులు. వీటిని పొందటంఅంటే, లోకాన్ని వదలాలి. అంటే, పైనచెప్పిన త్యాగమే అయింది. రాజయోగంలోచెప్పిన యమనియమాలన్నీ రావాలి. అలా అయినప్పుడు యితరయోగాల్లాగా యీజ్ఞానయోగం అందరికి ఎలాసాధ్యం అవుతుంది? ఎవరైతే తెగించటానికి తయారుగాఉంటారో, అంటే త్యాగమే ధనంగా కలిగిఉంటారో, ఎవరికైతే అతికుశాగ్రమైన బుద్ధి, అంటే గొప్ప తెలివితేటలుంటయ్యో, ఇంకా ఎవరికైతే శాస్త్రపరిచయం స్వయంకృషిచేతగాని సద్గురుకృపచేతగాని కలుగుతుందో, అలాంటి వాళ్ళకుమాత్రమే జ్ఞానమార్గం లభిస్తుంది. అందరికీ అలవిఅయ్యేదిగాదు. అందుకని యీ మార్గంలో అనుభవజ్ఞులు ఎంతమందిఉంటారో ఆలోచించుకో.

అలాంటి అతికష్టమైంది యీమార్గం. దాంట్లో యిక ఎలాంటి భావాలుంటాయో ఎందుకుచెప్పటం! ఆవిషయాన్నిగూర్చి యిక కొన్ని ఉత్తరాలలో చెప్పుతుంటాను. శ్రద్ధగా చదువుకుంటూ అర్థంచేసుకో.

నాన్నగారు

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం

25.2.46.

# 23

# జ్ఞానయోగము - సృష్టిరహస్యము

*చిట్టిచెల్లీ మాతాజీ!*

జ్ఞానమార్గంలోఉండే కొన్ని రహస్యాలు మొదటిఉత్తరంలో వచ్చాయి. వాటిని చదివేటప్పుడు అద్వైతభావాలు ఎంతకఠినమో నీకు కొంతతెలిసి ఉంటుంది. అందుకనే వాటిని అర్థంచేసుకోటానికి ఎక్కువ శ్రమచేయ వలసివస్తుంది. అలాగని మానెయ్యరాదు. అలాగే తంటాలు పడుతూవుంటే, మెల్లగా విషయాలుముందు అర్థంఅవుతాయి. తర్వాత మనస్సు నిర్మలం అయ్యేకొద్దీ, యమనియమాలు గట్టిపడేకొద్దీ, సాధనసంపత్తి అభివృద్ధి గాంచేకొద్దీ, యీమార్గంలోఉండే రహస్యాలు బోధపడుతూవుంటం, అను భవాలువస్తూవుంటం జరుగుతుంటుంది. అందుచేత ఏమాత్రం భయం లేకుండా ధైర్యంతో చదువుకో. అయినా మరొకవిషయం చెప్పుతున్నాను. ఇప్పుడే, ఎక్కువ కష్టంఅయిన విషయాలు నీకుచెప్పనులే. మెల్లమెల్లగా నీ శ్రద్ధ నుబట్టి, అర్థజ్ఞానాన్నిబట్టి, ఆచరణనుబట్టి, అనుభవాన్నిబట్టి, ఎప్పుడెంత వరకు, ఏదిఅవసరమో ఆలోచించి, ఆవిషయాలు నీకు తెలిపేస్తూ ఉంటాను. ఇక నీకు భయం ఎందుకు?

పూర్వం 'ఈశ్వరప్రణిధానాత్' అనేవిషయంలో భక్తియోగంలోఏమని గ్రహించుకున్నాం? మనకు కనబడుతూవుండే యీప్రపంచాన్నంతా భగవంతుడు సృజించాడనివిన్నాం. అతడు యింత విశ్వాన్నంతా కల్పించాడుకాబట్టి 'అతడెంత ప్రజ్ఞాశాలిరాబాబూ!' అని ఆశ్చర్యపోయాం. సృజించటానికి వస్తువేది? అనేటప్పటికి కుమ్మరివాడికి మట్టిగా, కంసాలికి బంగారంలాగా, యీ భగవంతుడికి ప్రధానంఅనేది ఒకటుందిఅన్నారు సాంఖ్యులు. అలా ఉండటానికే వీలులేదు. భగవంతుడు సర్వవ్యాపకుడు. అతడు లేనిచోటు, కానివస్తువు లేదుఅనాలి. అలాగైతే యీప్రధానం ఎక్కడుంటుంది? ఆయనకంటే బయటగా ఉందందామూఅంటే, భగవంతుడే అంతటాఉంటే యిక యీప్రధానం వుంటానికి చోటేది? అందుచేత ఆప్రధానంఅనేది భగవంతుడికి బయటుంటానికి వీలులేదు. పోనీ, భగవంతుడికి లోపలఉండయ్యాలంటే, పాలలో దానికి వ్యతిరేకమైన పెరుగుంటుందా? పాలుగడ్డకట్టి అసలు పాలలక్షణాలే పోవా? భగవంతుడు వెలుగులాంటివాడు, యీప్రధానం అంధకారంలాంటిది. రెంటికి యింతభేదంవుంటే ఆఈశ్వరుడిలో యీప్రధానం ఎలా వుంటుంది? అనేప్రశ్న వస్తుంది. వెలుతురులో చీకటి ఎలాఉంటుంది? వెలుతురురాగానే చీకటిపారిపోయెగదా అంటారు. దీనికి సమాధానంగా ఏమన్నారంటే, వుండవచ్చు, పాములో విషంలేదా? ఆవిషం పామునేమన్నా చంపి వేసిందా? అలాగే ఆయీశ్వరుడిలో యీ ప్రధానంవుంది అంటారు. అయితే ప్రధానం ఈశ్వరుడిలో ఏభాగంలోఉంది? అలా భాగంవుందంటే ఆ ఈశ్వరుడిలో, ఒకభాగంలో వుందనిఅర్థం. అలా భగవంతుడిలో భాగాలుంటానికి వీలులేదని ఉపనిషత్తులు చెప్తుతున్నయి. కాబట్టి యీప్రధానం అసలు లేనే లేదని కొందరితీర్మానం.

సరే, యీప్రధానంలేదు బాగానేవుంది. ఆవిషయం ఒప్పుకుంటాం. అయినా భగవంతుడే యీసృష్టిని చేస్తున్నాడయ్యా. ఎలాగంటే, ఆ పరమేశ్వరుడు తనశక్తిచేతనే తానే కర్తఅవుతాడు. అంటేకుమ్మరి తానే, మట్టికూడా తానే అయినాడయ్యాఅని మరికొందరు సమన్వయపరిచారు. అలా యీ విచిత్రం ఎక్కడైనావుందా? తానే కర్త, తానే కర్మకావటం, సృష్టిలోనే లేని

విషయంఅనే సందేహంకలుగుతుంది. లేకేమి? సాలెపురుగుంది. తనలోనుంచే దారంతీస్తుంది, గూడుకట్టుతుంది. అలాగే ఆభగవంతుడు తనలోనుంచే యీప్రపంచాన్నంతా సృజించాడయ్యాఅని మరల సమాధానంవస్తుంది. అదేమిటయ్యా! భగవంతుడు మరొకదాన్ని తనకంటే బయటగా చేయటానికి వీలులేదుగదా! ఎందుకని? తనకుబయటఅనేది ఉంటానికేవీలులేదు. లోపల సృజించుకోటానికిగూడా వీలులేదు. ఎలాగంటే అతనిలో భాగాలనేవిఉండవు కాబట్టి. ఇలాఉండగా, మరోసమస్య వస్తుంది. అలా తనలోనుంచి యీప్రపంచాన్నంతా సృజించాడంటే తాను మారటమేగా? అదెల్లాగ? అతడు వికారం, అంటే ఏమార్పు చెందనివాడన్నారుగదా శాస్త్రాల్లో. అవును, వికారంకూడా చెందడు అనవలసివస్తుంది. అయితే యిక యీసృష్టి ఎలాగ?

పోనీచేశాడందాం. ఎందుకుచేశాడు? ఏమీతోచకచేశాడా? ఆనందం కొరకుచేశాడా? తెలివిలేకచేశాడా? లేక మనల్నిఉద్ధరించటానికా? తోచకచేశాడంటే అప్పుడప్పుడు ఆభగవంతుడికి పనిలేక తోచకపోవటం ఉందన్నమాట! ఆనందంకొరకంటే, దీన్నిసృజించకముందు అతనికి సుఖంలేదన్నమాట! తెలివిలేకనంటే మనతోలెక్క అయినాడు. ఇవన్నీ ఆభగవంతుడి గొప్పదనానికి లోపమేగా! ఈవిధంగా సృష్టినంతా భగవంతుడు సృజించాడయ్యాఅంటే, అనేకసందేహాలు వస్తాయి. మనకోసం అన్నారంటే, యిలా మన సౌఖ్యంకోసం అయితే మనల్ని అందరినీ అంతఃపురసౌధాల్లోపెట్టి, లేక ఏడంతస్తులమేడమీద ఉంచాడా? ఎప్పుడూ సౌఖ్యాలే యిస్తున్నాడా? ఇలాగ ప్రశ్నలకు లెక్కలేదు. సమాధానాలు సరీగ్గా లేనేలేవు. వీటినన్నింటిని యిక్కడ వ్రాస్తూ నిన్ను కష్టపెట్టనేపెట్టను.

పైవిధంగా, యీచిత్రవిచిత్రమైన సృష్టినిగూర్చి బాగాఆలోచించిఆలోచించి, కొందరుమహాత్ములు ఒకతీర్మానానికి వచ్చారు. ప్రపంచం భగవంతుడికి బయటగా ఉండరాదు, లోపలగాకూడా ఉండరాదు, అతడిలో మార్పు రాకూడదు, వేరే పదార్థం లేదు, అనే ముఖ్యవిషయాలన్నీ తీసుకున్నారు. అలాంటిదెక్కడైనాఉందా అనేవిషయం వాళ్ళమనస్సుకి తట్టింది. లేకేమి? అన్నారు. అదేభ్రాంతి. ఆభ్రాంతిలో ఏమిజరుగుతుంది? అనగానే, ఉదాహర

ణలు కొన్నింటిని ముందుపడేశారు. వాటిల్లో ముఖ్యమైంది రజ్జుసర్పభ్రాంతి. అసలు, శ్రీశంకరాచార్యులవారుచెప్పిన యీ'వివర్తవాదం' అనే అద్వైతసిద్ధాంతానికిఅంతా యీరజ్జుసర్పమని, శుక్తిరజతమనీ అనబడే భ్రాంతులే ఆధారం అనవలసివస్తుంది.

ఈ భ్రాంతివిషయం యిదివరకు ఉత్తరాలల్లో చాలవరకు వర్ణించాను. ఎప్పుడైతే, యింకా ఎవరికైతే భ్రాంతికలుగుతుందో వాళ్ళకే, ఆభ్రాంతి ఉన్న కాలంలోనే, ఆపాముకాని, ఆవెండికాని అక్కడ వాటివాటికి అధిష్ఠానాలుగా ఉండేత్రాడుమీద, ముత్యపుచిప్పలమీద కనిపిస్తాయికాని అందరికి ఎల్లకాలం కనిపించవు. అలాగే యీసంసారంఅనేది, లేక యీసృష్టి అనేదికూడా, ఎవరికైతే భ్రాంతిఉంటుందో, ఆభ్రాంతి ఎంతకాలంఉంటుందో, వాళ్ళకే, అంతకాలమే ఉంటుందికాని ఆభ్రాంతిలేనివాళ్ళకు, ఆభ్రాంతిని పోగొట్టుకున్నవాళ్ళకు యీప్రపంచం లేనేలేదుఅని యీవాదంయొక్క ముఖ్యార్థం. ఈ భావాన్నే యింకా వివరించటానికని అందరికీరోజూ అనుభవంలోఉండే మరొకవిషయాన్ని చెప్పుతూ, అద్వైతభావాలుగల శాస్త్రజ్ఞులు తమ సిద్ధాంతానికి యింకా బలంయిచ్చారు. అదేమిటంటే స్వప్నం. స్వప్నాన్ని పొందుతున్నాం. ఆస్వప్నంలో ఉన్నంతసేపు, ఆస్వప్నంలోఉండే విషయాలే సత్యం అనుకుంటాం. అక్కడకూడా యీప్రపంచంలోమాదిరిగా పెళ్ళాంబిడ్డలతో సుఖదుఃఖాలు పొందుతూఉంటాం. ఇలాంటి కష్టసుఖాలతో ఆస్వప్నం వెళ్ళుతూఉంటుంది. కాని మేల్కొన్నతర్వాత ఆభార్యాబిడ్డలు ఏమైనారు? ఇల్లువాకిలి ఏమైంది? ఏమీలేవు. అన్నీఅదృశ్యం అయిపోయాయి. స్వప్నంలోనుంచి మేల్కొన్నతర్వాత అంటే, జాగ్రదవస్థకు వచ్చినతర్వాత తెలుసుకుంటాం అది కలఅని. అందుచేత ఆఅనుభవాలన్నీ కలలోనివేఅని గ్రహించినతర్వాత అవన్నీఅబద్ధంఅని తేల్చుకుంటాం. అలా నిర్ధారణ చేసుకున్నతర్వాత, ఆసంబంధంఅయిన సుఖాలు, దుఃఖాలు యింకామనంపొందుతామా? లేదు. ఆదారాపుత్రులు ఎంతఅబద్ధమో అలాగే వారివల్లకలిగిన ఆకష్టసుఖాలు కూడా. అందుకని అలా జ్ఞానంకలిగినతర్వాత, ఒక నవ్వునవ్వేస్తాం. ఈస్వప్నం అనేదికూడా ఆపాములాంటిభ్రాంతేఅని పెద్దలంటారు. యథార్థంకూడా అంతే. భ్రాంతిలోఉన్నంతకాలం ఆపామున్నది. దీపంతేగానే పాము కనబడ

నట్లు అంటే, ఆసర్పభ్రాంతి నశించినట్లు, స్వప్నంఉన్నంతకాలం ఆ మను ష్యులు ఆఅనుభవాలు ఉన్నయి, స్వప్నంపోగానే ఆ భ్రాంతులన్నీ పోయినయి.

పై దృష్టాంతాలలోనిరహస్యం ఏమిటి? పాముఅనేది యథార్థంగా లేక పోయినా, భ్రాంతిలో పాముకనిపించింది. భార్యాబిడ్డలు వస్తువాహనాలు నిజంగాలేకపోయినా స్వప్నంలో అవన్నీకనిపించాయి ఈభ్రాంతివస్తువులు కూడా ఆభ్రాంతికాలంలో నిజమైనవాటిలాగానే ఉన్నాయి. అట్టి అనుభవాల్నే మనకిచ్చాయి. వాటిని చూస్తున్నంతకాలం అంటే, ఆభ్రాంతిలో ఉన్నంత కాలం ఆవస్తువులన్నీ యథార్థమే. ఎప్పుడు వాటిని భ్రమఅన్నాం? భ్రాంతి పోయాక. అలాగేయీప్రపంచంఅనేదిఏవిధంగానైనా ఆసర్వవ్యాపకుడు, అఖం డుడు, నిర్వికారుడు, ఏకుడు, నిత్యుడుఅయిన ఆపరమేశ్వరుడిచేత సృజింప బడటానికి వీలు శాస్త్రాలప్రకారం, యుక్తిప్రకారం కనిపించటంలేదు. అయినా యీప్రపంచం కనిపిస్తున్నదిఅంటే యీభ్రాంతినే సమాధానంగా యిచ్చారు అద్వైతులు. దాన్నిఎలాసమర్థించారు? మనంఅసలు లేనిసర్పాన్నిచూచి నట్లు యిప్పుడుకూడా లేనిప్రపంచాన్నేచూస్తున్నాం. భ్రాంతిచేత ఎలాఅయితే ఆపామునుచూచామో, అలాగే భ్రాంతిచేతనే యీసంసారాన్ని చూస్తున్నాం. ఎలాగైతే భ్రాంతిపోగానే ఆపాము కనబడలేదో అలాగే మన భ్రాంతిపోగానే యీఉన్నదనుకొనే ప్రపంచంలేకుండాపోతుంది అన్నారు వాళ్ళంతా.

ఈభ్రాంతికే 'మాయ' అని నామకరణంచేశారు. దీనినే 'అజ్ఞానం' అని 'అవిద్య' అనికూడా అన్నారు. మాయ అనబడే అజ్ఞానంవల్ల, అసలులేని యీప్రపంచాన్ని అక్కడ పామును చూచినట్లు చూస్తున్నాం అన్నారు. అక్కడ భ్రాంతిని పోగొట్టుకున్నట్లు ఎప్పుడైతే అజ్ఞానాన్ని నశింపచేస్తామో, అంటే యీమాయను జయిస్తామో, అప్పుడు యీప్రపంచం అదృశ్యం అయిపో తుంది, అసలు లేనిదేకాబట్టి. ఏమిమిగులుతుంది? పాముపోగానే త్రాడు మిగిలినట్లుగా అజ్ఞానంపోగానే బ్రహ్మం మిగులుతుంది. లేక స్వప్నంపోగానే మనమే మిగిలినట్లు యీసంసారంఅనే స్వప్నం మాయాపాశంతోపోగానే మిగి లేదినీవే అన్నారు యీవేదాంతులు. అంటే స్వప్నానికి నీవేఅధిష్ఠానం, పాముకు నీవు అధిష్ఠానంకాదుగా. అధిష్ఠానంఅంటే యిదివరకేమని చెప్పాను? దేనిమీద భ్రాంతికలుగుతుందో అదిఅధిష్ఠానం. సర్పానికి త్రాడు అధిష్ఠానంఅయింది.

ముత్యపుచిప్ప వెండికి అధిష్ఠానం. ఇలాగా యీసంసారభ్రాంతిలో వేరే మనకంటే యితరమైన అధిష్ఠానంలేదంటానికే యీస్వప్నదృష్టాంతాన్ని చెప్పుకొచ్చారు. వాటికి అధిష్ఠానం, చూచేవాడికంటే, అంటే భ్రాంతునికంటే యితరంగాఉందిగాని, యీస్వప్నభ్రాంతిలోమాత్రం అలాకాదు. ఈస్వప్నం అనే భ్రాంతి ఎవరికికలిగింది? నీకే. ఎక్కడకలిగింది? నీలోనే. లేచినతర్వాత ఎక్కడ అదృశ్యంఅయింది? నీలోనే. అలాగే యీసంసారం అనేదికూడా నీ భ్రాంతివల్ల నీలోనేకలిగి, నీలోనేభాసించి, నీలోనే చివరికి లయిస్తుందిఅని జ్ఞానులతీర్మానం. అర్థం అయిందా?

అప్పటికి ఏమవుతున్నది? 'ఈశ్వరప్రణిధానాత్' అనేశీర్షికలో, భక్తి యోగంలో, ఏపరమేశ్వరుడైతే యీప్రపంచాన్నంతా సృజిస్తున్నాడు, పోషిస్తున్నాడు, లయింపజేస్తున్నాడుఅని అన్నామో, ఆభగవంతుడు వేరుగా ఎక్కడో, ఏవైకుంఠంలోనో, ఏకైలాసంలోనోలేక యిక్కడేఉన్నాడు. ఎవరు? నీవే అని అర్థంతేలుతుంది యీచర్చవల్ల. ఆనీవులంటే ఎవరు? ప్రతి మనుష్యుడూ కూడా అనిఅర్థం. జీవుడే తన భ్రాంతిచేత యీనానాత్వంగా కనిపిస్తూఉండే ప్రపంచాన్ని చూస్తున్నాడు. కాని యథార్థంగా యీప్రపంచం లేనేలేదు. కనిపించేదంతాలేనిదే. భ్రాంతే. ఈభ్రాంతిరూపంగాఉన్న ప్రపంచానికంతా కారణమైన భగవంతుడు యీజీవుడే.

అయితే మరల జీవుడే అంటందేనికి? ఈశ్వరుడే అనరాదా? అంటావు. నిజమే. ఈ పైనవచింపబడిన రహస్యాన్ని కేవలం పరోక్షంగానే కాకుండా అపరోక్షంగాకూడా ఎవరుగ్రహించుతారో, ఏజీవుడు తెలుసుకుంటాడో, వాడు జీవుడుఅనబడడు, వాడు భగవంతుడే. ఈయథార్థం గ్రహించినవాడు బ్రహ్మవిదుడని, ఆబ్రహ్మవిదుడు బ్రహ్మమేనని, 'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి' అన్నాయి ఉపనిషత్తులు. మరి యీస్థితినిపొందే మార్గం ఏమిటో యిక కొంచెం చూద్దాం.

ఆతడే మన దిక్కు.

ఆతడే మన గమ్యం.

26 -2-46

# 24
# జ్ఞానయోగము - జీవుడు

*సోదరీ మాతాజీ!*

అమ్మాయీ! పూర్వపుటుత్తరంలో జ్ఞానమార్గంవిషయాన్ని కొంత తెలుసుకున్నావు. సృష్టిఅంతా, అంటే యీలోకంఅంతా భ్రాంతేనని, ఆ భ్రాంతికికారణం, అధిష్ఠానంబ్రహ్మమేనని, కాని భ్రాంతిలోఉండి యీసంసారాన్ని అనుభవిస్తున్నంతకాలం బ్రహ్మమే జీవుడనబడతాడని, మరల ఎప్పుడైతే అజ్ఞానాన్ని పోగొట్టుకుంటాడో యీజీవుడే బ్రహ్మమౌతాడని విన్నావు. అయితే యిలా కావటంమాత్రం వికారంకాదా? అంటే బ్రహ్మం జీవుడు కావటం మార్పుచెందటంకాదా అనేప్రశ్నఉంది. కాని ఇది వికారం కానేకాదు. త్రాడును ఎంతసర్పాన్నిగాచూచినా ఆత్రాడు అసలు ఏకొంచమైనామారిందా? ఇలాగే మనం స్వప్నంలోపడి కాలువిరిగినట్లు కనిపించినా, ఏడ్చినా, అసలు నిద్రపోతూ స్వప్నంపొందేమనకు కాలు, చేయి విరగటం, ఏడవటం జరిగిందా? అలాగే ఎన్నిరకాల భ్రాంతిపొందుతున్నా, బ్రహ్మం జీవుడు కానేకాదు.

...ంచే జీవుడుఅని పేరు వేరుగాపెట్టాంగాని అసలు భేదంలనేదే లేదు. దీనికే మరొక మంచి దృష్టాంతం చెప్తాను విను.

ఒక రాజుగారియింట్లో దొంగలుపడి, రాజుగారి పసిబిడ్డను దొంగిలించారు. రాజు వెతికించాడుగాని దొరకలేదు. కొంతకాలంఅయినతర్వాత, యీ కుర్రాడు దొంగలమధ్య పెరుగుతూవున్న ఆయరణ్యంలోకి, ఆరాజు వేటకై వెళ్ళాడు. అనుకోనట్లు యీదొంగలగూడానికి వెళ్ళాడు. కాని రాజుకు మాత్రం తన కుమారుడక్కడున్నట్లు అసలు తెలియనేతెలియదు. ఆపిల్లాడికి మాత్రం ఎలాతెలుస్తుంది? ఈరాజును చూచేటప్పటికి దొంగలంతా పారిపోతున్నారు. వాళ్ళలో యీపిల్లాడుఉండటం రాజుకు ఆశ్చర్యం కలిగింది. సుమారు పన్నెండేళ్ళున్నాయి కుర్రాడికి. గొప్పతేజస్సు. రాజపుత్రుడులాగా ఉన్నాడు. అందుకని రాజు ముందుగా ఆకుర్రాడిని పట్టించాడు. ఆఅబ్బాయిని ఎంతప్రశ్నించినా, ఆగూడెంలో యిద్దరు దంపతుల్నే తల్లితండ్రి అంటాడు. మాట్లాడానికి రాచబిడ్డడు. రాజు, దంపతుల్ని పిలిచి ప్రశ్నించాడు. అసలు వృత్తాంతంఅంతా విన్నాడు. అప్పుడు తెలిసింది రాజుకు, ఆ అబ్బాయి తనకొడుకే అని. వెంటనే కౌగలించుకొన్నాడు పిల్లవాడిని. ఆపిల్లవాడు భయంతో ఆదొంగల్లోకి పారిపోయాడు. ఎందుకని? పాపం ఆరాజు తన తండ్రిఅని తెలియదు. దొంగలుకూడా, బాగా నచ్చచెప్పినతర్వాత గ్రహించాడు 'నేను రాజపుత్రుడినా?' అని. సంతోషించి, ఒక్కకేకతో, ఆనందంతో రాజుఒడిలోకి ఉరికాడు. ఈకథలో ఆబిడ్డ దొంగలమధ్య ఉన్నంతమాత్రాన దొంగఅయ్యాడా? రాచబి... కాకపోయాడా? రాజు చెప్పినంతమాత్రంచేత కొత్తగా క్షత్రియుడుగా మారాడా? ఎప్పుడూ ఆబాలుడు రాచబిడ్డడే. కాని మొదట్లో తెలియకపోవడంచేత దొంగవాడినే అనుకున్నాడు. ఆ అనుకోవటంతో, ఆభాష, ఆఆచారాలు అన్నీవచ్చేశాయి. ఎప్పుడైతే తానే రాజకుమారుడుఅని తెలిసిందో ఆనందంపొందాడు.

అలాగే యీ బ్రహ్మంఅనబడే ఆత్మయే మాయఅనే అజ్ఞానంచేత 'నేను జీవుడిని, మగవాడిని, బ్రాహ్మణుడిని, డబ్బుగలవాడిని' అనీ, యింకా

యిల్లాంటి అనేకభ్రాంతుల్లో పడతాడు. కాని అసలు వాడు కేవలం ఆత్మయే. ప్రస్తుతం ఆఅజ్ఞానదశలో జీవుడని, యింకా యితరవిధాల అనుకున్నంత మాత్రాన అతని వస్తుత్వంలో మార్పులేదుగా! అలాగే చూచుకో, కుశలవుల చరిత్ర. రాముడు గుర్తుపట్టలేదు. కుశలవులుకూడా గుర్తించలేదు. వీళ్లు తెలుసుకోనంతమాత్రంచేత రాముడు తండ్రికాడా, కుశలవులు బిడ్డలుకారా? అజ్ఞానంలో కాదనుకుంటాం, జ్ఞానంలో అవుననుకుంటాం. అలాఅయినా ఒకప్పుడు అయిందీలేదూ, మరొకప్పుడు కానిదికూడాలేదు. ఇది యీ అద్వైతవాదంయొక్క రహస్యం.

ఇలాగే, మరొకకథ చెప్పుంతానువిను. పదిమంది మనుష్యులు ఒకపని మీదవెళ్లుతూ ఒకనదిని దాటారు. అవతలఒడ్డుకు వెళ్ళినతర్వాత అందరూ సురక్షితంగా చేరేరా, లేదా అనిలెక్కించారు. ఎంత లెక్కించినా తొమ్మండుగురే తేలుతున్నారు. ఒకడు ప్రవాహంలో పడిపోయినాడని భయం, దుఃఖం కలిగి, వాళ్ళందరూ రోదనం చేస్తున్నారు. ఇంతలో ఒకపెద్దమనిషి, ఆదారినేపోతూ వీళ్ళదీనస్థితిని విన్నాడు. ఆశ్చర్యపడ్డాడు. రహస్యంగ్రహించాడు. వరుసగా నిలపెట్టాడు అందరిని. ఒకడిని మిగతావాళ్ళను లెక్కపెట్టమన్నాడు. వాడు తనముందున్న తొమ్మిదిమందిని లెక్కించి, 'అయ్యో! పదోవాడో!' అని గోడున ఏడ్వటం మొదలుపెట్టాడు. అప్పుడు ఆపెద్దమనిషి 'ఓరి వెర్రివాడా! నీవేరా ఆపదోవాడివి. నిన్నుగాక మిగిలినవాళ్ళనే లెక్కపెట్టావురా' అన్నాడు. వాడు మరల లెక్కపెట్టాడు. తెలుసుకున్నాడు తనఅజ్ఞానాన్ని. పూర్వపు అజ్ఞానంపోయింది. జ్ఞానంకలిగింది. సంతోషించాడు. అందరూ వెళ్ళిపోయారు. ఈకథలోమాత్రం, పదోవాడు ఏటిలో కొట్టుకొనిపోయాడని, వీళ్లు ఏడ్చినంతమాత్రాన పదోవాడు అలాఅయినాడా? 'నీవేరా' అని చెప్పించుకుని, 'నేనే ఆపదోవాడిని' అని తెలుసుకున్నంతమాత్రాన నీళ్ళల్లోనుంచి పదోవాడు బయటపడ్డాడా? అదీలేదు, ఇదీలేదు. ఆపదోవాడు ఎప్పుడూ బయటనే, ఏఅపాయం లేకుండానేఉన్నాడు. కాని తన బుద్ధితక్కువచేతనే అలా భ్రాంతిపడి ఏడిచాడు.

అంతే యాజీపుడిచరిత్రకూడా. తానే ఆయాత్మస్వరూపమైనబ్రహ్మం అయియుండికూడా, తానుకాదు ఎక్కడో ఆభగవంతుడున్నాడు, 'నేను అజ్ఞానిని, సుఖదుఃఖాలలో మునిగిఏడుస్తున్న మూఢుడిని' అనేవిధంగా అనేక భావాలుపెట్టుకొని, సంకుచితుడిలాగా దుఃఖిస్తూఉంటాడు. కాని యథార్థంగాచూస్తే, ఆపదోవాడితెలివే యాజీవుడికికూడాఉంది మొదట్లో. కాని ఎలాగైతే చివరికి 'ఆపదోవాడిని నేనే' అని వాడు గ్రహించాడో, అలాగే ఎక్కడో ఉన్నాడని అనుకుంటున్న 'ఆబ్రహ్మన్ని నేనే' అని గ్రహించడం, జ్ఞానం అన్నారు అద్వైతజ్ఞానులు. అంటే 'నేను బ్రహ్మమును' అని గ్రహించడం జ్ఞానం అన్నారు. దాన్నే 'అహం బ్రహ్మస్మి' అని శాస్త్రాల్లో చెప్పారు. ఇలా తెలుసుకుంటే అద్వైతసిద్ధి కలిగిందంటారు. ఈవిషయం మరల తెలుసుకుందాం.

28-2-46

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం.

# 25

# జ్ఞానయోగము-మహావాక్యచతుష్టయము

నా మాతాజీ!

క్రిందటి ఉత్తరంలో 'అహం బ్రహ్మాస్మి' అని ఎవడు గ్రహిస్తాడో వాడే అద్వైతసిద్ధుడు అనిఅన్నాం. వాడే ముక్తుడుకూడా. ఈస్థితిని పొందాలంటే సామాన్యంకాదు. సాధనచతుష్టయసంపత్తినిపొందినతర్వాతఅంటే, ఎట్లయినా ఆత్మానుభూతిని సంపాదించాలిఅని పట్టుదలతో, దానికవసరమయ్యే సర్వ యోగ్యతలతో, యీసాధనమార్గాన్నంతా అనుసరించి, ఉత్తీర్ణతపొందిన అనుభవవేత్తఅయిన గురువును ఆశ్రయించి, చతుర్విధ శుశ్రూషలద్వారా ఆ గురువు సేవచేస్తూ, అతనిని సంతోషపరుస్తూ, వారి అనుగ్రహం పొందితే, ఆ గురువు పై బోధనంతా చేసి, చివరికి 'తత్త్వమసి' అంటే 'ఆ బ్రహ్మము నీవే' అని చెప్పేస్తాడు. 'తత్' అంటే బ్రహ్మము, 'త్వం' నీవు, 'అసి' అయియున్నావురా, అని బోధచేస్తాడు. ఇలా గురువుద్వారా యీరహస్యాన్ని, ముఖ్యంగా పర్యవసానపాఠాన్ని వినటాన్ని, శాస్త్రాలలో శ్రవణంఅంటారు. 'నేనే ఎలా బ్రహ్మాన్ని అయినాను' అనే మీమాంసను మననంఅంటారు. మననం చేసినతర్వాత 'నేనే బ్రహ్మం' అని జ్ఞానంపొంది, ఆయానందంలో మునిగి ఉండటం నిదిధ్యాసనఅంటారు. అంటే పైజెప్పిన 'అహంబ్రహ్మాస్మి' అనే స్థితికి రావాలంటే, యీ శ్రవణ, మనన, నిదిధ్యాసనలు మూడు జరిపితేగాని

స్థితుల్ని అనుసరించి, వాటికి నాలుగు వాక్యాలుకూడా ఏర్పడ్డయి. వాటినే మహావాక్యాలంటారు. ఈ మహావాక్యాలంటే ఏమిటో విందాం.

క్రిందటి ఉత్తరంలోలాగా, జీవుడికి బ్రహ్మానికి భేదంలేదు అనేఅర్థాన్ని చెప్పేవాక్యాలను ఉపనిషత్తుల్లో మహావాక్యాలంటారు. అవిమొత్తానికి నాలుగు. అవికూడా పైయర్థప్రకారం శ్రవణ మనన నిదిధ్యాసనలరూపంగా ఉంటాయి. వీటిలో మొదటిది 'తత్త్వ సి' అనేవాక్యం. దీని అర్థం ఏమిటి? 'తత్' బ్రహ్మ 'త్వం' నీవు 'అసి' అయియున్నావు. దీన్ని గురువు, తన శిష్యుడికి చెప్తుతాడు 'నీవే బ్రహ్మానివిరా' అని. దాన్ని విన్నతర్వాత, నేనంటే ఆత్మగదా, కాబట్టి యీఆత్మయే బ్రహ్మము అనేఅర్థంతో విచారణచేస్తాడు శిష్యుడు. అంటే మననంచేస్తాడు. అలా మననపూర్వకమైనవాక్యం 'అయమాత్మా బ్రహ్మ' అనిఉంది శ్రుతుల్లో. 'అయం ఆత్మా' యీఆత్మ, 'బ్రహ్మ' బ్రహ్మంగాఉంది. ఈఆత్మ నేనేకాబట్టి, నేనే బ్రహ్మాన్నిఅని తీర్మానంచేసుకుని అంటాడుగదా 'అహం బ్రహ్మాస్మి' అని. 'అహం' నేను, 'బ్రహ్మ' బ్రహ్మ ముగా 'అస్మి' అయియున్నానుఅని తెలుసుకుంటాడు. అప్పుడు ఆ ధ్యానం దంలో, స్థిరమైన, సందేహరహితమైన స్థితిలోఉంటాడు. దీన్ని నిదిధ్యాసన వాక్యంఅన్నారు. తర్వాత ఆఅద్వితీయమైన ఆనందంలోమునిగి బాహ్య ప్రజ లేకుండాఉంటాడు. ఈస్థితిని సూచించటానికి 'ప్రజ్ఞానం బ్రహ్మ' అన్న నాలుగోవాక్యం చెప్పారు. ఇలా యీనాలుగు మహావాక్యాలు, క్రమక్రమంగా ఆ శిష్యుడిని గురువులంతటివాడినిగా చేసేస్తయి.

ఈవిధానంగా, మహావాక్యశ్రవణంచేత, 'నేనే బ్రహ్మమును' అనే అద్వైతజ్ఞానాన్ని పొందవచ్చునన్నారు పెద్దలు. పొందవచ్చునేమిటి? పొందాలి అన్నారు మరికొందరు. పొందాలి ఏమిటి? వేరుమార్గం అసలు లేనేలేదన్నారు యింకాకొందరు. అంటే వీళ్ళందరి అభిప్రాయంప్రకారం యీ అద్వైతసిద్ధి పొందాలంటే, యీ మహావాక్యశ్రవణమే మార్గంఅని తేలుతుంది.

సరే, యీ మననం ఎలా చేయాలి అనే విషయం, ముందు ఉత్తరంలో విందువుగాని, ప్రస్తుతం నిలుపుతాను.

ఆతడే మన దిక్కు.

ఆతడే మన గమ్యం.

1-3-46

# 26

# జ్ఞానయోగము

## శ్రవణాదులు-పంచకోశాలు

తమ్ముడూ మాతాజీ!

మననం ఎలాచేయాలిఅని ప్రశ్నకలిగింది పూర్వపుటుత్తరంలో. 'తత్త్వమసి' అనేవాక్యాన్ని శిష్యుడు గురువుద్వారా వినేటప్పటికి, యిక అతడు ఆలోచిస్తాడు 'నేను బ్రహ్మమా?' సరే 'నేనంటే ఎవరు?' అని. నేనంటాడు. సామాన్యంగా నేనుఅంటే యీస్థూలశరీరమే నేనుఅంటాడు మొదట్లో. అందరు అలాగే అంటారు. ఈదేహమే నేననిఅనకపోతే నేనుపుట్టాను, అందగాడిని, పొడుగైనవాడిని, చిక్కిపోయాను, అనే యిలాంటిభావాలు ఎలా కలుగుతయి? అందం, చందం, పొడుగు, పొట్టి, ఎరుపు, నలుపు, ఆరోగ్యం, అనారోగ్యం, అనేభావాలు దేహానివేగా! అయినా, దేహానికి అనకుండా నాకే అంటాడు. అందుకని, మొదట యీదేహమే నేనంటాడు. ఈదేహాన్నే శాస్త్రజ్ఞులు అన్నమయకోశంఅంటారు. 'దేహంఅంటే సులభంగాబాగుంది. అన్నమయకోశం అనేది జ్ఞాపకం ఉండదేమో' అంటావా? అలా వద్దు. శాస్త్రంలో ఉపయోగించిన పరిభాష తెలుసుకోవాలిఅని ముందుగానే చెప్పాను. ఇది అర్థంఅయినతర్వాత మరల ఏయితర గ్రంథాలు చదివినా, సులభంగా ఆగ్రంథాలుకూడా అర్థంఅవుతాయి.

అలాగా శాస్త్రాలప్రకారం కోశాలు అనబడేవి అయిదుగా ఉన్నయి. శిష్యుడి మననంకూడా యీఅయిదు కోశాలమీద నడుస్తుంది. కాబట్టి యీ కోశాలనుగూర్చి తెలుసుకోవాలి కొంచెంఅయినా.

మొదటిది 'అన్నమయకోశం' అన్నాను. అంటే దేహం అన్నంచేత తయారై, అన్నంచేత పెరుగుతూఉందికాబట్టి దానికాపేరు వచ్చింది. తర్వాత 'ప్రాణమయకోశం' రెండోది. ఇది వాయురూపాన ఉంటుంది. వాయువులో ప్రాణవాయువులనేది అసలు ఆధారంకాబట్టి ఆపేరు దీనికివచ్చింది. ఉఛ్వాస నిశ్వాసరూపంగాఉంది అది మనకు. మూడోది 'మనోమయకోశం'. దీనికి మనస్సేస్వరూపం. అందుచేత ఆపేరుపెట్టారు. తర్వాత నాలుగోది 'విజ్ఞాన మయకోశం'. దీనికి బుద్ధి ఆధారంగాఉంటుంది. చివరిది 'ఆనందమయ కోశం'. దీనికి ఆనందమేరూపం.

ఈఅయిదుకోశాల్లో, మొదట 'అన్నమయకోశం' తానే అని తీర్మా నించుకుంటాడు శిష్యుడు, తానే బ్రహ్మంఅని గురువు చెప్పాడుకాబట్టి. మొదట్లో 'అన్నమయకోశమే' బ్రహ్మంఅంటాడు. కాని కొంచెంసేపు ఆలోచి స్తాడు. బ్రహ్మన్నిగూర్చి శాస్త్రాల్లో ఏమిచెప్పారో చూస్తాడు. బ్రహ్మం నిరాకా రుడు. మరి, దేహానికి ఆకారంఉందే! పోనీఅనుకుంటే, యీదేహం క్షణ క్షణం వ్యాధులవల్లనో, ఉపవాసాలవల్లనో క్షీణిస్తున్నది, ఆహారంవల్ల బలుస్తు న్నది. చిన్నప్పటికంటే, అభివృద్ధి రోజురోజుకు అవుతున్నది. పుట్టుతుంది, చస్తుంది. ఇలా యిన్నిరకాల మారుతూవుంటే, యిదెలా అవుతుందయ్యా బ్రహ్మంఅంటేఅని సందేహిస్తాడు. ఈదేహం మారటం ఆరురకాలు. వీటినే షడ్భావవికారాలు అంటారు. 1.అస్తి = వున్నది 2. జాయతే = పుట్టుచున్నది 3. వర్ధతే = పెరుగుచున్నది 4. పరిణమతే = మార్పు చెందుచున్నది 5. అప క్షీయతే = క్షీణించుచున్నది 6. మ్రియతే = మరణించుచున్నది. ఇలా షడ్భావ వికారాలకు అనగాఆరురకాల మార్పులకుకట్టుబడ్డ యీశరీరం, యిలాంటి సర్వవికారాలకు అతీతంఅయిన ఆబ్రహ్మం ఎలాఅవుతుందయ్యా అని ఆలో చించి, ఆబ్రహ్మం ప్రాణమయకోశం అయిఉంటుందని అంటాడు. కాని మళ్ళా ఆలోచిస్తాడు. 'ఛీ' కాదంటాడు. ఎలాగంటే యీవాయువుమాత్రం

చలిస్తూ ఉండలేదూ? మన లోపలికిపోవటం బయటికిరావటం ఏమిటి? అలామారుతుందా బ్రహ్మం? అంటాడు. కాబట్టి బ్రహ్మం ప్రాణమయ కోశంకూడా కానేకాదయ్యా అంటాడు. అలాకాకపోతే మనోమయకోశం అనుకో, అందాక. సరే అంటాడు. అవును, దానికి ఆకారంలేదు నిజమే అంటాడు. కానివెంటనే, మనస్సు చాలచంచలంగా ఉంటుంది. అదీకాకుండా ఎప్పుడైనా మనస్సు బాగుండకపోతే నామనస్సు అంటాను. నేనే మనస్సులంటే బాగుంటుందంటాడు. 'అయినా నేనే మనోమయకోశం అయియుంటే, నా మనస్సుఅని ఎలాఅంటాను? నాదిగా ఉండేది, నేనుగా ఎలాఅవుతుంది? కాబట్టి యీమనస్సుకూడా నేనుఅనబడే బ్రహ్మంకాదు. అంటే మనోమయ కోశంకూడా నేనేఅనబడే బ్రహ్మం కాదంటాడు. దీనికంటే స్థిరత్వం గలిగి ఉండే బుద్ధిని బ్రహ్మం అంటే బాగుంటుంది అంటే, అదీ వీలులేదంటాడు. ఈబుద్ధినికూడా క్షణికంఅన్నారు శాస్త్రంలో. అంతేకాకుండా, బుద్ధిలే కుండాఉండే జీవులుఎన్నిలేవు! అంటే అలా బుద్ధిలేనిజీవులు బ్రహ్మం కాదన్న మాటేగా! అలాఉంటానికి వీలులేదు. కాబట్టి బుద్ధిరూపంగాఉండే యీ విజ్ఞానమయకోశంకూడా బ్రహ్మంకాదంటాడు. చివరకు ఆనందమయకోశం అంటే బాగుంటుందంటాడు. అయినా ఆనందమయకోశంఅనేది ఆనందం తోనిండి ఉండేదనిగదాఅర్థం. బ్రహ్మంఅంటే ఆనందస్వరూపమేకదా! ఈ రెండూ ఎలాఒకటవుతాయి అనిఅంటే అవునంటాడు. ఆనందంలేని సమయాలుకూడా మనకుంటున్నయికదా! ఆనందమయకోశమే బ్రహ్మం అయితే, బ్రహ్మంలేకుండా ఉంటాడన్నమాట ఆనందంలేనివాడు. బ్రహ్మమే లేకపోతే నేనేఅది అయిఉన్నప్పుడు యిక నేనెల్లాఉంటాను? ఇదికూడా విరు ద్ధంగానేఉంది అనితీర్మానించుకుంటాడు. అలా పంచకోశాలు అనబడే అన్న మయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయకోశాలు, నేనుఅయిన బ్రహ్మంకాదుఅని ఖచ్చితంగా తీర్మానించుకొనేటప్పటికి వాడి బుద్ధి విశాలంఅయిపోతుంది. తానే బ్రహ్మంఅని అప్పుడు తెలుసుకుంటాడు. ఈకోశాలే బ్రహ్మంఅంటే, యీకోశాలకున్న అన్నిలోపాలు, సంకుచిత త్వాలుఅన్నీ బ్రహ్మానికికూడా చెప్పవలసిఉంటుంది. వీటిలోఉన్న లోపాలు

గాని, గుణాలుగాని, ఆబ్రహ్మంలో ఏమాత్రం ఉండటానికి వీలులేదు కాబట్టి, ఎలా సమన్వయం చేసుకుందామన్నా వీలులేకుండా ఉంటుంది కాబట్టి మనకు కనిపిస్తూ ఉండేవికాని, యోచనకు అందేవికాని ఆ బ్రహ్మం కాదని యీచర్చవల్లనే తెలుతున్నది.

అయితే, యిక నేనేఅనే బ్రహ్మం ఎలాఉంది అనేటప్పటికి వేదాలు అన్నయికదా 'అబ్బాయీ! నీవెంత పిచ్చివాడవురా నాయనా! మనస్సుకే అతీతమైనదని చెప్పడానికి మనోమయకోశం బ్రహ్మం కాదన్నాముగదా! మనస్సుకే అందనిదాన్ని యిక ఎలాచెప్పమంటావు' అనిఅంటూ, యీబ్రహ్మం అవాఙ్మానసగోచరం అన్నాయి. అంటే వాక్కుచేతగాని, మనస్సుచేతగాని, తెలుసుకోటానికి వీలేలేదన్నాయి శాస్త్రాలు. అయితే ఎలాగయ్యాలంటే అనుభవించాలిసిందేఅన్నాయి. సామాన్యమైన మన అనుభవాలనే అర్థంచేసుకొని, చెప్పటానికి వీలుకాకపోతే, యిక బ్రహ్మాన్నిగూర్చి ఎలాచెప్పేది? పంచదారతీని ఎలాఉందని చెప్పుతావు? దానిరుచిని తెలియనివాడికి ఎలాగయినా చెప్పలేవు. అలాగేఅనుకో. ఆబ్రహ్మం యిలాగఅని అనుభవంచేత తెలిసినా, ఆలోచనకుకాని, మాటకుగాని వచ్చేదికాదుఅని దీనికంతా సారాంశం.

ఈచెప్పినచొప్పున శ్రవణం, మననంచేసి, నిదిధ్యాసనఅనే అనుభవంలోమునిగిఉంటే వాడిని జ్ఞానిఅంటారు. బ్రహ్మవిదుడనికూడాఅంటారు. జీవన్ముక్తుడనికూడా వ్యవహారంఉంది. వీడి అజ్ఞానంఅంతా నశించింది కాబట్టి, అజ్ఞానమే యీజననమరణప్రవాహరూపమైన సంసారానికి కారణం కాబట్టి, నేనేబ్రహ్మంఅనే అనుభవరూపమైనజ్ఞానం కలిగేటప్పటికి, వీడి అజ్ఞానంనశించి యిక జన్మలోకిరాడు. వాడికి మాయచేత కల్పించబడిన ఆవరణం తెగిపోయిందికాబట్టి, కేవలానందస్థితిలో లయించి, అంటే అన్నింటికీ అతీతమైన బ్రహ్మమే తానై, ఆయనసమానమైన ఆనందమే తానైఉంటాడు. ఇంతకంటే వాడిస్థితినిగూర్చి చెప్పటానికి వీలులేదు. ఆబ్రహ్మం ఎంత అనిర్వచనీయంఅన్నామో, ఆబ్రహ్మం మనస్సుకు అందనివాడనిఅన్నామో, అలాగే యీ బ్రహ్మవిదుడుకూడా అనిర్వచనీయంగా ఉంటాడు. దీన్నే జ్ఞానమార్గం అంటారు.

ఇప్పటికి కర్మమార్గంఅంటేఏమిటో, రాజయోగసారంఏమిటో, భక్తి యోగరహస్యంఏమిటో, తర్వాత జ్ఞానమార్గంలోఉండే స్థితులుఏమిటో విన్నావు. దీన్నిబట్టి ఏదిముందు ఏదివెనుక అనేవిషయం, నేను వేరుగా చెప్పనవసరంలేకుండానే గ్రహిస్తావు. ఒక్కొక్కదాంట్లోఉండే రహస్యాలన్నీ చూచావుకాబట్టి, వాటిని సక్రమంగా అనుసరించాలి, ఆచరించాలి. అప్పుడు గాని అనుభవానందరాశి నీకు లభించదు. ఇక నీవు ఆలోచించుకుని, ఏది ఎలాచెయ్యాలో తీర్మానించుకుని, ఆధ్యాత్మికరంగంలోకి దిగు. భయం మాత్రంవద్దు. కష్టం అనుకోవద్దు. ముందు కష్టంగాఉన్నా, తర్వాత సులభం అయ్యే విషయాలు ఎన్నిలేవు! మన భయాలు ఎలా ఉంటయిఅంటే, ఒక చిన్నవిషయం చెప్పుతాను విను. చీకటిపడ్డతర్వాత, మీఅమ్మ నిన్ను పిలిచి 'అమ్మాయీ! బజారుకెళ్ళి అరటిపండ్లు తె'మ్మన్నదిఅందాం. చీకటిగాఉంది కాబట్టి ఒకదీపాన్నికూడా యిచ్చింది. దారినికూడా చెప్పింది. కాని నీవు అంటావు 'అమ్మా! ఈదీపం కొంచెందూరమే కనిపిస్తుందిగదా! నేను అంత దూరంవెళ్ళాలే ఎలాగ?' అంటావు. ఎంతతెలివో చూచావా! చేతిలో దీపం పట్టుకుని పోతూఉంటే, దీపంకాంతి నీతోకూడా బజారుదాకారాదూ! అయినా తెలివితక్కువచేత అంటావు. 'దీపం నీతో వస్తుందికాబట్టి వెలుతురు కూడా వస్తుందిలే పో' అని నచ్చచెప్పితే పోతావు. తర్వాత తెలుసుకుంటావు. అలాగ తెలుసుకున్నది కొంచమేగదా, మార్గంచూస్తే చాలాఉందే ఎలాగ? అనే భయం వద్దు. ఈవెల్తురేకాక, పోనుపోను యీప్రకాశం పెద్దదవుతుంది. ఇంక అధైర్యం ఎందుకు? కాన జంకకుండా దిగు.

కాని, యింకా ముఖ్యవిషయాలు కొంచంఉన్నాయి. వాటినికూడా వినాలి. వాటిని తర్వాత ఉత్తరాల్లో చెప్పుతాను.

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం.

1-3-46

# 27

# జ్ఞానయోగము - అనుభవము

చిన్న చెల్లీ మాతాజీ!

జరిగిపోయిన 26 ఉత్తరాలద్వారా, ఆధ్యాత్మికానందానికి కారణభూత మైన నాలుగు యోగాలనుగూర్చి విన్నావు. ఈమార్గాలవల్లకలిగే ఫలితాలలో గూడా, చాలా తారతమ్యముండంది. ఏమిటంటావా? చూడు. కర్మయోగఫలి తాలేమన్నాం? ఏయజ్ఞం చేస్తాడో, ఆయజ్ఞం చేయటానికి కారణమైనలేమిని పోగొట్టుకుంటాడు. అంటే, పిల్లలులేక యజ్ఞంచేస్తే పిల్లలు పుట్టుతారు. ధనంలేకపోతే ధనాన్ని పొందుతాడు. చివరికి స్వర్గంకోసంచేస్తే ఆస్వర్గాన్ని పొంది, తత్సంబంధమైన సుఖాలు పొందుతాడు ఆయజ్ఞకర్త. అందుకని, యజ్ఞఫలితంగా యీలోకంలో ఏదైనా లాభంపొందాడంటే, అది కేవలం యీ లోకసంబంధమైన సుఖాలు అయివుంటయి. ఎప్పుడైనా యీవిషయసుఖా లంటే సంకుచితమేగా! కాబట్టే, యింతధనప్రయాసలు వ్యయంచేసి యజ్ఞం చేస్తే, వాడు చిరస్థాయిఅయిన ఆనందాన్ని పొందడు. వాడికి ఆభావంకూడా లేదు. పోనీ, స్వర్గాన్ని పొందుతాడయ్యా అందామంటే ఆస్వర్గసుఖాలైనా ఎంత కాలం? అసలు యీకర్మకాండను బోధించే పూర్వమీమాంసాశాస్త్రప్రకారం

యజ్ఞంచేస్తూఉంటేనే, దానిఫలితంగా ఒకశక్తిపుట్టుతుంది. ఆశక్తిని 'అపూర్వం' అంటారు. యజ్ఞకాలంలో పుట్టిన ఆశక్తి, యీయజ్ఞకర్త చనిపోయిందాకా ఏమీ ప్రయోజనంలేకుండానే వాడికి దగ్గరనేఉంటుంది. కనపడదులే. ఆ యజ్ఞంచేసిన సోమయాజి చనిపోయేటప్పుడు, అతడి సూక్ష్మశరీరంవెంటనే యిది బయలుదేరుతుంది.

సూక్ష్మశరీరంఅంటే ఏమిటో నీకు తెలుసా? చెప్పుతాను విను. జీవికి మూడు శరీరాలుంటాయి. మనకు కనపడుతూ, కాళ్ళు, చేతులు, యితర అవయవాలతోగూడివున్న యీశరీరం 'స్థూలశరీరం' అంటారు. దీన్నే 'అన్నమయకోశం' అని పూర్వంఅన్నాం. ఈశరీరం యిక్కడే ఉండిపోతుంది, మనిషి చనిపోయినతర్వాత. దీనిలో మరొక శరీరంఉంది. అదే 'సూక్ష్మ శరీరం'. కోశాల్లో అన్నమయం తర్వాతఉండే ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయాలు, సూక్ష్మశరీరం అంటారుకొందరు. కాని, మన రామ కృష్ణుడుమాత్రం అలాఅనక, అన్నమయ ప్రాణమయాలు స్థూలశరీరం అనీ, మనోమయవిజ్ఞానమయాలు సూక్ష్మశరీరమనిఅన్నాడు. ఇలాగ స్థూల సూక్ష్మ శరీరాలకు నాలుగుకోశాలుపోగా యిక ఒక్కకోశంఉంది. అదేది? ఆనంద మయకోశం. దీన్నే 'కారణశరీరం' అంటారు. ఇది అతిసూక్ష్మంగా ఉంటుంది. ఒకవేళ శ్రమించి, మొదటి స్థూలశరీరాన్నేగాక, సూక్ష్మాన్నైనా గ్రహించవచ్చుగాని, యీకారణదేహాన్నిమాత్రం గ్రహించటం అతికష్టం. కష్ట మేమిటి? దుర్లభం, దుస్సాధ్యం అనాలి. జీవికి ప్రాణంపోగానే, యీ సూక్ష్మ, కారణశరీరాలు రెండూకలిసి, యీస్థూలశరీరంలోనుంచి బయలుదేరు తయి. మనవాళ్ళు సాధారణంగా యీరెండుశరీరాలనే జీవుడని, ప్రాణం అని అంటూఉంటారు. పైనచెప్పిన 'అపూర్వం' అనేశక్తి యీసూక్ష్మ, కారణ శరీరాలవెంట బయలుదేరుతుంది. ఆజీవుడికి నాయకురాలై, పరలోకాలకు తీసుకొనివెళ్ళుతుంది. ఈపరలోకాల్లోనే, పుణ్యం చేసుకున్నవాళ్ళు సౌఖ్యాలు అనుభవిస్తారు. ఆపుణ్యకర్మఫలితంగా, ఆలోకాల్లో యీ'అపూర్వం' వాడికి, ఆయజ్ఞానికితగిన సుఖాలను కలుగజేస్తూ అనుభవింపజేస్తుంది. అతడు ఆ సుఖాలను అనుభవిస్తున్నకొద్దీ, యీ 'అపూర్వం' పెట్టెలో డబ్బులాగా ఖర్చు

అయిపోతుంది. ఈ 'అపూర్వం' పూర్తిఅయ్యేటప్పటికి వీడిసుఖాలు స్వర్గాలలో పూర్తిఅయిపోతాయి. అప్పుడు వాడేమవుతాడు? ఆ ఊర్ధ్వలోకాల నుండి ఒక్కసారిగా క్రిందికి పడతాడు మన మానవలోకానికి. మరల పుట్టి మామూలుప్రకారం అవుతాడు. దీనివల్ల ఏమితేలింది? ఈప్రపంచంలో సుఖాలు ఎంతఅశాశ్వతమో, ఆపరలోకసుఖాలుకూడా అంతఅనిత్యమే అని, వీటికంటే పరలోకసుఖాలు కొంచెంఎక్కువగా ఉండవచ్చు, యింకా ఎక్కువ కాలం జరుగవచ్చు. ఎలాగైనా, ఎప్పటికీ ఉండేవిమాత్రం కావులని నిర్ధారణ.

రాజయోగం చూద్దామాఅంటే, దానివల్ల ఏమిలాభం? ధర్మప్రవృత్తి, అంటే నైతికజీవితం లభ్యంఅవుతుంది. దేహదార్ఢ్యం, నాడీబలం, మనోస్థైర్యం, బుద్ధిసూక్ష్మత, మొదలైన శుభలక్షణాలు కలుగుతాయి. ఈ లక్షణాలు యితరయోగాలకు ఉపయుక్తం అయ్యేవేకాని, ప్రత్యక్షంగా ఆ మోక్షాన్ని యివ్వనేరవని తీర్మానంచేశారు.

తర్వాత భక్తియోగం అందామాఅంటే, అదిమాత్రం జపాలచేత, తపాలచేత తంటాలుపడుతూ, ఆపరమేశ్వరుడికోసం తన్నుకుంటే, ఆ భగవంతుడు కొంతసేపు కనిపించటం, తర్వాత అంతర్ధానంకావటం. కనిపించేటప్పుడు కలిగేఆనందానికి పరిమితేలేదు. బాగానేఉంది. కాని మరల ఆ యిష్టదైవం ఎప్పుడు అదృశ్యంఅవుతాడో, అప్పుడే ఆఆనందంకూడా జారిపోతుంది. మరల దుఃఖంప్రారంభం. దాన్నే గ్రంథాలలో విరహవేదన అన్నారు. జీవించినంతకాలం యీదుఃఖంలేకుండా, ఏభక్తుడు ఆనందంలో నిలిచి ఉన్నాడు? రాధికనుచూడు, చైతన్యునిచూడు, మీరా, సక్కు యింకా వెయ్యి భక్తులచరిత్రల్ని చూడు. వాళ్ళఆనందంలో హెచ్చుతగ్గులేకాకుండా, అంటే అపరిమితమైన ఆనందంకాక, అలాంటి అతిదుఃఖం గోచరిస్తూ ఉంటుంది. సరే, వీరికి ఎడతెగని ఆనందం ఎప్పుడందాం? ఆవైకుంఠాన్నో, కైలాసాన్నో, యిలాంటి మరొకలోకాన్నో పొంది, తమ యిష్టదైవంయొక్క సన్నిధానంలో ఉండే అవకాశంవచ్చి, జన్మరాహిత్యంకలిగి, అంటే మరల యీలోకానికి వచ్చి, జననమరణపరంపరలలోపడటం ఎప్పుడు నిలిచిపోతుందో, అప్పుడు అలాంటి నిత్యానందాన్ని అనుభవిస్తారు. కాని ఆఆనందానుభూతి యిక్కడ

కాదుగా! భక్తిమార్గంలో మన రామకృష్ణుడు సాధన చేసి, భగవతీ దర్శనం పొందాడుకదా! కాని ప్రథమ దర్శనంలోనే 'అమ్మా! నీవు నా వద్దనేఉండు. అమ్మా! అని పిలిచినవెంటనే కనిపించు' అని ఆజగన్మాతను వియోగం లేకుండా అర్థించాడు రామకృష్ణుడు. అదే ఆయన భక్తిలోని ప్రత్యేకత. అద్వైతానుభూతి పొందినతర్వాతకూడా అంతటా ఆలోకమాతనే దర్శించిన ఆయనకు విరహంఏది? అందుచేతనే ఆయనకు దుఃఖంలేదు. ఆయనకు సర్వావస్థలలో ఆనందమే. ఇది యితరభక్తులలో గోచరించదు.

ఇక, జ్ఞానయోగంలో చూచామూఅంటే, దీని పద్ధతేవేరు. మొదటి నుండి సాధనసంపత్తిని గట్టిచేసుకుంటూ, అస్థిరమైన యీప్రపంచసుఖాలపై బుద్ధిపెట్టక, వీటిఅన్నింటికి అతీతమైన ఆత్మానందంలో నిమగ్నం అయి ఉంటాడుజ్ఞాని. ఈప్రపంచంలోఉండే సుఖాలుగాని, కష్టాలుగాని, అతన్ని చలింపచేయలేవు. అతడికి, పైమార్గాలలోగల ఉద్రేకమైన ఆనందాలతో సంబంధంఏమాత్రం లేనేలేదు. ఈప్రపంచం వాడిని కన్నెత్తి ధైర్యంగా చూడనే లేదు. అందుచేత జ్ఞానిఅనేవాడు, అతినిశ్చలమైన చిత్తంతో, అత్యధికమైన ఆనందంతో, అతిగంభీరమైన రూపంతో, ఎడతెగని శాశ్వతమైన ఆనందంలో మునిగిఉంటాడంటేనమ్ము. ఈనిర్వచనకూడా సరిలేదేమో! ఆ అనిర్వచనీయమైన, అనుభవవేద్యమైన, అనుభవానందమే తానని తెలుసుకుని, ఆ జ్ఞానానందంలో మునిగిఉంటాడని నమ్ము. పైవిధంగా, యితర మార్గాలలో ఎప్పుడో, ఎక్కడో, ఎలాగోఉండే ఆనందం, యీజ్ఞానమార్గంలో యిప్పుడే, యిక్కడే, అంతులేకుండాఉంది. ఇది యీ జ్ఞానమార్గంయొక్క ఘనత!

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం.

(signature)
4-3-46

28

# సాధన చతుష్టయము

## వివేకము

ప్రియమైన మాతాజీ!

'చాలబాగుంది. అలాగా యీజ్ఞానమార్గం అంతగొప్పదైతే దాన్నే అను సరిస్తాను. అవ్యయమైన ఆనందాన్ని యీలోకంలోనే అనుభవిస్తాను' అంటావా. అవును. పైకి అంతఆకర్షవంతంగా వుంటుంది యీజ్ఞానమార్గం. 'దీంట్లో యజ్ఞాలులేవు, ఆసనప్రాణాయామాలు లేవు, జపాలు లేవు, తపాలు లేవు. కాబట్టి ఊరికే, ఉద్రోడియంగా వీటికన్నింటికిమించిన అనుభవా నందసాగరం లభిస్తుంది. అందుకనే దీన్ని అవలంబిస్తాను' అని అనుకుంటు న్నావుకాబోలు. అంత సున్నితం, సులభంకాదు యీమార్గం. వాటిల్లోఉన్న నియమాలు సులభంఅనిపిస్తయిగాని, యీజ్ఞానమార్గంలోఉండే కట్టుబాట్లు చాలకఠినం. ఈమార్గం త్రొక్కాలంటే చాలయోగ్యతలు సంపాదించి వుండాలి. అప్పుడుగాని యీజ్ఞానమార్గం సులభంఅయి, దీనిలోఉండే అను భవసంపద లభించదు. ఆనియమాలు ఏవో, ఆలక్షణాలు ఎలావస్తాయో, ఆ విషయం యికచూద్దాం.

భక్తియోగంలో భక్తిఅంటే ఏమిటో నిర్వచనంచేస్తూ, భక్తియే త్యాగం,

త్యాగమే భక్తిఅనిచెప్పాను. భగవంతుడిమీద దృష్టినిఉంచి చూస్తే భక్తిఅంటామని, ఆదృష్టినే అవసరంలేని ప్రపంచంమీదికి త్రిప్పితే త్యాగంఅంటామని చెప్పాను. ఈరెండూ కలిసేఉంటయి. ఈరెంటివల్ల కలిగేది జ్ఞానంఅనిఅర్థం. భక్తి దేనిమీద? ఎందుకు? అనేది మొదటిప్రశ్న. త్యాగం దేన్నిచేయాలి? ఎందుకు? అనేది రెండోప్రశ్న. వీటివల్లకలిగే ప్రయోజనం ఏమి? అనేది మూడోప్రశ్న. ఇలాచేస్తే మనలో కలిగేమార్పేమిటి? అనేది నాల్గోప్రశ్న. ఈ నాల్గు ప్రశ్నలకు సమాధానాలే యీజ్ఞానయోగానికి పునాది. ఈప్రశ్నలకు సరియైన సమాధానాలు తెలుసుకోకుండా, ఆసమాధానాల్లో వచ్చేలక్షణాలు పొందకుండా యీజ్ఞానమార్గం లభించదు. అంతేకాదు, యీజ్ఞాన మార్గంలో ప్రవేశించటానికే వీలులేదు. జ్ఞానసౌధానికుండే ద్వారం, యీ గుణాలు పొందితేగాని తెరువబడదు. అందుకని యీలక్షణాలను తప్పక పొందితీరాలి యీజ్ఞానమార్గాన్ని కంటితోనైనా చూడకముందే. ఇక యిలాంటప్పుడు, యీలక్షణాల్ని ఎంతముఖ్యంగాచూడాలో చెప్పాలీ! ఆ గుణాలకు మించినసంపద ప్రపంచంలో మరొకటి ఉంటుందీ? ఈలోకంలో ఏమిటి, మరొకలోకంలోనైనా, యీసంపదకుమించినసంపద లేనేలేదంటే నమ్మ తల్లీ! ఆకారణంచేత, యీగుణాల్ని సాధనసంపత్తిఅన్నారు. ఇవి **నాలుగుకాబట్టి** చతుష్టయం అనేపదాన్ని చేర్చారు. అందుకనే, యీజ్ఞానసౌధానికి ముందు ద్వారపాలకుల్లాగాఉండే యీనాలుగు లక్షణాలను 'సాధనచతుష్టయసంపత్తి' అన్నారు. దీనికెంత ప్రాముఖ్యతఉండాలో అంతప్రాముఖ్యతఉంది. వ్యాసభగవానులు బ్రహ్మసూత్రాలువ్రాస్తూ, మొదటిసూత్రంలోనే, ఆబ్రహ్మనుగూర్చి చెప్పకముందే, 'ఈలక్షణాల్ని ముందు సంపాదించరా అబ్బాయీ!' అంటానికి 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' అన్నారు. అంటే 'సాధన చతుష్టయసంపత్తిని సంపాదించుకున్నతర్వాత బ్రహ్మజిజ్ఞాస చెయ్యి' అనిగట్టిగా బల్లమీద గుద్దుతూ పలికాడు. అందుచేత, అంతముఖ్యం అన్నమాట యీ సాధన చతుష్టయసంపత్తి.

సాధనచతుష్టయం అంటే నాలుగన్నాను. అవి ఏమిటో చెప్పుతాను యికవిను. 'నిత్యానిత్యవస్తువివేకం' అనేది మొదటిది. 'ఇహాముత్రఫలభోగ

విరాగం' రెండోది. 'శమాది షట్కం' మూడోది. 'ముముక్షుత్వం' నాలుగోది. ఇక యీనాల్గింటివివరణ చూద్దాం.

మొదటిది నిత్యానిత్యవస్తువివేకం అన్నాం. ముందు దీంట్లోఉండే మాటలకు అర్థంతెలుసుకోవాలి. నిత్యంఅంటే ఏమిటి! అనిత్యం అంటే ఏమిటి? వాటి వివేచనఏమిటి? మొదటినుండి నీవు విన్నవిషయాలన్నింటిని, ఒక్కొక్కటిగా జ్ఞాపకం చేసుకోవాలి. వాటిని, వీటితో సమన్వయం చేసుకుంటూ అర్థంచేసుకోవాలి.

నిత్యం, అనిత్యంఅనే రెండుమాటల్లో ఏఒక్కదాన్ని అర్థంచేసుకున్నా రెండోది తెలిసిపోతుంది. నిత్యాన్ని తెలుసుకోటానికి శాస్త్రానికిపోవాలి. అనిత్యపదానికి అర్థంకోసం ప్రపంచానికిపోవాలి. అలా ఎందుకన్నానంటే శాస్త్రానికి అనిత్యపదార్థంతో అవసరమేలేదు. దాన్నిగూర్చి ఆశాస్త్రం చెప్పవలసిన అగత్యం యింకెందుకుంటుంది? కాబట్టే అనిత్యాన్ని శాస్త్రంలో గ్రహించలేము. మరి నిత్యం ఎందుకక్కడుంటుంది? అంటే, శాస్త్రం సామాన్యవిషయాన్నికాక అసాధారణ విషయాన్నిగూర్చి చెప్పాలి. అనిత్యాన్ని అనుభవిస్తున్న, అనిత్యులైన జీవుల్ని నిత్యుల్నిగాజేసి, నిత్యత్వాన్ని అనుభవించటానికి దారిచూపేది శాస్త్రంకాబట్టే ఆనిత్యాన్నే చెప్తుతుంది. కాబట్టే నిత్యంకొరకు శాస్త్రంలో వెతకాలిఅన్నాను. అలా శాస్త్రాల్లోచూచినా యీనిత్యాన్ని అర్థం చేసుకోటానికిముందు, మన అనుభవంలోఉండే అనిత్యాన్నిగ్రహిస్తే దీన్నిబట్టి ప్రస్తుతం మన అనుభవంలోలేని నిత్యం తెలుస్తుంది. మనకు తెలియనిదాన్ని తెలుసుకోటానికి, తెలిసినదానిద్వారా తెలుసుకోవటం సులభం. కాశీ ఎలా ఉంటుందని అడిగావుఅనుకో. నేను, దాన్ని నీకర్థంచేయటానికి దానిలాంటిదో, దానికివిరుద్ధంగా ఉండేదాన్నో నీకు తెలిసినపట్నాన్ని తీసుకుని, దాన్నిబట్టి నీకు కాశీని అర్థంచేయిస్తాను. ఎలాగఅంటే, నీకు రాజమండ్రి తెలుసు. పెద్దపట్నం, ప్రక్కనే గోదావరిమహానది, రైలువంతెన, కట్టమీదనే యిళ్లు మొదలైనవాటితో శోభాయమానంగా ఉంటుంది. ఒడ్డునే స్నానానికి వీలుగా అనేకఘట్టాలున్నాయి. వాటిల్లో అనేకులు స్నానాలు చేస్తూనేఉంటారు. ఇది రాజమండ్రి. అలాగే కాశీకూడా. రాజమండ్రికి గోదావరినదిగాని కాశీకి

యింకా పవిత్రమైన గంగానదిఉంది. ఇక్కడలాగే వంతెన, ఘట్టాలు, స్నానాలు అన్నీఉంటాయి. కాని యింకాఎక్కువగా ఉంటాయి. అంతటా ఎప్పుడూ జనమేఅని, నీకు తెలిసిన రాజమండ్రితోపోల్చి చేప్పేటప్పటికి, కొంతవరకు నీకు కాశీ అర్థంఅవుతుంది. అలాగే కాశీనిగూర్చి నీకు చెప్పటానికి మరొక విధానంఉంది. విరుద్ధవిషయాలు చెప్పటం. ఉదాహరణకు మన భీమిలి దగ్గ రున్న చిట్టివలసఅనుకో. ఈచిట్టివలస అనేగ్రామానికి, కాశీకి ఉండేసంబంధం ఏమిటి? అంతావిరుద్ధమే. చిట్టివలసలాగా చిన్నగ్రామంకాదు కాశీ. తాటి ఆకులయిళ్లులేవు కాశీలో. మట్టిరోడ్లుకాక తారురోడ్లు, సిమెంటురోడ్లు కాశీలో. కూలిజనం ఎక్కువ చిట్టివలసలో. యాత్రికులతో నిండిఉంటుంది కాశీ. చిట్టివలసకు దూరంగా నీళ్లులేనిది, కాకపోతే ఉప్పునీటి గోస్తనీనది ఉంది. అలాకాక కాశీకే ఆనుకుని చాలపెద్దదై, పవిత్రమైనగంగలోఉంది కాశీ. ఈవిధంగా అనేకభేదాలు నీకుచెప్పి, చిట్టివలసకుండే లక్షణాలకు విరుద్ధవిష యాలతో నిండినది కాశీపట్నమని నీకు బోధపరుస్తాను. ఈరెండువిధాల నీకు కాశీనిగురించి తెలుస్తుంది.

అలాగే, నిత్యంవిషయం గ్రహించాలంటే మనకు రోజూ తెలుస్తూ ఉండే అనిత్యాన్ని తెలుసుకుంటే నిత్యం బోధపడుతుంది. అనిత్యంవిషయం మనకుతెలుసుగాఅంటావు. కొంచెం సూక్ష్మదృష్టితోచూస్తే అంతాఅనిత్యమే, అంతాక్షణికమే, మనం అనుభవించేదంతా. ఎలాగంటావు? చెప్తుతాను విను.

ఈలోకంలో అనేకవిషయాలు చూస్తున్నాం. ఉదాహరణకు చూచుకో. చదువుకోటానికి ఒకపుస్తకం కొన్నావు. కొన్నిరోజులు, ఆ కొత్త పుస్తకం కొత్తవాసనతో, ముచ్చటగా, మాయకుండా ఎంతో బాగుంటుంది. దాన్ని ఎవరైనాతాకితే నీవుఒప్పుకోవు. మరలమరల, దానిలో బొమ్మలు చూస్తావు. రెండోరోజు ఆముద్దు తగ్గుతుంది. అట్టలుకూడా మాస్తయి. మూడోరోజుకు కాగితాలు నలుగుతయి. ఆముచ్చటకూడా చాలతగ్గింది. అలా, ఒకవారం అయ్యేటప్పటికి అది, దాని చినిగిపోయినఅట్టలు, కాగితా లతో వీధిలోఉంటుంది. ఎంతకాలంఉంది ఆపుస్తకం? ఎంతకాలంఉంది ఆ ముచ్చట?

ఇంకోవిషయం చూడు. ఎంతోకష్టంగా, తొమ్మిదిమాసాలు మోసి కన్నది బిడ్డను తల్లి. బిడ్డ తనచేతుల్లో ఉండేవరకు ఎంతప్రేమ! ఎంతముద్దు! కొంచెం ఏడుస్తూడుంటే 'వెధవ బిడ్డ' అయిపోయాడు తల్లినోటిద్వారా. నడి చేటప్పుడు, కొంటెపనులు చేసేటప్పుడు, యిక చీవాట్లకు, దెబ్బలకు లెక్క లేదు. ఆటల్లోపడి, స్కూలుకువెళ్ళేయాడులో, ఎన్నికర్రలు విరుగుతాయో! పెండ్లి అవుతుంది, దూరం యింకాలవుతాడు. 'వెధవా! నీభాగం నీవు పుచ్చు కుని, నీవూ నీపెళ్ళాం వేరేడుండండి' అంటారుతర్వాత. మొదటిముద్దు ఏ యేట్లోకలిసింది? మొదటిప్రేమ ఏ యాత్రకు పోయింది? అంతే అన్నీ యీ ప్రపంచంలో.

నీకు, అప్పుడప్పుడూ లభిస్తున్న డబ్బును దాచుకుని, ఒక పావలాతో పూలుకొన్నావు తలలోపెట్టుకోటానికి. ఎంతకాలం అవిఉంటయి? తెల్లవారే టప్పటికితీసి దూరంగాపారేస్తావు. ఎందుచేత? వాటివాసన, వాటిఅందం, ఒక్కపూటలో పోయాయి. గులాబిపువ్వు ఎంతఅందం! ఎంతవాసన! చెట్టు నుండి కోయగానే దానిసొగసుపోయింది. రెక్కలు రాలాయి.

ఈవిధమే, యీప్రపంచంలోఉండే సర్వవిషయాలు. అయితేకొంచెం సూక్ష్మదృష్టితో చూడాలి. ఈవిధంగా ఆలోచించేకదూ గౌతముడు బుద్ధుడై పోయాడు! వృద్ధుడినిచూచి, తనభార్య యశోధరకూడా అంతపక్కనది, యౌవనంలో వున్నదికూడా, యీవిధంగా ముసలిదిఅవుతుందా అనిఅడిగి, అవుతుందని చెన్నడు చెప్పేటప్పటికి నిలువున నీరైపోయాడు. అలాగే రోగిని చూచినా, శవాన్నిచూచినా. అలాగే యోచించితే, యీప్రపంచంఅంతా బుద్బుదప్రాయమేగదా! నీటిబుడగ ఎంతచక్కగా ఉంటుంది! కాని ఆహాహా అని పట్టుకుందామంటే, ముద్దుపెట్టుకుందామా అని ముందుకు పోయేటప్ప టికి, దాన్ని తాకకముందే టప్అని విట్లిపోతుంది. అయ్యో! పోయిందను కుంటాం. అలాంటిదే యీప్రపంచంలో సర్వమూను. ఈ ప్రపంచంఅయినా అంతే. అనుభవించాలని అనుకుంటూవున్న మనంమాత్రం అంతేకాదూ? ఇప్పుడు శనగల్ని నమిలేపండ్లు నాలుగు సంవత్సరాలకేమౌతాయి? అన్నాన్ని నమలటానికికూడా వుండవుగదా! అలాగే యీప్రపంచాన్ని అనుభవిస్తూవున్న

శక్తి ఎంతకాలండుంటుంది? నాలుగు సంవత్సరాలు దాటేటప్పటికి అంతా తారుమారైపోదూ? అనుభవించాలని బుద్ధివుంటున్నా అనుభవించే శక్తి మాత్రంలేక కుళ్ళిపోయేవాళ్లెందరులేరు! పోనీ, యీశక్తిపోయేవరకైనా ఉంటా మని ఎవరు నమ్మకంచెప్పగలరు? గ్యారంటీలేదు. ఏక్షణాన ఎలా మారిపో తుందో! 'గోడమీద పిల్లి తా పొంచియున్నది కనిపెట్టి తిరుగవే చిలుకా' అన్నట్లు ఆమృత్యుదేవి మనవెంటనే కాచుకొని వుంటున్నది. ఆమృత్యువుకు అధీనంకానివాళ్ళెవరైనా వుండగలరా? ఎంత జాగ్రత్తపడ్డా, యీమార్పులు తప్పనేతప్పవు యీమాయాప్రపంచంలో యీచంచలలోకంలో. దీనిప్రకారం అనుభవించే కర్త, అనుభవించబడే కర్మ, రెండూకూడా అశాశ్వతంగా వున్నయి. అందుకనే ప్రపంచం అంతా అనిత్యం అన్నాం.

పోనీ, యీలోకంకాకపోయినా, యీలోకంలో పుణ్యకర్మ చేసుకుంటే పరలోకాల్లో, దేవలోకంలో ఎందుకు శాశ్వతంగావుండవు సుఖాలు అంటా వేమో! కాని, ఆవిషయం యిదివరకే యజ్ఞాలు, వాటిఫలితాలు మొదలైన వాటినిగూర్చి చర్చించేటప్పుడు చెప్పాను. ఆయజ్ఞంలోనుండి పుట్టిన 'అపూర్వం' వున్నంతకాలంమాత్రమే ఆపరలోకసుఖాలు. తర్వాత మరల, పునరావృత్తి అనబడే జన్మపరంపర తప్పదు. ఇక్కడ, సుఖాలు ఎంతనిత్యమో అలాగే పరలోకసుఖాలుకూడా అంతనిత్యమే. అంటే అన్నీ అశాశ్వతమే. కాని కొంచెం తరతమభేదంమాత్రంవుంది. అందుచేత యీలోకంగాని, పర లోకాలుగాని అన్నీఅనిత్యపదార్థాలే. అయితే యిక వాటిద్వారా అనుభవిస్తాము అనేసుఖాలు శాశ్వతం ఎలాఅవుతాయి? ముమ్మాటికీ కానేకావు. ఇలా విమర్శించిచూస్తే తేలిందేమిటి? మనకు కనిపించేవిఅన్నీ, అంటే అను భవించేవన్నీ అనిత్యం అన్నమాట.

ఇలాగ, ఒకకాలంలోఉండి, మరొకకాలంలో లేనిది కాకుండా, ఎప్పుడూవుండేది నిత్యంఅంటారు. ఈవిషయం మొదట్లోనే 'సత్యం' అనే పదానికి అర్థంనిర్ణయిస్తూ, త్రికాలాలఅంటే ఆవస్తువు పుట్టకముందు వుండాలి. అంటే మనం పుట్టకముందు, చచ్చినతర్వాత కాదుసుమా! ఆ వస్తువే, తాను పుట్టకముందు, తాను నశించినతర్వాతకూడా వుండేది అయి

వుండాలి. అలా వుండటానికి వీలులేదు. కాబట్టి పుట్టుకకు ముందుకూడా వుండేదానికి పుట్టుకేలేదు. మరణించినతర్వాతకూడా ఉండేదానికి చావూ లేదు. ఈపుట్టుక, చావులు లేకపోతే, ఎప్పుడూవుండేదే నిత్యపదార్థం అంటాం. ప్రపంచంలో అలా పుట్టనిది, చావనిది లేనేలేదు.

అందుకని యీప్రపంచంఅంతా, దాని సుఖాలు, సంపదలు యీ ప్రపంచకర్మల ఫలితంగా పొందబడే స్వర్గాదికాలు, వాటిల్లోవుండే సౌఖ్యాలు, అన్నీఅనిత్యవిషయాలే. అన్నీఅలాకాకుండా, కేవలం భగవంతుడి విష యాలు, అంటే 'బ్రహ్మం' నిత్యం అనిఅర్థం. అందుకనే పెద్దలు 'యత్ దృశ్యం తత్ నశ్యం' అంటారు. అంటే ఏదిచూడబడుతుందో, ఏది విన బడుతుందో, అదంతానశించేదే. అంటే, ఏది మన ఏకాదశయింద్రియాల ద్వారా అనుభవింపబడుతున్నవో, ఆసర్వవిషయాలు యీప్రపంచంలోవి గాని, ఆ స్వర్గంలోవిగాని, అన్నీ నశించేవేకాబట్టి అనిత్యం అయినాయి.

ఈవిధంగా విమర్శచేసి తెలుసుకుంటే, దాన్ని నిత్యానిత్యవస్తువివేకం అంటారు పెద్దలు. ఇది చాల ముఖ్యంకాబట్టి తర్వాత మూడు విషయాలు దీనిమీదనే ఆధారపడిఉంటయి. కాబట్టి దీన్నిమొదటిదాన్నిగా ఉంచారు. తర్వాత విషయం వచ్చేఉత్తరంలో.

నాన్నగారు

8-3-46

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం.

# 29
# సాధన చతుష్టయము - వైరాగ్యము

నా మాతాజీ!

క్రిందటిఉత్తరంలో విన్నావు, నిత్యానిత్యవస్తువివేకాన్నిగూర్చి. ఈ వివేకాన్ని అనుసరించిఉంటయి తక్కిన విషయాలన్నీ యీ సాధనచతుష్టయంలో అన్నాను. ఇలా తీర్మానం చేసుకుంటే 'వివేకం' అని ఊరుకుంటారుకూడా. అలాఅన్నా, నిత్యానిత్యవస్తువివేకం అన్నమాటే. ఇదే ఆధారం, తర్వాత సాధన సంపత్తి భాగాలకు అన్నాను. ఎలాగ?

నిత్యంఅంటే భగవద్విషయం అన్నాం. అనిత్యంఅంటే మనం రోజూ అనుభవిస్తూవుండే ప్రపంచవిషయాలన్నాం. కొంతకాలం ఉంటుందికాని, ఎప్పుడూవుండదు అనేటప్పటికి దీనిమీద భ్రాంతితగ్గుతుంది. త్యాగాన్ని గురించిచెప్పుతూ యిదివరకు యీవిషయం చాలవివరించాను. ఏమన్నాను? త్యాగంఅంటే చిన్నవిషయాలను వదిలి, పెద్దవాటిని స్వీకరించటం అన్నాను. ఇరవైరూపాయలజీతగాడు, ఇరవైఅయిదు రూపాయలకు వెళ్ళటంలాంటిది. దీనిలో ఇరవైరూపాయల వుద్యోగాన్ని వదిలాడు, ఇరవైఅయిదురూపాయల

దాన్ని తీసుకున్నాడు. అంటే ముందు దీన్నివదలాలి, తర్వాత దాన్ని పుచ్చుకోవాలి. వాడు చేసినకర్మను ఆలోచిస్తే రెండుపనులు జరిగాయి. ఒకదాన్ని వదలటం మరొకదాన్ని స్వీకరించటం. 'ఎందుకు వదిలావురాదాన్ని?' అంటే అంటాడువాడు, 'అదిఅల్పం. అంతేకాక అది ఖాయంకాదు' అంటాడు. ఇదో, పెద్దపుద్యోగం, ఖాయంకూడాను అంటాడు.

అలాగే, రెండువిషయాలు పూర్వం నిర్ణయించాం. ఒకటి నిత్యం, రెండోదిఅనిత్యం. ఈరెంటిలో దేన్ని పుచ్చుకోవాలి? దేన్ని వదలాలి? అనేది ప్రశ్న. తెలివిగలవాడెవడైనా ఏమంటాడు? ఖాయంఅనేదాన్ని అంటే నిత్యం అనేదాన్ని తీసుకోవాలంటాడు. అనిత్యాన్ని త్రోసెయ్యాలంటాడు. సాధన చతుష్టయంలో, రెండోదిఅయిన విరాగంలో ఏమన్నారంటే, పుచ్చుకోబోయే దానికంటే ముందు ఆవదలాలి అనుకున్నదాన్ని వదలాలిఅంటారు. ముందు నీదగ్గరున్నదాన్ని వదిలితే, తర్వాత పుచ్చుకోవలసినదాన్ని తీసుకోవచ్చు. అంతే కాదుటమ్మా! ఒక ఊరుపోవాలంటే వున్నఊరును వదలద్దూమరి! కొత్తగుడ్డ కట్టాలంటే పాతదాన్ని వదిలెయ్యాలిగామరి! కొత్తయిల్లు కట్టాలంటే పాత దాన్ని తీసివెయ్యాలిగా! అలాగే ప్రస్తుతం మనముందు, లేక శాస్త్రంవల్ల 'ఉంది' అని తెలియబడిన ఏనిత్యపదార్థంఅయిన భగవత్తత్వంవుందో దాన్ని గ్రహించాలంటే, ముందు నీదగ్గర అనుభవంలోవుండేవాటిని ప్రక్కకు త్రోసెయ్యాలి. రాజయోగంలోమాత్రం మనంచేసింది యిదేగా! ధ్యానంలో, ఇష్టదైవాన్ని దృష్టిలో నిలపటానికిముందు, మనమనస్సులోవున్న సర్వయితర భావాల్ని, అంటే ప్రపంచభావాల్ని నెట్టివేయలేదూ! ఇలాగే ప్రపంచభావాలన్నీ పోయినతర్వాతేగా ఆబుద్ధిలో భగవంతుడిని నిలపగలిగాం! అలాగే, యిక్కడ కూడా ముందు అనిత్యంఅని అనుభవంచేత, యుక్తిచేత, అంటే నీబుద్ధిచేత యింకా శాస్త్రంచేత, అంటే శాస్త్రంకూడా యిదంతా అశాశ్వతంఅని చెప్పుతున్నదికాబట్టే యీసర్వాన్నీ వదిలెయ్యాలి. అంటే యీ ప్రపంచసుఖాలూ, యీప్రపంచంకూడా అంతా త్రోసివేయబడాలి. అప్పుడు, మనం స్వీకరించవలసినవాటినిగురించి ఆలోచించటం.

కనబడే యీప్రపంచాన్ని, దీని సుఖాల్నిమాత్రమేకాదు, యీ ప్రపం

చంలో నీవుచేసిన పుణ్యకర్మలవల్ల వచ్చే పరలోకభోగాలుకూడా, వీటికంటే యింకాకొంచెం ఎక్కువకాలం వుండినా, అశాశ్వతం అవుతున్నాయికాబట్టి వాటినికూడా వదిలివేయిఅన్నారు. ఈరకంగా యీప్రపంచాన్ని అంటే ఇహాన్ని, పరలోకాన్ని అంటేఅముత్రమును, వాటిల్లోవుండే భోగాలను వద లటంఏదుందో అదే సాధనచతుష్టయంలోని రెండోవిషయం. దీన్నే ఇహా ముత్రఫలభోగవిరాగం అంటారు. లేక ఇహపరార్థఫలభోగవిరాగం అనికూడా అంటారు. ఇహంలోకాని, పరంలోకాని, మనకర్మ ఫలితంగావుండే సర్వసౌక ర్యాలను త్యాగంచెయ్యాలనిఅర్థం. దీన్నే ఒక్కమాటలో వైరాగ్యం అంటారు.

ఈ వివేక వైరాగ్యాలకు చాలా సన్నిహితసంబంధం వుంటుంది. వివేకం సరిగావుంటే విరాగం దానివెంటనేవస్తుంది. సరిగాలేకుంటే విరాగం రానే రాదు. అందుచేత వైరాగ్యంలేనివివేకం ఎందుకూపనికిరాదు. అలాగే వివేకం లేని విరాగంఅయినాఅంతే. వట్టినిష్ప్రయోజనం. వైరాగ్యానికి ఎప్పుడూ వివేకం పునాదిగాఉండాలి. వివేకానికి వైరాగ్యం అలంకారంగాఉండాలి. ఈ రెండూ కలిసిమెలిసి అన్యోన్యంగా ఎప్పుడుప్రవర్తిస్తుంటయ్యో అప్పుడు, అసలు సాధకుడిలో మార్పుకలుగుతుంది. ఆమార్పుమూలంగా, నిత్య పదార్థం పొందాలనేకాంక్ష తీవ్రంఅవుతుంది.

'విరాగం, విరాగం' అంటారే, విరాగంఅంటే సన్న్యాసం పుచ్చుకోవా లంటారా? ఆంతరంగికంగా సన్న్యాసంఅయితేచాలదా?' అంటారుకొందరు. ఈరకంగా మాట్లాడేవాళ్ళకు జనకుడు ఆదర్శవంతంగా కనిపిస్తాడు. అతని లాగా మేముకూడా ఉండరాదా అంటారువీళ్ళు. ఈవిషయం చెప్పడానికి బాగానేఉంది. కాని కొంచెం విమర్శించిచూద్దాం.

శాస్త్రంప్రకారం నాలుగు ఆశ్రమాలున్నాయిగదా! వీటిలోఉండే పరి ణామాన్నిబట్టి చూస్తే, చివరికి సంపూర్ణంగా సన్న్యాసంచెప్పారు. మొదట్లో శాస్త్రంచదువుకో అన్నారు బ్రహ్మచర్యంలో. ఇంకా, కొంచెం మంచిఅల వాట్లు నేర్చుకోఅన్నారు. స్నానసంధ్యాదికం, గురుభక్తి, బ్రహ్మచర్యం, సత్సాం గత్యం, మధుకరవృత్తిచేత అహంకారత్యాగం, యిలాంటి లక్షణాలు సంపా

దించమన్నారు. తర్వాత, గృహస్థాశ్రమంలో ఆగుణాలనే యింకా గట్టిపరుచుకుంటూ, నిష్కామంగా యితరగృహస్థధర్మాల్ని ఆచరించుకుంటూ, దానధర్మప్రవృత్తిగలిగి సత్యాస్తేయాది సద్గుణాలనభివృద్ధిచేసుకుంటూ, యీషణత్రయాలమీద మమకారంలేకుండా, కామ్యంలేకుండా యజ్ఞయాగాదులను నిర్వర్తిస్తూ, పైఆశ్రమమైన వానప్రస్థానికి తయారుకమ్మన్నదిశాస్త్రం. ఈషణత్రయంఅంటే తెలుసా? త్రయంఅంటే మూడు. దారేషణమొదటిది. భార్యమీదమమకారం పురుషులకు భర్తలమీదమమకారం స్త్రీలకన్నమాట. అసలు యీమొదటి యీషణంమీదనే తక్కిన రెండుయీషణాలు ఆధారపడతాయి. ఇదే లేకపోతే, తర్వాతవి రెండూ ఉంటానికేవీలులేదు. ఇల్లాలితోనే యిల్లు, వాకిలి ఏర్పడాలి. భార్యతోనే, బిడ్డలు బయలుదేరాలి. ఈ భార్యాబిడ్డలకోసమే ధనార్జనకై తాపత్రయపడాలి. అందుచేత భార్యతోనే సంసారం మొదలైంది. ఈదారేషణవెంటనే ఉండేది పుత్రేషణ, అంటేసంతానేచ్ఛ. సంతానంపైనమమకారం ప్రారంభంఅవుతుంది. ఈరెంటినీ అనుసరించిఉంటుంది ధనేషణ. ఇదేమూడోది. కొందరు ధనేషణకుబదులు లోకేషణపెట్టారు. ఇంకాకొందరు, పుత్రేషణకుబదులు లోకేషణపెట్టారు. లోకేషణఅంటే లోకం తనను గౌరవించాలని మొదలైనవాంఛలు. ఈచెప్పబడ్డ యీషణత్రయాలు తనను స్వాధీనంచేసుకోకుండా జాగ్రత్తపడాలి గృహస్థుగాఉండేటప్పుడు. అంటేవిరాగమే. తర్వాత వీటినివదలి, ఒక్కభార్యనే సపర్యలకొరకుమాత్రం వెంటపెట్టుకొని, యితరప్రపంచంతో సంబంధంలేకుండా అన్నారు. ఇదేవానప్రస్థం అన్నారు. దానివల్ల యింకా త్యాగం ఎక్కువఅవుతుంది. తర్వాత సన్న్యాసమే. ఇలా సన్న్యాసమే పర్యవసానంగాఉండి, ప్రతి ఆశ్రమంలోనూ అది, రానురాను అభివృద్ధిచెందుతూ ఉంటుందన్నాను.

మరల యీసన్న్యాసమైనా నాలుగురకాలుంటూ వాటిల్లోగూడా యీ త్యాగమే, క్రమక్రమంగా అభివృద్ధి పొందుతూ ఉంటుంది. ఆ సన్న్యాసాలు ఏవంటే, మొదటిది 'కుటీచక' సన్న్యాసం. దీంట్లో ఆసన్న్యాసి శిఖా, యజ్ఞోపవీతాలుంచుకుంటూ వర్ణాశ్రమధర్మాలను పాటిస్తూ, తన ఊళ్ళోనే బయటగా ఒకఆశ్రమాన్నిపెట్టుకుని దాంట్లోఉంటాడు. భోజనానికిమాత్రం

యింటి ఏర్పాటే అన్నారు. స్నానసంధ్యావందనాది కర్మకలాపంఅంతా ఉంటుంది. వానప్రస్థంలోవలె భార్యకూడా యిక్కడఉండరాదు. తర్వాత స్థితి 'బహూదక' సన్న్యాసంఅంటారు. ఈస్థితిలో తనఊళ్ళోగాని, మరెక్కడగాని నిలకడగాఉండక, తిరుగుతూ అంటే తీర్థయాత్రలసేవిస్తూ, మహాత్ములదర్శిస్తూఉండాలి. బాహ్యకర్మ తగ్గించుకోవాలి. కాని వర్ణాశ్రమధర్మాలు, శిఖా యజ్ఞోపవీతాలుంటయి. మూడోది 'హంస' సన్న్యాసం. దీంట్లో శిఖా యజ్ఞోపవీతాలవర్జించి శాస్త్రప్రకారం 'విరజం' అనే హోమంచేసి, సన్న్యాసం గురువుద్వారా గ్రహిస్తాడు. గృహస్థాశ్రమంలోఉండే గాయత్రీమంత్రాన్నికూడా వదలి, గురువుచేత ఉపదేశింపబడిన బ్రహ్మమంత్రాన్ని జపిస్తూఉండాలి. బాహ్యకర్మ పూర్తిగాతగ్గాలి. బ్రహ్మజిజ్ఞాసఎక్కువై, ఎక్కువగా బ్రహ్మధ్యానంలో నిలిచిఉండాలి. సన్న్యాసచిహ్నాలుఅయిన దండకమండలాలు కాషాయవస్త్రాలుంటాయి. దీనితర్వాత 'పరమహంస' సన్న్యాసం. ఇతడు దండాన్ని కూడా వర్జించి, జపధ్యానాలు, యితరకర్మలు పూర్తిగాత్యజించి, వర్ణాశ్రమాచారాలు లేకుండాఉంటాడు. ఈనాలుగు సన్న్యాసక్రమాల్లో లేకపోయినా, మరొకటి అయిదోదిఉంది. అప్పుడు, కౌపీనంకూడా ఉంచుకొనే స్థితియే ఉండదు. అలాంటప్పుడు దండకమండలాదులెక్కడుంటాయి? ఆచారాలు ఎక్కడుంటాయి? ఇంకా ఉపాసనలుంటాయా? తానేబ్రహ్మమై, ఆస్థితినుండి ఒకక్షణమైనా జారనిస్థితియిది. ఇతడికిఏకట్టుబాట్లున్నూలేవు. ఇదే అవధూత స్థితి అంటారు. అత్యాశ్రమి అనికూడాఅంటారు. జీవన్ముక్తిఅని అనవచ్చు. ఈవిధంగా మరల యీనాలుగోఆశ్రమంకూడా నాలుగ్గాఅయి యీత్యాగాన్ని మెట్టుమెట్టుగా వృద్ధిచేస్తూ, సంపూర్ణమైన వైరాగ్యానికి తీసుకునిపోతుంది. ఈవిధంగా శాస్త్రాల్లో యీవైరాగ్యాన్నే ప్రధానంగాపెట్టుకుని, దానిమీదే లక్ష్యంఉంచుకుని, వ్రాసుకుంటూవచ్చారు అనుభవజ్ఞులైన పెద్దలు. వాళ్ళంతా తెలియకవ్రాశారందామా? ఎంతగొప్ప అనుభవంతోవ్రాశారువాళ్ళు.

పోనీ, అలాకాకుండా అనుభవాన్నిచూద్దాం. ఎప్పుడు మనస్సు ఒక విషయంలో లయంఅయిందాఅంటే, యితరవాటిని పూర్తిగా మరచిపోతుంది. ఇదివరకు పరీక్షకు చదువుతూవుండేవాళ్ళవిషయం చెప్పాను. చదు

వులో బుద్ధి ప్రవేశించేటప్పటికి యితరవిషయాల్ని త్రోసిపుచ్చుతారు. అలాగే మరొకవిషయం చెప్తానువిను. ఒక అమ్మాయివుండి. విన్నది, సౌందర్యవతి, చాలధనికురాలు. దేహాన్ని ఎంతోజాగ్రత్తగా కాపాడుకుంటూ, ఎండ తగిల్తే కందిపోతుందనే స్థితిలోవుందందాం. ఎప్పుడూ ఇంట్లోనుంచి బయటికివచ్చి ఎరుగదు. పాపం, కాలవశాత్తు భర్త మరణించాడు. శవాన్ని బయటికి తెస్తున్నారు. తనగుడ్డలు నలుగుతాయని ఆలోచిస్తుందావిడ? తల వెరుగుతుందంటుందా? దేహానికి రాయాలని ఉంచుకున్న వెన్నమీదికి బుద్ధిపోతుందా? అన్నింటిని మరచిపోతుంది. ఆశవంవెంటనే వీధిలోకివస్తుంది. దుమ్ము, ధూళితో నిండియున్న నడిరోడ్డుమీదపడుతుంది. వస్త్రంపోయిందనికూడా లేకుండా క్రిందదొర్లుతూ, ఆమట్టిలో మట్టిలయిపోతున్నట్లు ఏడుస్తుంది. దేహసౌందర్యాన్నిచూచుకొని, ధనాన్నిచూచి తెచ్చిపెట్టుకున్న అహంకారమమకారాలు ఏమయ్యాయి? భర్తమీదవున్నప్రేమచేత యీవిధంగా యితరాలన్నీ పారిపోయాయి. దీన్నే వైరాగ్యంఅంటాను. బుద్ధి భర్తమీద నిలిచిపోవటంచేత అన్నాహారాలు, నిద్ర, నీళ్ళుండవుగదా! ప్రపంచమే లేదన్నట్లుంటుంది ఆమెస్థితి. అలాగే ఆనందంకలిగినా, అందరూ యిలాగే ప్రపంచాన్ని దాటిపోతూవుంటారు. ఇవన్నీ ప్రపంచంలోవున్న అనుభవాలేనా? ఇలా జరగటం మానసికధర్మశాస్త్రంప్రకారం ఉందా? అంటేఏమిటి? దుఃఖంచేతగాని, సంతోషంచేతగాని, మనస్సు ఎప్పుడైతే ఒకదానిమీద లగ్నంఅవుతుందో యితరాలన్నీ అంతర్థానమైపోతాయి. ఇలా, ఇతరాలన్నీ అదృశ్యం కావటాన్ని వైరాగ్యంఅంటాం. అలా, బుద్ధి ఆవస్తువులలో లగ్నంకాకపోతే, అది అనుభవమేకాదన్నాను పూర్వం. ఎందుకని? అనుభవంఅంటే, మనోవాక్కాయకర్మణ ఉంటుందికాని, మనస్సులోమాత్రంవుండి, కాయికంగా లేకుండా ఉండదన్నాను. ఆమానసికస్థితి కాయికంగా ఎప్పుడు మారుతుందో, అప్పుడే అది అనుభవంఅవుతుంది. లేకపోతే, దాన్ని అనుభవం అననేఅనను.

పైవిధంగా ఆలోచిస్తే శాస్త్రంప్రకారంగాని, యుక్తిని అనుసరించిగాని, అనుభవాన్నిబట్టిగానిచూస్తే, వైరాగ్యంలేకుండా, అంటేవైరాగ్యం కేవలం మానసికంగానేకాకుండా, బాహ్యంగాకూడా ఉంటేనేగాని అనుభవంఅనేది లేదం

టాను, లేక ఆవైరాగ్యం పూర్తి కాదంటాను. వైరాగ్యం పూర్తికాకపోతే అభివృద్ధి కలుగనేకలుగదంటాను. ఇట్టి వైరాగ్యాన్ని పొందినప్పుడే సాధనచతుష్టయంలో రెండోమెట్టును మనం ఎక్కినట్లు. ఈవైరాగ్యలక్షణాలు వస్తేనేగాని తర్వాత మెట్టుగావున్న శమదమాదిషట్కసంపత్తి రానేరాదు. ఇలా వైరాగ్యంలోఉండే ప్రాముఖ్యతను తెలియనివాళ్ళు, యీవైరాగ్యంలోగల రహస్యాన్ని గ్రహించని వాళ్లు, యింకా యీవైరాగ్యంలో ప్రవహిస్తూఉండే మధురరసాన్ని చవిచూడనివాళ్ళు, ఏమి మాట్లాడినా మనం లెక్కచేయరాదు.

అందుకని అమ్మాయీ! వైరాగ్యంలోఉండే ప్రాధాన్యాన్ని బాగా అర్థం చేసుకొని, నీవు అలా దాన్నిసంపాదించి, నీబుద్ధిని తర్వాతకావలసిన శమాదులకొరకై సంసిద్ధంచేస్తావని నమ్ముతూ, యీజాబు ముగిస్తున్నాను.

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం.

9-3-46

# 30

# సాధన చతుష్టయము

## శమాదులు-శమం

అమ్మాయీ మాతాజీ!

నీ వుత్తరం, చాలసంతోషం. నీవు తప్పక నావ్రాతల్ని అన్నింటిని చదివి అర్థం చేసుకుంటానన్నావు. ఆశ్రద్ధ పట్టుదల ఎప్పుడుంటాయో అప్పుడునీకు యీవిషయాలు తప్పకఅర్థంఅవుతాయి. అంతేకాదు యీపట్టుదల శ్రద్ధల్నే మరలఅభ్యాసంలోకూడా ఉపయోగిస్తే యికఅనుభవాలకేమితక్కువ! అవి నీ దగ్గరకే పరిగెత్తుకురావూ! అలాంటి ఉత్తమభక్తిశ్రద్ధల్ని యింకానీవెక్కువ అభివృద్ధిచేసుకుని యింకాఉత్తమస్థితులకు యీఆధ్యాత్మికానుభవాల్లోకివస్తావని గట్టిగానమ్ముతున్నాను. అలా నీవు కావటానికని హృదయపూర్వకంగా నిన్ను ఆశీర్వదిస్తున్నాను.

మొన్నటి ఉత్తరంలో సాధనచతుష్టయంలో రెండోభాగంగా వుండే ఇహాముత్రఫలభోగవిరాగాన్నిగూర్చి విన్నావు. ఈ ప్రపంచసంబంధం, పరలోకసంబంధంఅయిన సుఖాల్ని అన్నింటిని వర్జించటమే దానిసంపూర్ణమైన అర్థంఅని అన్నాను. అలాఎప్పుడైతే చేయగలుగుతామో అప్పుడు మూడో

విషయం, శమాదిషట్కం సాధ్యంఅవుతుంది. ఆవిషయం యీజాబులో కొంచెం చూద్దాం.

దీన్ని శమాదిషట్కసంపత్తిఅంటారు. షట్కంఅంటే ఆరుఅని అర్థం. అవి ఏవంటే 1. శమం 2. దమం 3. ఉపరతి 4. తితిక్ష 5. శ్రద్ధ 6. సమాధానం. వీటిని ప్రత్యేకప్రత్యేకంగా చూడాలి.

మొదటిది శమం అన్నాను. అంటే ఏమిటి? అంతరింద్రియ నిగ్రహం అంటారు. దీంట్లో మూడు మాటలున్నాయి. అంతర్ + ఇంద్రియ + నిగ్రహం అనేవి మూడు వేరువేరుమాటలు. శమాన్ని బాగాఅర్థం చేసుకోటానికి వీటిని చక్కగా అర్థం చేసుకునివుండాలి.

నిగ్రహంఅంటే ఏమిటో మొదటచూద్దాం. నిగ్రహంఅనగానే నిరోధం అని అర్థంవస్తుంది. అంటేఏమిటి? అడ్డగించటంఅనిఅర్థం. వేటిని? ఇంద్రియాలను. ఏయింద్రియాలను? అంతరింద్రియాలను. మనలోపలఉండే యింద్రియాలను అడ్డగించటంఅంటూ అర్థంఏర్పడింది. ఇంద్రియాలు ఎన్నో, ఏవేవో నీకు జ్ఞాపకంవుందికదా! అవి పదకొండన్నాం. అందులో అయిదు కర్మేంద్రియాలు, అయిదు జ్ఞానేంద్రియాలు, ఒక మనస్సు. ఈ పదకొండు యింద్రియాలలో అంతరింద్రియంఏదో? కర్మేంద్రియాలు బయటుండేవే. అలాగే జ్ఞానేంద్రియాలుసైతం బయటవుండేవే. ఇక మిగిలివున్న మనస్సుఅనే పదకొండోయింద్రియం లోపలుండేదికాబట్టి దాన్ని అంతరింద్రియంఅంటారు. దాన్నే మరొకపదంగా అంతఃకరణఅంటారు. ఈ అంతఃకరణఅనేది మళ్ళా నాలుగురకాలు కావటంచేత, అంతఃకరణచతుష్టయంఅని దీనికే పేరుపెట్టారు. ఆనాలుగే 1. మనస్సు 2. బుద్ధి 3. చిత్తం 4. అహంకారం. మొత్తానికికలిపి మనోబుద్ధిచిత్తాహంకారాలనిఅంటారు. అనేకరకాలభావాలతోఉండే విషయాలనుగూర్చి ఆలోచిస్తూ, ఏ ఒక్కభావంమీద కూడా నిలకడలేకుండాఉంటే అప్పుడది 'మనస్సు' అనబడుతుంది. అలా కాకుండా ఆ అంతఃకరణమే ఒకభావాన్ని స్థిరం చేసుకున్నదాఅంటే అప్పుడు దాన్ని 'బుద్ధి' అంటారు. అలా స్థిరంఅనుకున్న భావంమీదనే నిలిచితే దాన్ని

అప్పుడు 'చిత్తం' అంటారు. వీటికన్నింటికి ఆధారంగాఉంటూ నడుపుతూ ఉంటూ, అహంకర్తృత్వం వహించే తత్వాన్ని 'అహంకారం' అంటారు. ఈ రకంగా పేర్లు పెద్దలుపెట్టినా, గ్రంథాల్లోమాత్రం, యీవివక్షణను పాటించకుండానే వాడుతూఉంటారు. కొన్నిగ్రంథాలలో మనస్సును పదకొండో యింద్రియంఅంటే, కొన్నింటిలో బుద్ధిఅన్నారు. ఇంకా కొన్నింటిలో చిత్తం అనికూడా అన్నారు. ఇలాగ సాదారణంగా, అన్నీ యించుమించుభేదాలతో ఒక్కటేలని చెప్పవచ్చు. అంటే యిప్పుడుచెప్పబడ్డ మనస్సును, నిరోధం చేయటం శమం అన్నమాట.

ఈనిరోధంఅంటే అడ్డగించటం అన్నానే, దానికి అర్థంఏమిటి? పట్టుకుంటానికి దొరికేదికాదే! ఎలా దాన్నినిలిపేది? ఇదిచాలకష్టం. దీనినే పతంజలిమహర్షి, యోగసూత్రాలలో, మొదటప్రకరణంలో వివరంగా వ్రాశాడు. అలా ఆమనస్సును నిరోధించడం 'యోగం' అన్నాడు. 'యోగః చిత్తవృత్తి నిరోధః' అనిసూత్రం. తర్వాత, దానికై పద్ధతులు చెప్పుకుంటూవచ్చాడు. అవి చాలకష్టం. వాటిసంగతి రానురాను నీకుతెలుస్తుంది. అయినా కొన్నివిషయాలుమాత్రం చెప్పుతాను. కొన్నిటిని, యీగ్రంథంలోనే, యిదివరకే వర్ణించాను. నిరోధందేన్ని? అంటే మనస్సునుఅని తెలుసుకున్నాం. ఇక దేనినుండి? అనేప్రశ్న ఉంది. ఎందుకు? అనేది తర్వాతప్రశ్న. ఎలాగ? అనేది ఆ తర్వాతప్రశ్న. మొదట దేనినుంచి అనేదానికి సమాధానంచూడాలి మనం. మనకు గమ్యంకానిదానినుండి అందామా? మనకు అవసరం కానిదానినుండి అందామా? మనకు హానికరమైనదానినుండి అందామా? మనకు విరుద్ధమైన దానినుండి అందామా? ఎలాఅన్నా ఒకటే. అలాగ మనకు విరుద్ధంఅయింది ఏది? ముముక్షువులకు, అంటే ఆబ్రహ్మపదార్థాన్ని యీజన్మలోనే పొందాలి అనే తీవ్ర అన్వేషకులకు ఏదివిరుద్ధమో, ఏదిహానికరమో, మనం యిదివరకే తీర్మానించాం. అదిఏది? ప్రపంచం. ఈప్రపంచం స్థూలంగాఉండి మన కాటంకంఅయితే 'విక్షేపం' అన్నాం. సూక్ష్మంగాఅయి మనస్సులోనే భావరూపంఅయితే 'కషాయం' అన్నాం. ఈరెండురకాలఉన్న యీఆటంకాల్ని, యీరెండురకాల మనకంతరాయం కలుగజేసే యీప్రపంచాన్ని మనం నిరో

ధించాలి. స్థూలప్రపంచాన్ని అరికట్టటంఅంటే యింతవిశాలమై, శక్తివంతంగా ఉండే యీప్రపంచాన్ని, ఎలాఅరికట్టడం అనేప్రశ్న వెంటనేవస్తుంది. దీనికి మనం దానినుండి వైదొలగడమేదారి. దానితో సంబంధాలు పెట్టుకోకుండా దూరంగా ఉండటమే మార్గం. అది ఎలాగఅంటే 'అభ్యాసవైరాగ్యాభ్యాం' అన్నాడుపతంజలి. వైరాగ్యంచేత, అభ్యాసంచేత సాధించాలి. దానికే మన రామ కృష్ణుడుకూడా అన్నాడుగదా మాసానికొకనాడైనా ఏకాంతవాసానికి వెళ్ళమని. ఏకాంతానికివెళ్ళితే మనమనస్సు యితరవిషయాలపైకి పోకుండా లోపలనే నిలిచిపోతుంది. క్రమక్రమంగా అదేఅలవాటు అయిపోయి తర్వాత జనసమూహంలోకివచ్చినా, కదలికమెదలికలు లేకుండా నిశ్చలంగా, తనగమ్యంలో నిలిచిఉంటుంది. లేక మౌనాభ్యాసంచేసినా ప్రపంచం దూరంఅవుతుంది. మౌనంఅంటే అర్థంకాక, దానిలోఉండేరహస్యం తెలుసుకోలేక కొందరు విమర్శిస్తారు. మౌనం మూడురకాలు. కాయికమౌనం ప్రథమం. దీనివల్ల దేహం స్థిరంఅవుతుంది. ఆసనాలు మొదలైనవాటిని అభ్యసిస్తే యీకాయికమౌనం అలవడుతుంది. సాధారణంగా చాలామంది కూర్చున్నా, పడుకున్నా, మరి ఎలాఉన్నా, ఏకాలో, చెయ్యో కదిలిస్తూఉంటారు. ఇది చాలా పెద్దఅలవాటు. ఈవిధంగా కాయికచంచలత్వంవల్ల చిత్తంకూడా చలిస్తూఉంటుంది. కాబట్టి ఎప్పుడూ మనదేహంలో ఏభాగంగాని, అనవసరంగా కదలకుండా చూసుకోవాలి. ఇలా అలవాటుపడి, యీదేహం మన చెప్పుచేతల్లోఉంటే కాయిక మౌనం సిద్ధించింది అనవచ్చు. రెండోది వాఙ్మౌనం అన్నాను. నోరు అడ్డు లేకుండా వాగుతూఉంటుంది. అలా వాగటంలో అర్థంఉండదు, అవసరం ఉండదు. అలాకాకుండా ఎంతవరకు అవసరమో అంతవరకే ప్రసంగించటం గొప్పవాళ్ళలక్షణం. అది సాధ్యంకావాలంటే యీవాక్కును సంపూర్ణంగా నిరోధించాలి కొన్నాళ్ళు. ఇది చాలకష్టం. ఇది ఒకతపస్సులాంటిది. దీనివల్ల ప్రయోజనాలు అనేకంఉన్నాయి. నోరు, దాని యిష్టంవచ్చినట్లు ప్రవర్తిస్తూ ఉంటే, మనస్సు నిశ్చలంగా ఎందుకుంటుంది? కాబట్టి మొదట కాయిక మౌనం, తర్వాత వాఙ్మౌనం ముఖ్యం. ఆతర్వాత మానసికమౌనం. పై రెండు ముందు సాధ్యంఅయితే, యీమూడోది చిత్తమౌనంకూడా సులభసాధ్యం

అవుతుంది. దీన్ని సాధ్యంచేసుకోటానికి చాలశ్రమపడాలి. చిత్తంలోవుండే భావాలన్నింటినిత్రోసెయ్యాలి. ఈవిషయం ప్రత్యాహారంలో కొంతచెప్పాను. ఇక్కడకూడ యింకా కొంచెం చెప్పుతాను.

చిత్తానికి ఆటంకాలు భావరూపం. ఆభావాలు వ్యక్తి, వస్తువు, భావం అనేమూడురకాలుగా ఉంటయి. ఏవ్యక్తిమీద రాగద్వేషాలు పెట్టుకోకుండా వుండాలి. వస్తువుమీద మమకారంలేకుండావుండాలి. భావంలంటే రాగద్వేషాలువుండరాదు. అన్నిటికి సాక్షీభూతుడుగా ఎప్పుడుంటాడో అప్పుడు యీచిత్తమౌనం కలుగుతుంది. సాక్షిఅంటేఏమిటో చెప్పుతాను విను. నీవు స్కూలుకు వెళ్లుతున్నావు. వీధిలో నీకెదురుగా యిద్దరుపిల్లలు కొట్టుకుంటు న్నారు. వాళ్లలో ఒకరు నీస్నేహితులులనుకో. అప్పుడు నీవేంచేస్తావు? నీవు నీస్నేహితురాలితో కలుస్తావు. మీరిద్దరూకలిసి ఆపిల్లను కొట్టేస్తారు. అలా కాకుండా వాళ్లిద్దరిలో నీస్నేహితులు లేకపోయినా ఒకపిల్లమాత్రం విరోధి అందాం. అప్పుడు విరోధితోపోట్లాడే పిల్లతోజేరి ఆవిరోధిని కొట్టేస్తావు. అలా నేను ఎవరిని కొట్టుతున్నాను, తిట్టుతున్నాను అంటావా? నీవిషయం కాదులే. నీవు అసలు చాల మంచిపిల్లవు. ఇంకో పిల్లలనుకో. అలాకాకుండా ఆయిద్దరు పిల్లలు నీస్నేహితులుకాక, విరోధులుకాక, ఎవరోఅయితే ఏమి చేస్తావు? కన్నెత్తిమాచి, ఎవరిమీదకూడా రాగద్వేషాలులేకుండా విడదీసి పంపే స్తావు. లేక, అసలుజోక్యం కలుగచేసుకోకుండా వెళ్లిపోతావు. అలాగ రాగ ద్వేషాలులేకుండా, తటస్థంగాఉండటమే సాక్షీభూతస్థితిఅంటారు. అలాగే ప్రపంచంలో ఎప్పుడుంటావో అప్పుడు నీకుసాక్షిస్థితి వచ్చిందన్నమాట. చిత్త మౌనం కొంతవరకు సిద్ధించిందన్నమాట.

ఈరకంగా చిత్తనిర్మలత్వం కలుగకుండాచేసేవి మనకు ఆరు లక్షణా లున్నాయి. వాటినిపూర్తిగా వేరుతోగూడా తీసేస్తేనేగాని మనకు చిత్తశాంతి అనేది కలుగదు. అవే అంతఃశత్రువులుఅని, కామషట్కంఅని అనబడతాయి. కామం మొదటిది, క్రోధం రెండోది, లోభం మూడోది, మోహం నాల్గోది, మదం అయిదోది, మత్సరం ఆరోది. కామంఅనేది కోరిక. అసలు యీ కోరిక అనేది, చాలగొప్పశత్రువు మనకు. కోర్కెతోనే బయలుదేరుతయి అన్ని

అవలక్షణాలు. ఈకోర్కెఅనేది అసలుండరాదా అంటావేమో! పూర్తిగా కోర్కెలుండరాదనే పర్యవసానం. కాని మొదట్లో మంచికోర్కెలను మసం కలిగిఉండాలి. ప్రాపంచికవిషయమైన కోర్కెలుండరాదు. క్రోధంఅంటే పై కోర్కెలను మనంపొందటానికి యత్నిస్తూఉంటే, వాటికాటంకంగా వచ్చిన వాళ్ళమీద, మొదట కోపంకలుగుతుంది. ఆకోపం నిలిచిపోయి దీర్ఘకోపంగా మారి, పగతీర్చుకోటానికి యత్నాలుచేయటం క్రోధం. అలా క్రోధించి అడ్డ మైనవాళ్ళను నిర్మూలంచేసి, ఆకోర్కెకి మూలంఅయిన వ్యక్తి, వస్తువు, భావం అనే మూడువిధాల విషయాలలో దేన్నోఒకదాన్ని పొందుతాం. దానిమీద అతి మమకారంతోనో, ఖర్చుకాకుండా అంటే యితరులకు దాంట్లో కొంచెమైనా అవకాశంలేకుండా, తనఆయుష్యం తనఆరోగ్యంఅనే బుద్ధితోఉంటాన్ని లోభంఅంటారు. డబ్బును దానధర్మాదులకైనా వ్యయంచెయ్యనివాళ్ళను లోభులంటారు సాధారణంగా. అలా దాచిఉంచుకున్నదానిపై అతిమమ కారంతోఉండటం దాన్నిఎప్పుడూ వదలకుండాఉండటం, ఒకవేళదానినుండి ఎడబాటుకలిగితే ప్రాణత్యాగానికైనా తయారుకావటం అనేదిమోహం. డబ్బు మీదమోహం, బిడ్డమీదమోహం, భార్యమీదమోహం. ఇలాంటి ప్రాపంచిక విషయాల్లో అతిరాగంఅంటే పిచ్చిప్రేమను మోహంఅంటారు. తర్వాత అయిదోదిమదం. తన కోర్కెఫలించి, పైచెప్పబడ్డట్లు కష్టించగావచ్చిన డబ్బు వల్లనో, పిల్లవల్లనో, యింకాయితర ఐహికసంపదవల్ల కన్నుమిన్ను కాన కుండా, అతిగర్వంగాఉండటం మదంఅంటారు. చివరిది మత్సరం. దీన్ని అసూయఅనవచ్చు. తనకులభించినట్లు తనకోర్కె యితర్లకుకూడా లభించి నట్లయితే వాళ్ళమీద అసూయకలిగి, వాళ్ళదెపుడు నాశనంఅవుతుందాఅని దేవుడిని ప్రార్థించటమే కాకుండా, వాళ్ళని నాశనం చేయటానికి పూనడం మత్సరం అవుతుంది. ఈఆరు దుర్గుణాలు చిత్తంలోఉన్నంతకాలం, లేశ మాత్రంఅయినా ఉన్నాసరే చిత్తశాంతిఅనేది దుర్లభం. వీటికన్నిటికి పునాది కామంఅనే కోరిక. దాన్ని మొదలంట తీసేశామంటే యీరోగాలన్నింటికి అవ కాశం ఉండనేవుండదు.

పైవిధంగా చిత్తమానసరూపంగా చిత్తశాంతిని సంపాదించి, దానికాటంక

రూపమైన సర్వప్రాపంచిక విషయాలను త్యజించి, వైరాగ్యంలో చెప్పినట్లు మనసా అనుసరించి, అనుభవించటం శమంఅంటారు.

ఎలా నిరోధించేయటం? అనేప్రశ్నవుంది. దీనికి మార్గాలు అనేకమున్నయి. వాటిల్లో ముఖ్యపద్ధతుల్ని చెప్తుంటాను. మనకు ధ్యానంలో కూర్చున్నప్పుడుగాని, యితర సమయాల్లోగాని, మనచిత్తానికి విరుద్ధమైన భావం వస్తే, 'నీవిరోధివస్తే ఎలా వెళ్ళకొట్టుతావో అలా దాన్ని 'ఛీ ఛీ' అనేసి గెంటెయ్యి' అన్నాడు వివేకానందుడు. 'ఆభావం నీఆధ్యాత్మికాభివృద్ధికి హానికరంకాకపోతే కొంచెం దాన్నివిహారించి, తృప్తిచేసిపంపు' అన్నాడు రామతీర్థుడు. 'ఇంతెందుకు ఆభావంరాగానే, దానికీ నీకూవుండే సంబంధాన్ని విమర్శతో ఆలోచించి, ఆసంబంధం నీ ఆధ్యాత్మికాభివృద్ధి కవసరంకాకపోతే తన్నెయ్యి' అన్నాడు జిడ్డుకృష్ణమూర్తి. 'ఇవన్నీకాదు. అసలు ఏభావాన్ని రానియ్యవద్దు' అన్నాడు పతంజలి. 'అలాకాదు. ఏభావంవచ్చినా దాన్ని నిరోధిస్తే ఎదురుతిరుగుతుందికాబట్టి, దానితో సంబంధంలేనివాడిలాగా, దానివిషయమే ఎత్తుకోకుండాఊరుకో' అన్నాడు మనరామకృష్ణుడు. ఈ శ్రీరామకృష్ణుని వాక్యాలు సాధకులకు సువర్ణాక్షరములనుకో.

ఈపైజెప్పిన మార్గాల్లో ఒక్కొక్కతత్వానికి ఒక్కొక్కటి కుదురుతుందికాబట్టి ఆమార్గాన్ని ఏరుకుని ఆచరించుకుంటూవుంటే, ఆ శమంఅనే అంతరింద్రియనిగ్రహం లభిస్తుందంటాను నేను. దీనికై, ఎక్కువకాలం వినియోగించాలి. ఏపనిచేస్తున్నా. ఎక్కడున్నా, యీలక్ష్యాన్ని మనస్సులో వుంచుకుని, మనకనవసర ప్రవృత్తుల్ని చిత్తంలోనికి రానీయకుండా, ఆధ్యాత్మికాభివృద్ధికి తోడ్పడేవాటినే అభివృద్ధి చేసుకోవటం ముఖ్యావసరం అంటానునేను. అంటే, అత్యంతావసరప్రవృత్తి ఎప్పుడువస్తుందో, దానితో శమంఅనే ఆనందం కలుగుతుంది. దీన్ని బాగా అర్థంచేసుకుని, నీవు సంపాదించి, ఆచరించి, ఆనందించు తల్లీ!

10-3-46

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం.

# 31

# సాధనచతుష్టయము
## శమాదులు - దమము - ఉపరతి

*సోదరీ మాతాజీ!*

నిన్నటి ఉత్తరంలో శమాన్నిగూర్చి విన్నావు. నిరోధం అంటే అర్థంలేని బలవంతంకాకుండా, ఆయింద్రియప్రవృత్తికి కారణంఏమిటో గ్రహించి, ఆ కారణాన్నే నిర్మూలనంచేయాలని కేవలంయింద్రియాల్ని నిరోధంచేసినప్పటికిని ఎంతకాలంఅయితే ప్రవృత్తికికారణంఅయిన బలహీనతఉంటుందో అంతదాకబలవంతంగా ఆచిత్తాన్ని తొక్కిపెట్టటం నిష్ప్రయోజనంఅని చెప్పేశాను.

ఇప్పుడు దమంఅంటేకూడా అలా విమర్శచేసి చూద్దాం. దమంఅంటే బాహ్యేంద్రియనిగ్రహం. పూర్వం అంతరింద్రియంఅయిన మనస్సు ఎలా నిరోధించాలిఅన్నామో, అలాగేదీంట్లో, బాహ్యేంద్రియాలను నిరోధించాలి. బాహ్యేంద్రియాలంటే పదిఅని యిదివరకే విన్నావు. కర్మేంద్రియాలు అయిదు, జ్ఞానేంద్రియాలు అయిదు. ఈపదింటిని నిరోధించాలిఅంటే వాటి ప్రవృత్తుల్ని నిగ్రహించాలి. ప్రవృత్తిలంటే, కన్ను చూస్తుంది, చెవి వింటుంది. కన్నుకుచూడటం ప్రవృత్తిఅంటారు. చెవికివినటం. అలాగే చెయ్యికి పట్టుకోటం మొదలైనవి. అంటే యీయింద్రియాలకు ఒక్కొక్కదానికొక్కొక్క

ప్రవృత్తి ఉంటుంది. ఆ ప్రవృత్తుల్ని నిగ్రహించటంఅని అర్థం. ఎలాగ?

శమంలో చర్చించిన నిగ్రహంకంటే యీదమంలోఉండే నిగ్రహం కొంచెంసులభం. అక్కడ నిగ్రహింపబడవలసిన యింద్రియం అతిసూక్ష్మం. కాబట్టి అదిఎప్పుడు, ఎలా ఉంటున్నది కనిపెట్టటం కష్టం. ఇక నిగ్రహం ఎలాగ? అలాకాదుదమంలో. ఈఇంద్రియాలు బయటికి బాగాగోచరిస్తయి. కాబట్టి వాటిప్రవృత్తులు వెంటనేతెలిసిపోతాయి. ఇకనిగ్రహం సులభం అన్న మాటే. మొదట కర్మేంద్రియాలను తీసుకుందాం.

కర్మేంద్రియాలంటే వాక్పాణిపాదపాయూపస్థలులనేవి అయిదు. వాల స్థూలం. వీటిని నిగ్రహించాలి. అంటే శమంలో కాయికమౌనంఅన్నాను. అది రావాలి. కాలుగాని చేయిగాని, తనయిష్టంవచ్చినట్లు నడుచుకోరాదు. వాక్కు నుకూడా కలిపారుకాబట్టి వాచికమౌనంకూడా పాటించాలి. లేక యీయింద్రియాలను మనం ఉపయోగించుకొనేటప్పుడు అవివాటియిష్టం వచ్చినట్లు కాకుండా, మన కంట్రోలులోఅంటే, మన స్వాధీనంలోఉండి ప్రవర్తించేటట్లు చేసుకోవాలి. మనస్వాధీనంలోకి అవివచ్చినపిమ్మట వాటిని దుష్టకార్యాలకై ఉపయోగించకుండా కేవలం ఆధ్యాత్మికవిషయాలకే ఉపయోగించాలి. అందుకనే కదూ ప్రహ్లాదుడేమన్నాడు? 'కమలాక్షునర్చించు కరములు కరములు' అనే పద్యంలో చూచుకో. అంటే, మనం యీయింద్రియాలను ఎప్పుడైతే మన ఆధ్యాత్మికాభివృద్ధికిమాత్రమే ఉపయోగించుకుంటామో అప్పుడుమాత్రమే వాటి సార్థకత. లేకపోతేఅంటే వాటిని దుష్టంగా ఉపయోగిస్తూఉంటే, అవి మనఆధ్యాత్మికాభివృద్ధికికాక హానికిఉపయోగపడి, 'తానుచెడి ఊరంతా చెరవి నట్లు' అవి చెడిపోవటమేకాక, మొత్తంగా మనల్నే నాశనంచేస్తయి. అందుచేత యీకర్మేంద్రియాలను సద్వినియోగం చేయాలనిఅర్థం. మాటమాత్రానికి చెప్పుతానువిను. చేతులున్నయి మనకు. వాటితో ఎన్నిపనులైనా చేస్తున్నాం, వ్రాస్తున్నాం అందాం. ఆవ్రాయటం భక్తి జ్ఞాన వైరాగ్యాభివృద్ధికి ఉపయోగపడే వ్రాతఅయితే సద్వినియోగం చేసినట్లు. అలాకాక, ఒకర్ని బూతులుతిడుతూ వ్రాశామనుకో. అది దుష్ప్రయోజనం. వాక్కుంది, దానితో ఒకర్నితిట్టవచ్చు, లేక మనకు భగవంతునిమీదఉండే ప్రేమచేత కీర్తించవచ్చు. మొదటిదైతే దుర్వి

నియోగం రెండోది సద్వినియోగం. అలాగే యితర యింద్రియాలన్నీ.

ఈకర్మేంద్రియాలకంటే, యింకాకొంచెం సూక్ష్మంగాఉండేవి జ్ఞానేంద్రియాలు. ఇవికూడా బాహ్యంక్రిందలెక్కే. ఇవే శ్రోత్రత్వక్చక్షుజిహ్వా ఘ్రాణములంటారు. చెవిని మంచికిఉపయోగించవచ్చు చెడుకుకూడా వినియోగించవచ్చు. మంచిగ్రంథాలను వినటానికి, సంకీర్తనమొదలైన ఆధ్యాత్మికపరిణామానికి ఉపయుక్తం అయ్యేటట్లుఉంచటం సదుపయోగం. లేక లౌకిక విషయాలువింటానికి చెవులుకోసుకుంటుంటే దురుపయోగంఅంటారు. ఇలాగే కన్నుందనుకో. మహాపురుషదర్శనం చేసుకోటం, మహాక్షేత్రాల్ని చూడటం, యిలాంటివన్నీ నేత్రాల్ని బాగాఉపయోగించుకున్నట్లు. లేక చెడు దృశ్యాలను, లౌకికదృశ్యాలను చూడటానికి పరుగెత్తటం దుష్ప్రవర్తన క్రింద లెక్క. ఈ విధంగా జ్ఞానేంద్రియాలనుకూడా నిగ్రహించేయాలంటుంది దమం.

ఇప్పటికి శమంవల్ల అంతరింద్రియంగాఉన్న చిత్తం స్వాధీనంకావటం, దమంవల్ల బాహ్యేంద్రియాలైన కర్మేంద్రియ, జ్ఞానేంద్రియాలు పది స్వాధీనం కావటం జరిగింది. ఈరెంటిలో మనోవాక్కాయాలు నీకు లొంగాయిఅని చెప్పవచ్చు. ఈమనోవాక్కాయాలు ఎప్పుడైతే ఏకమైఉంటయ్యో యిక దేన్ని గురించి సాధనచేసినా అది సులభంకాకతప్పదు. చిత్తం ఆసాధ్యవస్తువుమీద అచంచలంగా నిలిచిపోవటానికి ఎట్టిఅభ్యంతరం దేహంవల్లకాని, వాక్కువల్ల కాని, మనస్సువల్లకానిలేదని, ఉండజాలదని విదితంఅయింది. ఇలా అన్నీస్వాధీనమైనవాడినే గ్రంథాల్లో జితేంద్రియుడుఅంటారు. అలాంటి స్వాధీన యింద్రియములుగలవాడికి స్వాధీనంకానిదేదీ ప్రపంచంలోలేదు. వాడి ఆగ్రహానుగ్రహాలమీదనే ప్రపంచం ఆధారపడి ఉంటుందంటే నమ్ము. అతడు ఏమి చెయ్యాలంటే అది అతనికి అతిసులభం అయిపోతుంది.

ఆగ్రహానుగ్రహాలుఅన్నారే అలాంటి ఏకాగ్రచిత్తులకు ఆగ్రహంకూడా ఉంటుందాఅంటే, అవును ఉంటుంది. ఇంతవరకు జరిగిందంతా చిత్తైకాగ్రతే గాని, ఆధ్యాత్మికంగా అట్టివాడిలో అభివృద్ధి ఉంటేగా? అందుచేత తన పని సాధించటానికని ఆగ్రహంకూడా కలుగజేసుకుంటూఉంటాడు. చూడ

రాదూ! విశ్వామిత్రుడు కోపంచేతకదూ త్రిశంకుస్వర్గాన్నే సృజించాడన్నారు. ఇలా మన పురాణాల్లోచూస్తే, యిలా కోపం మాటిమాటికీ తెచ్చిపెట్టుకుని, అనేకఘనకార్యాలు నిర్వహించిన ఋషులెందరులేరు! ఆఘనకార్యాలు చేయటానికి పెద్దఆధ్యాత్మికస్థితి అవసరంలేదన్నమాట. చిత్తం ఏకాగ్రంఅయి, యితర దేహేంద్రియాలు చిత్తానికి ఆటంకంకాకుండాఉంటే ఆబుద్ధి వాల నిశితంఅయి, ఎంతపనైనా చేసేస్తుంది. ఆపని మంచికావచ్చు, చెడుకావచ్చు. ఆమంచిచెడులు సమయాసమయాలపై ఆధారపడిఉంటయి. అలాకాకుండా ఎప్పుడైతే ఆచిత్తశక్తికి ఆధారమైన పునాదులు ఏర్పడుతవో అప్పుడు అది దేశ క్షేమానికీ సర్వుల శ్రేయస్సుకుమాత్రం ఉపయుక్తం అవుతుంది.

ఈశమాదిషట్కంలో మూడోది ఉపరతిఅన్నారు. ఇక ఉపరతిని ఆలోచిద్దాం. ఉపరతిఅంటే 'ఉప' అంటే పైన, 'రతి' అంటే ఆనందం. పైన ఆనందం పొందటంఅని చెప్పవచ్చు. పై ఆనందంఅనీ, క్రింద ఆనందంఅనీ, యిన్ని ఆనందాలున్నాయా అంటే ఉన్నాయి. వాటిని కొంచెం తెలుసుకోవాలి. రతి అనబడేఆనందం సర్వేసర్వత్రా అందరికీ అనుభవంలో రెండురకాలు ఉంది. మొదటిది బాహ్యరతి. రెండోది అంతరరతి. బాహ్యరతిఅంటే బాహ్యేంద్రియాలైన కర్మ, జ్ఞానేంద్రియాలతో, మనకంటే బాహ్యంగాఉండే యీ ప్రపంచాన్ని అనుభవించటం అవుతుంది. కన్నులతో ఒకచక్కని దృశ్యాన్ని చూచి ఆనందించామంటే అది బాహ్యరతిక్రిందలెక్క. దేహంనిండా మంచి గంథం పూసుకుని, ఆచల్లదనాన్ని అనుభవించామంటే, అది బాహ్యరతి అనబడుతుంది. ఈబాహ్యరతిలో రహస్యంఒకటుంది. ప్రపంచంలో మన దేంద్రియాలద్వారా ఏయేఅనుభవాలు పొందుతున్నామో అవన్నీ యీ బాహ్యరతి క్రిందరానేరావు. మరి వచ్చేవేవిఅంటే వీటిలో మనకానందాన్ని యిచ్చేవే బాహ్యరతిక్రింద వస్తాయి.

మనంచేసే కర్మలు, వాటిఫలితంగా మనంపొందే అనుభవం, ఎప్పుడూ మూడు రకాలుంటుంది. మొదటిది సత్కర్మ, దానిఫలితం సుఖం. రెండోది దుష్కర్మ, దానిఫలితం దుఃఖం. మూడోది మిశ్రమకర్మ, దాని ఫలితంగా సుఖదుఃఖాలు రెండూకలిసిఉంటయి. పైచెప్పిన త్రివిధకర్మలలో బాహ్యరతి

క్రింద సుఖాన్నిచ్చే సత్కర్మ, మిశ్రమఫలితాన్నియిచ్చే మిశ్రమకర్మ వస్తాయి. పర్యవసానం ఏమిటి? సత్కర్మ, మిశ్రమకర్మ ఫలితంగా, మనంపొందే సుఖం ఏదైతేఉన్నదో దాన్ని బాహ్యరతిఅని అంటారు.

తర్వాత అంతరరతి. ఇదికూడా పైనచెప్పబడ్డ సత్కర్మ, దుష్కర్మ, మిశ్రమకర్మరూపంగా మూడువిధాలఉంది. అది ఆయాఫలితాలనేయిస్తుంది. కాని బాహ్యరతిలో ఆనందానుభూతి బాహ్యేంద్రియాలవల్ల కలుగుతుంది. ఈఅంతరరతిలో ఆసుఖం, అంతరింద్రియమైన మనస్సువల్ల కలుగుతుంది. అదిఎలాగఅంటే, విను. నీవు కాశీకి వెళ్ళావుఅనుకో. ప్రత్యక్షంగా నీవు అక్కడికివెళ్ళి గంగలోస్నానం శ్రీవిశ్వేశ్వరదర్శనంవల్ల కలిగినఆనందం అనుభవించి ఉంటే, అది బాహ్యరతిఅవుతుంది. అలాకాక వెళ్ళివచ్చినతర్వాత నాకు ఆ విషయాలుచెప్పుతూ ఆనందపడ్డావు. ఆదృశ్యాలన్నీ నీమనస్సులో స్ఫురిస్తున్నాయి. మరలఆనందిస్తావు. ఇప్పుడాకాశీని నీబాహ్యేంద్రియాలు అనుభవించటంలేదు. కాని మరల ఆఅనుభవాలే కలుగుతున్నాయి. అలాగే ఆనందం పొందుతున్నావు. ఎలాగ పొందుతున్నావు? మనస్సులోమాత్రమే. అలా పూర్వం మనం అనుభవించినదాన్నే మరల జ్ఞాపకంతెచ్చుకుని ఆనందిస్తే దీన్ని అంతరరతిఅంటారు. ఈఅంతరరతి పైచెప్పినవిధంమాత్రమేకాకుండా మరొకవిధంవుంది. అదే స్వప్నం. మొదటిది స్మృతి. ఈస్వప్నంకూడా స్మృతిఅని అంటారు. స్మృతిఅంటే పూర్వం మనం ఏయేవిషయాలనైతే అనుభవించామో వాటినిమరల మనస్సులోకి తెచ్చుకోటంఅనిఅర్థం. పోనీ, నీకుపూర్వం అనుభవంలోలేనిదాన్ని దేనినైనా జ్ఞాపకంతెచ్చుకో. అలా వీలులేదు. జ్ఞాపకం అనగానే, యిదివరకు మనం అనుభవించినదాన్నే మరల మనస్సులోకి తెచ్చుకోటం అవుతుంది. అలాగే స్వప్నం అంటేకూడా. ఇదివరకుచూచిన బావట్ల నీకు కలలోకివస్తుందికాని రామేశ్వరం కలలోకిరాదు. కారణం దాన్ని నీవు యింతవరకు చూడలేదుకాబట్టి. ఈనియమం సామాన్యంగాకలిగే స్వప్నాల విషయం. కాని కొన్నిస్వప్నాలుంటాయి చాలఅసాధారణంగా. అలాంటి దృశ్యాలు మనం కని, విని ఎరుగం. కాని కలల్లోవస్తాయి. అలాంటివిషయం చాలవుంది. ప్రస్తుతం నీకువద్దు. మరొకసారిచూద్దాం. అందుకని సామా

స్యంగావుండే స్వప్నాలు స్మృతిరూపాలేఅని పెద్దలతీర్మానం. ఈవిధంగా స్మృతి రూపంగాగాని, స్వప్నరూపంగాగాని మనం ఆనందంఅనుభవిస్తే, దాన్ని 'అంతరరతి' అంటాం. ఇంతేకాదు. స్మృతి స్వప్నాలమాదిరి పూర్వానుభవం మీద ఆధారపడకుండా మనం ఆనందంఅనుభవిస్తే, దాన్ని అంతరరతి అంటాం. అది కవులకు, చిత్రకళాకోవిదులకు, గాయకులకు అనుభవంలో ఉంటుంది. వాళ్ళఆనందం కేవలంఊహాజనితమే. దానికి ముందు వెనుకలనేవే వుండవు. అప్పటికప్పుడు స్ఫురించి ఆనందంలో లయించిపోతారువాళ్లు. ఇదంతాకూడా అంతరరతి అంటారు. కాని యీపై నిర్వచనలో యింకా కొంచెంమార్పు కలగాలి. అప్పుడుగాని అంతరరతిఅంటే నీకుయింకా బోధ పడదు. అలాగే బాహ్యరతికూడాను. బాహ్యరతికి ఏమూడు కర్మలు వాటి ఫలితాలుచెప్పానో ఆమూడువిధాలు అంతరరతిలోకూడారావలసిందే. అంటే అంతరరతిలో సత్కర్మ, మిశ్రమకర్మ, దుష్కర్మలున్నాయి. ఈమూడింటిలో ఆనందం కలుగచేసేవి మొదటిరెండే. అవే సత్కర్మ, మిశ్రమకర్మలు. కాని యీ రతిఅనేది మరల రెండురకాలైంది. ఒకటి విషయంఅంటే లౌకికం, రెండోది ఆధ్యాత్మికంఅంటే అలౌకికం. లౌకికంఅంటే ప్రాపంచికసుఖాలవల్ల ఆనందంకలగటం. ఆప్రాపంచికసుఖాలు ప్రత్యక్షానుభవంచేత బాహ్యరతిఅని, స్వప్న, స్మృతి, భావరూపాలు అంతరరతిగామారాయి. ఎప్పుడైతే యీరెండు రతులు కేవలంప్రాపంచికం అవుతాయో అప్పుడవిత్యాజ్యం, అంటే వదిలి పెట్టాలి. కాని ఆధ్యాత్మికంగా ఉండేటప్పుడు, దైవసంబంధంగా ఉన్నప్పుడు, వాటిని పెంపొందించుకోవాలి. పూర్వంమనంచూచిన శమదమాలవల్ల బాహ్య అంతరరతులు స్వాధీనంఅయ్యాయి. అంటే అవిలేనేలేవు అనిచెప్పవచ్చు. ఇక మిగిలేదేమిటో అదేడపరతి. దాని సంగతి విచారిద్దాం.

ఇందాకకేవలం లౌకికానందంఅనేది అంతరం, బాహ్యంఅన్నాం. అలాగే ఆధ్యాత్మికానందంకూడా యీరెండురకాలఉంది. కాని బాహ్యంఅనబడేది కేవలం స్థూలంకావటంచేత, అది మనఆధ్యాత్మికాభివృద్ధికి మొదట్లో కొంచెం ఉపయోగించినా, తర్వాత మనకు అదిఉపయోగమేలేదు. మీదుమిక్కిలి మన కాటంకదాయకంగాకూడా అవుతుందంటాను. కాబట్టిదాన్ని పూర్తిగా త్రోసె

య్యాలి. ఇక అంతరరతి అనేదాంట్లోగూడా లౌకికసంబంధం వదిలెయ్యాలి. తర్వాత మిగిలుండేది దైవసంబంధం. అలాంటి దైవసంబంధమైన దృశ్యాలలో, భావాలలో, వాటివల్లకలిగే ఆనందాలలో మునిగిఉండటం ఉపరతి అంటాను. అంటే బాహ్యాన్ని సంపూర్తిగామరచిపోయి, అంతరంగా భగవత్సంబంధవిషయాలలో మునిగి తేలుతూఉండే ఆనందం ఉపరతిఅని అర్థం.

ఈఉపరతిఅనబడే పరమపవిత్రమైన, ప్రపంచానికి సంబంధం కాసంతయినాలేని యీఆనందాన్ని అనుభవించటం అభ్యసించాలి. ప్రాథమికస్థితులలో యీఉపరతి, అష్టాంగంలో అంగంగాఉన్న ధ్యానంగూర్చి చర్చించటంలో వచ్చిన విషయాలమాదిరి రూపంవల్ల ఆనందంకలుగవచ్చు. అంటే నీకు ధ్యేయపదార్థంగావుండే ఆయిష్టదైవంయొక్క రూపంమీద నీదృష్టి నిలిచి, ఆరూపంద్వారా నీకు ఆనందంకలిగితే దాన్ని ఉపరతిఅంటాం. కాని యిది కొంచెంస్థూలం. ఎందుకంటే, నీఆనందకారణమైన ఆధ్యేయానికి ఒక ఆకారంఉందికాబట్టి. కాక నీ మనస్సులోఉన్నది రూపంకాక నామంకావచ్చు, గుణంకావచ్చు, మంత్రంకావచ్చు, లేక భావంకావచ్చు. వీటిల్లో ఏవైనా మొదటిదానికంటే సూక్ష్మంఅవుతుంది. దేనిమీద మనస్సుకుదిరేది ఆ సాధకునిస్థితిమీద ఆధారపడివుంటుంది. కాబట్టి యీఉపరతియొక్క స్థితులు కూడా ఆయా సాధకుని స్థితినిబట్టి మారుతుంటాయి. అతడు భక్తుడైతే ద్వైతంమీద బుద్ధినిలిచి అలాంటిఆనందాన్ని పొందుతాడు. లేక అద్వైతి అయితే ఏఉపనిషద్వాక్యాన్నో, లేక 'అహంబ్రహ్మాస్మి' అనే ఏమహావాక్యాన్నో తీసుకుని, దాన్ని మననంచేస్తూ, ఆయానందానుభవంలో మునిగిఉంటాడు. ఇది ఉత్తమమైన ఉపరతి అంటాను.

ఎలాగైనా యీఉపరతి, యీశమాదుల్లో చాలముఖ్యమైన విషయం అని గ్రహించాలి. శమదమాలపర్యవసానంగానే యీఉపరతి కలుగుతుందిఅని తెలుసుకోవాలి. అలా దీనిప్రాముఖ్యతను నీవుగ్రహించి, దీన్ని నిత్యం అనుసరిస్తూ, సాధిస్తావని నమ్ముతున్నాను.

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం.

(signature)

11-3-46

32

# సాధనచతుష్టయము

## శమాదులు - తితిక్ష

నా మాతాజీ!

గతఉత్తరాల్లో శమ, దమ, ఉపరతిఅనే మూడువిషయాల్ని సమగ్రంగా చూచావుచాలసంతోషం. వాటినిబాగాగ్రహించిఉంటావనేనమ్మకంతో తర్వాత ముఖ్యమైన తితిక్ష శ్రద్ధ సమాధానాలనుచెప్పటానికి పూనుకుంటున్నాను.

తితిక్షఅంటే సహనం, ఓర్పు, క్షమ అనేపదాల్లో వివరించాలి. ముందు విన్న శమ, దమ, ఉపరతుల్లో ముఖ్యం ఉపరతిఅనీ, దానికి పునాదులే శమ దమాలనీచెప్పాను. అంటే శమదమాలు ఉపరతికి దారిచూపుతున్న ద్వారపాల కులన్నమాట. అయితే యీశమదమాలుమాత్రం అంతసులభం కాదు సుమా! వాటికి వేరేపునాదులుండాలి. అవే తరువాతవచ్చే తితిక్ష, శ్రద్ధా, సమా ధానాలు. అలా అయితే శమాదిషట్కంలో అసలు ముఖ్యమైనది ఉపరతి అయింది. దీనికి ద్వారపాలకులుగా శమం, దమం ఉన్నవి. శమదమాలకు అంగాల్లాగా తితిక్ష, శ్రద్ధా, సమాధానాలుంటాయి. ఉపరతిఅనే చక్రవర్తిని కాపాడటానికోఅన్నట్లు మధ్యలో ఉపరతినివుంచి, యిరుప్రక్కల మిగిలిన అయిదు నిలిచివున్నాయి. ఈరహస్యం దృష్టిలోవుంచి యిక విను.

తితిక్షఅంటే ఓర్పు అన్నాను. ఓర్పు ఎవరికి కావాలి? ఓర్పు లేనివాడికి ఓర్పుకావాలి. ఓర్పు లేకపోవటంఅంటే అసూయ అనికాదు అర్థం. క్షమ అన్నాను. సహనంఅన్నాను. ఇంకా యీఅర్థం వివరిస్తానువిను. ఓర్పులేనివాడికి ఓర్పుకావాలన్నాను. ఓర్పులేనివాడెవడు? తనకు విరుద్ధమైనవాటిని సహించ లేనివాడనిఅనాలి. అంటే నీవు ధ్యానానికిపూనుకుంటే అనేకమంది అనేక అడ్డం కులను కలుగజేస్తారు. అన్నికాలాల్లోనూ సత్యాన్వేషకులకు యీశ్రమ ఉన్నదే. ఏమహాపురుషుడు యిలా తనఅకారణ విరోధులచేత బాధపడలేదు? ఏసు క్రీస్తును ఏమిచేశారు? శిలువమీదవేసి చంపారు. మహమ్మదును ఊరూర వెళ్ళగొట్టారు. ఇలాగే మన రామకృష్ణుని ఎందరు బాధపెట్టలేదు! ఇలాగే మన వివేకానందునిజీవితం చూచుకో. ఎన్నికష్టాలో ఆయనకు! అవి మన హృద యాన్ని దహించివేస్తాయి. ఇలాగే ప్రపంచాన్నివర్జించి, ఆధ్యాత్మికానందామృ తాన్ని త్రాగాలిఅని అన్నివిధాల కష్టపడేవాళ్ళకు యీప్రపంచం ఎదురైనిలిచి, వారిని అనేకవిధాల కష్టపెట్టుతుంది. అవన్నీఆటంకాలేగా! ఇంకా ఆకలి దప్పులు బయటప్రపంచంకంటే ఎక్కువబాధపెట్టుతయి. నీకు పిడికెడు కబళంకూడాదొరకదు. త్రాగటానికి గుక్కెడునీళ్ళుకూడా దొరకవు. అయినా నీ పట్టును విడవకుండా సాధనలో మునిగిపోవాలి.

అసలు భగవంతుడు యీక్షమను కలుగజేయటానికే యిన్నిరకాల ఆటంకాలను కలుగజేస్తుంటాడుఅని మనం అర్థంచేసుకుంటే, ఎవరు ఏది చేసినా మనకుఎవరిమీద కోపతాపాలు కలగనేకలగవు. ఒకరహస్యం చెప్తుంతాను విను. త్రిగుణాల్లో సత్వం ముఖ్యంఅని, దాన్ని ఎంతఅభివృద్ధి చేసుకుంటే అంత ఆధ్యాత్మికాభివృద్ధి కలుగుతుందని యిదివరకుచెప్పాను. సత్వ పూర్ణం అయితేగాని యీక్షమరాదు. తితిక్షఅనేది యీసత్వాన్ని ఆశ్రయించి వుంటుంది. సత్వంఅనేది బయటికి గోచరించాలంటే యీతితిక్ష రూపంగా మనలోనుండి బయటికివస్తుంది. ఎవడు ఎంతవరకు సత్వసంపన్నుడుఅంటే, వాడి తితిక్షనుబట్టి తెలుసుకోవచ్చు. మొదట్లో మనఅభిప్రాయాలకు, మన సాధనలకు యింట్లోవాళ్ళు ఒప్పుకోరు. 'కాదు నాభావాలు మంచివి' అని చెప్పచూచామంటే వాళ్ళకునచ్చదు. అయినా చేస్తున్నామా అంటే అనేకవిధాల

బాధలు పెట్టుతారువాళ్ళు. అసలు ఆధ్యాత్మికమార్గానికి మొదట బాధలు మన బంధువులదగ్గరనుండే అనగా మనతల్లి, తండ్రి, భార్య, భర్త మొదలైన వారినుండే బయలుదేరుతయి. వాళ్ళను ఎలాగైనా స్వాధీనంచేసుకొనో లేక, అదీవీలుకాకపోతే ఎదిరించో, సాధన సాగించామూఅంటే యిక ప్రపంచంలో వుండే మనయిరుగుపొరుగు స్నేహితులు, యితర్లు ప్రారంభిస్తారు. దాన్ని దాటామూఅంటే ఊరివాళ్ళు. ఆతర్వాత జిల్లావాళ్లు. ఇలా ప్రపంచంఅంతా అన్నట్లు ఎదురుతిరుగుతుంది. ఇలా యిన్ని అసంఖ్యాకమైన అడ్డంకుల్ని దాటితేగాని అనుభవానందం సాధ్యంకాదు. అందుకనే 'యింటగెల్చి రచ్చ గెలువ' మన్నారుపెద్దలు. చిన్నచిన్న అడ్డంకులదగ్గరనుండి పెద్దవాటిని దాటే వరకూ అసమానమైన సహనభావం ఎవరు చూపిస్తారో వాళ్ళకు, యీతితిక్ష సాధ్యంకాని, ఆప్రపంచానికి ఎదురుతిరిగి సాధిద్దామూఅంటే దుస్సాధ్యం అయి తీరుతుంది. కాబట్టి జాగ్రత్తగా యీతితిక్షను సాధ్యంచేసుకోవాలి.

దానికిమార్గం ఎలాగంటే, ముందు వాళ్ళకు నచ్చచెప్పటానికి యత్నించాలి. అలాగావీలుకాకపోతే, వాళ్ళను నిర్లక్ష్యభావంతో చూడగలిగే శక్తి మనకు వచ్చేవరకు ఎదురుతిరగకుండా, మనం ఏమిచేస్తున్నదికూడా తెలియనీయకుండా సాధనగావించాలి. అలాప్రపంచాన్ని ఉదాసీనభావంతో చూడగలిగే శక్తి సామర్థ్యాలు వచ్చాయామాఅంటే అప్పుడు మనస్థితి బయటికితెలిసినా ఫరవాలేదు అనేభావంతో నిర్భయంగా ప్రవర్తిస్తుండాలి. ఇతర్లమీద ఏవిధమైన కోపతాపాలు కలుగచేసుకోకుండా, మనస్సులోనైనా వాళ్ళమీదద్వేషం నిలుపుకోకుండావుండాలి. ఇంతగాఉంది తితిక్ష. ఎంటే కేవలం, సత్వగుణప్రధానంగా ఎప్పుడుండిపోతామో అప్పుడు తితిక్ష అలవడిందంటాను.

ఇలా మనగమ్యస్థానాన్ని పొందటానికై యత్నించేటప్పుడు, విశ్వసించిన సత్యానికై ప్రాణాలనైనా వదలటానికిపూని యత్నించేటప్పుడు, యింకా అనేక కష్టాలు మనమీదికి యుద్ధంప్రకటిస్తాయి. కొన్నిరోజులు నిన్నుపిలిచి పెట్టేవాళ్లుండరుగదా! ఒకవేళ నీవుపోయి 'భవతీ భిక్షాం దేహి' అన్నా పిడికెడు కూడు పెట్టేవాళ్ళుండరు. అంతేకాదు ఒకనీటిబొట్టు గొంతులోపోయరు. అయినా సహించి, మేరుపర్వతంలాగా ఏవికారాలు లేకుండాఉండటం తితిక్ష. సరే

యియ్యకపోతే నిన్ను సన్మానించి యింట్లోకి రానిస్తారా? అలాంటప్పుడు సూర్యునివేడికి తట్టుకోటానికి ఆశ్రయంఏది? పిడుగులుపడుతూ, ఏనుగు తొండాలంతధారల్లో, తుఫానువానలో నీకు నిల్వటానికిచోటేది? ఎండలో ఎండాలి వానలోనానాలి. అయినా ఏవికారాలు పొందకుండా ఉండటంతితిక్ష. ఎండగా ఉందనిగాని, వానగా వుందనిగాని, నిన్ను చెట్టుక్రిందనైనా చేరనియ్యని యీ ప్రపంచం నీకు పట్టువస్త్రాలను కట్టపెట్టుతుందా? చలికి కప్పుకోటానికి కాశ్మీరుశాల్వలనుయిస్తుందా? లేదు. మానం కాపాడుకోటానికి చిన్న చింకి గుడ్డనైనా యివ్వదు. కౌపీనంఅయినా యివ్వదు. వున్నదాన్నే లాగేస్తుంది. అయినా ఏవికారాలు పొందకుండావుండటం తితిక్ష. ఇలా బయటనుండివచ్చే సర్వాటంకాలను లక్ష్యంసేయక, ఉదాసీనభావంతో, ఏవిధమైన వికారాలు లేకుండా, స్థిరంగా అచలంగావుండటం తితిక్ష.

ఆతడే మన దిక్కు.

ఆతడే మన గమ్యం.

ఆలాలా (signature)

13-3-46

# 33

# సాధనచతుష్టయము

## శమాదులు - శ్రద్ధ

అమ్మాయీ మాతాజీ!

మొన్నటి ఉత్తరంలోవిన్న తితిక్ష చాలకష్టం. దాన్ని పొందాలంటే దానికి పునాదిగా మరొకవిషయం వుండాలి. అదేశ్రద్ధ. ఈశ్రద్ధ చాలముఖ్యం. అందు కనే గీతలో 'శ్రద్ధావాన్ లభతే జ్ఞానం' అన్నాడుశ్రీకృష్ణుడు. శ్రద్ధాభక్తు లంటంలేదూ? భక్తిశ్రద్ధలని లేదూ? అంటే శ్రద్ధఉంటే భక్తికలుగుతుంది. శ్రద్ధలేనివాడికి భక్తిరానేరాదు. భక్తికలుగకపోతే యిక జ్ఞానంఎలాకలుగుతుంది? ఆకారణంచేత యీశ్రద్ధఅనేది అసలు ఆధ్యాత్మికసాధానికే పునాదిగడ్డఏమో అనిపిస్తుంది. ఎంత శ్రద్ధవుంటే అంత భక్తి, అంత అభివృద్ధిఉంటుంది.

సరే శ్రద్ధఅంటేఏమిటి? ఈశ్రద్ధ, నాలుగురకాలుంటుంది. శ్రద్ధఅన్నా, విశ్వాసంఅన్నా ఒకటే. ఇది 1. ఆత్మవిశ్వాసం 2. మార్గవిశ్వాసం 3. గురువి శ్వాసం 4. భగవద్విశ్వాసంఅనురీతిగా నాలుగువిధాలుంటుంది. ఆత్మవిశ్వాసం అంటే. సాధకుడు తనశక్తిసామర్థ్యాలను ముందుగాగ్రహించి, తానేస్థానంలో ఉన్నది తెలుసుకుని, ఆధ్యాత్మికగమ్యాన్ని యీతనశక్తిసామర్థ్యాలతో పొంద గలను, అనేధైర్యాన్నిపొందటం అంటారు. ఇలా తీర్మానించుకోటం అంత

సులభంకాదు. అసలు తానేస్థితిలోఉన్నది గ్రహించుకోటమే కష్టం. దానికి ఒక సూత్రంవుంది. ఆసూత్రాన్ని అనుసరించేవాళ్లు కాలుజారకుండా స్థిరంగానే ఆధ్యాత్మికమార్గంలోవుండి యింకా అభివృద్ధిపొందుతారు. ఏకొంచెం పొరపాటుఅయినాపడితే అడుగులేనినూతిలో పడిపోతారు. ఆవిషయం చెప్పుతాను శ్రద్ధగావిను.

మనస్థితిని ముందు తెలుసుకోవాలన్నాను. అంటే ఆధ్యాత్మికస్థితి అన్నమాట. దాన్ని తెలుసుకోవాలి. మనమాదిరిగా **యీఆధ్యాత్మికాభివృద్ధికై** తంటాలుపడినవాళ్లు, యింకా పడుతూఉండేవాళ్ళు చాలామంది ఉంటారు. వాళ్ళు గ్రంథాల్లోవుండే మహాపురుషులై వుండవచ్చు. లేక, ప్రస్తుతం ఉన్నవాళ్లైనాకావచ్చు. వాళ్ళనుగూర్చి మనం తీవ్రంగా ఆలోచించాలి. వారిలోవుండే గొప్పదనాన్నిఅంటే మంచిలక్షణాల్ని విచారించాలి. బాగాగ్రహించాలి. దీనికి కూడా చాల తెలివివుండాలి. మనం వాళ్ళమీదవుండే ప్రేమతోచూస్తే వారిలోవుండే లోపాలు కనిపించనేకనిపించవు సరికదా, యింకా లేనిగొప్పదనాలెన్నో గోచరిస్తయి. అలాగే ద్వేషబుద్ధితో చూచామాఅంటే, వారిలోవుండే మంచికనపడక చెడేకనబడుతుంది సరిగదా, మంచికూడా చెడులాగా కనపడుతుంది. కాబట్టి మరొకర్ని మనంసరీగ్గా గ్రహించాలంటే, వాళ్ళమీద ప్రేమగాని, ద్వేషంగాని లేకుండావుండాలి. ఇతరులమాటను వినరాదు. **సాధ్యమై**నంతవరకు యిప్పుడున్నవాళ్ళే అయిఉంటే, వాళ్ళవిషయం ప్రత్యక్షమైన మన అనుభవాన్నిబట్టే ఆలోచించాలి. బజారుకబుర్లు, రోడ్డుబాలాఖానాలు విని మన అభిప్రాయాన్ని స్థిరంచేసుకోరాదు. పురాణపురుషులైతే సాంప్రదాయికంగా పెద్దలు చెప్పుతూఉండే అభిప్రాయాన్ని తెలుసుకోవాలిగాని, ద్వేషపూరితమైన విమర్శలను వినరాదు. ఇలా నిష్పక్షపాతబుద్ధితో వాళ్ళను గ్రహించాక, మనకు వాళ్ళకుఉండే భేదాన్ని విమర్శించి చూచుకోవాలి. 'వాళ్ళలో ఏయే సద్గుణాలున్నాయి? నాలో ఏవిలేవు? నాలో ఏదుర్గుణాలున్నాయి? వాళ్ళలో ఏమిలేవు?' అనేరీతిగా విమర్శసాగించాలి. మనలోమనమే చేసుకోవాలి. ఇలా చూచుకొనేటప్పటికి ఆపురుషులంతా రెండుతెగలుగా మనదృష్టికి గోచరిస్తారు. ఒకతరగతి మనకంటే పైనవున్నవాళ్ళు. అంటే వాళ్ళల్లో మనకంటే ఎక్కువ మంచిలక్షణాలున్నాయి. ఇక రెండోతరగతివాళ్ళు, మనకంటే

తక్కువ. వాళ్ళలో మనకంటే తక్కువసద్గుణాలుంటాయి. లేక ఎక్కువ దుర్గు ణాలుంటాయి. మనం కేవలం ఉత్తమతరగతివారివిషయమే ఆలోచిస్తుంటే ఒకలక్షణం మనలో అభివృద్ధిచెందవచ్చు. 'వాళ్ళు గొప్పవాళ్ళుకాబట్టే ఆస్థితికి వచ్చారు. నేను సామాన్యురాలిని. నాకెలా అట్టిఅనుభవాలు వస్తాయి?' అనే భావం, అధైర్యం, మనలో పెరగవచ్చు. లేక, మనకంటే తక్కువ స్థితివాళ్ళను చూస్తూవుంటే 'వాళ్ళకంటే నేనుగొప్పదాన్ని. నాముందు వాళ్ళెంత?' అనే అహంభావం పెరగవచ్చు. ఈరెండూ సంకుచితదృష్టులే. మొదటిదానివల్ల అధైర్యంవస్తుంది. కాబట్టే యిక ప్రయత్నమేలోపిస్తుంది. అభివృద్ధి ఆగి పోతుంది. రెండోదానివల్ల గర్వంపెరిగిపోతుంది. 'నేనే సర్వజ్ఞుడను' అనేభావం వృద్ధి అవుతుంది. Pride is the doorway of the distruction నాశనానికి గర్వం ముఖద్వారంఅన్నట్లు అయిపోతుంది మన ఆధ్యాత్మికాభివృద్ధి. అలాకా కుండా పెద్దవాళ్ళలోవుండే మంచిలక్షణాలనుచూచి వాటిని పొందటానికై యత్నం, చిన్నవాళ్ళలోవుండే చెడుగుణాలులేకుండా ప్రయత్నం చెయ్యాలి. పెద్దవాళ్ళలోవున్న మంచినీలో ఉందాలేదాఅని తెలుసుకొని ధైర్యంచెందాలి. చిన్నవాళ్ళలోఉండే దుర్గుణాలు నీకు లేవుగదాఅని ధైర్యంచెందాలి. అలా సద్వి మర్శతో నీస్థితిని, నీపైవాళ్ళను, క్రిందివాళ్ళను తెలుసుకుని, దానివల్ల ధైర్యం చెంది, 'పెద్దవాళ్ళ లక్షణాలున్నాయికాబట్టే యింకా నేనెంతైనా అభివృద్ధిచెంది, ఆపెద్దవారు అనుభవించే అనుభవాల్ని పొందగలను' అనే ధైర్యంపొందాలి. అలాగే 'యీఅభివృద్ధికి ఆటంకదాయకమైనయిన చెడుగుణాలు లేవుకాబట్టే, యింకా నాఅభివృద్ధికి ఏమి' అని ధైర్యంపొందాలి. ఇలా అన్నివిధాల, తన శక్తి సామర్థ్యాలు ఆధ్యాత్మికాభివృద్ధికి అనుకూలంగానే ఉన్నయిఅని తెలుసుకుని, ధైర్యంతోఉంటం ఆత్మవిశ్వాసం అంటారు.

రెండోది మార్గవిశ్వాసం. పైవిధంగా ఆత్మవిశ్వాసం స్థిరంకావటానికి, అనేక సత్పురుషులచరిత్రలు చదువుతాం. అనేకమహాత్ముల సేవచేస్తాం. వాళ్ళ వాళ్ళ సన్నిహితసాంగత్యాన్ని పొందుతాం. వాళ్ళకుమనకు పోల్చి చూచు కుంటాం. మన తత్త్వానికి సరిపోయేవి, సరిపోనివి అనేక మార్గాలు తెలుస్తయి. వాటిల్లో మనకు అనుకూలమైనదాన్ని మనం తీర్మానించుకోవాలి. ద్వైతం అయితే క్రిందమెట్టుఅంటున్నారు. అద్వైతంఅయితే బాగుంటుంది. ఒక్క

సారిగా పైకిపోవచ్చుఅని మనయిష్టంవచ్చినట్లు తీర్మానించుకోరాదు. మన పెద్దలుఅంటే తల్లిదండ్రులు, తాతముత్తాతలు మొదలైన బంధువులు ఏ మార్గాన్ని అవలంబించారో గ్రహించి, వాటికి అనుగుణమైన సంస్కారాలనే తీసుకోవాలికానీ, క్రొత్త మార్గాల్లో దిగకూడదు. అలా ఎవరిమాటలో విని, గమ్యాన్నే ఆలోచించిదిగితే అందులోకాకుండా, యిందులోకాకుండా అయి పోతుంది. కాబట్టి యీమార్గాన్ని స్థిరంచేసుకోటంలో చాలతెలివి ఉపయో గించాలి. అలా మన పూర్వసంస్కారాలకు సరిపోయినదాన్ని అనుసరించాలని తీర్మానించుకుని, ఆమార్గంద్వారానే 'నేను ముక్తిపొందగలను' అనిస్థిరం చేసు కొని, తర్వాత ఎందరు ఎన్నిచెప్పినా మార్పులేకుండా ఆమార్గాన్నే అనుస రిస్తూఉండటం మార్గవిశ్వాసం అంటారు.

ఆత్మవిశ్వాసాన్ని పొంది, మార్గవిశ్వాసాన్ని దృఢం చేసుకున్నతర్వాత, ఆమార్గాన్ని ఆసాంతం ఏమహాపురుషుడు నడిచి అనుభవించాడో వెతకాలి. ఈగురు అన్వేషణలో చాలమంది మోసపోతూ వుంటారు. ఈకాలంలో అందరూగురువులే! సాధనచేసి, భగవత్సాక్షాత్కారాన్నిపొంది, లోకానికి ఉపదే శించే అర్హతను భగవదాదేశంద్వారా పొందినవాడేగురువు. అందరూ గురువులు కారు. ఈ 'గురువు' అనే పదాన్ని ఉచ్చరిస్తే రామకృష్ణుడు అంగీకరించేవాడు కాదు. సర్వసాధనలు చేసి, దేవీసాక్షాత్కారం పొంది, సకలమతసామరస్యాన్ని గ్రహించినఆయనే తనను 'గురువు' అని పిలవనీయలేదే! ఇక మిగిలినవారి సంగతి ఆలోచించుకో. ప్రస్తుతకాలంలో గురువులుఎక్కువై శిష్యులు అసలే లేరేమో అనిపిస్తుంది. యథార్థశిష్యత్వంలోనుండి యథార్థగురుత్వం వసుంది. దీనికి ఉదాహరణ శ్రీరామకృష్ణవివేకానందులే. అలాంటి గురుశిష్యులు చరి త్రలో ఎక్కడా, ఎప్పుడూలేరు, ఉండరుకూడా. శ్రీరామకృష్ణ, వివేకానం దుల జీవితచరిత్రల్ని పరిశీలనాదృష్టితో చదివితే, యీగురుశిష్యసంబంధం ఎంతగొప్పదో బోధపడుతుందినీకు. అలాంటప్పుడు సరియైన సత్యాన్వేషి మోసపోవటానికి చాలఅవకాశాలున్నాయి. అందుకని తనమార్గాన్నే అనుసరి స్తున్నవాడు కనబడితే, వాడిని కనీసం ఆరుమాసాలు పరీక్షిస్తూఉండాలి. తనకు ఏయిబ్బందులులేకుండా గమ్యస్థానాన్ని చేర్చగలడాఅని విషమపరీక్షలు చేయాలి. అలాఅన్నిరకాల సద్గుణాలున్నాయని, తనను తనమార్గంలో ఉత్కృష్టస్థితులకు తీసుకొనివెళ్ళగలడనే నమ్మకం సంపూర్తిగా కలిగినతర్వాత

వాడిని ఆశ్రయించాలి. ఒకసారి ఆశ్రయించినతర్వాత అతని అడుగుజాడలనే అనుసరించాలి. దారితొలగరాదు. వేరుమార్గంలోకి కన్నుత్రిప్పరాదు. ఆగురువుదగ్గర యింకానీవు పొందగలవిషయాలులేవు, యింకా అభివృద్ధికావాలంటే మరొకరిని ఆశ్రయించాలని మరలనిర్ధారణగా నీవు తేల్చుకొనేవరకు ఆగురువునువదలకుండా చతుర్విధ శుశ్రూషలద్వారా సేవచేస్తూ, అతని అనుగ్రహానికి పాత్రుడౌతూఉండాలి. ఇలా ఆగురువు తనమార్గాన్నే, తనగమ్యస్థానాన్నే పొందించగలడుఅనే దృఢనమ్మకాన్ని గురువిశ్వాసంఅంటారు.

పై త్రివిధ విశ్వాసాలకు మూలకారణంఅయిన ఆభగవంతునిమీద సంపూర్ణమైన నమ్మకంతోఉండటం భగవత్‌విశ్వాసంఅంటే. ఆభగవంతుని పొందటానికై ఎంతత్యాగాన్నైనా చేయటానికి పూనుకుంటూ, అందుకు ప్రాణత్యాగానికైనా ఒడిగట్టటం భగవద్విశ్వాసంలోఉండేరహస్యం. 'ఆ భగవంతుడు దయాస్వరూపుడై నాగురువును, యింకా పెద్దల్ని కడతేర్చలేదా? అలాగే నన్నుగూడా తరింపచేస్తాడు' అనేదేభగవద్విశ్వాసం. 'నాలోగల లోపాలచేతనే యింకానాకు అనుభవాలు రావటంలేదు. కాని ఆభగవంతుని ప్రేమలో లోపం ఏమాత్రంకాదు' అను దృఢత్వం భగవద్విశ్వాసం.

పైచతుర్విధ విశ్వాసాలనుచెప్పే గ్రంథాలమీదకూడా విశ్వాసంఉండాలి. మన మార్గాన్నిగూర్చి, గురువు లక్షణాల్నిగూర్చి, భగవంతునిగూర్చి అనేక రకాలు చెప్పుతూ, అనేక భక్తుల జ్ఞానుల మార్గాలను, అనుభవాలను, ఉపదేశాలను చెప్పే గ్రంథరాజాలపై విశ్వాసం తప్పకఉండాలి.

పైవిధాన అన్నిరకాల విశ్వాసం కలిగిఉండటం శ్రద్ధఅంటారు పెద్దలు. శ్రద్ధఉంటేనేగాని మార్గంఅర్థంకాదు. అసలు మార్గంయొక్క ముఖద్వారం కూడా కనిపించదు. ఆకారణంచేత యీశ్రద్ధఅనే ధనాన్ని అవశ్యం పొందితీరాలి, సాధనమార్గంలో దిగి, అభివృద్ధిగాంచి, ఆఅనుభవానందరసాన్ని ఆప్యాయంగా గ్రోలి తన్మయతపొందాలని కాంక్షించేవారంతా. ఇక నీవో!

15-3-46

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం.

# 34

# సాధనచతుష్టయము
## శమాదులు-సమాధానము

తమ్ముడూ మాతాజీ!

శమాదుల్లో కడపటిదైన సమాధానానికి వచ్చాం. సమాధానం అంటే నిర్వికారత అనవచ్చు, లేక నిశ్చలతఅనవచ్చు. పై విధానంగా అన్నివిధాల సాధన చేస్తూ, పైలక్షణాలను అన్నింటిని పొందగా, యింకా పూర్వజన్మ సంస్కార రూపంగా కొన్నిబలహీనతలుండి, వాటివల్ల మనమార్గానికి అంతరాయాలు కలుగుతూఉండవచ్చు. అవి అతిసూక్ష్మంగా లోపలుంటాయి. వీటిని గ్రహించటం చాలకష్టం. పెద్దల సాంగత్యంచేస్తూ, అప్పుడప్పుడు ఏకాంతవాసం, మౌనంఉంటుంటే, అప్పుడు యీదుష్టసంస్కారాలు పైకి కనబడుతూ ఉంటాయి. కొంచెం తలెత్తంగానే వాటిని పైకిలాగి, నిర్మూలం చేసెయ్యాలి మన బుద్ధిబలంచేత.

ఈసంస్కారాలు పూర్వజన్మవేకాక యీజన్మవికూడా ఉండవచ్చు. అంటే స్థూలంగా బయటికిరాకుండా లోపలుండేవి యీసంస్కారాలు. ఎంత కాలం జనసంఘంమధ్యఉంటామో అంతకాలం అవిబయటపడవు. పోనీ, ఏకాంతవాసంలోఅయినా, ఏగ్రంథాన్నో చదువుకుంటున్నా అవి బయటికి

రావు. మరెల్లాగలంటే మనస్సును కేంద్రీకరింపజేసి నిర్మలంచేస్తూ, ఏభావాలు లేకుండాచేస్తుంటే, అప్పుడు అవి లోపలతట్టుకోలేక, ఊదరపెట్టబడ్డ పంది కొక్కుల్లాగ బయటపడతాయి. అలాబయటపడ్డ సూక్ష్మభావాల్ని అమాంతంగా పిలకపట్టుకున్నట్లు గట్టిగాపట్టి, బయటికిలాగి నాశనంచేయాలి. దీనికి చాల నేర్పుండాలి.

అలాగైనా సాధ్యంకాకుండా, మన ప్రయత్నాల్ని నిష్ప్రయోజనంచేస్తూ, తప్పించుకుని తిరుగుతూ, ప్రక్కచాటునేఉండి, మన ఆధ్యాత్మికగమనానికి ఆటంకాలు కలుగజేస్తూఉంటయి యింకాకొన్ని అతిసూక్ష్మసంస్కారాలు. ఇవి ఎప్పుడు బయటపడుతుంటయి? మన ఏకాంతవాసంకంటే, కాష్టమౌనవ్రతంకంటే, యింకా ఏకాంతమైనస్థితి మరొకటుంది. అదే స్వప్నస్థితి. ఈ స్థితిలో ఏభావాలుకూడా దాగలేక, తాము జాగ్రదవస్థలో బయటికివచ్చి, తమ తృప్తికి అనుగుణమైన అనుభవాలను పొందలేవుకాబట్టి యీస్వప్నావస్థలో తృప్తికై ప్రాకులాడుతుంటయి. ఆసంస్కారాలు మనచిత్తాన్ని స్వాధీనం చేసుకుని, ఆచిత్తసహాయంచేత తమకుతగిన వస్తువుల్ని, మనుష్యుల్ని సృజించుకుని వాటితో ఆనందిస్తుంటాయి. అలా స్వప్నరూపంగాఉండే సంస్కారాలను మనంగుర్తించాలి. జాగ్రదవస్థకు వచ్చినపిమ్మటకూడా వాటిని జ్ఞాపకముంచుకుని, వాటిని నిర్మూలం చేయటానికి యత్నించాలి.

ఎలాగంటావు? బాహ్యంగా జాగ్రదవస్థలో ఆవేశ్యాలంగావస్తే, వాటిని నిరోధించటానికి ఏయే ఉపాయాలను యిదివరకు చెప్పానో వాటినన్నింటిని జ్ఞాపకం తెచ్చుకో. విరోధిని గెంటేసినట్లు అతితీవ్రభావంతో ఒక దుష్టసంస్కారాన్ని చూచామంటే, అదిభయపడి మనజోలికేరాదు. లేక రోజురోజుకు దాని బలంతగ్గి, కొద్దిరోజులలో అసలు మనచెంతకేరాదు. కొన్నింటిని సౌమ్యంగానే పోగొట్టవచ్చు. ఈవిధానంఅంతా ఆసంస్కారంయొక్క లక్షణాల్నిబట్టి, బలాన్నిబట్టి, సాధకునియొక్క శక్తిసామర్థ్యాల్నిబట్టిఉంటుంది. దాన్ని సాధించటానికి అనుభవంకలిగిన గురువుయొక్కసహాయం అవసరంఅనిపిస్తుంది. ఏ సంస్కారాన్ని ఎలానాశనంచేయాలో అతనికి సుగమంకాబట్టి, ఆఉపాయాలనతడు చెప్పుతాడు. దానిప్రకారం అనుసరించుకుంటే అంతాసులభమే. లేక

ఆగురువుయొక్క అనుగ్రహంసంపాదిస్తే ఆగురువు శక్తిసామర్థ్యాలు కలవాడైతే, ఒక్కస్పర్శతో శ్రీరామకృష్ణుడు వివేకానందునికి సర్వసంస్కారాలు నాశనం చేసినట్లు ఒకకరస్పర్శతో అన్నిసంస్కారాలను తీసేసి మార్గానపెట్టుతాడు. సర్వశక్తిసంపన్నుడైన గురువుకు సాధ్యంకానిది ఏదీలేదని నమ్ము.

పైవిధాన ఎప్పుడైతే మనసంస్కారాలు సద్దుమణిగిపోతాయో, వాటి బాధ మనకు ఎప్పుడుకలుగదో, అప్పుడు మనకు యీసమాధానంఅనే యీ స్థితి లభించినట్లు. ఈసంస్కారాలరూపంగాకూడాఉన్న సర్వఆటంకాలు నిర్మూలం అయితేనేగాని, మనమార్గం సుగమంకాదు. మనమార్గం మనకాళ్ళ బేరానికిరాదు. ఇది గట్టిగానమ్ముతల్లీ! ఈరహస్యం గ్రహించలేక ఎందరో సాధకులు మోసపోతున్నారు. వారికి అసలు ఆనందం ఏదోతెలియక, కేవలం బాహ్యంగా కలిగేఆనందమే అనుభవానందంఅని పొరపాటుబడి ఆసంకుచితానందంలో తృప్తిపొందుతూఉన్నారు. అందుకనే యీశమాదుల్లోఉండే రహస్యాన్ని యింతవివరంగా నీకు వ్రాయువలసివచ్చింది. అమ్మాయీ! యీ ఉత్తరంతో శమాదిషట్కంఅనేది పూర్తిచేశాను. దాంట్లో ఉపరతిఅనేది అసలు ముఖ్యంఅన్నాను. దానికి తక్కినవిఅయిదు తాబేదార్లుఅన్నాను. అందుచేత ఉపరతిని పొందటానికి తక్కినఅయిదింటిని సాధించి, నీచిత్తాన్ని ఆ ఉపరతిలో మగ్నంచేసి త్వరలోనేనీవుకాక్షించే అనుభవానందామృతపానంలో తన్మయత్వం పొంది, యీలోకాన్నంతా అతీతించి, సర్వమానవదూరమైన ఆధ్యాత్మికసంస్థితులలో మునిగిపోతావుగాక! అని యింతటితో యీలేఖను నిలుపుతున్నాను.

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం.

17-3-46

# 35

# సాధనచతుష్టయము

## ముముక్షుత్వము

అమ్మాయీ మాతాజీ!

సాధనచతుష్టయసంపత్తిలో చివరివిషయం ముముక్షుత్వాన్నిగూర్చి వ్రాయాలని నిన్ననేలనుకున్నాను. కాని వేరే ఆశ్రమంపనిఉండటంచేత మానేశాను. ఈదినం దానివిషయం వ్రాస్తున్నాను. ఇదివరకు నేను వ్రాస్తూఉన్న ఉత్తరాల అన్నింటిసారమే యీముముక్షుత్వంఅంటే. ఈముముక్షుత్వం బాగా కలగడానికే యిదివరకు యిదంతాచెప్పవలసివచ్చింది. ముఖ్యంగా యీ సాధన చతుష్టయంలో మొదటి మూడు వివేక, వైరాగ్య, శమాదులు ఉన్నప్పటికీ, యీముముక్షుత్వం లేకపోతే నిష్ప్రయోజనమే అవుతుంది. ఎలాగంటే విను.

సాధకుడు జీవితంలో ఏమాత్రంఅభివృద్ధి చెందుతున్నాడుఅని తెలుసుకోవాలంటే కొన్నిముఖ్యవిషయాలు గమనించాలి. ఆఅభివృద్ధిఅనేది మూడు ముఖ్యలక్షణాలద్వారా తెలియబడుతుంది. మొదటిది ధార్మికజీవితం, అంటే నైతికజీవితం. దీనిప్రకారం అతనికి ప్రపంచానికిఉండే సంబంధంలో, ఏ పొరపాట్లులేకుండా ఉంటున్నాడాఅనేది మొదటివిషయం. అసలు యీధార్మిక జీవితంలేకుండా ఆధ్యాత్మికజీవితం లేదనేచెప్పాలి. దీనిప్రకారం యమంలో చెప్పబడ్డ అహింస, సత్య, అస్తేయ, బ్రహ్మచర్య, అపరిగ్రహాలు పూర్తిగా నూటికి నూరుమార్కులుగా ఉండాలి. దీనివల్ల సాధకుడు శాంతి, దాంతి,

అనే శమదమాల్ని కలిగిఉంటాడు. ఎవరన్నా యీ ప్రపంచంలో తనకున్న సంబంధంలో జాగ్రత్తలేకుండాఉండి తానుజ్ఞాని అన్నాడంటే, వాడు వెర్రివాడనో, లేక మోసగాడనో మనంఅనుకోవాలి. జాగ్రత్తపడాలి. ఇలాంటివారు ప్రపంచంలో చాలమందిఉన్నారు. ఈగృహస్థులు, గురువులని పేరుపెట్టుకుని, కాషాయగుడ్డలుకూడా కట్టుతూ, యీయమంలో కాసంతైనా ప్రవేశం లేనివాళ్ళెందరులేరు? అమ్మాయీ! యిట్టివాళ్లు లెక్కలేకుండా ఉన్నారనుకో. వీళ్ళనుగూర్చి ఎక్కువగా చెప్పవలసినపనిలేదు. ఎందుకంటే యిది నిత్యానుభవంకాబట్టి. ఏఊళ్ళోచూచినా వీళ్ళే. ఏసందులోచూచినా వీళ్ళే. పైకి మెట్టవేదాంతాలు చెప్పుతుంటారు. కాని యిరుగుపొరుగువారితో కోర్టుదావాలు, బంధువులతోయుద్ధాలు, భార్యాబిడ్డలతో క్రవిరుగుడులు, ఒకటేమిటి, నానాభ్రష్టత్వాలు వీళ్ళదగ్గరే ఉంటయి. అందుకని ప్రవర్తన బాగుండాలి మొదట. తర్వాతగాని ఆధ్యాత్మికగుమ్మాన్ని ఎక్కలేరు. అందుకని సాధకుడు యీవిషయంలో తానెంతఅభివృద్ధి చెందుతున్నదీ చాలవిమర్శాదృష్టితో చూచుకోవాలి. విమర్శఅంటే తాను యితర్లను ఎంతజాగ్రత్తగా, నిష్పక్షపాతంగా విమర్శచేస్తాడో, అలాగ తనవిషయంగూడా చూడగల్గినప్పుడే వాడికి అభివృద్ధిఅనుకో. అసలు తననుసరిగ్గా విమర్శ చేసుకోగల్గితేగాని తనను గూర్చి తెలుసుకోలేడులే. ఈధార్మికజీవితం మొదటిచిహ్నంఅని తేలింది.

రెండోది వైరాగ్యం. పైజెప్పిన ధార్మికజీవితం అభివృద్ధిచెందినకొద్దీ, ప్రపంచంతో తనసంబంధం పవిత్రంఅయినకొద్దీ, ప్రపంచంలోఉండే లోటుపాట్లు ఎక్కువగా అర్థంఅవుతుంటాయి. అలాంటిప్రపంచంలో ఎంతపవిత్రమైనసంబంధమైనా తనఅభివృద్ధికి ఆటంకదాయకమేఅని గ్రహిస్తాడు. తనకూ ప్రపంచానికీఉండే సంబంధం పవిత్రంకావటమే ముఖ్యంగాని, ఆ తర్వాత కూడా యీసంబంధం తనఆధ్యాత్మికాభివృద్ధికి అవసరంకాదని ఆటంకదాయకమేఅనిగ్రహిస్తాడు. అందుకని యిక యీప్రపంచసంబంధాలు తగ్గించుకుంటానికి యత్నిస్తాడు. అదేకాకుండా యీధార్మికజీవితం గట్టిపడాలంటే దారాపుత్రాదులు, తల్లిదండ్రులు మొదలైన ఐహికసంబంధాలుండాలి. అవి ఉంటేనేగాని వీలులేదుకాని ఆధ్యాత్మికజీవితంలోఅభివృద్ధికిమాత్రం ప్రపంచం అసలు అవసరంలేనేలేదు. ఎందుకంటే నైతికజీవితంఅనేది సమిష్టిగతం. అంటే

నలుగురితో సంబంధించినది. ఇంకా కొంచెంవివరిస్తాను విను. 'నీకు నీ తల్లితో సంబంధం పవిత్రంగాఉండాలి' అన్నాననుకో. మీఅమ్మను వదలివేస్తే మీయిద్దరిసంబంధం ఎలాపవిత్రం చేసుకుంటావు? అలాగే భార్యభర్తల సంబంధం పవిత్రంగా ఉండాలంటాం. భార్యలేనివాడు ఆసంబంధాన్ని ఎలా పవిత్రంచేయగల్గుతాడు? అందుకని ధార్మికంగా అభివృద్ధిపొందాలంటే లోకం మీద ఆధారపడాలి. కాబట్టి సమిష్టిగతంఅన్నాను. అయితే అన్నిసంబంధాలు పెట్టుకుంటేనేగాని, అంటే అన్నిరకాలఅనుభవాలు పొందితేనేగాని యీ నైతిక జీవితంరాదా అనేసందేహం సహజంగా కలుగుతుంది. అందరికి యీ నియమంలేదు. వారివారి పూర్వవాసనలబట్టి సంస్కారాలనుబట్టి ఉంటాయి యీఅవసరానవసరాలు. బుద్ధికుశలతగలవాళ్లు యితర్ల అనుభవాలనుబట్టి తీర్మానాలుచేసుకుని సంబంధాలుమానేస్తారు. వీళ్ళకు పూర్వజన్మసంస్కార సంబంధంఉంటుంది. అలా అయితేనేగాని యీనిర్ణయానికిరాలేరు. ఇంకా తీవ్రంగా యీసంస్కారాలున్నవాళ్ళు యితర్ల అనుభవాలవిషయంకూడా లేకుండానే, అంటే యీప్రపంచసంబంధం లేకుండానే ఉండగలుగుతారు. అలాంటివారు చాలతక్కువమంది ఉంటారు. కాబట్టి పూర్వసంస్కారబలం చేతనేమి, ప్రస్తుతానుభవంచేతనేమి, సద్గురు అనుగ్రహంచేతనేమి, యీ ప్రపంచంతోసంబంధం తగ్గుతూఉండటం రెండోలక్షణం. ప్రపంచంలో మెలగటం, యీఐహికసుఖాలంటే అసహ్యం మొదలైనలక్షణాలు మొదట్లో యీ వైరాగ్యంలోఉంటాయి. ఈగుణాలు ఎంతఅభివృద్ధిచెందితే అంత ముందు అడుగు వేస్తున్నాడనేచెప్పాలి ఆధ్యాత్మికంగాకూడా. ఒకవేళ మొదటచెప్పిన ధార్మికజీవితంఅనేది ప్రత్యక్షంగా అందరికి, యితర్లకుకూడా కనిపించక పోయినా యీవైరాగ్యలక్షణంమాత్రం అందరికీ గోచరించేదే. మానసికంగా విరాగంఉండి, బాహ్యానికి లౌకికంగాఉంటానికి వీలులేదుకాబట్టి, యీ వైరాగ్యంఅనేది బాహ్యాభ్యంతరాల్లో కనిపిస్తూఉండాలి. అలాగా యీ వైరాగ్యం రెండో లక్షణం అన్నాను.

మూడోది దైవభక్తి. ఈప్రపంచాన్నంతా సృజించినవాడొకడున్నాడని, అతడే యీప్రపంచాన్నంతా పాలించేప్రభువని గట్టిగానమ్మి, అతనిదర్శనం పొందాలని, అతనితో మాట్లాడాలని మొదలైన అభిలాషతో యత్నించటం

అనేదే యీదైవభక్తికిఅర్థం. దీన్నే మరొకమాటలో ముముక్షుత్వం అంటారు. మోక్షాన్ని కాంక్షించేవాడు ముముక్షువు అనిఅర్థం. మోక్షంఅంటే ముక్తిఅని, ముక్తిఅంటే బంధంనుండివిడిబడటంఅని, బంధంఅంటే ప్రపంచబంధంఅని, ప్రపంచంఅంటే సర్వవిధప్రాపంచిక బాంధవ్యాలని యిదివరకే నీకు తెలుసు. ఈప్రపంచంఅనేదేసంసారం. దాన్నేజననమరణపరంపరఅనికూడా అంటారు. ఈసంసారంనుండి బయటపడితేనేగాని సరియైనఆనందం కలుగదని, యీ సంసారంలోఉండే సుఖాలన్నీ క్షణికాలేఅంటే నీటిబుడగల్లాంటివే అని సూక్ష్మంగాచూస్తే నిత్యంకాదని, అందుకని వీటికైయత్నించి ఆపాశాలలో యిరుక్కుని బాధపడటంకంటే వాటినితెంపివేసి, వాటికి అతీతమైన శాశ్వతా నందాన్ని పొందాలని యత్నించటం ముముక్షుత్వంఅంటారు. అందుకని యీముముక్షుత్వంకూడా పైరెండు లక్షణాలతోపాటు అభివృద్ధికావాలి. ఈ ముముక్షుత్వంకూడా సంపూర్ణంగాఉంటేనేగాని అసలు మన ఆధ్యాత్మికాభి వృద్ధిఅనేది సమగ్రంకాదు.

అందుకని యీమూడు ప్రవర్తన, విరాగం, ముముక్షుత్వం, అనేవి కలిసిమెలిసి అభివృద్ధిచెందుతూ ఉంటేనేగాని, సాధకుడు తన గమ్యాన్ని చేరటంలేదుఅని తీర్మానం. ఈమూడింటిలో ఏఒక్కటి లేకపోయినా ఏమీ ప్రయోజనంలేదు. ఇదివరకు ప్రవర్తన, విరాగం, విషయాలు క్షుణ్ణంగా విన్నావు. కాబట్టి యిక ముముక్షుత్వం విషయంకూడా వినాలి.

ఈ ముముక్షుత్వంకూడా మరల మూడురకాల ఉంది. మందం, మధ్యమం, తీవ్రం అనేవే యీమూడు. వీటినిగూర్చి రామకృష్ణుడు ఒక ఉప మానంతో చక్కగాచెప్పాడు. ఎద్దులబేరగాళ్ళు ఎద్దుల పరీక్షకువస్తారు. ఒక ఎద్దు పడుకునివుంటుంది. దగ్గరకువచ్చి దాన్నితాకుతారు. అయినా అది అలాగే పడుకొనివుంటుంది. నిలబెట్టిచూడాలి. అందుకని కొడతారు. ఎంత సేపటికీ లేవదుగా! బాగాకొట్టగా తర్వాతలేస్తుంది. మరొకదానిదగ్గరకు పోతారు. వీళ్ళురాగానే అదిమెల్లగా లేచినిలుస్తుంది వాళ్లుకొట్టకముందే. తర్వాత మరొకదానిదగ్గరకు వెళ్ళుతారు. ఆఎద్దు వీళ్ళు దగ్గరకు రాకముందే లేచినిలిచి, అమితచురుకుగా వీరివంకచూస్తుంది. మంచి నాణ్యంతెలిసిన బేర గాడేమిచేస్తాడు? మొదటి రెండురకాలను తోసేసి మూడోదాన్నికొంటాడు.

ఎందుచేత? దాని చురుకుదనాన్నిచూచికొంటాడు. ఇదితీవ్రజాతికిచెందింది. అదే ఉత్తమజాతిఅంటారు. రెండోది యింతతీవ్రత లేనిది. కాబట్టి మధ్యమం అయింది. మూడోది మందంఅయింది. అది అధమజాతిది అన్నమాట.

ఈవిధంగా ముముక్షువుల్లోకూడా మూడురకాలవాళ్లు వున్నారు. ఉత్తమతరగతివాళ్లు చాలతీవ్రంగాఉంటారు. వీరుఒకరిచేత చెప్పించుకోరు. గర్వంచేతకాదుసుమా! సంస్కారపూర్వకంగా వీళ్ళకు అన్నిలక్షణాలు యిది వరకేఉన్నయి. వీళ్ళవైరాగ్యం చాలతీవ్రంగా వుంటంచేత, శాస్త్రంలో చెప్పి నట్లు చిన్నప్పటినుండి సన్న్యాసం పుచ్చుకుంటారు. వీళ్ళజ్ఞానానికి, భక్తికి, అంతంవుండదు. వీరికి గురువుకూడాలేకుండా ఉండవచ్చు. ఒకవేళ వున్నా అతడు కారణమాత్రంగురువేకాని, యీఉత్తమజాతి శిష్యుడిదగ్గర తానే శిష్యుడిలాగాఉంటాడు. రామకృష్ణునిదగ్గర ఆయనగురువులెలా ప్రవర్తిం చారు? వాళ్ళకే బోధచేసేవాడు మనరామకృష్ణుడు. ఈఉత్తమజాతి ముముక్షు వుల్ని అరికట్టడానికి ఎవరిచేతకాదు. ఆబ్రహ్మకైనా కాదనుకో. 'ఆ జాతివారిని అరికట్టాలనేయత్నం గంగాప్రవాహాన్ని అరచేతితో ఆపటానికి యత్నించటం లాంటిది. ఆకాశంలోపోతుండేమేఘాన్ని నిలబెట్టయత్నించినట్లు అన్నాడు వివేకానందుడు. నిజంగా అంతేకూడా. ఈప్రపంచం ఎంతయత్నించినా వీరి ధాటికి తట్టుకోలేదు. విసిగి ఊరుకోవాలిసిందే. అలాగేగా మీరాబాయిని ఆమె అత్త, భర్త, ఎంతబాధపెట్టారు! ఆమెనేమైన మార్చగలిగారా! సక్కును మాత్రం ఏమిమార్చింది ఆమెఅత్త? ఇంతెందుకు మన గౌరీమాయిజీవితం విన్నావుగా! ఆమెకు పెండ్లిచేద్దామనికూడా యత్నించి, ఆమెకుతెలియకుండా అన్నియేర్పాట్లుచేసి, పెండ్లికూతురుగాకూడా చేశారుగదా! పెండ్లి చేయగలి గారా? తీవ్రముముక్షుత్వం ఉంటంచేత ఆరాత్రే, తనసొంతఅమ్మే కలకత్తాకు బయట వదిలిపెట్టిపోలేదూ? అప్పుడుగౌరీమాయికి ఏమిప్రాజ్ఞత వచ్చింది? పన్నెండోసంవత్సరమేగా! ఇక ప్రహ్లాదునివిషయం జగద్విదితమేగదా! వాళ్ళ నాన్న. అబ్బా! ఎంత బాధపెట్టాడు! చంపించాలని యత్నించలేదూ? ఏమైనా చేయగలిగాడా? అన్నియత్నాలు ఎగిరిపోయాయి. అలాంటిది తీవ్రముముక్షు వులప్రభావం. వాళ్ళకెదురులేదనుకో ప్రపంచంలో. ఈలోకం, దీనిలోఉండే శక్తులన్నీ వాళ్ళకు తృణప్రాయంఅంటే నమ్ము. అసలు ఆమూర్తిని చూస్తేనే

ప్రపంచం గజగజలాడుతుంది. అతడు కొడతాడా? లేదు. శాంతిచంద్రికలు ముఖాన చిందులుద్రొక్కుతున్నా, చిరునవ్వు తాండవిస్తున్నా, ప్రపంచం అతని దగ్గరికేపోలేదు. ఇక అతనిబాటకు అడ్డంకులేమిటి? పువ్వుపుట్టగానే పరిమళం వెదజల్లునట్లు యీఉత్తమజాతి పురుషులు పుట్టగానే, వాళ్ళగొప్పదనం చిన్నప్పటినుండి బయటపడుతూనేఉంటుంది. వీళ్ళు తమ సొంతఆనందానికేకాకుండా యింకా అనేకులకుకూడా తర్వాత ఆనందాన్నియిచ్చే మహాపురుషులుగాఉంటారు. వీళ్ళజన్మ లోకకళ్యాణానికి తోడ్పడేదిఅనుకో. ఆధ్యాత్మికప్రపంచంలో అనేకులకు మార్గదర్శకులౌతారు యీఉత్తమజాతి ముముక్షువులు. ఇలాంటివాళ్ళెందరుంటారు? నూటికి, కోటికి ఒకరుతప్ప ఎక్కువ ఉండనేఉండరు. ఆకాశంలో ఎన్నినక్షత్రాలులేవు? కాని చంద్రుడొక్కడేగా! అలాగే యిలాంటిముముక్షువు చాలఅపురూపంగా ఎక్కడోఒకడుంటాడు. కానిఎక్కువగా దొరకనేదొరకరు. ఇలాంటివాళ్ళనే కొందరు విద్వత్సన్న్యాసులు అంటారు. అట్టిమహనీయులను కొందరినిచూచేఅదృష్టం నాకు కలిగింది.

ఇక రెండోరకం మధ్యమంఅన్నాం. వీళ్లు చిన్నప్పటినుండి ముముక్షుత్వంవున్నా లేకపోయినా, మొదటివాళ్ళకుండే తీవ్రత లేకపోవటంచేత అంటే పూర్వసంస్కారాలు బలీయంగా లేకుండటంచేత చిన్నప్పుడే సన్న్యసించరు. కాని ఉద్దేశ్యంమాత్రంఉంటుంది. సత్సాంగత్యంఅంటే అభిలాష, సద్గ్రంథాల్ని చదవటం మొదలైన మంచిలక్షణాలన్నీఉంటాయి. కాని తగిన పట్టులేకపోవటంచేత గొప్పత్యాగాలు నిర్లక్ష్యంగాచేయలేరు. వీళ్ళకు యోచనలు ఎక్కువ. ఆలోచించికాని ఏకార్యంచేయలేరు. అందుకని కొంచెం కాలయాపన జరుగుతూఉంటుంది. వాళ్ళను మార్గంలో పెట్టటానికి తమశక్తిచాలకపోవటంచేత యితర్లసాయం కావలసిఉంటుంది. అటువంటివాళ్ళను సరిగా మార్గాన పెట్టి, నడిపించటానికి శక్తిసామర్థ్యాలుకలిగి, బాధ్యత పెట్టుకోదగిన ఉపదేశకుడు, అంటే గురువుఒకడు వారికిఅవసరం. అలాంటివాడికొరకై యితడు వెతకాలికూడాను. ఇలాగ స్వతస్సిద్ధంగా తనకులేని మోక్షకాంక్షను అభివృద్ధి చేయటానికి యితనికి శక్తిచాలదు. ఇతడు గ్రంథాలమీద ఎక్కువగా ఆధారపడాలి. ఇలాగపరాపేక్షతో తంటాలుపడగాపడగా అభివృద్ధికివస్తాడు. క్రమక్రమంగా తీవ్రముముక్షువుకుండే లక్షణాలన్నీ యితడికికూడా లభిస్తాయి. ఇతడు రెండోతరగతికివాడు అంటేమధ్యముడు. ఇలాంటివాళ్ళనే వివిధిష

సన్న్యాసులుఅని అంటారు.

తర్వాత మూడోరకం ఎంతచెప్పినా ప్రయోజనంలేదు. తిట్లుతినాలి గురువునుండి. రోజూ చీవాట్లేతినాలి. ఎంతచదివినా బుద్ధికుదరదుగా! పెద్దల సాంగత్యంఉన్నదికాని ఏమిలాభం? రోజూ గురువువల్లకలిగే దండనవల్ల భక్తి కంటే భయంప్రధానమై, ధ్యానాదులు, చదువులు, అభ్యాసాలు వీళ్ళకు సాగు తుంటాయి. ఈభయంవల్ల శ్రద్ధ, మరల యీశ్రద్ధవల్ల భక్తి, వీటివల్ల వైరాగ్య జ్ఞానాలు క్రమక్రమంగా కలుగుతయి. కాని చాలమందగమనం. వీళ్ళ అభివృద్ధి నత్తనడకేఅనుకో. సాధారణంగా వీళ్ళకు అసలు యీఆధ్యాత్మికమార్గం మీదైనా బుద్ధిపుట్టటం పూర్వసంస్కారంకంటే, సత్సహవాసంకంటే, సాంసా రికబాధలే కారణంఅయిఉంటయి. ఎక్కువగా ప్రేమిస్తున్న భార్యమరణిస్తే యిలా మారతారు కొందరు. ఆర్థికంగా దివాలాఅయితే విరాగంవస్తుంది కొందరికి. ఇలాంటివారే సర్వేసర్వత్రా ఉండటంచేత వీళ్ళనుగురించి ఎక్కు వగా వ్రాయవలసిన అవసరంలేదు. వీళ్ళు, మొదట్లో తంటాలుపడినతర్వాత అభివృద్ధికి రాగలరు. వీళ్ళే మందముముక్షువులు. ఇలంటివాళ్ళు సన్న్యాసం తీసుకుంటే మర్కటసన్న్యాసం అంటారు శాస్త్రంలో.

పైవిధంగా ముముక్షుత్వంఅనేది మంద, మధ్యమ, తీవ్రంఅని మూడు రకాలఉంటుందని సారాంశం. వీళ్ళనే మందమాధికారి, మధ్యమాధికారి, ఉత్తమాధికారి అనికూడాఅనవచ్చు. ముముక్షుత్వం పైరీతిగా అభివృద్ధిచెందా లంటే అంతకుపూర్వంచెప్పబడ్డ రెండులక్షణాలు ప్రవర్తన, విరాగాలు గట్టిగా ఉండాలి. ఈమూడు కలిసిఉంటేనే, మూడు సక్రమంగా అభివృద్ధిచెందుతూ ఉంటేనే, మనం ఆధ్యాత్మికమార్గంలో ముందడుగు వేస్తున్నట్లుగాని, వేరు విధానంలేదని సారాంశం. ఈవిషయాన్ని తనలో చూచుకుంటూ అభివృద్ధిని యీలక్షణాలద్వారా తెలుసుకుంటూఉండాలి. అమ్మాయీ మాతాజీ! ఈ లేఖతో సాధనచతుష్టయ సంపత్తినికూడా పూర్తిచేశాను. ఈ విషయాల్ని గ్రహించి, విమర్శించి, ఆచరించుకో.

ఆతడే మన దిక్కు.
ఆతడే మన గమ్యం.

(signature)
18-3-46

# 36
# అనుభవానందము

అమ్మా మాతాజీ!

మొన్నటిఉత్తరంతో, నేను వ్రాయాలనుకున్న, ప్రస్తుతం నీకు అవసరం అయిన విషయాలన్నిటిని పూర్తిచేశాను. మొదటి మూడు, నాలుగు ఉత్తరాల్లో సామాన్యవిషయం, తర్వాత కర్మ, రాజ, భక్తి, జ్ఞానయోగాలను గూర్చి, చివరికి వివేక, వైరాగ్య, శమాది, ముముక్షుత్వాలనున్న సాధనరహస్యాన్నంతా విన్నావు. ఈఉత్తరాలద్వారా సాధనఅంటే ఏమిటో, ఆసాధనకు ఏయే లక్షణాలవసరమో, ఆసాధనయొక్క గమ్యంఏదో, ఆగమ్యాన్ని పొందినవాడెలాఉంటాడో మొదలైన ముఖ్యవిషయాలనుచూచావు. ఈఆధ్యాత్మిక మార్గంలోఉన్న ఔన్నత్యం, అనుభవానందంలోగల ఆధిక్యత గ్రహించావు. దీనికి, ప్రపంచసుఖాలకి పోల్చిచూచుకొని, యీప్రపంచసుఖాలయొక్క క్షణికత్వం, అల్పత్వం, నీచత్వం గ్రహించావు. ఇంతమాత్రంతో నీపని పూర్తి కాలేదు. ఎప్పుడు గ్రహించినదాన్ని అనుష్ఠానంలోకి తెచ్చుకుంటావో, అంటే హేయత్వంగా కనిపించే విషయసుఖాలను వర్జించి, దగ్గరకైనా రానీయకుండా ఆమహదానందరూపమైన బ్రహ్మవిభూతిని పొందుతావో అప్పుడు నీపని పూర్తిఅయినట్లు. అంతవరకు నీకు నిద్రఉండరాదు, నాకునిద్రఉండకూడదు.

అయితే అట్టిఆనందవిభూతిని పొందటం అంతసులభమా? కాదు. దానికవసరంఅయిన అన్నిలక్షణాల్ని సమగ్రంగాపొందాలి. ఇప్పుడు యీఉత్త రాల్లోఉన్న లక్షణాల్ని విభజించిచూస్తే కొన్నిమార్దవం అయినవి, కొన్ని కఠినం అయినవిగాఉంటయి. కరుణ ముదితాదులు, శమాదులు మృదువుగా ఉంటాయికాని వైరాగ్యం మొదలైనవాటిలో కొంచెం కఠినత్వంఉంటుంది. ప్రేమించటానికి, ప్రేమను తెంచెయ్యటానికి భేదంలేదూమరి! మొదటిది సత్వాంశం, రెండోదిరజోఅంశం. మొదటిది ఎక్కువగా స్త్రీలలో గోచరిస్తూ ఉంటుంది, సామాన్యంగా స్త్రీలు మృదుహృదయులుకాబట్టి. రజోఅంశం పురుషుల్లోఉంటుంది, వాళ్ళు సహజంగా ఆలక్షణంతో ఉంటారుకాబట్టి. యథార్థానికిచూస్తే మార్గంలో అభివృద్ధికావాలంటే, యీరెండు లక్షణాలు, అంటే రజోసత్వాంశాలు చేదోడువాదోడుగా ఎప్పుడూ పనిచెయ్యాలి. అంటే స్త్రీలలోఉండే మృదుత్వం తత్సంబంధమైన సల్లక్షణాలు, పురుషుల్లోఉండే ధైర్యస్థైర్యాది మంచిలక్షణాలు అభివృద్ధికావాలి సాధకునికి. పరిపూర్ణత్వం పొందాలంటే స్త్రీత్వం పురుషత్వం సగంసగపాళ్ళగా ఎప్పుడుంటాయో అప్పుడే సాధకుని అభివృద్ధి.

కాబట్టి అమ్మాయీ! నీవు బాగావిచక్షణాజ్ఞానాన్ని ఉపయోగించి, యీస్త్రీపురుషుల ఏకస్వరూపానివి ఎప్పుడౌతావో అప్పుడేనీకు ఆధ్యాత్మికా నందంకలిగేది. స్త్రీలు స్త్రీత్వాన్ని నిలుపుకుంటూ పురుషత్వాన్నిసాధించాలి. పురుషులు స్త్రీలక్షణాలనుపొందాలి. అట్టి లింగభేదమునకతీతమైనస్థితిలో ఉంది ఆధ్యాత్మికానందవైభవం. అదే అర్ధనారీశ్వరతత్త్వం. దానికై తీవ్రంగా యత్నించు. నీకు సాధ్యంఅవుతుందని నానమ్మకం. అలా అగుదువుగాకలని ఆశీర్వదిస్తున్నాను. అట్టిస్థితిలో స్త్రీ స్త్రీకాదు, పురుషుడు పురుషుడేకాదు. అప్పుడే శుద్ధబ్రహ్మలక్షణం మూర్తీభవించిఉంటుంది. ఈవిషయాన్నిగూర్చి వివరాలుకావాలంటే అతివిచక్షణాబుద్ధితో మహాపురుషులజీవితాల్ని పఠించు, యీరహస్యం బోధపడుతుంది. వాళ్ళను ఆదర్శంగాపెట్టుకొని సాధన రంగంలో దిగు. అంతా సులభంఅయి సాధ్యం అయిపోతుంది.

చిన్నతనానే నీకిట్టి ఆధ్యాత్మికసంస్కారాలుఉండి, వాటికితగిన ఆర్తి

కూడా ఉందికాబట్టి అధికోత్సాహంతో యీఉత్తరాలను వ్రాశాను. వాటిని నీవు సక్రమంగా అర్థంచేసుకుంటున్నందుకు చాలవరకు ఆచరణలోకూడ పెట్టుతున్నందుకు చాలసంతోషిస్తున్నాను. ఇలాగే పట్టుదలతో ఆమార్గాన్ని నడిచి, సర్వాధ్యాత్మికానందసంపదను గడించి, ప్రపంచాతీతసంస్థితులలో మగ్నవై, సదా అనుభవానందరూపివై ప్రకాశించెదవుగాక! మన దేవదేవుడును, సర్వాధ్యాత్మికానుభవనిధానమును, మహాప్రభువునుఅయిన శ్రీరామకృష్ణ గురుదేవుడు, నీకు సదాతోడునీడయ్యై యుండుగాక! త్రిలోకజనని, ప్రేమ స్వరూపిణిఅయిన మనఅమ్మ శ్రీశారదామాయి, నిన్ను జాగ్రత్తగా మార్గ మున అభివృద్ధినొందింపజేసి, అచిరకాలంలో, అట్టి అమానుష అనుభవస్థితు లలో నిన్ను అధిష్ఠింపజేయుగాక!

ఆతడే మన దిక్కు
ఆతడే మన గమ్యం.

(signature)

**20-3-46**

# ప్రచురణములు

సర్వ సిద్ధాంత సౌరభము (12 సంపుటములలో)

మన భారతీయ సంస్కృతీ వాఙ్మయమునుగూర్చి పరిశోధనాత్మక (Re-search) గ్రంథములు. (The vision and voice of Indian Philosophy) సుమారు 4,000 పుటలలో కలదు.

1. **సాంఖ్య, యోగములు** : (3 వ ముద్రణ) సాంఖ్య, యోగ విషయములతో శ్రీకపిల, పతంజలి, మహర్షుల జీవితకాల విశేషములు, సిద్ధాంతములు యిందు విరచితము. 35.00

2. **వైశేషిక, న్యాయములు** : (2వ ముద్రణ) శ్రీకణాద, గౌతమ మహర్షుల జీవితకాల విశేషములు, వైశేషిక, (Atomic Theory) న్యాయసిద్ధాంతము, పండితాభిప్రాయములతో రచితము. 35.00

3. **మీమాంస, వేదాంతములు** : (2వ ముద్రణ) జైమిని, వ్యాస మహర్షుల జీవితకాల సిద్ధాంతములు, ఆధునిక పండితాభిప్రాయములతో రచితము. 35.00

4. **శ్రీ శంకరపూర్వాద్వైతము** : (2వ ముద్రణ) వేదములనుండి శ్రీ శంకరులవరకు ప్రవహించు అద్వైతరస ప్రవాహమును తెలుపు విపుల గ్రంథము. అద్వైత సిద్ధాంతమునకు, ఆధునిక భౌతిక విజ్ఞానమునకు సమన్వయము జూపును. 35.00

5. **శ్రీ శంకరాద్వైతము** :(2 వ ముద్రణ) శ్రీ శంకర జీవితకాల విశేషములు, అద్వైతసిద్ధాంతము విస్తృతముగా యిందు వివరింపబడినవి. సన్న్యాస ప్రాశస్త్య, అధికార వివరములు కలవు. 35.00

6. **శ్రీ శంకరానంతరాద్వైతము** : (2వ ముద్రణ) శ్రీ సురేశ్వర, శ్రీ విద్యారణ్య జీవితకాలవిశేషములతో ద్వైతసిద్ధాంతము లిందు చర్చితము. 35.00

7. **విశిష్టాద్వైతము** : (2వ ముద్రణ) వేదములనుండి వైష్ణవ సిద్ధాంత జనన చారిత్రము, శ్రీరామానుజ జీవిత సమీక్ష, విశిష్టాద్వైత సిద్ధాంత వివరములిందు ప్రస్ఫుటము. 35.00

8. **వైష్ణవము** : (3వ ముద్రణ) శ్రీమధ్వాచార్యునినుండి శ్రీకృష్ణ చైతన్యునివరకుగల వైష్ణవాచార్యుల జీవితసిద్ధాంత విషయము లిందు సమీక్షింపబడినవి. 35.00

9. **శైవము** : (3వ ముద్రణ) వేదముల రుద్రాధ్యాయ జనితమైన శైవసిద్ధాంతము వీరశైవమువరకు ఎట్లు పరిణమించియున్న దియు నిట స్పష్టము. నాయనారుల జీవితములు కలవు. 35.00

10. **శాక్తేయము** : (3వ ముద్రణ) వేదాంతర్గత దేవీసూక్త అదితి ప్రస్తావనముతో ప్రారంభమై, దక్షిణ వామాచారరూపమున సర్వత్ర ప్రఖ్యాతి నొందిన శాక్తసిద్ధాంత సాధనములతో వివరింపబడినది. 35.00

11. **బౌద్ధము** : బౌద్ధ సిద్ధాంతము- ప్రాముఖ్యత, శ్రీబుద్ధ భగవానుని, జీవిత విశేషములు పరిశీలనాత్మకముగా వివరింపబడినవి. (అచ్చులో)

12. **సర్వ సిద్ధాంత సౌరభ సారము** : సులభశైలిలో సౌరభమును గూర్చి వివరణాత్మక గ్రంథము. (అచ్చులో).

13. **సాధన రహస్యము** : (10వ ముద్రణ) ముముక్షువులు సాధన ఎలా చేయాలి? దాని ఫలితములు, ఆధ్యాత్మికాభి వృద్ధికి మార్గములు, చక్కని వ్యావహారిక భాషలో తెల్పి, అశేష ప్రజాదరణ పొందిన మహోత్కృష్ట గ్రంథరాజము. 80.00

14. **సాధన మకరందము** : (4వ ముద్రణ) సాధన విషయములే కాక, అనేక నిత్యావసర విషయముల విచారణమిందు కలదు. శ్రీ స్వాములవారి జీవితమున జరిగిన కొన్ని సంఘటనలు యిందున్నవి. (అచ్చులో)

15. **సాధనసుధ** : (4వ ముద్రణ) సాధనలో దగులు ఆటంకముల నివారింప అమూల్యమగు సలహాలనొసంగు గ్రంథము. శ్రీ స్వాములవారి జీవితమున జరిగిన కొన్ని సంఘటనలు యిందు కూర్చబడినవి. (అచ్చులో)

16. **దివ్య యోగ సాధనరహస్యము** : వచన కవిత్వమున సాధన రహస్యమును గూర్చి అద్భుతమైన గ్రంథము. సాధనను గూర్చిన చిత్రములుకూడ కలవు. 10.00

17. **సాధనరహస్యము - సమగ్రపరిశీలనము** : సాధన రహస్యము, సాధన మకరందము, సాధనసుధ, అనుభవరహస్యము మొ. గ్రంథముల పరిశీలనాత్మకము. (అచ్చులో)

18. **మన రామకృష్ణుడు** : (4వ ముద్రణ) జగద్గురు శ్రీరామకృష్ణుని అద్భుతాదర్శ, సాధనా వివరముల తెలుపు శ్రీ మాతాజీ విరచిత మహత్తర గ్రంథము. (అచ్చులో)

19. **మన శారదామాయి** : (4వ ముద్రణ) జగన్మాత శ్రీ శారదామాయి జీవితోపదేశముల వివరించు శ్రీ మాతాజీ విరచిత ఉత్సాహపూరిత గ్రంథము. 6.00

20. **మన వివేకానందులు** : (4వ ముద్రణ) వేదాంత కేసరి శ్రీ వివేకానందుని జీవితాదర్శముల ప్రబోధించు శ్రీ మాతాజీ విరచిత ఉత్కృష్ట గ్రంథము. (అచ్చులో)

21. **శాంతి సామ్రాజ్యము** : (2 వ ముద్రణ) శాంతిసిగోరు నేటి ప్రపంచమునకు శాంతి ప్రబోధగావించు ఉత్తమ గ్రంథము. 1.00

22. **శ్రీ రామకృష్ణాదర్శము** : (3వ ముద్రణ) : శ్రీ రామకృష్ణుని, సాధన, సిద్ధుల రహస్యముల వివరించు గ్రంథము. (అచ్చులో)

23. **శ్రీ శారదాదర్శము** : (2వ ముద్రణ) ఇందు శ్రీ శారదాదేవి గొప్పదనము మన హృదయముల గదిలించును.

24. **శ్రీ వివేకానందాదర్శము** :(3వ ముద్రణ)శ్రీ వివేకానందుని ఆదర్శవ్యక్తిత్వములిందు ప్రస్ఫుటముగా విరచితము. (అచ్చులో)

25. **శ్రీ అనుభవానందాద్శము** : ఇందు శ్రీ అనుభవానంద స్వాములవారి అనుభవాదర్శానుభవములు గోచరము. (అచ్చులో)

26. **మాండూక్యరసాయనము** : (3వ ముద్రణ) మాండూక్య ఉపనిషత్తుకు, 108 ఉపనిషత్తుల ముఖ్య మంత్రములతో, శ్రీ గౌడపాద కారికలతో శ్రీ అనుభవానందుల అద్భుత వ్యాఖ్యానము. (అచ్చులో)

27. **భగవద్గీత** : (Pocket size) పారాయణము

28. **ప్రాచీన భగవద్గీత** : (2వ ముద్రణ) (Revised Edition) 745 శ్లోకములు గల గీత. ఇది భోజపత్ర వ్రాత ప్రతినుండి గ్రహింపబడి, శ్రీ అనుభవానందులచే పీఠిక వ్రాయబడినది. 10.00

29. **శ్రీ రామకృష్ణపూజ** : (3వ ముద్రణ) పూజా విధానము. శ్రీ రామకృష్ణ అష్టోత్తరశతమునకు ఉపనిషత్ ముఖ్యమంత్ర ములతో శ్రీ త్యాగీశానందుల చక్కని వ్యాఖ్యానము కలదు. 8.00

30. **శ్రీ రామకృష్ణ లీలా సంకీర్తన** : (6 వ ముద్రణ) భక్తి, జ్ఞాన వైరాగ్య ప్రబోధక భజనలు, కీర్తనలు, సంకీర్తనలు 169 (ఇందులోని కొన్ని పాటలు స్టీరియో కేసెట్స్‌గా విడుదలై బహుళ ప్రచారము పొందినవి). 6.00

31. **శ్రీ రామకృష్ణ - వివేకానంద కథాగానములు** : శ్రీరామకృష్ణ వివేకానందుల జీవితములు ప్రదర్శించుటకు అనుగుణ్యముగా శ్రీస్వాములవారిచే విరచితము. ఆంధ్రదేశమున అనేక ప్రదర్శ నలు యీయబడినవి. 3.00

32. **యుగావతారము** : శ్రీ రామకృష్ణుని జీవితము, వచనము మరియు పాటలు, పద్యములతో కూర్చబడి, చక్కని భాషలో వ్రాయబడినది. అనేక కార్యక్రమములు యివ్వబడినవి. 10.00

33. **యతిసంప్రదాయము** : వేదకాలమునుండి నేటి వరకు సన్న్యాసములోగల మార్పులను, సన్న్యాసి-సంఘముల మధ్యగల సంబంధమును వ్యక్తపరచు అపూర్వ గ్రంథము. 2.50

34. **శ్రీ రామకృష్ణాంజలి** : (6వ ముద్రణ) భక్తి ఉత్సాహపూరిత శతకము. వివరణముతో. 3.00

35. **శ్రీ దక్షిణేశ్వరీ స్తవము** : (5వ ముద్రణ) శ్రీ కాళికాదేవిని గూర్చి భక్తితో తత్త్వవిషయముల ప్రబోధించు శతకము. వివరణముతో. 3.00

36. **చిత్తప్రబోధ** : (5వ ముద్రణ) సాధకులకు అనేక సాధనా విషయములను, అమూల్య రహస్యములను, మనోతత్త్వమును బోధించు శతకము. వివరణములతో. 3.00

37. **అనుభవానందము** : (౬వ ముద్రణ) అద్వైతానందవిభూతి వ్యక్తపరచు, అద్భుతానుభవ శతకము. 2.00

38. **శ్రీ లలితార్చనా వైభవము** : శ్రీ మాత పాదపద్మారాధన యందలి స్థూల, సూక్ష్మాది ఉపాసనా రహస్యములు శ్రీ లలితా సహస్రనామ స్తోత్రపరముగ శ్రీ మాతాజీ త్యాగీశానందులవారి అపూర్వ సమన్వయము. (అచ్చులో)

39. **పరమహంస** 0.50

40. **స్వామి వివేకానంద** 0.50

41. **సాధన రహస్యము** (కన్నడము) 50.00

42. **సాధన రహస్యము** (తమిళము) 50.00

43. सर्व सिद्धांत सौरभ (Hindi) Vol. 7,8,9,10 @50.00

44. सर्व सिद्धांत सौरभम् (Sanskrit) Vol. 1. 50.00



చింతింపకుము సోదరా! భయ మొందకుము!!

# భారతీయ ఆధ్యాత్మిక విజ్ఞాన సర్వస్వము

అనాదికాలగత భారతీయాధ్యాత్మిక విజ్ఞానవైభవము నొకపరి దిలకింపుము! ఆ యమూల్య సుధాప్రవంతి నీ శరీర రక్తనాళములందు అంతర్గతమని గ్రహింపుము! నీ నిజస్వరూపమును గుర్తించి, నీ ప్రశాంత ఆధ్యాత్మిక చంద్రికల నీ కల్లోలిత ప్రపంచముపై బ్రసరింపజేయుము!

అనుభవ స్వరూపులు

శ్రీ అనుభవానందస్వామికృత

# సర్వ సిద్ధాంత సౌరభము

భారతపుత్రా! లేవోయీ! అని మేల్కొలుపును!

(12 సంపుటములలో) (సుమారు 4,000 పుటలలో)



ఇందులోని కొన్ని గ్రంథములు సంస్కృతము, హిందీ, భాషలలో కూడా ప్రకటింపబడినవి. మరికొన్ని భాషలలోకూడా అనువదింప బడుచున్నవి.

1. సాంఖ్య, యోగములు 2. వైశేషిక, (Atomic Theory), న్యాయములు, 3. మీమాంస, వేదాంతములు, 4. శ్రీశంకరపూర్వాద్వైతము, 5. శ్రీశంకరాద్వైతము, 6. శ్రీశంకరానంతరాద్వైతము, 7. విశిష్టాద్వైతము, 8.వైష్ణవము, 9. శైవము, 10. శాక్తేయము, 11.బౌద్ధము (అచ్చులో), 12.సర్వ సిద్ధాంత సౌరభ సారము (అచ్చులో) (సౌరభముపై వివరణాత్మక గ్రంథము).

# విని ఆనందించండి! తన్మయత్వం పొందండి



మీ హృదయాలను స్పందింపజేసి, ఆనందరసాస్వాదనములో తన్మయత్వము గావించు స్టీరియో కేసెట్. చక్కని సంగీతముతో, మధురమైన పాటలతో, ప్రముఖ గాయనీగాయకుల అద్భుతగానముతో రికార్డింగ్ చేయబడి, ముముక్షువులను దివ్యానందానుభూతులలో ఓలలాడిస్తూ, తమ దైనందినజీవితమున అత్యంత సహాయముగా ఉండు మా ప్రీ రికార్డెడ్ కేసెట్స్ (Pre Recorded Cassettes)

1. శ్రీ రామకృష్ణ గానసుధ (భక్తి పాటలు) 40.00

పై కేసెట్ గాయనీ గాయకులు : ఎం.బాలమురళీకృష్ణ, పి.సుశీల, జి.ఆనంద్, ఎం.శారద, వి.రామారావు, శ్రీ మాతాజీ త్యాగీశానంద. రచనః శ్రీ అనుభవానందస్వామి, శ్రీ మాతాజీ త్యాగీశానంద. సంగీతం : శ్రీ బి.చిట్టిబాబు.

2. శ్రీ రామకృష్ణ జీవిత కథాగానము : 40.00

మాతాజీ త్యాగీశానందులవారి వ్యాఖ్యానముతో, భక్తిరసము తొణికిసలాడునట్లుగా శ్రీ బెనర్జీ భాగవతార్ అద్భుతముగా గానము చేసిన కేసెట్. రచన : శ్రీ అనుభవానందస్వామి, శ్రీ మాతాజీ త్యాగీశానందులు.

---

ప్రాచీన కాలమునుండి నేటివరకు అవిచ్ఛిన్న ప్రవాహమగు మన భారతీయ సంస్కృతీ వైభవాన్నిగూర్చి శ్రీ మాతాజీ త్యాగీశానందులవారి అనర్గళోపన్యాసముల కేసెట్లు. ఉపోద్ఘాతము : బ్రహ్మచారి సుధాచైతన్య - గీతరచన : శ్రీ అనుభవానందస్వామి. గాయనీ గాయకులు : శ్రీ ఎం.శారద, శ్రీ జి. ఆనంద్. సంగీతం : శ్రీ బి.చిట్టిబాబు.

3. భారతీయ సంస్కృతిః 1 వభాగం 40.00

4. భారతీయ సంస్కృతి :2వ భాగం. 40.00

భగవద్గీత యందలి 18 అధ్యాయములకు శ్రీ మాతాజీ త్యాగీశానందులవారి మహోన్నత ఉపన్యాసములు. ఉపోద్ఘాతము : బ్రహ్మచారి సుధాచైతన్య, సంగీతము, మరియు శ్లోకముల గానము : శ్రీ యం. శారద.

| | | |
|---|---|---|
| 5. కర్మయోగము | : (1-6 అధ్యాయములు) | 40.00 |
| 6. భక్తియోగము | : (7-12 అధ్యాయములు) | 40.00 |
| 7. జ్ఞానయోగము | : (13-18 అధ్యాయములు) | 40.00 |

పుస్తకముల, కేసెట్ల పైకమును ముందుగా D.D. ద్వారా, లేక M.O. ద్వారాగాని పంపవలయును.

| | |
|---|---|
| శ్రీరామకృష్ణ భక్త సమాజం<br>శ్రీఅనుభవానంద గ్రంథమాల<br>11-1-13, యం.జి.రోడ్<br>బాపట్ల - 522 101.<br>గుంటూరు జిల్లా. | శ్రీ శారదా రామకృష్ణ సంఘం<br>స్వామి అనుభవానంద యోగకేంద్రం,<br>శివాలయం వీధి<br>భీమునిపట్నము - 531 163.<br>విశాఖపట్నం జిల్లా. |

ప్యాకింగు పోస్టేజి చార్జీలు ప్రత్యేకం.

7 కేసెట్లు తీసుకున్నవారికి పోస్టేజి ఉచితం.
ఉత్తర ప్రత్యుత్తరములకు రిప్లైకార్డు వ్రాయవలయును.



# సాధనరహస్యము

## THE SECRET OF YOGA SADHANA

Here is the book of the Gateway to the Eternal Bliss. Th work invites one and all, young and old, boys and girls, men anc women, rich and poor, the learned and the ignorant, to get in for the Salvation. It takes everyone on broad avenues to the Goal of the human beings, namely, the knowledge of one's own Self.

This treatise is a signpost to the spiritual traveller at cross roads, a light-house to the spiritual sailor on the high seas, a com- pass to the spiritual airman in the aeroplane. It is a spiritual frien philosopher and guide. Like a mother this book feeds childre with the milk of Yoga; like a father it leads them by the hand to the goal; like a teacher it lights up their minds and hearts and lik friend it stands by them through think and thin.

This art and science of Yoga-Sadhana was first taugh to a girl (Poojya Sri Mataji) in her teens, longing to know what Yoga really is, in measured doses of letters by the sage-author of this sacred book born out of the personal experiences of The Divine Bliss by His Holiness Sri Anubhavananda Swami. Though taught to one, it is meant for all.

This Holy Book, the like of which is hard to come by, is an Angel-Teacher that is ready to extend her hand of help and pro- tection to every one with no exception She awakens and arouses all to spiritual activity. She gives an uplift to the beginners; dis- pels their doubts and removes the wrong notion; she's brilliant light on the spiritual paths of the on goers; urges forward the slow and the lazy; lends courage to the frightened and the confused and corrects the course of the losers of the spiritual way. She re- assures all of the ultimate success of entering the kingdom of God and of enjoying the Eternal bliss.

OH! BLESSED DEVOTEES OF YOGA! ENTER INTO THE PATH OF SPIRITUALITY THROUGH THE GOLDEN GUIDANCE OF THIS SACRED BOOK AND ATTAIN TO THE GLORIOUS STATE OF SELF REALIZATION. MAKE YOUR PIOUS LIVES FORTUNATE, HAPPY, LUCKY AND AUSPICIOUS. ENJOY THE SUPREME BLISS HERE AND NOW ITSELF.

Sri Anubhavananda Grandhamala

M.G.Road, Bapatla - 522 101(A.P.).